


## నాల్గవ సంపుటము

# దర్శనములు - మతములు



కొమర్రాజు వెంకట లక్ష్మణ రావు
విజ్ఞాన సర్వస్వ కేంద్రం
తెలుగు విశ్వవిద్యాలయం

## విజ్ఞాన సర్వస్వము

# దర్శనములు-మతములు

నాల్గవ సంపుటము







ప్రధాన సంపాదకులు

ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తి

సంపాదకులు

ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు

ఆచార్య పప్పు సూర్య సుందర రామారావు

ఆచార్య ఆర్యసోమయాజుల రామమూర్తి

ఆచార్య ముదిగొండ వీరభద్రశాస్త్రి

సహాయ సంపాదకుడు

డా. పగడాల చంద్రశేఖర్



ఆచార్య సి. నారాయణరెడ్డి
ఎం.ఎ., పిహెచ్.డి., డి.లిట్.
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం
లలిత కళాక్షేత్రము, పబ్లిక్ గార్డెన్స్
హైదరాబాదు-500 001

# భూమిక

తెలుగు భాషా సాహిత్య కళా సంస్కృతుల విలసనానికీ, వికసనానికీ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ చేసిన చట్టం ప్రకారం 1985 డిసెంబర్ 2వ తేదీన తెలుగు విశ్వవిద్యాలయం విశిష్ట విద్యాసంస్థగా రూపుదాల్చింది. బోధన, ప్రచురణలతోపాటు విస్తరణసేవ, రాష్ట్రేతరాంధ్రులకూ, విదేశాంధ్రులకూ సహాయ సహకారాల కల్పన వంటి అనేక కార్యక్రమాలనుకూడా విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నది. పూర్వం వున్న తెలుగు భాషా సమితి, అంతర్జాతీయ తెలుగు సంస్థ, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి మొదలైన సంస్థలు విలీనం కావడంతో విశ్వవిద్యాలయం వివిధ పీఠాల, కేంద్రాల, విభాగాల సమాహారంగా వ్యవహరిస్తున్నది.

తెలుగు జాతి వైభవోన్నతులకు అద్దంపట్టే గ్రంథాల ప్రచురణ విశ్వవిద్యాలయ ప్రధానాశయాల్లో ఒకటి. విశ్వవిద్యాలయం ఇంతవరకు 127 గ్రంథాలు వెలువరించింది.

విశ్వవిద్యాలయంలో విలీనమైన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవిశ్రాంత కృషిద్వారా దేశ సాహిత్య రంగంలో విశిష్టస్థానం సముపార్జించుకుంది. 1957 అగస్టు 7వ తేదీన ఏర్పాటైన ఈ అకాడమి దేశం మొత్తం మీద ప్రప్రథమ రాష్ట్రస్థాయి అకాడమి కావడం విశేషం. ఈ అకాడమి ప్రామాణికమైన నిఘంటువులు, పదకోశాలు, కావ్యాలు, ప్రబంధాలు, వ్యాసాలు, విమర్శలు, కల్పనా సాహిత్యం, పరిశోధనాత్మక గ్రంథాలు, జీవిత చరిత్రలు, అనువాదాలు మొదలైన 163 గ్రంథాలు ప్రచురించింది.

ప్రస్తుత ప్రచురణ **దర్శనములు - మతములు** తెలుగు విశ్వవిద్యాలయంలో అంతర్భాగంగా వున్న విజ్ఞాన సర్వస్వ కేంద్రం వెలువరించిన విజ్ఞాన సర్వస్వం నాలుగవ సంపుటం.

వివిధ రంగాలకు చెందిన ఆధునిక విజ్ఞానాన్ని ప్రజలకు అందుబాటులోకి తేవాలంటే అందుకు వారి భాషనే మాధ్యమంగా స్వీకరించడం అవసరం. పరపాలన సాగిన కాలంలో విద్యావ్యాప్తికి విదేశీ భాషలనే ఎక్కువగా ఆశ్రయించవలసి వచ్చినప్పటికీ విజ్ఞానరంగంలో తెలుగుకు సముచితస్థానం సమకూర్చడానికి ఎన్నో ప్రయత్నాలు జరగడం హర్షణీయం. ఇందుకు నిదర్శనంగా నిలిచే సంఘటన తెలుగులో విజ్ఞాన సర్వస్వ రచనకు ఈ శతాబ్ది రెండో దశకంలోనే శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు శ్రీకారం చుట్టడం. ఆయన విజ్ఞాన సర్వస్వ రంగంలో అపూర్వ కృషి చేసిన భాషా సేవకులు. అక్షర క్రమంలో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము పేరుతో మూడు సంపుటాలు ప్రకటించారు. 'ఆంధ్ర' పదానికి విడిగా ఒక సంపుటం ప్రచురించాలని సంకల్పించి ఆయన

సమాచార సమీకరణ యత్నంలో వుండగా కన్నుమూశారు. తరువాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు విజ్ఞాన సర్వస్వ ప్రచురణ బాధ్యత స్వీకరించారు. లోగడవున్న సంపుటాలను సంశోధించి చాలా చిత్రాలు చేర్చి రెండు సంపుటాలుగా వెలువరించారు. అప్పటిలో అలాంటి సంపుటాలు మరే ఇతర భారతీయ భాషలో వెలువడకపోవడం గమనార్హం. మూడో సంపుటం ముద్రణలో వుండగా శ్రీ నాగేశ్వరరావుగారు కీర్తిశేషులయ్యారు. తర్వాత శ్రీ కందుకూరి బాలసూర్య ప్రసాదరావుగారు పండితుల సహాయంతో 1938-41 మధ్య ఏడు సంపుటాలుగా శ్రీ ఆంధ్ర విజ్ఞానము ప్రకటించారు.

ఈ రంగంలో సుసంఘటిత కృషికి దోహదకారిగా ఉండడానికి, తెలుగు భాషాభివృద్ధికి ఉత్తమ వేదికగా ఉపకరించడానికి 15-10-1947 తేదీన తెలుగు భాషా సమితి స్వచ్ఛంద సంస్థగా ఏర్పాటయింది. తెలుగు భాషా సమితి విజ్ఞాన సర్వస్వ ప్రచురణలతోపాటు ఉత్తమ గ్రంథాలకు బహుమతి ప్రదానం, శాస్త్ర విజ్ఞాన పత్రికల నిర్వహణలాంటి కార్యక్రమాలుకూడా చేపట్టింది. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షులుగా, డా. మోటూరి సత్యనారాయణ కార్యదర్శిగా ఈ సమితి నిర్వహించిన కార్యక్రమాలు అత్యంత ప్రశంసాపాత్రాలు.

అన్ని సంపుటాలను అక్షర క్రమంలో కూర్చినట్లయితే చిట్టచివరి సంపుటం వెలువడేదాకా ఆ విజ్ఞాన సర్వస్వం పాఠకులకు పూర్తిగా ఉపయోగించకపోవచ్చు. పైగా ఏవైనా ఒకటి రెండు విజ్ఞాన రంగాలపై మాత్రమే ప్రత్యేక ఆసక్తివున్నవారు కూడా ఎక్కువ మూల్యం చెల్లించి అన్ని సంపుటాలను సంపాదించుకోవలసి వస్తుంది. అందుచేత తెలుగు భాషా సమితి ఒక్కొక్క శాస్త్రరంగానికో, సన్నిహిత రంగాలకో పరిమితమైన సంపుటాలను ప్రకటించే విధానం అనుసరించి 14 సంపుటాలు వెలువరించింది. 1985లో తెలుగు భాషా సమితి తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనమై కొమర్రాజు వెంకట లక్ష్మణరావు విజ్ఞాన సర్వస్వ కేంద్రంగా రూపుదిద్దుకున్న తర్వాత ఆ విధానాన్నే పాటిస్తూ కార్యక్రమాలను కొనసాగిస్తున్నది.

ఈ కేంద్రం ఆయా రంగాల్లో నిష్ణాతులైన పండితుల సహాయసహకారాలతో విజ్ఞాన సర్వస్వ సంపుటాలను రూపొందిస్తున్నది. భౌతికశాస్త్రం, రసాయనశాస్త్రం, భారత భారతి, విశ్వసాహితి, జ్యోతిష విజ్ఞానం, ఆయుర్విజ్ఞానం, దర్శనములు - మతములు, తెలుగు సంస్కృతి సంపుటాలు సిద్ధమయ్యాయి.

ఈ **దర్శనములు - మతములు** సంపుటానికి సుప్రసిద్ధ తత్త్వవేత్తలు ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారు ప్రధాన సంపాదకత్వ బాధ్యత వహించారు. తెలుగు భాషా సమితి ఈ సంపుటి ప్రథమ ముద్రణను 1962లో ప్రచురించింది. అప్పటి భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఈ సంపుటాన్ని ఆవిష్కరించారు. ఈ గ్రంథానికి విశేష ప్రజాదరణ లభించి ప్రతులన్నీ అమ్మకమయ్యాయి. విశ్వవిద్యాలయం అభ్యర్థనను పురస్కరించుకుని ఆచార్య సచ్చిదానందమూర్తిగారు ఎంతో శ్రమించి ఈ సంపుటాన్ని సవరించి, సంస్కరించి, కొత్త అంశాలు చేర్చారు. తత్త్వశాస్త్రరంగంలో లబ్ధప్రతిష్ఠులైన ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు, ఆచార్య పప్ప సూర్య సుందర రామారావు, ఆచార్య ఆర్యసోమయాజుల రామమూర్తిగార్లు సహకారం అందించారు.

విజ్ఞాన సర్వస్వ కేంద్రం డైరక్టరు ఆచార్య ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు అందరి కృషిని సమన్వయ పరిచారు.

తెలుగు విశ్వవిద్యాలయం గ్రంథ ప్రచురణలో వ్యావహారిక భాషాశైలిని అనుసరిస్తున్నప్పటికీ సంపాదకుల సూచనప్రకారం వ్యాసకర్తలు ఉపయోగించిన సరళ గ్రాంథిక శైలిని ఇందులో యథాతథంగా వుంచడానికి అంగీకరించింది.

కుశాగ్రబుద్ధినీ, రసైకమతినీ రంగరించుకున్న ఆదర్శ రాజనీతి కోవిదులు, బహుభాషావిదులు, భారత ప్రధాని, మాన్యులు శ్రీ పి.వి. నరసింహారావుగారు ఈ సంశోధిత ముద్రణను ఆవిష్కరించడానికి అంగీకరించడం తెలుగు విశ్వవిద్యాలయంపట్ల వారి కున్న వాత్సల్యాభిమానాలకు తార్కాణం. ఇందుకు తెలుగు విశ్వవిద్యాలయం వారికి హృదయపూర్వకంగా కృతజ్ఞతలు తెలియజేస్తున్నది. ఈ సంపుటాన్ని ప్రామాణికంగా తీర్చిదిద్దిన ప్రధాన సంపాదకులు ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారికీ, సహకారం అందించిన పండితులకూ మా ధన్యవాదాలు.

యథాపూర్వంగా ఈ ప్రచురణకూడా అందరి ఆదరాభిమానాలు చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

ఆచార్య సి. నారాయణరెడ్డి
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు
తేది: 12-3-1992

# విజ్ఞప్తి

విజ్ఞానసర్వస్వ సంపుటాల ప్రకటనలో పూర్వపు తెలుగు భాషా సమితి అనుసరించిన విధానం ప్రయోజన కరంగా ఉందని భావించి దానినే కొనసాగించడం జరుగుతున్నది. ఏదైనా ఒక విజ్ఞానరంగాన్ని, కొన్ని సందర్భాలలో దానికి సన్నిహితంగా ఉన్న మరికొన్ని విజ్ఞానరంగాలను ఒక క్షేత్రం(unit)గా గ్రహించి తత్సంబంధంగా ఒకటి (లేదా అవసరమైతే ఎక్కువ) సంపుటాలు వెలువరించాలన్నది ఈ విధానం. ప్రతి క్షేత్రంలోనూ మొదట విహంగవీక్షణంగా ఆ విజ్ఞానక్షేత్రానికి ఉన్న చారిత్రక ప్రాధాన్యాన్ని వివరిస్తూ సమీక్ష పొందుపరచడం, ఆ తరువాత విపులంగా తెలుసుకోవాలనే పాఠకుల నిమిత్తం ఆ క్షేత్రానికి సంబంధించిన వివిధ అంశాలను అక్షరక్రమంలో అరోపాలుగా ఇస్తూ వివరించడం ఈ విధానంలో ఒక భాగం. ఇందువలన ఈ సంపుటాలను సంప్రతించే పాఠకులకు అధిక సౌకర్యం ఏర్పడుతుందని మా విశ్వాసం.

ప్రస్తుత సంపుటం దర్శనములు-మతములు మొట్టమొదట 1962లో తెలుగు భాషా సమితి ప్రకటించిన ప్రతికి సవరణలు, చేర్పులతో కూడుకున్నది. సమితి ప్రచురణగా వెలువరించినప్పుడే (అప్పటి ఏడవసంపుటం) ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారు విశేష శ్రద్ధాసక్తులతో ప్రామాణికంగా ఆ సంపుటాన్ని తీర్చిదిద్దారు. ఆ సంపుటాన్ని పాఠకులు ఎంతగానో ఆదరించారు. ఆ సంపుటం ప్రతులు చెల్లినందున కొన్ని సంవత్సరాలుగా లభ్యంకావడంలేదు. దానిని సవరించి, పెంచి, విస్తృత పునర్ముద్రణంగా వెలువరించాలని విజ్ఞానసర్వస్వ కేంద్రం ప్రతిపాదించింది. ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు, ఆచార్య పప్పు సూర్య సుందర రామారావు, ఆచార్య ఆర్యసోమయాజుల రామమూర్తిగార్ల తోడ్పాటుతో ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారు, పూర్వపు ప్రతిని పరిష్కరించి ఇచ్చారు. ఇందుకు ప్రధాన సంపాదకులకు, సంపాదకులకు, రచయితలకు, అనువాదకులకు కేంద్రం కృతజ్ఞతాభివందనాలు అర్పిస్తున్నది.

కేంద్రం ప్రకటించే ప్రచురణలన్నీ ఆధునిక తెలుగుభాషలో ఉండాలనే విధాన నిర్ణయం ఉంది. అయితే సరళగ్రాంథికంలో తీర్చిదిద్దిన ఈ సంపుటంలో నిర్దిష్టార్థ అభివ్యక్తికి భంగం రాకుండా ఆధునిక తెలుగుభాష లోనికి మార్చడం కష్ట సాధ్యంకావడం చేత సంపాదకుల సూచనమేరకు శైలి మార్చకుండానే ప్రకటించడానికి నిశ్చయించడం జరిగింది.

విజ్ఞానసర్వస్వ కేంద్రం ఆరు సంపుటాలను ఒకేసారి చేపట్టి తుదిరూపమిచ్చే ప్రయత్నంలో ఉన్నది. త్వరలోనే ఇతర సంపుటాలను కూడా విడుదలచేయడం జరుగుతుంది. మాకృషిలో ఆయా విజ్ఞానరంగాలలో నిష్ణాతులైన వారి సహకారం ఒక అవశ్యభాగం. అటువంటి సహకారం మాకు సంతృప్తికరంగానే లభిస్తున్నది. అయితే కృషికి పట్టే కాలవ్యవధిలో మాత్రం అంతో ఇంతో జాప్యం తప్పడంలేదు.

ఈ సంపుటం పరిష్కరణ, ముద్రణలకు సంబంధించిన బాధ్యతలను నెరవేర్చటంలో మా కేంద్రంలోని పరిశోధనాధికారి డా. పగడాల చంద్రశేఖర్ అందజేసారు.

కాగితంధరలు, ముద్రణవ్యయం పెరిగినప్పటికీ విజ్ఞానసర్వస్వ సంపుటాలవంటి పరామర్శగ్రంథాలు పాఠకులకు అందజేయవలసిన అవసరాన్ని గుర్తించి సంపుటం ధరను దాదాపు మూడవవంతు తగ్గించి రు. 100/-లకే ఇవ్వాలని మా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష్యులు నిర్ణయించారు.

ఈ సంపుటం ముద్రణ బాధ్యతలు స్వీకరించి శ్రద్ధగా నిర్వహించిన పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ వారికి, ప్రూఫులు చూడటంలో సహకరించిన శ్రీ బి. సుబ్బరాయన్‌గారికి కృతజ్ఞతలు.

హైదరాబాదు
తేది: 2-3-1992

ముదిగొండ వీరభద్రశాస్త్రి
డైరెక్టరు,
కొమర్రాజు వెంకట లక్ష్మణరావు విజ్ఞాన సర్వస్వకేంద్రం

# తొలిపలుకులు
## (రెండో ముద్రణ)

ముప్ఫై ఏళ్ల తరవాత దర్శనాలకు మతాలకు చెందిన విజ్ఞాన సర్వస్వపు ఈ సంపుటం మళ్లీ ముద్రింపబడటం నాకు సంతోషకరంగా ఉంది. దీని మొదటి ముద్రణంలో నేను రాసిన "ప్రాక్కథనం"లో దానిలో లోపాలు దోషాలు ఉండటం అసహజం కాదని రాశాను. వాటిని కనిపెట్టి వాటిని పరిహరించటానికి నేను ముగ్గురు దార్శనికుల్ని ఎన్నుకుని, వారి అంగీకారంతో వారి కీ భారం అప్పగించాను. భారతీయ మత-దర్శనాలకు సంబంధించిన సమీక్షల్లోను, అకారాది వివరణాల్లోను చేయాల్సిన మార్పులు, చేర్పులు, తొలగింపులను చేయవలసిందని ఆచార్య పి. శ్రీరామచంద్రుడుగారిని, అభారతీయ విషయాలకు సంబంధించినవాటిలో అవసరమైనటువంటి వాటిని చేయవలసిందని ఆచార్యులు పప్పు ఎస్.ఎస్. రామారావు, ఎ. రామమూర్తి గార్లను కోరాను. వా రా కృషి నిర్వహించారు. పరస్పర వైరుధ్యాలు ఉన్నవేమో కనిపెట్టి వాటిని తొలగించటం, ఈ ముప్ఫైఏళ్లలో జరిగిన పరిశోధన దృష్ట్యా విసర్జించాల్సిన దానిని విసర్జించటం, సవరించాల్సినదానిని సవరించటం, మొదలైనవాటి నన్నిటిని ఆచార్య ఎం.వి. శాస్త్రిగారు చేశారు. వీరందరి సహకారంవల్లనే ఈ సంస్కరణం ఈ రూపంగా వెలువడుతున్నది; నేను నిమిత్తమాత్రుణ్ణి.

ఈ సంపుటపు మౌలిక వ్యవస్థలో పరివర్తనం అవశ్యకంగాను, సాధ్యంగాను నాకు, శ్రీరామచంద్రుడు, రామారావు, రామమూర్తిగార్లకు కనపడలేదు. దా న్నలా ఉంచి స్ఖలితాలు లేకుండా చేయటానికి, అనివార్యంగా ఉండవలసినవిగా తోచిన కొత్త విషయాల్ని అకారాది వివరణలో చేర్చటానికి, అవసరమైన దాని నంతటిని వర్తమానానికి సంవదించేట్టు చేయటానికి ప్రయత్నం జరిగింది.

ఇందులోని చాలా వ్యాసాలు పరమ ప్రామాణికాలు; దీనికొరకై విశ్వవిఖ్యాత తత్త్వవేత్తలు రాసినవి. వేదాలపై కుఞ్జన్‌రాజా, హిబ్రూ మతంపై కోహెన్, బౌద్ధంపై సాంకృత్యాయన కౌసల్యాయనలు, సాంఖ్యయోగాలపై ఎస్.సి. చటర్జీ, అస్తిత్వవాదంపై జీన్‌వాల్, చైనీయ దర్శనంపై తాన్ యున్ షాన్, మీమాంసపై డి.టి. తాతాచార్య, గాంధీదర్శనంపై తెన్నేటి విశ్వనాథం, భాషాదర్శనంపై భద్రిరాజు కృష్ణమూర్తి, జైనధర్మంపై మోహన్‌లాల్ మేహతా, రస్సెల్–విట్‌గెన్‌స్టయిన్‌లపై శివజీవన భట్టాచార్య, ఇస్లాంపై మీర్ వలీఉద్దీన్, హెగెల్ పై ఎస్. వహీదుద్దీన్, భగవద్గీతపై సి.పి. రామస్వామి అయ్యర్ ఇత్యాదులు, ఇతర విషయాలపై యూరోప్-అమెరికాలలోని ఉద్దండ పండితులు, -- వీరికంటే గొప్పవారెవరు ఇప్పుడు ఈ విషయాలపై ప్రత్యేకంగా ఈ సంపుటానికై రాస్తారు? అందుచేతనే అవసరమైనంతవరకే కనీసమైన పరిష్కరణతో ఈ సంపుటం పునర్ముద్రణ చేయబడుతున్నది.

1989 జూన్-నవంబరుల మధ్య సంపాదకుల పరస్పర ఉత్తర ప్రత్యుత్తరాల ఫలితంగాను, ఆకాలంలోనే నేనూ, హైదరాబాద్‌లోని సంపాదకులు, విజ్ఞాన సర్వస్వకేంద్రం డైరెక్టరు, తెలుగు విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు మొదలైనవారిమి, విశ్వవిద్యాలయ కులపతులతో హైదరాబాద్‌లో సమావేశమై చర్చించిన ఫలితంగా 1962లో రాయబడిన సమీక్షల్లోను, అకారాది వివరణల్లోను భాషవిషయకమైన మార్పులు చేయక్కరలేదని నిశ్చయించ బడింది. తిరిగి 19 ఆగస్ట్ 1991 నాడు నేను, ఆచార్యులు శ్రీరామచంద్రుడు, రామారావు, రామమూర్తి గార్లు, డైరెక్టర్, రిజిస్ట్రార్‌గార్లు హైదరాబాద్‌లో కలిసి కొన్ని నిర్ణయాలు తీసుకున్నాం.

ఈసారి ఈ సంపుటం తెలుగు విశ్వవిద్యాలయం ప్రకటిస్తూ ఉంది. దీనికి నన్ను సంపాదకులుగా ఉండమని కోరిన ఇదివరకటి కులపతి, ప్రసిద్ధభాషావేత్తలు ఆచార్య టి. దొణప్పగారు, ఇప్పటి కులపతి, నాకు సన్నిహిత మిత్రులు, మహాకవులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారున్ను, ఈ కార్యనిర్వహణలో నాకు పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చి నాఆదరానికి విశ్వాసానికి పాత్రులైన విద్వాంసుల్నే నాకు సహాయకుల్నిగా ఆమోదించటం నా కానంద దాయకం; వారికి నేను కృతజ్ఞుణ్ణి. సంపాదకవర్గంలోని ముగ్గురు సభ్యులకు, డైరెక్టరు డా. ఎం.వి. శాస్త్రిగారికి, యూనివర్సిటి మాజీ రిజిస్ట్రారు డా.ఎన్. శివరామమూర్తిగారికి నా ధన్యవాదాలు.

సంగం జాగర్లమూడి<br>మకర సంక్రాంతి, 1992

కొత్త సచ్చిదానందమూర్తి<br>ప్రధాన సంపాదకులు

మొదటి ముద్రణ

# సంపాదకుని ప్రాక్కథనము

విజ్ఞాన సర్వస్వ మనునది మానవ జ్ఞానము నంతను సమన్వయ పూర్వకముగ సమ్మీకరించి క్రమబద్ధ మగు అవగాహన (methodica comprehensio) కు వీలగునట్లు ఉపపాదించునదిగా ఉండవలెను. వ్యాపక మగు, సమన్వయాత్మక మగు దృష్టి (comprehensiveness and harmony of view), వ్యవస్థ, ఒక ప్రయోజనము నుద్దేశించి తదనుగుణముగ రచన యంతయు సాగుట- ఇవి విజ్ఞాన సర్వస్వమునం దుండవలసిన లక్షణములుగా ఆన్‌స్టెడ్, దిదిరో, న్యూమెన్, కోల్‌రిడ్జ్ మొదలగువారి అభిప్రాయము. అకారాదిక్రమమున జ్ఞానవిషయము లగు సర్వాంశములను వివరించుటయే విజ్ఞాన సర్వస్వపు పని యనునది మరొక భావము. దృష్ట్యైక్యముతో ఒక దార్శనిక వ్యవస్థతో సంవాదము సిద్ధించునట్లు అన్ని విషయములను వివరించుట ఒకనికి గాని, కొలదిమందికి గాని సాధ్యము కాని పని కాబట్టి రెండవదియే విజ్ఞాన సర్వస్వపు ప్రయోజనముగా ఎంచబడి, సమస్త విషయములను సంక్షిప్తముగా, ప్రామాణికముగా వివరించు సందర్భగ్రంథమే (reference book) విజ్ఞాన సర్వస్వ మను రూఢ్యర్థము ఏర్పడినది. ఇట్టి గ్రంథములు సక్రమముగా దృష్ట్యైక్యముతో ఏ విషయమును గూర్చియు బోధన గ్రంథములు (book of instruction) గ నుండవు. ఉదాహరణమునకు ఎన్సైక్లోపీడియా బ్రిటానికా, తరువాతి సంస్కరణములు అట్టివి ; దీనికి విరుద్ధముగ జొహాన్ హెయిన్‌రిష్ ఆన్‌స్టెడ్ 1630 లో రచించిన ఎన్సైక్లోపీడియాయును, దిదిరో 1746 నుండి సంపాదించిన ఎన్సైక్లోపీడియాయును, కోల్‌రిడ్జ్ తయారు చేసిన ప్రణాళిక ప్రకారము నిర్మింపబడిన ఎన్సైక్లోపీడియా మెట్రొపొలిటానా (1818-1845) యును ఐక్యదృష్టిని, వ్యవస్థను, సమన్వయమును సాధింపజూచినవి. వీనిలోని కెల్ల వాల్తేర్, రూసో, కాండియాక్, కండోర్‌సెత్, మోంటిస్క్వియో ఇత్యాదులలో చాలమంది సహాయముతో దిదిరో ప్రచురించిన విజ్ఞాన సర్వస్వము బుద్ధియుగ (Age of Reason) కీర్తి చిహ్నముగాను, జాగృతి ఆందోళనము (The Enlightenment) నకు వెలుగు బాటగాను ఉన్నది. అన్ని శాస్త్రముల పరస్పర సంబంధములను చూపుచు నిపుణుల (specialists) కవసర మగు సందర్భ గ్రంథముగా గాక, సామాన్య విద్యాదాయినిగా ఉండునట్లును, విచార స్వాతంత్ర్యమును, వ్యక్తుల, సంస్థల, పుస్తకముల అపరీక్షిత ప్రామాణ్యాధికారముల విమర్శను పురస్కరించుకొనియు దిదిరో దానిని నిర్మింప యత్నించెను. దాని కొక సాంఘిక మహత్త్వ మేర్పడెను. అది భావసంచలనమును తీసికొనివచ్చి తద్ద్వారా ఫ్రెంచి విప్లవమునకు దారితీసెను.

తెలుగు భాషా సమితివారు అవలంబించిన విధానము - అనగా ప్రతి శాస్త్రమునకు, లేదా ప్రతి రెండు మూడు శాస్త్రములకు ఒక ప్రత్యేక సంపుట ముంచి, అందు ప్రథమమున ఆ శాస్త్రమును గూర్చిన వ్యవస్థాయుతము, ఐతిహాసికము నగు సమీక్ష చేసి, తరువాత అకారాదిగ ఆశాస్త్ర సంబంధము లగు వివిధాంశములను వివరించుట - ఈ రెండిటికి మధ్యమ మగు మార్గము ననుసరించుచు ఆంధ్ర దేశపు ప్రస్తుతావసరములకు తగియున్నది.

ఈ మత, దర్శనముల సంపుటములోని సమీక్ష యంతయు సంపాదకుని రచనయే కావలె నని నిశ్చయింపబడెను. ఇంత బాధ్యత ఒకే వ్యక్తి వహించుటలో అతనికి శ్రమ అత్యధిక మగుటయే కాక, ఎవరును సర్వజ్ఞులు కారు గాన వ్రాసినదానిలో లోపములు మెండుగ దొరలవచ్చును. కాని వ్రాయు

వానికి కొంత సామర్థ్యము, విశాలదృక్పథము, విభిన్న అభిరుచులు, వివిధ సంస్కృతులతోను, మత దర్శనములతోను, దేశములతోను పరిచయము ఉండి, దేనిని గూర్చి కూడ ఇదియే పరమోత్కృష్టము, చరమసత్యము అను హఠయుక్తమగు అభినివేశము లేనియెడల అతని సమీక్ష మత దర్శనముల సమస్యలలో చాలవాటిని క్రమబద్ధముగా నొక ఐక్యదృష్టితో వాటి పరస్పర సంబంధముల చూపుచు చర్చింపగలదు. అట్టిది దాని కది యొక బోధక గ్రంథముగాను, ఈ శాస్త్రములను గూర్చిన ప్రారంభక పాఠ్యపుస్తకము వలెను ఉండుటకు వీలున్నది. ఇద్దరు ముగ్గురు కలసి ఇటువంటి గ్రంథమును రచించుట సాధారణముగ కుదురదు. కాని ఇట్టి గ్రంథములలో చాల విషయములను గూర్చి వ్రాసినదానిలో గాఢజ్ఞానరాహిత్యము, స్వీయాభిప్రాయ మూల్యాంకనము (evaluation)ల ప్రతిపాదన ఉండవచ్చును. కాని రచయితకు చాలవరకు పక్షపాత రాహిత్యము, స్వ మత దేశ దర్శనములను గురించిన దురభిమానాభావము ఉన్నచో సమీక్షలో ఐతిహాసికదృష్టిని, వస్తుతంత్రత (objectivity)ను సాధింపవచ్చును.

తక్కిన అన్ని లౌకికకృతులందు వలెనే ఇందును గుణ దోషము లుండును. నానాదేశ సంచారము, వివిధ మత దర్శనములందు ఆసక్తి, అధ్యయనములు, అన్య మతములకు, సంస్కృతులకు చెందినవారితో గాఢమైత్రి, ఆధునిక ప్రపంచమందలి సుప్రసిద్ధ ప్రాక్ప్రతీచీ దార్శనికులతో మైత్రీ పరిచయములు ఈ సంపాదకునికి ఉండుటచే అవి సమీక్షలో సమతులితదృష్టి (balanced outlook) ని తీసికొనివచ్చు ప్రయత్నము చేయుటకు ఆతనిని ప్రేరేపించి సహాయపడినవి. ఇక సంపూర్ణత, పూర్తి సఫలత యన్ననో - అవి భ్రమలు ; ఏ మానవ ప్రయత్నమందును అవి సిద్ధింపవు.

అకారాదిక్రమముగ ఇందు చర్చింపబడిన విషయములపై వ్రాసినవారు ఆంధ్రదేశమునకు చెందినవారు మాత్రమే కాదు ; యావద్భారత దేశమునుండి సహకారము లభించినది. అంతే కాదు ; ఖండాంతరములనుండి అతి ప్రసిద్ధ విశ్వవిద్యాలయములలో మహాచార్యపదవులం దున్నవారు వివిధ విషయములను గురించి అడిగినంతనే వ్రాసినారు. ఏ మతమునకు చెందినవారు ఆ మతమును గూర్చి వ్రాయవలె నని, ఏ దర్శనము నభిమానించువారు ఆ దర్శనమును వివరింపవలె నని, పాశ్చాత్య మత దర్శనములపై పాశ్చాత్యులు, పౌరస్త్య దర్శనములపై పౌరస్త్యులు వ్రాయుట సముచిత మని ఆ విధముగానే వ్రాయింప యత్నింపబడెను. చాలవరకు ఇందు కృతకృత్యత లభించినది. ఇందు వ్రాసినవారు చాలమంది విశ్వవిద్యాలయాచార్య పదవులం దున్నవారు. ఇందు వ్రాయుటవలన వచ్చు పారితోషికము వారికి లెక్కలోనిది కాదు. ముఖ్యముగా అన్యదేశముల విశ్వవిద్యాలయముల ఆచార్యుల విషయములో ఇది హెచ్చుగా వర్తించును. వారిలో కొందరు ఆ యా విషయములందు ఆధునిక జగత్తులో పరమ ప్రామాణికులుగ ఎంచబడువారు. చాలమంది అంతర్జాతీయ విఖ్యాతి కలవారు. ఇంగ్లండ్, జర్మనీ, ఫ్రాన్స్, ఇటలీ, అమెరికా మొదలైన అన్ని దేశములనుండి, భారత దేశపు ఇతర రాష్ట్రములనుండి, ఆంధ్రదేశము నుండి అభ్యర్థించినంతనే తమ అమూల్య రచనలు వ్రాసి పంపిన విద్వాంసులందరికి సంపాదకుడు కృతజ్ఞుడు. వారి స్నేహభావము, సహకారము వలననే ఈ సంపుటము వెలికి వచ్చినది ; సంపాదకుడు నిమిత్తమాత్రుడు. ఈ సంపుట మిటుల పండితులలో అంతర్జాతీయ సహయోగ సహకారములు సాధ్యము లనుటకు, వైదుష్యము దేశముల సీమలను సరకు చేయ దనుటకు నిదర్శనము.

ఆంగ్లభాషలో వచ్చిన యనేక వ్యాసముల నాంధ్రీకరించుట, రచయితలు దొరకని కొన్ని విషయములపై స్వయముగ వ్రాయుట, విషయము లన్నిటిని కూర్చుట మొదలగు పనులను కడు సమర్థతతోను, శీఘ్రతతోను సంగ్రాహకులు శ్రీ మేడేపల్లి వరాహ నరసింహస్వామి చేసినారు. వీరికి సంస్కృతమందు, దర్శనశాస్త్రమందు చక్కని పాండిత్యము పైతృకముగా అబ్బినది. చాల కాలము విజయనగర కళాశాలయందు రసాయనశాస్త్ర అధ్యయనాధ్యాపనములు చేయుటచే వీరికి ఆధునిక దృక్పథము, విమర్శదృష్టి ఏర్పడినవి. బుద్ధి తీక్ష్ణత పుట్టుకతో వచ్చినది. బంగారమునకు సువాసన యున్న నిక నేమి ? శ్రీ నరసింహస్వామి, వారి సహాయకులు శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, శ్రీ జె. యస్. ఆర్. యల్. నారాయణమూర్తి అనువాద, విషయ సంగ్రహణ కార్యములను ప్రశంసనీయముగ చేసినారు. శ్రీ శ్రీనివాసాచార్యులు ప్రసిద్ధ ఆంధ్ర రచయితలు ; శైలీ పరిమార్జన, ప్రూఫ్ సంశోధనలు వారి ఆధ్వర్యవములో చాలవరకు జరిగినవి. శ్రీ నారాయణమూర్తి మేధాసంపద, ప్రతీచీ దర్శనశాస్త్రమందు మంచి ప్రవేశము గలవారు. ఇట్టి ముగ్గురి సహాయము ఉండగా ఈ సంపుట సంపాదన మొక కష్టకార్యమా ?

ఈ మత దర్శనముల సంపుటమునకు ప్రణాళికను సిద్ధముచేయు మని అడిగి, తరువాత దాని నామోదించి, మత దర్శనముల సంపుట సంపాదనా భారమును ఈ సంపాదకునిపై నుంచి తెలుగు భాషా సమితి అధ్యక్షులు డాక్టరు బి. గోపాలరెడ్డిగారును, సభ్యులును అతని పట్ల తమ గౌరవమును, విశ్వాసమును వ్యక్తము చేసినారు. సమితి అధ్యక్షులకు, సభ్యులకు సంపాదకుడు కృతజ్ఞుడు.

ఈ సంపుటముపట్ల ప్రత్యేకాసక్తిని చూపుచు, అన్ని విధముల సహాయము చేయుచు, ఎంత ఆలస్యము జరిగినను సహించుచు, తమ సౌహార్దముతో సంపాదకుని ఆప్లుతము చేయుచు వచ్చిన సమితి కార్యదర్శి పద్మభూషణ శ్రీ మోటూరి సత్యనారాయణగారికి ధన్యవాదములు.

విజ్ఞాన సర్వస్వమునకు సంపాదకత్వము సాధారణుడు చేయరాదు; ఋషికానివాడు కావ్యము వ్రాయకూడనట్లే. కాని ఒక్కొక్కసారి సర్వతంత్ర స్వతంత్రులు లభించరు. ఒక్కొక్కపరి అసలు ఉండరు. అట్టిచో పరిస్థితులనుబట్టి అల్పమతులు, కించిద్‌జ్ఞులు మహాత్కార్యములకు పూనుకోవలసి వచ్చును. ఇందు అట్టివారిది కాని, వారిచే కార్యసాధన చేయించినవారిది గాని దోషము లేదు. ఈ సంపుటమును గూర్చి విచార విమర్శలు చేయు విద్వాంసుల కిది గుర్తు ఉండుటలో ఆశ్చర్యములేదు. కాగా దర్శన శాస్త్రము దుర్గమము. భారతీయ దర్శనములగూర్చి వివరించుటే సులభముకాదన్న, యూరోపియన్, ఇస్లామిక్, చైనీస్ మున్నగు దర్శనములను నానా మతములను మొదటిసారిగ ఆంధ్రమున వ్రాయుటలో లోపములు, దోషములు సంభవించుట అసహజము కాదు. అవి క్షంతవ్యములు. రాబోవు సంస్కరణములలో పరిహార్యములు.

వాల్తేరు
15 ఆగష్టు, 1962

కొత్త సచ్చిదానందమూర్తి
సంపాదకుడు

మొదటి ముద్రణ

# ప్రకాశకుల విజ్ఞప్తి

స్వతంత్ర భారతమున తెలుగువారు సుశిక్షిత పౌరులుగ ప్రవర్తించి యథోచిత పాత్ర నిర్వహింప వలయు ననిన ప్రాచీన, ఆధునిక విజ్ఞానము నంతను సామాన్య ప్రజల అందుబాటులోనికి తెచ్చుట అవసర మను భావమే ఈ విజ్ఞాన సర్వస్వ ప్రచురణకు మూల కారణము.

కీ.శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు 1915 లో అకారాదిగ 'ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము' ను ప్రచురింప మొదలుపెట్టి 1917 నాటికి మూడు సంపుటములను (అ - అహి వరకు) ప్రకటించిరి. నాలుగవ సంపుటమును ప్రకటింప సంకల్పించి, సామగ్రిని సేకరించుచు మధ్యలో 1923 లో వారు కాలధర్మ మొందిరి. పిమ్మట కీ.శే. కాశీనాథుని నాగేశ్వరరావుగారు లక్ష్మణరావుగారి కృషిని పునరుద్ధరించి కొనసాగింప ప్రయత్నించిరి. కాని 1938 లో వారు కూడ నిర్యాణము చెందుటతో ఆ మహోత్తర కార్యము అంతటితో ఆగి పోయినది. ఇట్టి ఘన కార్యము కేవలము వ్యక్తులమీదనే ఆధారపడినయెడల ఆ వ్యక్తి లస్తమించుటతో ఆ కార్యమును ఆగిపోవును గావున శ్రీమంతుల తోడ్పాటు, ప్రభుత్వ సాహాయ్యము కలిగిన ఒక సంస్థ మాత్రమే ఈ కృషిని నిరంతరాయముగ కొనసాగింప కలుగునను ఉద్దేశముతో 1947 లో మదరాసులో తెలుగు భాషాసమితి స్థాపింపబడినది. మదరాసు విశ్వవిద్యాలయమువారి సౌజన్యాదరముల ఫలితముగ విశ్వవిద్యాలయ భవనములలో స్థావరము లభించుటతో అచట తన కార్యస్థానమును నెలకొల్పుకొని, 10-5-1948 న సమితి తెలుగున విజ్ఞాన సర్వస్వ రచనకై విషయ సామగ్రిని సేకరింప నారంభించినది.

కీ. శే. లక్ష్మణరావుగారు తలపెట్టిన రచనా విధానము అకారాది వర్ణక్రమమును అనుసరించినది. అది సంప్రదాయసిద్ధ మగు రచనా విధానమే ఐనను దానిని అనుసరించి పని సాగించునెడల విషయ సంగ్రహణ మంతయు సమగ్రముగ పూర్తి అయి అన్ని సంపుటములును వెలువడిన తరువాతనే అది ఉపయోగకర మగును. అదియును గాక, విశ్వవిద్యాలయ స్థాయియందు కూడ ప్రాంతీయ భాషలోనే బోధనాదులు జరుపు సౌకర్యమేర్పడి పారిభాషిక పదములకు సువిదితార్థములు ఏర్పడిన గాని విజ్ఞాన సర్వస్వ రచనలో సంప్రదించుటకు వీలగు అకారాది వర్ణక్రమ రచనా విధానము నవలంబించుటవలన ఎక్కువ ప్రయోజనము లేదు. అందువలన తెలుగువారికి సుబోధముగ ఉండునట్లు విజ్ఞాన సర్వస్వ రచన సాగించి వేగముగ ఒకటి తర్వాత ఒకటిగ పదునారు సంపుటములలో (ఆదిలో అవలంబించిన 12 సంపుటముల ప్రణాళిక 1960 లో 16 సంపుటముల పథకముగా సవరింపబడినది) విజ్ఞాన విషయ మంతయు ప్రకటించుటకు సమితి పూను కొనినది. ఈ రచనా విధానమున ఒక్కొక్క సంపుటము ఒక ప్రత్యేక విషయమునకో, లేక కతిపయ సన్నిహిత విషయములకో ఉద్దిష్టమైనది. పాఠకుల సౌకర్యార్థము ఆయా విషయములకు సంబంధించిన ప్రత్యేకాంశముల సమాలోచన సౌలభ్యమునకై ఒక అకారాది వివరణ భాగము కూడ జత పరుప సంకల్పింపబడినది.

ప్రతి సంపుటమునను మొదటి విభాగమున ఆ సంపుటమునకు చెందిన విషయము లన్నియు ఆమూలాగ్రముగ సంక్షిప్తముగ పాఠ్యగ్రంథములో వలె వివరింపబడును. రెండవ భాగమున ఆయా విషయములకు సంబంధించిన వివిధాంశములు సంప్రదాయ సిద్ధమైన విజ్ఞాన సర్వస్వ రచనా విధానమును అనుసరించి అకారాది వర్ణక్రమమున కూర్పబడును. ప్రతి సంపుటమందును మొదటి భాగ

# సంపాదకమండలి

ప్రధాన సంపాదకులు

## కొత్త సచ్చిదానందమూర్తి

పద్మభూషణ; కళాప్రపూర్ణ; వాచస్పతి; విద్యాసాగర; పిఎచ్.డి.;
గౌ.డా.ఫిల్., గౌ.డి.లిట్., గౌ.డి.ఎస్‌సి.,
ఆనరరీ ప్రొఫెసర్ :
ఆంధ్రవిశ్వవిద్యాలయం; జవాహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం (కొత్తఢిల్లీ);
బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం; హైదరాబాద్ విశ్వవిద్యాలయం;
పీపుల్స్ యూనివర్సిటీ ఆఫ్ చైనా (బీజింగ్).

సంపాదకులు

## పుల్లెల శ్రీరామచంద్రుడు

ఎం.ఎ., పిఎచ్.డి., వేదాంత శిరోమణి, రాష్ట్రపతి సన్మానగ్రహీత,
రిటైర్డ్ సంస్కృత ఆచార్యులు, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు.

## పప్పు సూర్య సుందర రామారావు

ఎం.ఎ., పిఎచ్.డి.,
ఆచార్యులు, దర్శన విభాగం, మయామి యూనివర్సిటి (యు.ఎస్.ఎ.).

## ఆర్యసోమయాజుల రామమూర్తి

ఎం.ఎ., పిఎచ్.డి.,
ఆచార్యులు, దర్శన విభాగం, హైదరాబాద్ యూనివర్సిటీ, హైదరాబాదు.

## ముదిగొండ వీరభద్రశాస్త్రి

ఎం.ఎ., పిఎచ్.డి.,
డైరెక్టర్, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు విజ్ఞాన సర్వస్వకేంద్రం,
తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

సహాయ సంపాదకుడు

## పగడాల చంద్రశేఖర్

ఎం.ఎ., ఎం.ఫిల్., పిఎచ్.డి. (తెలుగు)
ఎం.ఎ. (లింగ్విస్టిక్స్), పి.జి.డిప్లమ ఇన్ ట్రాన్స్‌లేషన్
రిసెర్చ్ ఆఫీసర్, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు విజ్ఞాన సర్వస్వకేంద్రం,
తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

# మొదటి ముద్రణ (1962) లో పాల్గొన్న రచయితలు

అయ్యంగార్. ప్రొఫెసర్ కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్, డి.లిట్.
హెడ్, ఇంగ్లీష్ డిపార్ట్ మెంట్, ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు.
సౌందర్య మీమాంస – ప్రాచ్య, ప్రతీచ్య.

ఆర్. ఆర్. ఆచారి. ప్రొఫెసర్ ఆర్. రామానుజాచారి
అన్నామలై యూనివర్సిటీ.
ధర్మము; బ్రహ్మన్.

ఆర్. చం. రావు. శ్రీ ఆర్. చంద్రశేఖర రావు, పిఎచ్. డి. (లండన్)
లెక్చరర్, పొలిటిక్స్ డిపార్ట్ మెంట్, ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు.
మానవత్వవాదము.

ఆర్. వి. డిస్మెట్. ఫాదర్ ఆర్. వి. డిస్మెట్, పిఎచ్.డి. (లువాన్)
డి నోబిలి కాలేజ్, పూనా-6
అక్వైనాస్, సెంట్ తామస్ ; ఛాత్రవాదము.

అష్బీ. ప్రొఫెసర్ ఫిలిప్ అష్బీ
రెలిజియన్ డిపార్ట్ మెంట్, ప్రిన్స్టన్ యూనివర్సిటీ, ప్రిన్స్టన్.
దివ్యత్వ, పవిత్రతా భావములు; రహస్య మతములు.

ఇ. ఎ. డి లేసీ. ప్రొఫెసర్ ఎస్టెలీ ఎల్లెన్ డి లేసీ
డిపార్ట్ మెంట్ ఆవ్ ఫిలాసఫీ, రూజ్వెల్ట్ యూనివర్సిటీ, చికాగో.
అనుభవ వాదము.

ఈ. సాంబయ్య. రెవరెండ్ ఈ. సాంబయ్య
ప్రిన్సిపాల్, బిషప్స్ కాలేజ్, కలకత్తా.
ఆగస్టీన్, భక్త.

ఎ. జి. యన్. ఫ్లూ. ప్రొఫెసర్ ఆంటనీ జి. ఎన్. ఫ్లూ
డిపార్ట్ మెంట్ ఆవ్ ఫిలాసఫీ, ది యూనివర్సిటీ, కీల్, ఇంగ్లండ్.
మత దర్శనము.

ఎ. సి. యూఇంగ్. డాక్టరు ఎ. సి. యూఇంగ్
కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ.
ఉపయోగితా వాదము; వాస్తవికతా వాదము.

ఎచ్. ఎమ్. ఝా (ఝా) శ్రీ హరిమోహన్ ఝా
హెడ్, ఫిలాసఫీ డిపార్ట్ మెంట్, పాట్నా యూనివర్సిటీ, పాట్నా.
మోక్షము.

మండలి సంక్షిప్త కథనము ఆ విషయముతో ప్రప్రథమముగ పరిచయము కలిగించుటకు చక్కగా ఉపకరింప గలదు. ఏ ప్రత్యేకాంశము నైనను తెలిసికొన గోరువారికి అకారాది వర్ణానుక్రమ వివరణము సహకరించును. ఈ విధానమును ఇదివర కెవరును అనుసరించి ఉండలేదు.

మొదటి సంపుటము (చరిత్ర-రాజనీతి) 1954 లో ప్రకటింపబడినది. ఆ వెనువెంటనే 1955 లో రెండవ సంపుటము (భౌతిక, రసాయన శాస్త్రములు) వెలువడినది. ఈ రెండు సంపుటములును ఆంధ్ర విజ్ఞాన ప్రియుల ఆదరణ ఫలితముగ పూర్తిగ ఖర్చగుటతో వాని సంశోధిత పునర్ముద్రణము ఇపుడు జరుగుచున్నది.

1956 లో ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక రాష్ట్రముగ ఏర్పడి ఆంధ్ర సంస్కృతి చరిత్రయం దొక నూతన యుగమునకు నాందీ ప్రస్తావన జరిగినది. తదనుగుణముగ తన కార్యకలాపములను విస్తరింపజేసి, వివిధ విశ్వవిద్యాలయ కేంద్రములందలి పండితుల సాయముతో త్వరితగతిలో సంపుటములను వెలువరించుటకై హైదరాబాదునందును, వాల్తేరునందును కూడ సమితి తన శాఖా కార్యస్థానముల నెలకొల్పినది. ఆ తరువాత 1959 లో మూడవ సంపుటమును (తెలుగు సంస్కృతి) సమితి వెలువరించినది. 1960 లో 16 సంపుటముల నూతన ప్రణాళిక సిద్ధము చేసినప్పుడు తెలుగు సంస్కృతి సంపుటమునకు మరికొంత భాగము చేర్చి దానిని రెండు సంపుటములుగా విడదీయుటకును, వెనుకటి ప్రణాళికలోని 3 వ సంపుటము పొందిన కొద్దిమంది కొరకు అదనముగా చేర్చిన భాగమును మాత్రము అనుబంధ సంపుటముగా ప్రకటించుటకును నిశ్చయింపబడినది.

ఆ ప్రకారము - పూర్వ వత్సరములందు గడించిన అనుభవము కారణముగ సమితి తన కార్యక్రమమును మరింత త్వరిత గతిని కొనసాగించి, 1961 లో నాలుగవ సంపుటము (తెలుగు సంస్కృతి 2) తెలుగు సంస్కృతి అనుబంధము, అయిదవ సంపుటము (అర్థ, వాణిజ్య భూగోళశాస్త్రములు), ఆరవ సంపుటము (విశ్వసాహితి) వెలువరింపగలిగినది.

"దర్శనములు - మతములు" అను విషయమునకు సంబంధించిన ఈ ఏడవ సంపుటములోకూడ సగ భాగము ముద్రణము ఈ సంవత్సరారంభమునకే పూర్తి అయినను, కొన్ని అనివార్యకారణములచే మిగిలిన భాగము ముద్రణ పూర్తిచేయుటలో కొంత విలంబ మేర్పడి, నేటికి గాని దీనిని వెలువరించుట సాధ్యము కాలేదు. ఈ సంపుటమును సంకలనము చేయుటలో మాకు తోడ్పడిన సంపాదకులకు, తమ రచనలు పంపి మాతో సహకరించిన రచయితలకు మా ధన్య వాదములు.

ఈ విజ్ఞానసర్వస్వ కార్యకలాప మంతటిని సాధించుటకు కనీసము 15 లక్షల రూపాయలు కావలసి యుండునని అంచనా వేయడ మైనది. అభిమానులు, ఉదారులు అయిన ధనవంతులవద్ద ధనము సేకరించుటకు సమితి నిశ్చయించుకొన్నది. విజయనగరము మహారాజా, పిఠాపురము మహారాజా, తిరుపతి దేవస్థానము కమిటీ, సింహాచలము దేవస్థానము కమిటీ, శ్రీ. వి. రామకృష్ణ, ఉయ్యూరు షుగర్ ఫ్యాక్టరీ, శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య మొదలగు వారు ప్రశంసనీయమైన ఔదార్యముతో విరాళము లిచ్చియున్నారు. దాతలనుండి చేకూరిన మొత్తము రు. 2,50,000 లు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రమేర్పడక మునుపు ఉమ్మడి మద్రాసు ప్రభుత్వమువారు సంవత్సరమునకు లక్ష రూపాయలు చొప్పున ఐదు సంవత్సరములకు ఐదు లక్షలు ఇచ్చుటకు వాగ్దానము చేసిన విరాళములో 1960 - 61 వ సంవత్సరాంతమునకు మద్రాసు, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వములు ఇచ్చిన

మొత్తము రు. 4,87,964·87 లు. మార్చి 1962 నాటికి కేంద్ర ప్రభుత్వ శాస్త్రపరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వ శాఖ రు. 1,80,000 లు గ్రాంటుగా ఇచ్చినది. వీరందరికిని, సమితి భవన నిర్మాణమునకై దీర్ఘకాల కౌలు పద్ధతి మీద ఎ. 1. 50 సెంట్ల భూమిని తమ ప్రాంగణమున కేటాయించి ఇచ్చిన ఉస్మానియా విశ్వవిద్యాలయము వైస్ ఛాన్సలరు డాక్టరు డి. యస్. రెడ్డిగారికిని, మద్రాసు విశ్వవిద్యాలయ భవనములందు తెలుగు భాషాసమితి కార్యస్థానము నెలకొల్పుకొనుటకు అవకాశము కల్పించి అనేక విధములగు సౌకర్యములు కలుగజేసిన వైస్ ఛాన్సలరు డాక్టరు సర్. ఆర్కాటు లక్ష్మణస్వామి మొదలియారుగారికిని, వాల్తేరులో శాఖా కార్యాలయము నెలకొల్పుకొనుటకు తమ భవనములలో ఉచితముగ స్థలము ఇచ్చిన ఆంధ్ర విశ్వవిద్యాలయము వెనుకటి ఉపాధ్యక్షులు కీ. శే. శ్రీ వి. ఎస్. కృష్ణగారికిని, ప్రస్తుతోపాధ్యక్షులు డాక్టరు ఏ. ఎల్. నారాయణ గారికిని, తమ అధీనమునందు గల చిత్రములను పునర్ముద్రించుకొనుటకు అనుమతి నొసగిన వివిధ సంస్థలవారికిని మా కృతజ్ఞతాభివందనములు.

ఈ సంపుటమును సాధ్యమైనంత నిర్దుష్టముగను, అందముగను, ఆకర్షకముగను ముద్రించిన హిందీ ప్రచార ప్రెస్ కార్యకర్తలకు మా ధన్యవాదములు.

శక 1884 శ్రావణ 24 - బుధవారము

1962 ఆగస్టు 15

బెజవాడ గోపాలరెడ్డి
అధ్యక్షుడు
తెలుగు భాషా సమితి

మోటూరి సత్యనారాయణ
దండా వెంకట సుబ్బారెడ్డి
కార్యదర్శులు

ఎన్. వి. బెనర్జీ. ప్రొఫెసర్ ఎన్. వి. బెనర్జీ
హెడ్, ఫిలాసఫీ డిపార్ట్ మెంట్, ఢిల్లీ యూనివర్సిటీ, ఢిల్లీ.
వేదాంత దర్శనము.

ఏ. సి. బొకే. (ఎ. సి. బోకె.) డాక్టరు ఏ. సి. బొకే
రిటైర్డ్ లెక్చరర్, కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ, కేంబ్రిడ్జ్.
అనుగ్రహము; ఆరాధన; విశ్వాసము.

కట్స్. ప్రొఫెసర్ ఎల్మర్ ఎచ్. కట్స్, ఎ.బి., ఎమ్.ఏ., పిఎచ్.డి.,
లేట్ హిస్టరీ ప్రొఫెసర్, నార్త్ ఈస్టర్న్ యూనివర్సిటీ, బోస్టన్.
రాజకీయ దర్శనము; హాబ్స్, తామస్.

కాలెన్. ప్రొఫెసర్ హొరేస్ ఎమ్. కాలెన్
ది న్యూ స్కూల్ ఫర్ సోషల్ రీసెర్చ్, న్యూయార్క్, ఎన్. వై. (యు. ఎస్. ఏ.)
బెర్గ్‌సన్.

కిషన్. డాక్టరు బి. వి. కిషన్
ఫిలాసఫీ లెక్చరర్, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు.
నిగమన తర్కము; వైట్‌హెడ్, ఎ. ఎన్.; వ్యాప్తి గ్రాహక పద్ధతి; సంకల్ప స్వేచ్ఛ (కొంత భాగము); సూఫీ మతము.

కుఞ్జన్ రాజా. డాక్టరు సి. కుఞ్జన్ రాజా
రిటైర్డ్ సంస్కృతం ప్రొఫెసర్, మద్రాసు, టెహరాన్, ఆంధ్ర యూనివర్సిటీస్; బెంగుళూరు.
ఉపనిషత్తులు; వేదములు.

కృష్ణమూర్తి. శ్రీ కృష్ణమూర్తి, ఎమ్. ఏ., శాస్త్రి, విశారద
లెక్చరర్, ఫిలాసఫీ డిపార్ట్ మెంట్, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు.
ఉదాసీన సంప్రదాయము; జగదీశుడు; ధర్మోత్తరుడు; పురుషుడు; బౌద్ధమతము (సాధనలు); భావ వివేకుడు; మధురానాథుడు; మధుసూదన సరస్వతి; మైత్రేయ నాథుడు; రఘునాథుడు; రామానందుడు; వాచస్పతి మిశ్రుడు; వామమార్గము; సాయనుడు.

కె. రా. కృ. శ్రీ కె. రాధాకృష్ణమూర్తి, ఎం.ఏ., ఎం.ఏ. (ఆనర్స్)
కొంతకాలం ఫిలాసఫీ లెక్చరర్, ఆంధ్ర యూనివర్సిటీ; కొంతకాలం టీచింగ్ అసిస్టెంట్, ఫిలాసఫీ డిపార్ట్ మెంట్, కాలిఫోర్నియా యూనివర్సిటీ.
అంతర్యామిత్వ దర్శనము; అజ్ఞేయతా వాదము; అథెనేషియస్; అనాక్సిమాండర్; అనాక్సిమేనీజ్; అనాగ్జగొరాస్; అబెలార్డ్, పీటర్; అరిస్టిపస్; అసత్కార్యవాదము; అహంవాదము; ఆంటిస్తెనీజ్; ఆక్స్‌ఫర్డ్ ఉద్యమము (కరపత్రోద్యమము); ఆయ్‌కెన్, రుడోల్ఫ్ క్రిస్టోఫ్; ఆల్బర్టస్ మాగ్నస్; ఈశ్వర మీమాంస; ఈశ్వర సర్వగతత్వ వాదము; ఉపమానము; ఎంగెల్స్, ఫ్రీడ్రిఖ్; ఎకార్ట్, యోహానిస్ మైస్టర్; ఎపిక్టిటస్; ఎమర్సన్, రాల్ఫ్ వాల్డో; ఎరిజినా, యోహానిస్ స్కోటస్; ఏ నులు; ఏకసత్తావాదము; ఒకేమ్‌కు చెందిన విలియమ్; ఒరిజెన్; కన్ఫ్యూషియస్; కాండియాక్, ఎటియన్ బోనే దె; కారణము-కారణత (కొంత భాగము); కాల్విన్, జాన్; కాసీరర్, ఎర్నెస్ట్; కుసానస్, నికోలస్; కూజాన్, విక్టర్; కేంపనెల్లా, తామస్; కేంబ్రిడ్జి ప్లేటో

వాదము; కేబల; కోంట్, అగస్ట్; గాసెండీ, పీరె; గ్యూలింక్స్, ఆర్నాల్డ్; గ్రోషియస్ హ్యూగో; చైతన్యారోపవాదము; జాకోబి, ఫ్రీడ్రిఖ్ హైన్రిఖ్; జిహోవ; జీనో (ఈలియా నివాసి); జీవ ద్రవ్య వాదము; జెంటిలె, గియోవన్ని; జెజూయిట్లు; జ్ఞాన పునరుజ్జీవన యుగము; డన్స్ స్కోటస్; డయొనీషియస్ (సూడో); డిమా క్రిటస్; డిల్థీ, విల్హెల్మ్; డొమినికన్లు; డ్యుర్ ఖైమ్, ఎమిలి; తత్త్వప్రక్రియ సిద్ధాంతము; థామస్ ఎ కెంపిస్; తేలిజ్; దివ్యజ్ఞానము; దీద్రో, డెనీ; దేవ వాదము; నవీన ప్లేటో వాదము; నిరంకుశ చింతకులు; నిరాశా వాదము; నిష్ప్రవృత్తి మతము; నెస్టోరియన్ మతము; పాంపనాజీ; పార్మెనిడిస్; పితాగోరస్; పిరో; పెరిపేటెటిక్కులు; పెర్స్ (పియర్స్), చార్లెజ్ సాండర్జ్; పెలేజియన్ మతము; ప్రధాన సుగుణములు; ప్రాతీతిక వాదము; ప్రొటాగోరాస్; ఫిక్టె, ఇమాన్యుయల్ హెర్మన్ ఫాన్; ఫిక్టె, యొహాన్ గాట్ లీబ్; ఫైలో; ఫ్రాన్సిస్కన్లు; ఫ్రాబెల్, ఫ్రీడ్రిఖ్ విల్హెల్మ్ అగస్ట్; ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వ సంగ్రాహకులు; బట్లర్, సామ్యూల్; బమ్, జాకోబ్; బెంతమ్ జెరిమీ; బెనెడిక్టైన్లు; బెర్నార్డ్, సెంట్; బేకన్, ఫ్రాన్సిస్; బేకన్ రోజర్; బోజంకెట్, బెర్నార్డ్; బోయీతియస్; బ్రెంటానో, ఫ్రాంజ్; మనఃప్రాధాన్య వాదము; మహమ్మదు; మార్కస్, ఒరీలియస్ ఆంటోనియస్; మార్భర్గు సమావేశము; మాల్బ్రాన్ష్, నికోలా దె; మిల్, జాన్ స్టూవర్ట్; మెన్సియస్; మెసైయా; మైమానిడీజ్; యూడిమస్ (రోడ్సు నివాసి); రిట్ల్, ఆల్బ్రెక్ట్; రీడ్, థామస్; రైజ్‌బ్రెక్, యాన్‌ఫాన్; లక్షణము; లాగాస్; లాట్జె, రూడాల్ఫ్ హెర్మన్; లామా మతము; లావోట్జు; లూసిపస్; లెనిన్, వ్లాడిమిర్ ఇల్యిచ్ ఉల్యనోవ్; లెవి-బ్రూల్, లూసియన్; లెస్సింగ్, గాట్‌హోల్డ్ యేఫ్రాయిమ్; వర్గీకరణము; వాల్టేర్, ఫ్రాన్సొమారీ అర్వేడ; విశేషాభిధానము; వోల్ఫ్, క్రిస్టియన్ ఫాన్; వ్యక్తిత్వ భావ వాదము; శక్తివాదము; షింటోమతము; షిలర్, ఫెర్డినాండ్ కానింగ్ స్కాట్; ష్లైర్ మేఖర్, ఫ్రీడ్రిచ్ ఎర్నెస్ట్ డేనియల్; సంశయ వాదము; సత్తా శాస్త్రము; సర్వచైతన్య వాదము; సామయిక వాదము; సినిక్కులు; సిరెనేయిక్కులు; సుఖవాదము; సోక్రటీస్; సోఫిస్టులు (యుక్త్యాభాస వాదులు); స్పెన్సర్, హెర్బర్ట్; స్వీడెన్‌బార్గ్, ఇమాన్యుయల్; హార్ట్‌మన్, కార్ల్ రాబర్ట్ ఎడ్వర్డ్ ఫాన్; హెకెల్, ఎర్నెస్ట్ హైన్రిచ్; హెర్డర్, యొహాన్ గోట్‌ఫ్రీడ్ ఫాన్; హెర్బర్ట్, యొహాన్ ఫ్రీడ్రిచ్; హెల్వీషస్, క్లాడ్ అడ్రియన్.

శ్రీ కె. వేంకటేశ్వర్లు, ఎమ్. ఏ.

లెక్చరర్, పొలిటిక్స్ డిపార్ట్‌మెంట్, ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు.

మార్క్స్-మార్క్స వాదము.

శ్రీ కె. వేంకటేశ్వరరావు, ఎమ్.ఏ., ఎల్.ఎల్.బి.

సంగం జాగర్లమూడి, (వయా) తెనాలి.

సాక్షాత్కార వాదము.

శ్రీ కేశవ తీర్థ స్వామి

'రామ దర్శన' సంపాదకులు, పిడుగురాళ్ల పోస్టు, గుంటూరు జిల్లా.

భక్తి (స్వరూపము, విధములు); రమణ మహర్షి; రామకృష్ణ పరమహంస; రామమోహన రాయలు.

డాక్టరు కొత్త సచ్చిదానందమూర్తి

ఫిలాసఫీ ప్రొఫెసర్, ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు.

సమీక్ష; అచింత్య భేదాభేద వాదము; అజాత శత్రువు; అద్వయ వాదము; అధిహాస్తవికతా వాదము; అనాత్మవాదము; అనిరుద్ధుడు; అనేకాంత వాదము (జైనులది); అన్నం

ఛట్టు; అరబ్బీ దర్శనము; అరిష్టనేమి; అలెగ్జాండర్, శామ్యుయల్; అవెనేరియ రిచర్డ్; అశ్వపతి (కైకేయుడు); ఆరంభవాదము; ఆర్ఫిక్ మతము; ఈజిప్టు మతవ ఉత్పలాచార్యుడు; ఉపాసన; ఉమాస్వాతి; ఊనముసో, మిగ్యుయల్ డి; ఎలౌసియ గుహ్య ప్రక్రియలు; కబీర్; కాంట్ దర్శనము (కొంత భాగము); కుంద కుం చార్యుడు; కుమారలాతుడు; గుణభద్రుడు; గుణరత్నుడు; గ్రీన్, థామస్ హి చరిత్ర దర్శనము; జీవము లేదా ప్రాణము (కొంత భాగము); జీవుడు; దివ్యప్రేరః నాథముని; పాస్కల్, బ్లెయిజ్; యామునాచార్యులు; వివర్త వాదము.

డాక్టరు సైమన్ కోహెన్

హీబ్రూ యూనియన్ కాలేజ్, జ్యూయిష్ ఇన్స్టిట్యూట్ ఆవ్ రెలిజన్,
క్లిఫ్టన్ అవెన్యూ; సిన్సినాటి, ఓహియో.

హీబ్రూ మతము.

శ్రీ ఆనంద కౌసల్యాయన్

హిందీ నగర్, వార్ధా.

బౌద్ధమతము - అభ్యుదయ, పతనములు; బౌద్ధమతము - దార్శనిక సంప్రదాయములు.

ప్రొఫెసర్ కార్నీలియస్ క్రూస్

ఫిలాసఫీ డిపార్ట్ మెంట్, వెస్లేయన్ యూనివర్సిటీ, మిడిల్ టౌన్, కనెక్టికట్.

ల్యాటిన్ అమెరికా దర్శనము.

ప్రొఫెసర్ ఎ. సి. గార్నెట్

ఫిలాసఫీ డిపార్ట్ మెంట్, విస్కాన్సిన్ యూనివర్సిటీ, మాడిసన్.

సాధుత.

పండిత గోపదేవ్

ఆర్యసమాజము, కూచిపూడి, (వయా) తెనాలి.

న్యాయము; వైశేషిక దర్శనము.

స్వామీ ఘనానంద

శ్రీ రామకృష్ణ - వేదాంత సెంటర్, 68, డ్యూక్స్ అవెన్యూ,
మస్వెల్ హిల్, లండన్.

హిందూమత పరిణామము.

స్వామీ చిరంతనానంద

113, ఆదియప్ప నాయక్ స్ట్రీట్, జార్జిటౌను, మద్రాసు-1.

ఆత్మ.

డాక్టరు పి. జె. చౌదరి

లేట్ ప్రొఫెసర్ ఆవ్ ఫిలాసఫీ, ప్రెసిడెన్సీ కాలేజ్, కలకత్తా.

జ్ఞాన మీమాంస.

ప్రొఫెసర్ ఎస్. సి. ఛటర్జీ, ఎమ్.ఏ., పిఎచ్.డి.

రిటైర్డ్ హెడ్, ఫిలాసఫీ డిపార్ట్ మెంట్, కలకత్తా యూనివర్సిటీ, కలకత్తా.

యోగ దర్శనము; సాంఖ్య దర్శనము.

జ. మా. శర్మ. — శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ, విద్యాప్రవీణ
సంస్కృత పండితులు, ఆంధ్రా క్రిస్టియన్ కాలేజ్, గుంటూరు.
కాశ్మీర శైవము; తంత్రములు.

జి. ఆర్. జీ. మూర్. — ప్రొఫెసర్ జి. ఆర్. జి. మూర్
వార్డెన్, మెర్టన్ కాలేజ్, ఆక్స్‌ఫర్డ్
అరిస్టాటిల్.

జి. సుం. రా. — శ్రీ జి. సుందరరామయ్య
ట్యూటర్, ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్, ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు.
కాంట్ దర్శనము (కొంత భాగము); బౌద్ధిక వాదము

జీన్ వాల్. — ప్రొఫెసర్ జీన్ వాల్
ప్రొఫెసర్, లా సోర్ బోన్ (విశ్వవిద్యాలయము), పారిస్
అస్తిత్వ వాదము.

జె. ఎల్ (యల్). బ్లౌ. — ప్రొఫెసర్ జోసెఫ్ ఎల్. బ్లౌ
కొలంబియా యూనివర్సిటీ, న్యూయార్క్.
అమెరికా దర్శన శాస్త్రము; వ్యావహారిక సత్తావాదము,

జె. కౌప్. — డాక్టరు జూలియన్ కౌప్, ఓ.ఎఫ్.ఎమ్.
ప్రొఫెసర్ ఆవ్ డాగ్మాటిక్స్, వెస్టర్న్ స్టర్, పాడర్ బారన్ (వెస్ట్ జర్మనీ).
బొనవెంచర్, జాన్ ఫిడాన్జా.

జె. నా. మూర్తి. — శ్రీ జె. ఎస్. ఆర్. ఎల్. నారాయణమూర్తి, ఎమ్.ఏ.
కొంతకాలం ఉపసంగ్రాహకులు, తెలుగు భాషా సమితి,
లెక్చరర్, ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు.
అనుమానము; అనేకేశ్వర వాదము; అమిదా మతము (అమితాభమతము); అల్ కిండీ (అల్ కిండియన్); అల్ ఘుజాలీ; అల్ ఫారాబీ; అవిసెన; అవిసెబ్రాన్; అవ్యక్త చైతన్య దర్శనము; అంతరజ్ఞాన వాదము; ఆలోచన నియమములు; ఆశావాదము (సర్వశ్రేయోవాదము); ఇస్లాం మతము (మహమ్మదీయ మతము); ఈశ్వర భావము; ఎవరోయిాజ్; ఏకేశ్వర వాదము; కార్నాప్, రుడోల్ఫ్; కృష్ణమూర్తి, జిడ్డు; క్రోచే, బెనెడట్టో; జీవాత్మ పారంపర్యోత్పత్తి వాదము; జేమ్స్, విలియమ్; జ్ఞానమతము; టావో మతము; తాదాత్మ్య దర్శనము; నియమము, నైతిక; నిర్ణయము; నిషేధము; నీట్షె, ఫ్రీడ్‌రిక్ విల్హెల్మ్; న్యాయ ప్రయోగ రూపములు; పియానో, జూసెపి; పృథక్కరణము; సాధారణీకరణము; పోర్ట్ రాయలిస్టులు; ప్యూరిటన్ మతము; ప్రయోజన వాదము (కొంత భాగము); ప్లోటినస్; ఫోయెర్ బాఖ్, లుడ్విగ్ ఆండ్రియస్; బార్త్, కార్ల్; బాహ్యార్థ సమర్పణ వాదము; బాహ్యార్థానుమేయ వాదము; బుద్ధి సర్వస్వ వాదము; బెర్ద్యయేవ్, నికొలాయ్ అలెగ్జాండ్రోవిచ్; బ్రన్ష్విగ్, లియోన్; బ్రాడ్, చార్లీ డన్‌బార్; భావనాత్మక దర్శనము; మనఃపరాగ సిద్ధాంతము; మనశ్శరీర సాహచర్య వాదము; మనస్సు – భౌతిక ద్రవ్యము; మని మతము; మనోద్రవ్య సిద్ధాంతము; మరీటాన్, జాక్; మాజ్ద మతము; మిత్రమతము; మిల్ పద్ధతులు; మూర్, జార్జి ఎడ్వర్డ్; మైనాంగ్, ఎలెగ్జియస్; మోర్గన్, లాయిడ్; రైఖెన్ బాఖ్, హాన్స్; లూథర్, మార్టిన్; లొమ్‌బార్డ్, పీటర్; వికాశనము;

విశ్లేషణము, సంయోజనము; వ్యక్తి ప్రధానవాదము; శ్రద్ధాదర్శనము;
మతము; షెలర్, మాక్స్ ఫెర్దినాండ్; షోపెన్ హోవర్, ఆర్థర్;
వాదము; సత్తాశాస్త్రవాదము; స్టోయిక్కులు – స్టోయిక్ దర్శనము; స్నే
సంఘము; హార్ట్‌మన్, నికొలాయ్; హుస్సెర్ల్, ఎడ్మండ్; హేత్వాభాసలు (ప
తర్క శాస్త్రములో).

జెనీ ఫిలిప్స్. — డాక్టరు జెనీ ఫిలిప్స్
బాస్టన్ యూనివర్సిటీ, బాస్టన్.
విద్యాశిక్షణ దర్శనములు.

టాన్-యున్-షాన్. — ప్రొఫెసర్ టాన్-యున్-షాన్
ప్రొఫెసర్ అండ్ ప్రిన్సిపాల్, విశ్వభారతి చీనా భవన్, శాంతినికేతన్.
చైనీయ దర్శనము.

డివాటియా. — మిస్ ఎస్. డివాటియా, ఎమ్.ఏ. (కేంబ్రిడ్జి)
రీడర్ ఇన్ ఫిలాసఫీ, ఎమ్. ఎస్. యూనివర్సిటీ, బరోడా.
రెనె డేకార్ట్ (కొంత భాగము); లైబ్నిట్స్.

తాతాచార్య — శ్రీమాన్ డి. టి. తాతాచార్య, శిరోమణి, ఎమ్. ఓ. ఎల్.
కొంతకాలం ప్రొఫెసర్, తిరుపతి ప్రాచ్య సంస్థ,
కొంతకాలం శ్రీ వైష్ణవ యూనివర్సిటీ, బృందావన్ (యు.పి.).
మీమాంస.

తివారీ. — డాక్టరు బ్రజ్ గోపాల్ తివారీ, ఎమ్.ఏ., ఎల్.టి., ఎల్ఎల్.బి., పిఎచ్.డి., డి.లిట్.
కొంతకాలం ప్రొఫెసర్ అండ్ హెడ్, ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్,
ఆగ్రా కాలేజ్, ఆగ్రా; రీడర్, జబల్‌పూర్ యూనివర్సిటీ.
భేద భావము – దాని విమర్శ; మిథ్యాత్వము.

తె. వి. — శ్రీ తెన్నేటి విశ్వనాథం, ఎం.ఏ., ఎం.ఎల్.ఏ.
మాజీ ఆర్థిక మంత్రి, ఆంధ్ర రాష్ట్రము, విశాఖపట్టణము.
గాంధీ దర్శనము.

త్సానాఫ్. — ప్రొఫెసర్ రడోస్లావ్ ఏ. త్సానాఫ్
ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్, రైస్ యూనివర్సిటీ, హూస్టన్, టెక్సాస్.
భావ వాదము.

దావార్. — ప్రొఫెసర్ ఫిరోజ్ సి. దావార్, ఎమ్.ఏ., ఎల్ఎల్.బి., బి.ఇ.ఎస్. (రిటైర్డ్)
హెడ్, ఇంగ్లీష్ డిపార్టుమెంట్, ఎల్. డి. ఆర్ట్సు కాలేజ్, అహమ్మదాబాద్.
జొరాష్ట్రియన్ మతము.

ప. పూ. ఆచార్య — శ్రీ పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు, శతావధాని, మహోపాధ్యాయ, కవిశేఖర
రిటైర్డు పండితులు, హిందూ కాలేజ్, గుంటూరు.
ద్వైత వేదాంతము.

పి. చెం. సు. కుమారి పి. చెంచుసుబ్బమ్మ, ఎమ్.ఏ., శిరోమణి

లెక్చరర్, వి. ఆర్. కాలేజి, నెల్లూరు.

ఆజీవికులు; ఆర్యదేవుడు; కుమారిలభట్టు; క్షేమరాజు; గౌడపాదులు; చరకుడు; చార్వాకులు; చిత్సుఖాచార్యులు; జీవన్ముక్తుడు; దిఙ్నాగుని న్యాయశాస్త్రము; నాగసేనుడు; నీతిశాస్త్రము – జైన, బౌద్ధ; పరిణామ వాదము (కొంత భాగము); పాశుపతులు; ప్రత్యభిజ్ఞ లేదా కాశ్మీర శైవమతము; ప్రభాకరుడు; భర్తృహరి, భారతీతీర్థులు; మండన మిశ్రుడు; వజ్రయానము; విద్యారణ్యులు; వైష్ణవ మతము; సత్కార్యవాదము.

పి. న. రావు. డాక్టరు పి. నాగరాజారావు, డి.లిట్.

ఫిలాసఫీ డిపార్ట్మెంట్, కర్నాటక్ కాలేజ్, ధార్వార్ (ప్రస్తుతం మెర్కారాలో).

అధికారము; అభినవగుప్తుడు; అవతారములు; చైతన్యుడు; నారదుడు; బసవుడు; యోగములు.

పీటర్(,) హెన్నిసీ. ఫాదర్ పీటర్ హెన్నిసీ, ఎస్.జె.

డి నోబిలి కాలేజ్, పూనా-6.

అలెగ్జాండ్రియా దర్శనము; అన్సెల్మ్, సెంట్.

ప్రసాద్. డాక్టరు రాజేంద్ర ప్రసాద్, పిఎచ్.డి. (మిషిగన్)

ఫిలాసఫీ డిపార్ట్మెంట్, పాట్నా కాలేజ్, పాట్నా.

తర్కము, అరిస్టాటిలీయ; తర్కము, గణిత శాస్త్రాత్మక; వైధ తర్కము.

బలరామమూర్తి. శ్రీ ఏటుకూరి బలరామమూర్తి

సహాయ సంపాదకులు, 'విశాలాంధ్ర', విజయవాడ.

రష్యన్ దర్శన శాస్త్రము.

బెంపొరాడ్. శ్రీ జాక్ బెంపొరాడ్

హీబ్రూ యూనియన్ కాలేజ్, సిన్సినాటి, ఓహియో.

యూదీయ దర్శనము.

బెనర్జీ. శ్రీ కాళీ కృష్ణ బెనర్జీ

రీడర్ ఇన్ ఫిలాసఫీ, జాదవపూర్ యూనివర్సిటీ, జాదవపూర్, కలకత్తా.

నీతి శాస్త్రము; నీతి శాస్త్రము – గ్రీకు, రోమను; నీతి శాస్త్రము, నవీన.

బొ. శ్రీ. శ్రీమాన్ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

సహాయ సంగ్రాహకులు, తెలుగు భాషా సమితి, మద్రాసు.

అప్పయ్య దీక్షితులు; అర్థవాదము; అవిద్య; దయానంద సరస్వతి; రామతీర్థస్వామి; సిసిరో, మార్కస్ టల్లియస్.

భ. కృ. డాక్టరు భద్రిరాజు కృష్ణమూర్తి, పిఎచ్.డి. (కాలిఫోర్నియా)

ప్రొఫెసర్, భాషాశాస్త్ర విభాగము, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్.

భాషా దర్శనము.

భట్టాచార్య. — శ్రీ శివజీవన్ భట్టాచార్య

ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్, సాగర్ యూనివర్సిటీ, సాగర్ (మధ్యప్రదేశ్).

రసెల్, బెర్ట్రాండ్ ఆర్థర్ విలియమ్; విట్‌గెన్‌స్టైన్ దర్శనము.

మత్రాణీ. — ప్రొఫెసర్ జి. ఎన్. మత్రాణీ, ఎమ్.ఏ., (కాంటబ్), డిప్. ఎడ్. (లండన్)

ఇస్మాయిల్ యూసఫ్స్ కాలేజ్, జోగేశ్వరి, బొంబాయి.

స్పినోజా, బరూక్, లేదా బెనడిక్టస్ డె.

మహదేవన్. — ప్రొఫెసర్ టి. ఎమ్. పి. మహదేవన్, ఎమ్.ఏ., పి.ఎచ్.డి.

ప్రొఫెసర్ అండ్ హెడ్, ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్, మద్రాసు యూనివర్సిటీ.

నీతి శాస్త్రము; భారతీయ; మాయ.

మెక్‌క్వేరీ(రి). — శ్రీ జాన్ మెక్‌క్వేరీ

లెక్చరర్ ఇన్ సిస్టమెటిక్ థియోలజీ, గ్లాస్గో యూనివర్సిటీ.

కియెర్క్‌గార్డ్; యాస్పర్స్, కార్ల్; హైడెగ్గర్.

మెహతా. — డాక్టరు మోహన్‌లాల్ మెహతా, ఎమ్.ఏ., పిఎచ్.డి.

కౌన్సెలర్, బ్యూరో ఆవ్ వొకేషనల్ గైడెన్స్, బికనీర్.

జైన దర్శనము.

మే. వ. న. — శ్రీమాన్ మేడేపల్లి వరాహ నరసింహస్వామి

సంగ్రాహకులు, తెలుగు విజ్ఞాన సర్వస్వము, వాల్తేరు.

అజిత కేశ కంబళి; అతి లౌకిక సంఘటనలు; అద్వైతము; అపౌరుషేయత; అమలానందుడు; అరవిందుడు; అలారకాలమ; అశ్వఘోషుడు; ఆగమములు; ఆనందగిరి; ఆనంద మీమాంస; ఆపస్తంబుడు; ఆర్త భాగుడు; ఆలయ విజ్ఞానము; ఆశ్మరథ్యుడు; ఆళ్వార్లు; ఉదయనుడు; ఉద్ధాలకుడు; ఉద్యోతకరుడు; ఉపవర్షుడు; ఉపాలి; ఉపాస్య దేవతా శ్రేష్ఠత్వవాదము; ఎపిక్యూరియన్ వాదము; ఔడులోమి; కకుద కాత్యాయనుడు; కణాదుడు; కపిలుడు; కమల శీలుడు; కాత్యాయనుడు; కాపాలికులు; కారణము – కారణత (కొంత భాగము); కాశకృత్స్నుడు; కేవలము, కేవల వాదము; గంగేశోపాధ్యాయుడు; గాయత్రి; గార్గి; గోవిందానందుడు; గౌతముడు; ఘోషకుడు; చంద్రకీర్తి; జనకుడు; జయంతుడు (జయంతభట్టు); జయతీర్థుడు; జాబాలి; జీవము లేదా ప్రాణము (కొంత భాగము); జైవలి; ఠాకుర్, రవీంద్రనాథ్; డార్విన్, చార్లెస్ రాబర్ట్; తపోనిష్ఠ; దాస్ గుప్తా, సురేంద్రనాథ్; దృశ్యశాస్త్రము; దేవయానము; దేశము, కాలము; ద్రమిడాచార్యులు; ద్రవ్యము; ధర్మరాజు; ధ్యాన బౌద్ధమతము; ధ్యానము; నమ్మాళ్వార్; నానక్; నామ రూపములు; నామవాదము; నియతి వాదము; న్యాసము; పంచశిఖాచార్యుడు; పంచీకరణము; పదార్థములు; పద్మపాదుడు; పరతః, స్వతః ప్రామాణ్యములు; పరమాణు వాదము (ప్రాచ్య; ప్రతీచ్య); పరమార్థము; పరలోక శాస్త్రము; పరిణామ వాదము (కొంత భాగము); పార్థసారథిమిశ్రుడు; పార్శ్వనాథుడు; పితృయానము; పిప్పలాదుడు; పురాగాథా శాస్త్రము; పురుషార్థములు; పురుషార్థ శాస్త్రము; ప్రకాశాత్మ; ప్రకాశానందుడు; ప్రజాపతి; ప్రతర్దనుడు; ప్రత్యయము; ప్రత్యయ వాదము; ప్రమాణములు; ప్రయోజన వాదము (కొంత భాగము); ప్రశస్తపాదుడు; ప్రేత సంసర్గ వాదము; బాదరాయణుడు; బుద్ధఘోషుడు; బృహస్పతి;

బోధాయనుడు; బ్రాహ్మణములు; బ్రూనో, జోర్డానో; భర్తృ ప్రపంచుడు; భర్తృ మిత్రుడు; భాగవత మతము; భారుచి; భాస్కరుడు; భోజరాజు; భౌతిక వాదము; మంజుశ్రీ; మణిభద్రుడు; మత సంస్కరణోద్యమము; మధ్యవర్తిత్వము; మహావీరుడు; మాఠరుడు; మాధ్యమిక సిద్ధాంతము; మార్సెల్, గేబ్రియల్; మాహేశ్వరులు; మేధాతిథి; మైత్రేయనాథుడు; మౌద్గల్యుడు; యజ్ఞము; యశోమిత్రుడు; యాజ్ఞవల్క్యుడు; యాదవప్రకాశుడు; రంగరామానుజులు; రసేశ్వర దర్శనము; రామానుజాచార్యులు; రాయ్ దర్శనము; రూసో, జె. జె.; లోక సంగ్రహము; వర్ణ వ్యవస్థ; వాక్కు; వాత్సీపుత్రుడు; వాత్స్యాయనుడు; విగ్రహారాధన; విజ్ఞాన భిక్షువు; వివేకానందుడు; విశిష్టాద్వైతము (కొంత భాగము); వైజ్ఞానికదర్శనము; వైజ్ఞానిక పద్ధతి; శబ్ద బ్రహ్మవాదము; శ్రుతి ప్రామాణ్యము; షడ్విధ తాత్పర్య లింగములు; సంకల్ప స్వేచ్ఛ (కొంత భాగము); సన్న్యాసి మఠ సంస్థ; సాపేక్షతా వాదము; సామాన్యములు; సార్త్రె, జీఁపాల్; సిక్కుమతము; సుఖావతి; సృష్టి; స్ఫోటవాదము; స్వర్గ – నరకములు; హిరణ్యగర్భుడు.

మో. స. — పద్మభూషణ మోటూరి సత్యనారాయణ, ఎం. పి.
కార్యదర్శి, తెలుగు భాషా సమితి; మాజీ కార్యదర్శి,
దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు.
నింబార్కుడు; వల్లభాచార్యులు.

రామ్‌సే. — ప్రొఫెసర్ ఐ. టి. రామ్‌సే
నొల్లోత్ ప్రొఫెసర్ ఆవ్ క్రిస్టియన్ ఫిలాసఫీ, ఓరియల్ కాలేజ్, ఆక్స్‌ఫర్డ్.
క్రైస్తు, జీసస్; పాపము; పాపము, మోక్షము.

రామ్ స్పర్జర్. — డాక్టరు ఆల్బర్ట్ జి. రామ్‌స్పర్జర్
ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్, విస్కాన్సిన్ యూనివర్సిటీ, మాడిసన్.
బర్‌క్లీ, జార్జి; లాక్, జాన్; హ్యూమ్, డేవిడ్;

వరదాచారి. — డాక్టరు కె. సి. వరదాచార్య, ఎమ్.ఏ., పిఎచ్. డి.
రీడర్, ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ, తిరుపతి.
విశిష్టాద్వైతము (కొంత భాగము).

వాన్ మీటర్ ఏమ్స్. — ప్రొఫెసర్ వాన్ మీటర్ ఏమ్స్
ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్. సిన్సినాటి యూనివర్సిటీ, సిన్సినాటి, ఓహైయో.
సౌందర్యభావము.

వార్నర్ విక్. — ప్రొఫెసర్ వార్నర్ విక్
డిపార్ట్‌మెంట్ ఆవ్ ఫిలాసఫీ, చికాగో యూనివర్సిటీ, చికాగో.
అతిభౌతిక శాస్త్రము; గ్రీకు దర్శనము.

వాలీ ఉద్దీన్. — ప్రొఫెసర్ మీర్ వాలీ ఉద్దీన్, ఎమ్. ఏ., పిఎచ్.డి. (లండన్), బార్-ఎట్-లా.
రిటైర్డు ప్రొఫెసర్, ఫిలాసఫీ డిపార్టుమెంట్, ఉస్మానియా యూనివర్సిటీ,
హైదరాబాదు.
ఇస్లాం దర్శనము.

వాహిదుద్దీన్	డాక్టరు ఎస్. వాహిదుద్దీన్, పిఎచ్.డి. (మార్బర్గ్)
ప్రొఫెసర్, ఫిలాసఫీ డిపార్ట్ మెంట్, ఉస్మానియా యూనివర్సిటీ,
హైదరాబాదు (ఆంధ్రప్రదేశ్).
హెగెల్.

వి. నా. శాస్త్రి.	శ్రీ వి. నాగేశ్వర శాస్త్రి, ఎం. ఏ.
భారత ప్రభుత్వ రీసర్చి స్కాలర్, ఫిలాసఫీ డిపార్టుమెంట్, ఆంధ్రా యూనివర
వాల్తేరు.
రెనె డేకార్ట్ (కొంత భాగము).

వీర్‌హౌస్	ఫాదర్ జె. వీర్‌హౌస్, అండ్ ఫాదర్ ఎచ్. స్టాఫ్నర్
డి నోబిలీ కాలేజ్, పూనా-6.
చర్చిపితల దర్శనము.

వెంకటరామన్.	ప్రొఫెసర్ ఎస్. వేంకటరామన్, ఎం. ఎల్.,
హెడ్, లా డిపార్టుమెంట్ ; ప్రిన్సిపాల్, యూనివర్సిటీ కాలేజీలు,
ఆంధ్రా యూనివర్సిటీ.
ధర్మ దర్శనము ; మనువు.

వెం. సూ.	డాక్టరు వెంపటి సూర్యనారాయణ
తెనాలి.
వినోబా దర్శనము – సర్వోదయము.

వైన్‌బర్గ్.	ప్రొఫెసర్ జూలియస్ ఆర్. వైన్‌బర్గ్
ఫిలాసఫీ డిపార్టుమెంట్, విస్కాన్సిన్ యూనివర్సిటీ, మాడిసన్.
తార్కిక ప్రత్యక్ష జ్ఞాన ప్రాధాన్య వాదము.

ష్నీవిండ్.	డాక్టరు జెరోమ్ ష్నీవిండ్
డిపార్టుమెంట్ ఆవ్ ఫిలాసఫీ, చికాగో యూనివర్సిటి
బ్రాడ్లీ, ఫ్రాన్సిస్ హెర్బర్ట్.

సరస్వతి.	డాక్టరు శ్రీమతి సరస్వతీ చెన్నకేశవన్, ఎం.ఏ., పిఎచ్.డి.
కొంతకాలం అసిస్టెంట్ ప్రొఫెసర్, ఇల్లినాయి యూనివర్సిటీ,
అసిస్టెంట్ ప్రొఫెసర్ ఆవ్ ఫిలాసఫీ, పచ్చియప్పాస్ కాలేజ్, మద్రాసు.
కర్మసిద్ధాంతము ; రాధాకృష్ణన్ దర్శనము ; వీరశైవము ; శాక్తేయము.

సాంకృత్యాయన్(న).	మహాపండిత శ్రీ రాహుల్ సాంకృత్యాయన,
హాపీ వ్యాలీ, ముస్సోరీ.
అసంగుడు ; దిఙ్నాగుడు ; ధర్మకీర్తి ; నాగార్జునుడు ; వసుబంధువు.

సి.పి.ఆర్.అయ్యర్.	సర్. సి. పి. రామస్వామి అయ్యర్
(మాజీ వైస్ ఛాన్సెలర్, కాశీ, అన్నామలై విశ్వవిద్యాలయములు)
"డిలెస్లీ", ఉదకమండలము.
భగవద్గీత.

సోలమన్. మిస్ ఇ. ఎ. సోలమన్, ఎమ్.ఏ., పిఎచ్.డి.
అసిస్టెంట్ డైరెక్టర్, బి. జె. ఇన్‌స్టిట్యూట్ ఆవ్ లెర్నింగ్ అండ్ రీసెర్చ్,
భద్ర, అహమ్మదాబాద్.
తర్కము, బ్రాహ్మణ, బౌద్ధ, జైన.

సౌరయ్యా. ఫాదర్ ఎస్. సౌరయ్యా, పి. ఎచ్ డి. (గ్రెగోరియన్)
సేక్రెడ్ హార్ట్ కాలేజ్, షెంబగనూర్, మధుర జిల్లా.
క్రైస్తవమతము.

(జె. ఎ.) హనీవెల్. జె. ఎ. హనీవెల్
కొంతకాలం ఫుల్ బ్రైట్ రీసర్చర్, ఆంధ్ర యూనివర్శిటీ, వాల్తేరు.
రీసర్చ్ స్కాలర్, చికాగో యూనివర్శిటి, చికాగో.
డ్యూయీ, జాన్ ; ప్లేటో ; సాంతియానా, జార్జి.

హుల్యాల్‌కర్. ప్రొఫెసర్ ఎచ్. జి. హుల్యాల్కర్, ఎమ్.ఏ. (లండన్)
ప్రిన్సిపాల్, శ్రీ పరశురామ్ భా కాలేజ్, పూనా.
సాక్షాత్కారము.

హెండర్‌సన్. శ్రీ కె. డి. డి. హెండర్సన్, ఎం.ఏ. (ఆక్స్‌ఫర్డు), ఒ.బి.ఇ.
సెక్రెటరీ, స్పాల్డింగ్ ట్రస్ట్, ఆక్స్‌ఫర్డు.
గ్రీస్, రోమ్ దేశముల మతములు.

## రెండవ ముద్రణ (1992) లో అదనంగా పాల్గొన్న రచయితలు

ఆర్త్ బెర్నండ్‌సన్ దర్శన శాస్త్రాచార్యులు, మిస్సోరి యూనివర్సిటీ, కొలంబియా (యు.ఎస్.ఎ.)
మెక్సికో, లాటిన్ అమెరికా దర్శనము

అన్నా లూయీ కాన్‌రాది దర్శన శాస్త్రాచార్యులు, నేటాల్ విశ్వవిద్యాలయం, దర్బన్
ఆఫ్రికాదర్శనము

రిచర్డ్ టీజిన్ మయామీ విశ్వవిద్యాలయం, ఆక్స్‌ఫర్డ్, ఓహియో (యు.ఎస్.ఎ.)
గణిత తత్త్వం
(పై వ్యాసాలకు అనువాదం : డా.ఆర్. వెంకటరెడ్డి, రీడర్
దర్శనశాస్త్రవిభాగం, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్.)

జె.నా. మూర్తి జె.ఎన్.ఆర్.ఎల్. నారాయణమూర్తి
దర్శనశాస్త్ర విభాగం, మాంటెరీ పెనిన్సూలా కాలేజి, కాలిఫోర్నియా (యు.ఎస్.
ఇస్లాం మతము
అనువాదం : డా.పి. చంద్రశేఖర్, రీసర్చ్ ఆఫీసర్
విజ్ఞాన సర్వస్వకేంద్రం, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.

# విషయానుక్రమణిక

# దర్శన సమీక్ష

## దర్శన స్వరూప, స్వభావములు

మానవుడు సాధారణముగా తన జీవితమును గురించి, ప్రపంచమును గురించి పరిశీలన, ఆలోచన, లేదా చింతన చేయకుండ గడుపును. తన పరిస్థితిని గూర్చి గాని, బ్రతుకుచున్న విధానమును గూర్చి గాని సాధారణముగా ఆలోచింపడు. తన పూర్వగులు, సంఘము, సంస్కృతి ప్రవర్తింపచేసి సాంప్రదాయికముగా చేసిన లక్ష్యములకొరకై పనిచేయుచు, తోటి వ్యక్తులు, సంఘము ఆమోదించు విధముగా నడుచుకొనవలెనని, తనకు సుఖము, తృప్తి కలుగునట్లు చూచుకొనవలెనని మనుష్యుడు మామూలుగా ప్రయత్నించును. అయితే వీటన్నిటికిని సమన్వయము పూర్తిగా జరుగదు; వీటిమధ్య సంఘర్షణ ఏర్పడును. అప్పుడు కర్తవ్య నిశ్చయము చేసికొనుటకు ఆలోచన అవసరమగును. ''నేనెందుకు సంఘము గాని, తోటి మానవులుగాని ఆమోదించు విధానమునే అనుసరింపవలెను? నా కెక్కువ సుఖము, తృప్తి కలుగునట్లు నేనెందుకు వర్తింపకూడదు? లేదా నా సుఖమును, తృప్తిని త్యాగము చేసి సాధింపవలసిన లక్ష్యము ఏమైన ఉన్నదా? ఉన్నచో అది నాకు గోచరము కావలసినదే! ఇతర మనుష్యులకు – వారు పూర్వగులు కావచ్చును, సమకాలికులు కావచ్చును – తెలిసిన విషయము స్వయముగా నాకును బోధపడవలెను కదా! అన్యులను, సంఘమును ప్రమాణముగా నేనెందుకు తీసికొనవలెను?'' ఇటువంటి ప్రశ్నలు ఒక విధమైన చింతనను రేకెత్తించును.

**దార్శనిక సమస్యలు:** ప్రపంచములో ఏదో ఒక విషయము గాని, సమస్త విశ్వమును గూర్చిన భావము గాని ఒక్కొక్కసారి మనకు కుతూహలమును, ఆశ్చర్యమును కలిగింపవచ్చును. ఉదాహరణమునకు ప్రపంచములో కన్పడుచున్న క్రమము, వ్యవస్థ మనకు ఆశ్చర్యకారణము కావచ్చును. మానవుని బుద్ధిబలము, హస్త కౌశలము – వీటిద్వారా అతడు సాధించిన నిర్వాహమును, అతడు తక్కిన జీవకోటిపైన, ప్రకృతిపైన పొందిన విజయమును, అతడు భావనాశక్తి (imagination) ద్వారా సృజించిన కవిత్వ, శిల్ప, సంగీతములను మననము చేయుట వలన మానవుని మహిమ, శ్రేష్ఠత్వము తెలిసి మన కాశ్చర్యము కలుగవచ్చును. అట్లే, ఇంత ఉత్కృష్టమైన మానవుడు కూడ లోకములో కొంచెము కాలమే మనునని, అతడును తక్కిన పశు పక్షి వృక్షాదుల వలె మరణించునని తెలిసికొన్నప్పుడు ''అతని పర్యవసాన మేమి? గమ్యమేది? అతని ఆలోచన, కృషి, ఆరాటము, ఉద్వేగము ఇవన్నియు మరణాంతము లేనా? లేదా అతనిలో ఏదైన శాశ్వతతత్వము కల్గిన సారవస్తువు ఉన్నదా? మానవ జీవితమునకు ఒక అర్థము, ప్రయోజనము ఉన్నవా?'' ఇటువంటి విచికిత్స మానవుని గురించి, లేదా ఏదైన వస్తువును గురించి, సంఘటనను గురించి ప్రారంభింపవచ్చును. లేదా యావత్తు ప్రపంచమునే ఇట్టి విచికిత్సకు విషయముగా చేయవచ్చును.

మానవుల, వస్తువుల స్వరూప, స్వభావములను గురించి, వాటి ప్రవృత్తి, కర్మ, కార్యములను గురించి, వీటన్నిటి మధ్య గల సంబంధములను గురించి చాల సంగతులు ప్రత్యక్షముగను, దానిపై ఆధారపడిన అనుమానముల (inferences) ద్వారాను తెలిసికొనవచ్చును. ఈ అనుమానములను రుజువు చేసికొనవచ్చును. కాని వీటిని గురించి వేయుటకు వీలైన అనేక ప్రశ్నలకు, కలుగు సందేహములకు ప్రత్యక్షముపైన గాని, అనుమానముపైన గాని ఆధారపడినచో సమాధానములు దొరుకవు. అప్పుడు క్రమబద్ధముగా, ఊహా చోదితుడై భావనా శక్తి సహాయముతో మానవుడు చింతన చేయవచ్చును. అప్పుడు "అసలు తెలిసికొనుట అనగా ఏమి? జ్ఞాన స్వరూపము ఎట్టిది? దేనిపై అది ఆధారపడి ఉన్నది? ఎట్లు కలుగుచున్నది? జ్ఞానమును జ్ఞాన మని పరీక్షించి తేల్చుకొనుట ఎట్లు?" ఇటువంటి సమస్యలు ఏర్పడును. అట్లే లక్ష్యములను, విలువలను గురించి, కార్యాచరణ రీతులను గురించి, కర్తవ్యమును గురించి సమస్యలు తోచవచ్చును. లక్ష్యములు, విలువలు, మంచి, చెడుగు, కర్తవ్యము, అకర్తవ్యము, శాశ్వతము, అశాశ్వతము, వస్తువు, అవస్తువు, సత్యము, అసత్యము, యథార్థము, అయథార్థము - మొదలైన మాటలను ఉపయోగించుచు చేయబడిన ప్రతిపాదనలను, వాక్యములను గురించి మీమాంస జరుగవచ్చును. "ఈ మాటలు ఎట్లు వాడుకలోనికి వచ్చినవి? ఇవి భావములపై ఆధారపడియున్నవి; ఆ భావములకు ఏవైన ఆశ్రయములు ఉన్నవా? అవి స్వతంత్రముగా, సహజముగా మానవ మస్తిష్కములో పుట్టినవా?" అనెడు ఆలోచన కలుగవచ్చును ఇట్లు భావములకు, అర్థమునకు, భాషకు గల పరస్పర సంబంధము, ఆలోచనకు, వ్యాపారమునకు, లక్ష్యములకు, ఆదర్శములకు, కృషికి గల పరస్పర సంబంధము సరళముగాను, సమస్యారహితముగాను, పెద్దగా చింతన చేయ నక్కరలేని విషయములుగాను కన్పడవచ్చును. కాని వీటిని గురించి మననము చేసినచో వీటిలో ఎన్నియో చిక్కులు, సమస్యలు, లోతులు గోచరించును.

ఈ పై పేరాలలో సూచింపబడిన సమస్యల పరిష్కారమునకై జరుగు ఆలోచన విజ్ఞాన, మత, కవిత్వాదులలోని మానసిక వ్యాపారమునకు భిన్నము. ఇట్టిది 'దార్శనిక' చింతనకు దారి తీయును.

**'దర్శన' నిర్వచనము:** ఏదో యొక సంస్కృతికి చెందిన ఏదో యొక సంఘములో ఒకడైన మానవుడు పూర్వగులు, చుట్టునున్నవారు అనుసరించు విధానములనే అనుసరించుచు, వారివలెనే వారు సాధింప యత్నించుచున్న ప్రయోజనముల కొరకే పాటుపడుచు లోకవ్యవహారమును విమర్శింపకుండ, పరీక్షింపకుండ సాగించుట మానవులకు సాధారణముగ సహజము. ఏదో ఒక క్రొత్త భావము (ఉదా. అవధులు లేని విశ్వము ఒకటున్నది. అందు అనేక సాధ్యములకు, సాధనలకు తావున్నదను భావము), లేదా అనుదినము చేసినదే చేయుచు ఆవృత్త మగుచున్న జీవితము, అందులో అనివార్యముగ కల్గుచున్న జన్మ మృత్యు జరా వ్యాధులను, దుఃఖ దోషములను చూచుట, లేదా మనము సాధించుచున్నట్టి, చేయుచున్నట్టి వస్తువులు, కార్యములు నిరర్థకములు, నిష్ప్రయోజకములు అని అనుభూతమై, స్వయంసిద్ధముగా సంపూర్ణముగా సార్థకమైన, శివమైన వస్తువు ఉన్నదా అను అన్వేషణ, లేదా వస్తువులకు నిజమైన ఆధారము, కారణము, గమ్యము ఏది? అను జిజ్ఞాస, లేదా విశ్వమును గురించియో, అందులో ఏదో ఒక వస్తువును, వ్యక్తిని, లేదా సంఘటననో గురించిన ఆశ్చర్యము, లేదా మంచి జీవిత విధానమును అనుసరింపవలె నను ఆరాటము వలన మానవుడు తనను గూర్చియో, తన బాధ్యతలను, కర్తవ్యములను గూర్చియో ఆలోచించుట - వీటిలో ఏ ఒకటియైన కేవలము ప్రత్యక్షముపైన, అనుమానములపైన ఆధారపడని చింతనకు దారితీయవచ్చును. అది ఫలించి క్రమబద్ధమై సుసంగతమైన భావములలో పర్యవసించినప్పుడు 'దర్శనము' అనబడును. కొన్ని సన్నివేశములు, అనుభూతులు(ఉదా. అద్భుత,[1] ఉగ్ర,[2] దివ్య,[3] లేదా పవిత్ర[4] వస్తు సంబద్ధములు), ఉద్వేగములు

1. numinous, 2. tremendous,
3. divine, 4. sacred.

(ఉదా. భయము, ఆశ్చర్యము, విషాదము), సంఘర్షణలు జీవితమునకు, లోకవ్యవహారమునకు ఆధారములైనకల్పనలను లేదా అభ్యుపగమములను (assumptions) గురించి సవిమర్శకముగా ఆలోచించుటకు ప్రేరేపింపవచ్చును ఈ ఆలోచన, మననము సందేహమునకు, విచికిత్సకు దారితీయును. ఈ సందేహములను, ప్రశ్నలను ఉపశమనము చేయుటకు జరుగు చింతనమే దర్శనము. కొందరు వ్యక్తులలో ఈ చింతనకు నిశ్చిత పర్యవసానము రాదు. వారి సందేహములు తీరవు. ప్రత్యక్ష అనుమానములకు అందని దేదియు వారికి ఉండదు. లేదా అది వారికి శాశ్వత సందేహముగానే ఉండిపోవును. మరి కొందరిలో ఈ ధోరణి ఇంకను తీవ్రమై, ప్రత్యక్ష అనుమానములద్వారా గూడ నిశ్చిత జ్ఞానము అసాధ్య మని, ఏవో కొన్ని పునరుక్తి వాక్యములు (tautologous propositions- అవి ఏ రీతినైనను క్రొత్తజ్ఞానము నీయవు, యథార్థతను గురించి చెప్పలేవు) తప్ప, నిరూపించుటకు యోగ్యమైన, పూర్ణముగా సత్యములైన ప్రతిపాదనలు లేవను వాదముగా ఏర్పడును. ఇట్టి వారికి లోకవ్యవహారమునకు ఆధారమైన దృష్టికి భిన్నమైన మరొక దృష్టి ఏర్పడదు. అయితే వారు దానిని పరీక్షించి, విమర్శించి దాని అపర్యాప్తతను మాత్రము తెలిసికొనగలుగుదురు. మరికొందరు తమ మనన చింతనలను నిశ్చిత జ్ఞానము పొందిన దనుక కొనసాగింప గల్గితి మను తృప్తిని పొందినందున వారికి తమ ఆలోచన ఫలముగా విశ్వమును గురించిన, మానవుని, అతని కర్తవ్య బాధ్యతా లక్ష్యములను గురించిన మరొక దృష్టి ఏర్పడిన దని, అది నైసర్గిక, వ్యావహారిక దృష్టి కంటె సమగ్రము, సంగతము అని విశ్వాసము కల్గును. ఇట్టి దృష్టులే 'దర్శనములు'*.

* ఫిలాసఫీ అను శబ్దము మొదట జ్ఞాన ప్రేమ, సత్యాన్వేషణ అను అర్థములలో గ్రీసులో ఉపయోగింపబడెను. క్రమముగా అది విశాలము, గంభీరము అయెను. ప్రస్తుతము దానిని ఇక్కడ 'దర్శనము'ను వివరించినరీతిగానే వివరించి అర్థముచేసికొనవచ్చును.

**దర్శముల ఆధారములు :** దర్శనములు కేవల ప్రత్యక్ష అనుమానములపై ఆధారపడవు. అవి తర్కమును, ప్రత్యక్షమును ఉపయోగించినను, అంతర్దృష్టులను, ఆ యా అనుభవముల విశిష్ట వ్యాఖ్యలను, ఊహను, భావనా శక్తిని ఆలంబనముగా తీసికొనును. అయితే కొందరు తమ తమ దర్శనములు అనుభవముపైన, బుద్ధి (reason) పైన మాత్రమే పూర్తిగా ఆధారపడియున్న వని, అవి పూర్ణముగా హేతుబద్ధము లని అనుకొందురు. ఇతరులు ఇది ఒప్పుకొనరు. సమగ్ర సత్య దర్శనము కేవల బుద్ధిపైన ఆధారపడనక్కరలేదు. అది ప్రజ్ఞపైన, అంతర్దృష్టి పైన ఆధారపడవచ్చును. లేదా అది ప్రత్యేక సందర్భములలో - విశిష్ట ఉద్వేగములు కలిగినపుడు, అరుదైన అనుభూతులు తారసిల్లినప్పుడు-ఉద్భవించిన మనన ఫలితము కావచ్చును. అట్టిచో అది ప్రత్యక్షమునకు, అనుమానమునకు అందని విషయములను, విరుద్ధ విషయములను కూడ ప్రతిపాదింపవచ్చును. అయినప్పటికిని అదియు జ్ఞానమే. అయిన దాని స్వరూపము, తర్కము, పద్ధతి వ్యవహార జ్ఞాన, విజ్ఞానము (science)ల స్వరూపాదులకు భిన్నముగా నుండును. 'వీటి దృష్ట్యా దానిని రుజువుచేయుట కాని, దానిని అపహతము చేయుట కాని కూడదు' అని కొందరి మతము. దీనికి విరుద్ధముగా 'దర్శనము ఎన్నటికిని జ్ఞానము కాజాలదు. అది కేవలము శ్రద్ధ (faith) మాత్రమే' అని కొందరి వాదము. జీవితమునకు లక్ష్య నిర్దేశము చేయుటకు విలువలను, ప్రమాణములను (standards) నిర్ణయముచేసి వాటి కనుగుణముగ ఒక గమ్యమునకు చేరునట్లు బ్రతుకుటకు, రిక్తత, నిర్వేదము, నిస్పృహలకు పాల్పడి జీవితము విచ్ఛిన్నము కాకుండ ఉండుటకు శ్రద్ధ అవసరము. విజ్ఞానము, ప్రత్యక్షము ఈ పనులను చేయలేవు. శ్రద్ధ భావరూపము, అసందిగ్ధము, సంస్థాపకము అగు నిష్ఠ. అది అభావాత్మకము, నాస్తి గర్భము, సంశయాత్మకము, నిషేధాత్మకము, సంహారకము కాదు. అయితే శ్రద్ధయొక్క నిజ స్వభావము నెరిగి, అది జ్ఞానము కాదని గ్రహించి, దానిని పరీక్షించి,

విమర్శ యుతముగా స్వీకరించి, దాని ఆధారములను, కల్పనలను తెలిసికొని, దానిని గ్రహించినప్పుడు, అవి యథార్థములు కావని నిరూపితమైనపుడు వాటిని పరిత్యజించి, పునర్మనన చింతనల ద్వారా, అనుభూతుల వ్యాఖ్యాన విశ్లేషణల ద్వారా నూతన విధమైన శ్రద్ధను నిర్మించుటకు సిద్ధముగఉన్నప్పుడు మాత్రమే శ్రద్ధ నిజముగా దర్శనమగును. జ్ఞాన వస్తు కర్మలను పరీక్షించి, లోకమును గూర్చి, మానవుని గురించి, ఆదర్శములను, విలువలను గురించి ఏర్పరచుకొన్న శ్రద్ధామయ దృష్టి దర్శన మని ఇట్టి వారి అభిప్రాయము. ఇట్టి శ్రద్ధ విజ్ఞానమునకు, ప్రత్యక్ష అనుభవమునకు భిన్నముగా ఉండదని వీరందురు.

**సమగ్ర దర్శనము :** సరియైన సమగ్ర దర్శనము ఈశ్వరుని, లేదా ఏదో ఒక లోకోత్తర సత్త అభివ్యక్తివలన, పరమ సత్యముయొక్క అపావరణము (revelation or unveiling) వలన ఏర్పడు నని, దార్శనికుల పని అటువంటి అభివ్యక్తిని, లేదా అపావరణమును అవగాహనము చేసికొనుట, వివరించుట, విస్తరించుట, దాని దృష్ట్యా విశ్వమును వ్యాఖ్యానించుట, మానవ గమ్య కర్తవ్యాదులను నిర్ణయించుట అని కొందరి మతము. ప్రవక్తల, ఋషుల మనస్సులలోను, అవతార పురుషుల సనాతన పవిత్ర గ్రంథముల ద్వారాను ఇట్లు సత్యప్రకాశనము జరిగిన దని, దానిని గ్రహించి అర్థము చేసికొని ఆచరించుట అవశిష్టమని వీరల విశ్వాసము. 'ప్రత్యక్షానుభవముపైన, హేతువాద తర్క మానవ బుద్ధులపైన ఆధారపడు దర్శనములు అసంపూర్ణములు, అప్రతిష్ఠితములు' అని వీరు అందురు. 'మా దర్శనమే సంపూర్ణము, సుసంగతము, పూర్తిగా బుద్ధిపై నిర్మితము' అనువారు చాలామంది కలరు. వీరందరి దర్శనములు పరస్పర బాధితములు, ప్రతితంత్ర సిద్ధాంతములు.* అట్లే 'మా ఋషి, మా ప్రవక్త, మా దివ్యగ్రంథమే పరమ సత్యమును సాకల్యముగ, నిరవశేషముగ చాటినది. అదే మానవులందరికిశరణ్యము.' అనువారు చాలమంది ఉన్నారు. వీరందరి విశ్వాసములు, ప్రతిపాదనలు, క్రియాకలాపములు కూడ పరస్పర వ్యాహతము లగుచు విరుద్ధములుగానే ఉన్నవి. శ్రద్ధయే దర్శనము అనువారిలో స్వపక్షాభిమానము ఇంతగా ఉండదు. కాని అశ్రద్ధ, సందేహవాదము, నాస్తి వాదము - ఇవి దర్శనములు, జీవిత మార్గదర్శకములు కావని, విజ్ఞాన ప్రత్యక్షానుభవముల కందనిది కలదని, ఇది గుర్తించకపోవుట తప్పు అను ఆగ్రహము మాత్రము వీరికి ఉన్నది. కొందరు పెద్ద మనుష్యులు ఏదో రుచులలోని వైచిత్ర్యము వలన రకరకములుగ దృష్టులు ఏర్పడునని, అన్నిటిలోను సత్యము ఉన్నదని, అది తెలిసికొనలేక కేవలము సంజ్ఞలను గూర్చి వివాదములు జరుగుచుండునని, అన్నియు సత్యమును చేరుటకు మార్గములే నని, అన్ని నదులును సముద్రమునే చేరునట్లు అన్ని మార్గములును ఒకే గమ్యమును చేరు నని ఘోషించుచున్నారు. వీరిలో కొందరు అన్ని దృష్టులు సత్యదృష్టులైనను అందులో ఒకటే సంపూర్ణము, వ్యాపకము అగు నని, తక్కినవి పాక్షికముగ, అంశికముగ మాత్రమే సత్యమగు నని, కాబట్టి అవి పరిహార్యములు, త్యాజ్యములు అని, అట్లే అన్ని మార్గములు ఒక గమ్యమునకే దారితీసినను అందులో ఒకటే ఋజువైన రాజపథ మని, తక్కినవి డొంక తిరుగుడుగ ఉండు కుటిల మార్గము లని చెప్పుచున్నారు. 'ఇదిగో వేదాంతమే సరియైన దర్శన'మని, 'కాదు థామస్ మతమే సరియైన'దని, 'రెండును కాదు మార్క్సుమతమే అసలు నిండైన, నిజమైన దర్శనము' అని - ఇట్లు పరస్పరవిరుద్ధముగ లెక్కలేనన్ని ప్రతిపాదనలు ఉన్నవి.

'దృశ్యతే అనేన ఇతి దర్శనమ్' - అనగా దేని వలన చూడబడునో అది దర్శనము అని అర్థము. చూడబడునది ఏది? సత్యము, లేదా మనుష్యుల, వస్తువుల, క్రియల, వాగర్థముల, శాస్త్రవిజ్ఞానముల, ఇతిహాస కళా కౌశలముల - ఇంత ఎందుకు - విశ్వము, అందలి పదార్థములయు నిజస్వరూపము; యథార్థ

* ప్రతితంత్రసిద్ధాంత మనగా ఏదో ఒక దర్శనమునకు మాత్రమే సమ్మత మగు సిద్ధాంతము. సర్వతంత్ర సిద్ధాంత మనగా అన్ని దర్శనములకును సమ్మత మగునది.

త్వము స్వభావము; తత్త్వము. కాబట్టియే దీనిని 'తత్త్వ జ్ఞానము' అనవచ్చును. మననపూర్వకముగా సవిమర్శముగా ప్రతిదానిని అవలోకనము, పర్యాలోచనము చేయునది కాబట్టి ఇది "ఆన్వీక్షికి" అనబరగు విద్య. ఉన్నదానిని, భూతవస్తువులను, తత్త్వమును, శంసనము (ప్రకటన, వర్ణన) చేయునది కాబట్టి ఇది తత్త్వశాస్త్రము. అన్నిటికంటె గొప్పది, అన్నిటికి మూల కారణము, పరమ సత్యము, సత్త, పరమార్థము అగు దానిని బ్రహ్మము అనవచ్చును. కాబట్టి బ్రహ్మవిద్య దర్శనశాస్త్రమం దంతర్భూతము. మనుష్యులలో, వస్తువులలో ఏది నిజముగ సారమో, నిజతత్త్వమో (ఏది తానో) అది ఆత్మ. ఆత్మను విషయముగా చేసి కొని ప్రవర్తిల్లునది అధ్యాత్మ విద్య. అదియు దర్శనమే. కర్మాకర్మల మంచి చెడుగులను, ఔచిత్యానౌచిత్యములను, వాటి పర్యవసానములను ఆలోచించి, పూర్వాపరములను వీక్షించి, ధర్మమును (వస్తు సముదాయమును ధారణ చేయునది) సవివేకముగ, సవిమర్శకముగ విచారముచేసి, దానిని ప్రకాశ పరచునది, శాసించునది ధర్మశాస్త్రము. ధర్మ మీమాంసయు దర్శనమే. 'ఏది జ్ఞానము? ఏది కాదు? జ్ఞానమునకు మానమేమి? జ్ఞాతృ జ్ఞేయ జ్ఞానముల పరస్పర సంబంధము, వాటి స్వభావము ఏమి? జ్ఞానోపార్జన విధములు ఎన్ని? అవి ఎట్టివి? ప్రతిపాదక వాక్యముల, వాదముల సత్యాసత్యముల పరీక్షించుట, నిర్ణయించుట ఎట్లు? వాటి సూత్రము లేమి?' అను విచారణ కూడ దర్శనమే!* కాబట్టి దర్శనము సర్వవిద్యలకు ప్రతిష్ఠ. మన శరీరముల వివేక విభాగములు, వాటి స్వభావాదుల నిర్ణయము, మానసిక జీవిత వ్యాపారములను గూర్చిన విచారము కూడ దర్శనమే. సంఘము, రాష్ట్రము, సంస్కృతి - వీటిని గూర్చిన ఊహాచోదితమగు చింతనయు దర్శనమే! ఈవిధముగ కౌటిల్యుడు అనినట్లు దర్శన శాస్త్రము (ఆన్వీక్షికి) సర్వ విద్యలకు ప్రదీపము; సర్వ కర్మలకు ఉపాయము; సర్వ ధర్మములకు ఆశ్రయము (అర్థశాస్త్రము, 1. 2.)

**దర్శన ప్రాధాన్యము :** ప్లేటో, డేకార్ట్ మొదలగు పాశ్చాత్యుల దర్శనములను, వేదాంతము, టావో మతము మొదలగు ప్రాగ్దేశముల దర్శనములను గమనించినచో, 'దర్శన' విలక్షణత్వము తెలియవచ్చును. ఇటువంటి దర్శనములను ప్రమాణముగా గొనుటకు వాటి ప్రభావము, మానవేతిహాస సంస్కృతులలో వాటికిగల స్థానము, చిరస్థాయి యగు వాటి సాఫల్యము కారణములు. ఇతర శాస్త్రముల వలెను, విజ్ఞానము వలెను గాక, దర్శనము యావదనుభవము పైనను, వ్యవహారము పైనను ఆధారపడి యున్నది. జీవితము, సమస్తానుభవములు, వీటిని గూర్చిన విజ్ఞానములు- ఇవి అన్నియు దానికి విషయములే. అడ్డంకులను, సీమిత పరిధులను నిర్మూలించి, వివిధానుభవముల, శాస్త్రముల, సంస్కృతుల, సిద్ధాంతముల మధ్య సంబంధములను స్థాపించి వ్యాపక విశ్వ దృష్టి (Weltan - schauung) ని సృజించుట దర్శనాశయము. ప్రపంచ జీవితముల అనుశీలన వలన తట్టు ప్రహేళికల నెదుర్కొని వాటికి సమాధానము నరయు ప్రయత్న ఫలితము దర్శనము.

**దర్శనము-మతము :** 'వ్యాపక విశ్వదృష్టి జ్ఞానము కాజాలదు. శ్రద్ధమాత్రమే అగు' నను దార్శనికులు కలరు. జ్ఞానమే అను వారును కలరు. దీనికి విరుద్ధముగ 'వివిధ విజ్ఞాన శాఖలలోను, అనుదిన లోకవ్యవహారములోను ఉపలబ్ధమగు జ్ఞానము మనకు పర్యాప్తము. ఈ జ్ఞానమువలన తీరని సందేహములు, సమాధానము నందలేని ప్రశ్నలు ఎప్పటికిని అట్లు ఉండవలసినవియే.' అనువారును కలరు. 'కాబట్టి నేల విడచిన సాము ఎందుకు? వ్యర్థ ప్రలాపముల వలన ప్రయోజనము లేదు. వాగర్థముల స్వరూప సంబంధాదుల విచారమో, వాక్య విశ్లేషణమో, విజ్ఞానపు ఆధారములను, పద్ధతులను గూర్చిన మీమాంసయో, వివిధ

* కొందరు దార్శనికులు ధర్మము వస్తువు కాదనిరి; కొందరు 'బ్రహ్మ', 'ఆత్మ' పదములు మాత్రమే నని, యథార్థముగ అట్టి వస్తువులు లేవని అందురు. వీటన్నిటిని గూర్చిన జిజ్ఞాస, మీమాంస నిశ్చయముగా దర్శనమే. కాని అట్టి మీమాంస వలన అవి లేని వస్తువులని తేలునో, ఉన్న వస్తువులని తేలునో అనునది వేరు విషయము.

వైజ్ఞానిక సిద్ధాంతములను సమన్వయించి, వ్యవస్థీకరించుటయో మాత్రమే దర్శనము చేయగలిగిన కృషి' అని వీరి అభిప్రాయము. వీరి దృష్టిలో బ్రహ్మవిద్య లేదు. ధర్మశాస్త్రము కూడ నామమాత్రశాస్త్రమే. వీరిని తప్పించిన, ఇంచుమించు తక్కిన దార్శనికులందరును దర్శనము జీవితమునకు గమ్యము నొకదానిని, దానికి తగిన జీవిత విధానమును సూచించు ననియు, దర్శనము జీవితములో పరివర్తనను, సంస్కరణను తేగలదనియు తలచుచున్నారు. జీవిత నౌకకు దర్శనము చుక్కాని వంటిది. మతము కూడ జీవితమునకీ రీతిగ లక్ష్యనిర్దేశము చేసి ఉత్తమ జీవితవిధాన మేదో నిర్దిష్టము చేయగలదు కాని అందు స్వీయ ఆధార, అభ్యుపగమములను పరీక్షించు యత్నము, పరమత సహనము, ఉదారత చాలవరకు తక్కువ. సంపూర్ణ సత్యము హస్తగతమయినదిగాన ఇక అందరునుదానిని అవశ్య మంగీకరింపవలెనను హఠము అందు ఉండును. ఇక దర్శనమన్ననో నిరూపణయోగ్యమగు జ్ఞానమైన కావలెను. లేదా సవిమర్శము, చింతనశీలము అగు శ్రద్ధయైన కావలెను. అందు అగ్రహము, హఠము ఉండవు. ఏదో ఒక వ్యక్తియో, పుస్తకమో, సంస్థయో సంప్రదాయమో ఘోషించినదే సనాతన సంపూర్ణ సత్యమను విశ్వాసము ఉండదు. ఒక వేళ అట్టి విశ్వాసము ఉండినను అది విశ్వాసము మాత్రమే ననియు, ప్రమాణలబ్ధ నిశ్చయ జ్ఞానము కాదనియు నిజమైన దార్శనికుడు గుర్తెరుగును. ఇట్లే దర్శన మందు అంతర్దృష్టులను, విలక్షణ అనుభూతులను, ఇంద్రియ ప్రత్యక్షముతో గాని అనుమానముతో గాని వ్యామిశ్రము చేసి, బుద్ధి మోహము (confusion) కలిగించుట ఉండదు. అంతర్దృష్టుల, విలక్షణానుభూతుల, శ్రద్ధల ఆధారములను, అభ్యుపగమములను తెలిసికొని పరీక్షించుటకు, అవసరమైన సందర్భములలో వాటిని పరిత్యజించుటకు నిజమైన దర్శనము వెరవదు. స్వావలంబితములైన ఈ అభ్యుపగమములనే ఇతోఽధిక వికాసమునకు, స్పష్టతర ఉపబృంహణమునకు, ఉత్కృష్టతర పరిష్కారమునకు వీలులేని సంపూర్ణ పరిణామరహితము అగు సత్యప్రతిపాదనలని అది ఎంచదు. మత, దర్శనము లిట్లు విభిన్నములుగా నున్నవి.

**దర్శనము-విజ్ఞానము:** ఇక విజ్ఞాన,దర్శనములకు కల భేద మేమన, ఏదో యొక చేతనాచేతన వస్తుజాతమునో, భూతార్థములనో, సంఘటనలనో ప్రత్యక్ష ప్రయోగ (experimentation), అనుమానముల (ఇవి రెండురకములు:నిగమనము, వ్యాప్తిగ్రహణము) ద్వారా కూలంకషముగా నెరుగగోరునది విజ్ఞానము. విజ్ఞాన శాఖలు పెక్కులు. ప్రతిశాఖకు నిశ్చిత పరిధి, విశిష్ట పద్ధతి, నిర్దిష్ట విషయము కలవు. విజ్ఞాన పర్యవసానములు నిరూపణ యోగ్యములు (verifiable); సార్వలౌకికములైన సర్వసామాన్యములు (universals). ఇంతేకాక విజ్ఞాన శాఖలు అత్యంత ఏకదేశీయములై ఆ యా ప్రత్యేక సంకుచిత పరిధిలో విశిష్ట నిపుణత్వమును ఆర్జింప ప్రయత్నించుచు, దేని కది స్వయం పూర్ణమని భావించుచు, వివిధ విజ్ఞానశాఖల మధ్యను, మత, విజ్ఞాన, దర్శన, జీవితాదుల మధ్యను గల పరస్పర సంబంధములవైపు కన్ను ఎత్తవు. విజ్ఞాన సిద్ధాంతములు నిశ్చిత జ్ఞానము నిచ్చును. ప్రయోగ ప్రత్యక్షములచే నిజముకావని తేలిన సిద్ధాంతములు అపాస్తములగును. వాటిస్థానే నూతన సిద్ధాంతములు లేచును. విజ్ఞానము నానాటికి పురోగమించుచు వర్ధిల్లునది. ప్రాత విజ్ఞానము (ఉదా. చరకుని నాటి వైద్యము, బ్రహ్మగుప్తుని నాటి ఖగోళశాస్త్రము) గుర్తు పట్టరానంతగానైన మారును; లేదా పూర్తిగా విడనాడబడును. దీనికి కారణము ప్రయోగ, ప్రత్యక్ష, అనుమానములపై ఆధారపడి విస్తరిల్లుచున్న మానవ జ్ఞానము, క్రొత్తగా వెలుగులోనికి వచ్చుచున్న భూతార్థములు, వాటి దృష్ట్యా చేయుటకు వీలైన వివరణలు. దాదాపుగా ఇం దేలక్షణము కూడ దర్శనమునకు వర్తింపదు.

ఇట్లు దర్శన మననేమో, దానికి విజ్ఞాన, మతములతో గల భేద మేమో స్పష్టము. మానవులు, వస్తువులు, మాటలు, చేతలు - వీటిని గూర్చిన విజ్ఞాన శాఖలు, కళాకౌశలములు - ఇవన్నియు దర్శనమునకు ఎప్పుడో ఒకప్పుడు విషయములైన వని ఇతి

హాసము తెల్పుచున్నది. బ్రహ్మవిద్యయే దర్శనము, భౌతికవాదమే దర్శనము, భాషా విశ్లేషణమే దర్శనము, తక్కినవి కావు - అని ఇట్లు నానా విధములుగ ఆయా దార్శనికులు చెప్పుట చూడ, వారు దర్శనమన నేమో, దాని లక్ష్యము లేవో, పద్ధతులేవో ఇతిహాసము నధ్యయనము చేసి నేర్చుకొనుటకు సంసిద్ధులు కారని తేలును.

**దర్శన వైవిధ్యము:** ప్రాక్ప్రతీచీ దేశములలో పూర్వమునుండి ఇప్పటివరకు సఫలముగ, చిరకాలీనముగ, గాఢముగ తమ ప్రభావములను చూపిన దర్శనముల సామాన్య లక్షణములను పరిశీలించి, పైపైధముగ దర్శన స్వభావము నర్థము చేసికొనినచో జీవిత విశ్వముల ప్రహేళికను పరిష్కారముచేయు ప్రయత్నములో దర్శన ముదయించు ననియు, ప్రతి చింతకునిపైని దర్శనపు గత చరిత్ర తన ప్రభావమును చూపుననియు, ఆ ప్రహేళికను పరిష్కారము చేయు ఆశ లేనప్పుడు కూడ దార్శనిక చింతన ఆ సమస్యనుబట్టియే రూపొందు ననియు, చింతకు లవలంబించు దృక్పథములు వారెరిగిన దర్శనపు పూర్వచరిత్రవలన, స్వీయ ఊహా భావనాశక్తుల వలన నిర్ణయింపబడు ననియు తేలును. తన పరిస్థితిని బట్టి, తాను చేయదలచుకొనిన కృషి స్వరూపమువలన ఏర్పడిన సందర్భమునుబట్టి, తన సంస్కృతి సంఘములనుబట్టి, స్వీయ శక్తి జ్ఞానములనుబట్టి, ఆయా చింతకుడు దర్శనమన ఇది యనియో, అది యనియో నిర్వచించి, తదనుకూల పద్ధతుల ప్రకారము తన మనీషచే ఉత్ప్రేక్షించి 'ఇదియే తత్త్వము, తక్కినది కా' దని అనుటలో తప్పు లేదు. ఎందు కన అతడు చేయునది తన కేది దర్శనమో దానిని మాత్రమే నిర్వచించుచున్నాడు. పూర్వకాలమున భిన్న దేశములలోను. అట్లే ఇప్పుడును దర్శనము ఇతర విధములగు లక్ష్యములను, కర్తవ్యములను ఏర్పరుచుకొని ఆ ప్రకారము కృషి సాగించినదని, సాగించుచున్న దని అతడును ఒప్పుకొనును. అవి అసాధ్యములనో, నిరర్థకములనో మాత్రమే ఆత డనును. అందుచే అతనికి ఆ పరిశ్రమ అంతయు ఎండమావులను వెంటాడుటగా తోచును. ఉదాహరణమునకు - చార్వాకులకు పూర్వోత్తర మీమాంసా దర్శనములు అరణ్య రోదనములుగనో, జగద్వంచనగనో కనపడినవి. నేటి భాషా విశ్లేషకులకు (analysts) స్పినోజా శంకరాదుల, హెగెల్ మార్క్సుల వ్యవస్థలు (systems) అర్థము, సారములేని ప్రలాపములు (nonsense). కాని, ఏదో యొక సంప్రదాయమునకో, వ్యక్తికో, దేశమునకో, కాలమునకో మాత్రమే దర్శనముగా తోచునదే దర్శనము కాదు. ఎల్లప్పుడు ఎల్లెడల దర్శనముగా పరిగణింపబడుటకు యోగ్యమగు రీతిని ఘనము ఈ శాస్త్రమును అర్థము చేసికొనినచో, దాని వివిధ రూపములు, అవతారములు, పద్ధతులు అవగతము లగును. తద్ద్వారా ఆయా చింతన రీతులు, విలక్షణ కల్పనలు ఆయా దేశకాలములందు ఉద్భవించుటకు, అవి 'దర్శన' మననేమో ప్రత్యేక విభిన్న విధముల నర్థము చేసికోనుటకు గల కారణములు అవగత మగును. ప్రతివాడును కొంతవరకు గతకాలమును మరచి, భవిష్యత్తులో వచ్చుటకు వీలున్న ఉత్కర్షను సరకుగొనక, తనచే స్పష్టమైన సిద్ధాంతములనో, నిర్మాణములనో వెనుకటివాటికంటె మంచివిగాను, శాశ్వతములుగాను ఎంచవచ్చును. ఇది యొక భ్రమ. సమకాలికులగు ఇతరులకు, రాబోవు తరముల వారికి వాటి సాపేక్షత, సంకుచితత్వము, నశ్వరత్వము తెల్లమగుచుండును. అరిస్టాటిల్, హెగెల్, నాగార్జున, శంకరాదు లెందరో దర్శనములో చరమ వాక్యమును తాము పలుక గలిగితి మని ఎంచిరి. తమవే సత్యమైన దర్శనము లని ఘోషించిరి. పరస్పర వ్యాఘాతములచేతను, పరుల ఖండనములచేతను వీటి వ్యర్థత స్పష్టమయ్యెను. ప్రతి దర్శనము ఇతిహాస ప్రవాహమున నొక తరంగము; తత్తత్ పరిస్థితులచే జన్యము; కొన్ని సన్నివేశముల కది ప్రస్తుతము, ఉచితము, సంగతమును. దర్శనసారము (spirit, essence) ఇతిహాసమున ఈ వివిధ దర్శనములలో మూర్తీభవించుచున్నది. జీవితప్రపంచముల ప్రహేళికను పరిష్కరింపవలె నను తత్త్వజిజ్ఞాసాత్మక (metaphysical) మగు ప్రేరణ, విశ్వ

మును ఒకే పరి సమస్తముగ (సర్వముగ), ఏకముగ (as a whole and as a unity) అవగతము చేసికొనవలెనను ఆకాంక్ష - ఇవి రెండును ఒక వంకను, 'దృష్టమే ప్రమాణము, నిరూపణయోగ్య మైనదే జ్ఞానము, అట్టిది సార్వలౌకిక సర్వసామా న్యము' అను మార్గణ (demand) మరొక వంకను దర్శనమును పూర్ణముగ దేనికది తనకే విధేయముగ చేసికొన జూచుచున్నది. ఈ రెండు విధములయిన దృక్పథముల మధ్యను జరుగు పరస్పర సంఘర్షణయే దర్శన రీతులను, ప్రగతిని నిర్ణయించుచున్నది.

# దర్శన పద్ధతులు

దర్శనేతిహాసము నన్వీక్షించుటయు ఒక విధ మగు దార్శనిక చింతనయే. ఏలన దర్శనముల ప్రాదుర్భావ, అభివృద్ధి, ప్రభావములు ఒక దార్శనిక సమస్యయే. ఈ అన్వీక్షణవలన, ఉపయోగింపబడిన పద్ధతినిబట్టి దానినుండి పర్యవసితమగు దర్శనపు స్వభావమును, ఆ యా చింతకుల నాకర్షించు సమస్యను బట్టి, వారు ఏర్పరచుకొను లక్ష్యములనుబట్టి ఒకానొక పద్ధతిని గ్రహించుటయు జరుగునని తెలును. అట్టి ఆరు పద్ధతుల నిక్కడ సంగ్రహముగ వివరింతుము :

**1. లక్షణ (భావ) వివర్ధనలు :** ప్రాచీన కాలము నుండియు కొందరు దార్శనికు లవలంబించిన పద్ధతులు. దేనిని గూర్చియైన 'ఇదిఏమి?' అను ప్రశ్నను వేసి, సమాధానముగ నొక అనుభవ పూర్వక (a pr'ori) మగు, అనగా అనుభవముపై ఆధారపడని మనః కల్పితమగు లక్షణమును చెప్పుటవలన ఈ పద్ధతి ప్రారంభ మగును. ఉదాహరణమునకు - నిత్యము, ఆనందమయము, పాపరహితము, పరిణామ శూన్యము అగునది ఆత్మ యని లక్షణము చెప్పి, శరీరమునకు, జాగ్రత్, స్వప్న, నిద్రా చైతన్యములకు ఈ లక్షణము వర్తింపదుగాన అవి ఆత్మ కావు అని వాటిని నిరాకరించుట ఈ పద్ధతి నుపయోగించుట యగును. మరొక ఉదాహరణము : దేనినుండి అంతయు ఉత్పత్తి యగుచున్నదో, దేనిలో అంతయు ప్రతిష్ఠితమో, దేని యందు అంతయు లయమగునో, ఏది పరమోత్కృష్టమో ఆ ఏకైక వస్తువే పరమార్థ మగు సత్పదార్థ మని లక్షణము చెప్పవచ్చును. అప్పుడు భౌతిక పదార్థమున కీ లక్షణము వర్తింప దని దానిని నిరాకరింప వచ్చును. ఏలన ప్రాణము దానికంటె ఉత్కృష్టతరమగునది కదా! ప్రాణముకంటె కూడా విజ్ఞానము (చింతన, బుద్ధి - thought) ఉత్కృష్ట తరము గాన ప్రాణము పరమార్థ సత్పదార్థము కాజాలదు. కాని విజ్ఞానమందు ద్వైధీభావము (dichotomy) కలదు. ఎట్లన విజ్ఞాన ప్రక్రియయు దానికి విషయమగునట్టిదియు. ఇక సత్పదార్థమన్ననో అద్వితీయము, అవిభాజ్యము, ఏకము (స్వగత భేద రహితము). ఏలన, దాని లక్షణము అది కదా! ఆనందము చరమ లక్ష్యము, పరమోత్కృష్ట మూల్యము అని భావింపవచ్చును. పైగా అందు విజ్ఞానమందు వలెగాక, విషయి విషయములకు ఐక్యము కలదు. ఆనందము నుండియే భూతము లుత్పన్నమగుచున్నవి. ఎంత దుఃఖము కలుగుచున్నను జీవితము ధారణ యోగ్యముగా కన్పడుచున్నది కావునను, దినములు పోయినకొలది హెచ్చు సుఖము ప్రాప్తించునను ఆశచేతను ప్రాణులు జీవించుచున్నవి. ఇక చచ్చిపోయిన తరువాత అవి ఇంకను ఎక్కువైన చరమ సుఖము పొందవా? ఏలన, మరణము అన్ని అవధులకు, సకల సాంసారిక దుఃఖములకు పరిసమాప్తి కదా! కాబట్టి అప్పు డవి ఆనందమునే పొందును; అందే విశ్రమించును. కాబట్టి సత్పదార్థము, ఆనందము - ఈ రెండును లక్షణ వివర్ధనల పద్ధతికి ఉదాహరణములు. 'ఆత్మ', 'సత్త', 'ద్రవ్యము' మొదలైన మాట

లను తీసికొని వాటికి అనుభవ నిరపేక్షము లగు లక్షణలను చెప్పుటవలన మనకు కొన్ని అభ్యుపగమ ములు ఏర్పడును. వీటిలో ఇమిడియున్న (implied) ప్రతిపాదనలను,భావములను వెలికి గొనివచ్చి స్పష్టము చేయుటద్వారాను, వీటిని అంగీకరించుటవలన ఏయే ఇతర ప్రతిపాదనలు, సిద్ధాంతములు పర్యవసిల్లునో వాటిని నిగమనము (demonstration) చేయుట ద్వారాను భావ వివర్ధన జరిగి, రేఖా గణితమందు యూక్లిడ్ చేసిన వ్యవస్థవలెనే దార్శనిక వ్యవస్థలు ఏర్పడును.

మానసిక, రసిక (aesthetic), బౌద్ధికము లగు కొన్ని మానవావసరములను తీర్చుటకు ఆత్మ, త్రిభుజము ఇత్యాది కొన్ని పదార్థముల ఉనికిని కల్పింప* (posit) వలసివచ్చుటచే పై విధమగు దార్శనిక వ్యాపారము ప్రారంభించును. జన్మ మృత్యు జరా వ్యాధుల, సాంక్రామిక రోగ క్షామాది ఈతి బాధల, బంధువుల ప్రియుల మరణపు,వస్తువుల నశ్వర త్వపు అనుభవము ఇవేవియు కానట్టి ఏదో ఒక వస్తువు కొరకై ఆకాంక్షను కలిగింప వచ్చును. అప్పుడు ఇవేవియు కాని ఇవన్నియు కాని కానట్టి-అనగా అసంపూర్ణత, వికారము, పాపము, దుఃఖము లేనట్టి-ఆత్మ కల్పింపబడును. ఆపై దాని అస్తిత్వము వక్కాణింపబడును. తదితరములనుండి దానిభేదము నొక్కి చెప్పబడి, అట్టి ఆత్మ గృహీత లక్షణమునుండి నిగమనము చేయబడును. అట్లే బాబిలోనియా, చాల్డియా, గ్రీసుదేశీయులకు సమమిత (symmetrical), సమతల క్షేత్ర ఆకృతుల (plane figures) లోను, సరళరేఖలలోను గల అభిరుచి వారిని త్రికోణాది ఉపపత్తుల (hypotheses) ను కల్పించి వాటిని గురించి వాదులాడకుండ, వాటి ఆధారముపై వివిధ సిద్ధాంతములను నిగమనము చేయించినది.

'కొన్ని మూలప్రత్యయముల(concepts)తో సంపూర్ణమైన దార్శనిక రచన జరిగినచో దాని సంవిధానము (structure) సత్పదార్థ సంవిధాన ముతో సంవదించును' అను పూర్వ కల్పన (presupposition) పై ఇట్టి దార్శనిక ప్రక్రియ ఆధారపడి యున్నది.

**2. పక్ష విపక్షముల తార్కిక చింతన :** ఇది మరొక దార్శనిక పద్ధతి. విరుద్ధ దృక్పథముల సంఘర్షణను, పరస్పర బాధితములగు సిద్ధాంతముల సమీకరణము (balance) ను గుర్తించుకొని, ఈ క్రింది రెండుపనులలో నొకటి చేయవచ్చును : 1. విమర్శతో సిద్ధాంతముల నన్నిటిని పరీక్షించి వాటి నన్నిటిని త్రోసివేయుట. 2. వైరుధ్యములను సమన్వయించి వాటి నన్నిటిని తనలో ఇముడ్చుకొన గల్గిన సమ్మేళ నాత్మకమగు ప్రత్యయముల వ్యవస్థను నిర్మించుట.

ఇతర వ్యక్తులు ఎటుల ఆలోచించిరో, ఆలోచించ గలరో గుర్తుంచుకొని వారి భావములను, ఊహలను పక్ష విపక్ష రూపమున పెట్టి, వాటిని విమర్శతోడను, పక్షపాతరహితముగాను ఆలోచన చేయవలసిన పని ఈ పద్ధతిలో నున్నది, ప్రకృతి, మానవానుభవము, జ్ఞానము, క్రియ, ఇతిహాసములలో ఎన్నో సంఘర్షణలు, వైరుధ్యములు కలవు. మానవ బుద్ధులకు సంభవించు వివశత్వ విక్షేప వ్యగ్రతాదులు, నానావాద ముల సిద్ధాంతముల వలన కలుగు విప్రతిపన్నత, బుద్ధికి నిలకడ లేకపోవుట, భావముల దాస్యమునకు లొంగుట-ఇవన్నియు విమర్శతో పక్షపాతములేకుండ పరీక్షించుటవలన తొలగును. అప్పుడు మానవబుద్ధి అపర్యాప్తములు, అసత్యములు అగు భావముల శృంఖలములనుండి, వాటివలన కలుగు ఆగ్రహోద్రేకములనుండి విముక్తి చెంది, శాంతిని, మనస్సమాధానమును పొందును. ప్రతి దృక్పథమును వేరు గాను, ఇతరములతో కలిపియు పరీక్షించుటవలన పక్షపాత పూర్వకమగు అభినివేశము (dogmatism) పోవును. ప్రతి మతమును, సిద్ధాంతమును ఒక ఉప

---

* ఏదైన అర్థము చేసికొనుటకు, వివరించుటకు, లేదా కొన్ని తీవ్ర ఉత్కంఠల, ఆకాంక్షల ఉనికిని సార్థకము,సఫలము చేయునది ఉండవలెనను ఊహతో దేనినైన ప్రతిపాదించుట కల్పన. కల్పనా విషయము దృష్ట పూర్వము కాదు. అది యథార్థము కావచ్చును; కాక పోవచ్చును.

పత్తిగా మాత్రమే తీసికొని, దానిలో ఇమిడియున్న అభ్యుపగమములను వెలికి గొని వచ్చి, వాటిని గ్రహించుటవలన అయుక్తసిద్ధి, అనిష్టాపత్తులు సంభవించు నని చూపించుట, ఇట్లు నిరాకృతములైన భావ సిద్ధాంతముల స్థానమున వాటికి భిన్నమైన దేనిని ఉపపాదన చేయకుండుట ఈ పద్ధతి లక్షణము. ఒక ప్రత్యేక ఉపపత్తిని పరీక్షించునపుడు దాని స్థాపకుని కిష్టమగు సూత్రములను, ప్రక్రియలను గ్రహించి, వాటి ఉపయోగము వలననే ఆ ఉపపత్తిలోని వైరుద్ధ్యమును ప్రదర్శించుట, ఈ సూత్ర ప్రక్రియల ప్రామాణ్యమును గురించి ఎట్టి పూర్వకల్పనలను చేయకుండుట ఇందు జరుగును. ఇట్టి విమర్శాయుత పరీక్షవలన క్రొత్త జ్ఞానము రాదు కాని, ఇదివరకు జ్ఞానముగా ఎంచబడినది జ్ఞానమా కాదా యనియు, దాని స్వీకారము వలన వచ్చు పర్యవసానములు, దాని ఆధారములైన అభ్యుపగమములు తెలియవచ్చును. ఉపపాదితములైన, ఉపపాదనకు వీలైన, తత్త్వజ్ఞానపరము (metaphysical) లైన ఉక్తు లన్నిటిని పరీక్షించి వాటిని నిరాకరించుటవలన అనిర్వాచ్యమైనదేదో కలదనియు, దానిని తత్త్వజ్ఞానము నిర్వచింప యత్నించుననియు తేల్చవచ్చును. ఇట్టి ప్రవృత్తియే దర్శనము. అంతేకాని ఒక సిద్ధాంత స్థాపనము కాదు. 'తత్త్వజ్ఞానమంతయు నిరర్థక ప్రలాపము; కాని అది ఉపేక్షణీయమగు నిరర్థక ప్రలాపము కాదు; సర్వతాత్త్విక దృష్టుల ప్రహాణము ఒక నూతన ముఖ్య అంతర్దృష్టిని-ప్రజ్ఞను - పొందుటకు దారితీయు'ననియు, దానివలన తత్త్వమును గూర్చిన యొక అనిర్వాచ్యమగు అవగతి మన కబ్బవచ్చుననియు ఈ పద్ధతి నుపయోగించి కొందరు దార్శనికులు తేల్చిరి.

ఈ పద్ధతిని ఇంకొక విధముగా కూడ ఉపయోగింప వచ్చును. ప్రకృతి పురుషులు (చిదచిత్తులు), నిర్వికార పరమార్థ సవికార వ్యావహారిక సత్తలు, నిత్యత్వ కాలములు మొదలగు పరస్పర వ్యాహత ద్వంద్వములలో అభివ్యక్తమగు ప్రధాన మూల వైరుద్ధములను పరీక్షించి, ఈ వ్యాఘాత నిసంవాద ప్రభేద విరోధముల నతిక్రమించునట్టి, వీటి నన్నింటిని సమన్వయించి సంవదింపజేసి సమ్మేళనము చేయునట్టి వ్యాపక సూత్రములను, తత్త్వములను అన్వేషింప వచ్చును. అన్ని పదార్థముల ఏకముఖత్వమును, సావధికత్వమును గమనించి వేరే విధముగ సమన్వితములు కాక అబోధ్యములుగ నుండు భావములను, ప్రతిపాదనలను సంబద్ధములు చేసి సంవదింపజేయు వ్యాపక సూత్రమును, తత్త్వమును కనిపెట్టుట ఈ పద్ధతి ఉద్దేశ్యము. సమస్త వస్తువులలో నున్న పరస్పర సంబంధ, పరతంత్రతలను గుర్తించి, ఉన్నదానినంతను ఆలోడించి పర్యాలోకించగల దృష్టి ఏర్పరచుకొనుట ఇందు జరుగును. విహంగమ దృష్టివంటి దిది. ప్రకృతిలో, చింతనలో, క్రియలో గల వైరుద్ధ్యము లన్నియు ఒకటి, లేదా కొన్ని వ్యాపక భావముల ద్వారా ఐక్యమై సామరస్యము నొందగలవు. దీనికి మార్గము ఏదన - ప్రత్యయములను వాటి అపర్యాప్తత, ఏకముఖత్వముల కారణముగా వాటికి విరుద్ధ ప్రత్యయములను ప్రసవించునట్లుగా చేసి, పరస్పర వ్యాఘాతముల వలన ఈ భావాభావాత్మక ప్రత్యయములు సమసిపోగా వాటినుండి నూతనము లగు సంవాద సమ్మేళనములతో కూడిన భావముల నేర్పరచుట. సాంత సావధికములపై ఆధారపడిన భావములు ఇట్లు తమ్ము తామతిక్రమింపవలసినవై అనంతమందు, నిరవధికమందు పరిసమాప్తి నందును. సీమితము, సావధికము,సాంతము అయిన దేదియు నిత్యము, పరమము కాలేదనియు, విశ్వబోధ్యత (intelligibility of the universe) ను ప్రకాశ పరచగల భావ తత్త్వమే పర్యాప్తము, యథార్థము అనియు విశ్వసించి ఈ పద్ధతి పురోగమించును.

**3. స్వతంత్ర విచారణ :** ఏ విధమైన పర నియంత్రణను సహింపకుండ స్వయముగ విచారించుట మరొక దార్శనిక పద్ధతి. దర్శనము చింతకుడైన వ్యక్తికి గల సాక్షాత్ సంవేదనము (direct awareness) నుండి ప్రారంభము కావలెను. ఏ విధమైన పూర్వకల్పనల నుండియు ప్రారంభము కారాదు. ఈ సాక్షాత్ సంవేదనము

ప్రత్యయ నిర్మాణమునకు ముందుగా జరుగు నిర్వికల్ప ప్రత్యక్ష అనుభవము. మానవానుభవ విజ్ఞానములచే అసందిగ్ధముగా గ్రహింపబడు ప్రతి అంశమును సంశయింపవలెను; విమర్శింపవలెను. లోక వ్యవహారము, విజ్ఞానము మన ఉనికిని, మన చుట్టు నున్న ప్రపంచపు ఉనికిని స్వతస్సిద్ధాంశముగా తీసికొనుచున్నవి. వీటి అస్తిత్వమందలి విశ్వాసము ఎంత స్వతస్సిద్ధముగా కన్పడినను, దానిని విచారము చేసి పరీక్షించియే స్వీకరింపవలెను. దేనిని గూర్చియు ఉన్నదని లేదని నిర్ణయము చేయక, ఆ యా వ్యక్తులు నిజముగా అనుభవించుచున్నదేదో దానిని మననము చేయుటవలన అనుభవించుచున్న ఆ యా ప్రత్యేక వ్యక్తుల అనుభవము మాత్రము నిస్సంశయ మని తేలును. అప్పుడు స్వ సంవేదన కలిగిన ఒక వ్యక్తి యొక్క సాక్షాత్ శుద్ధ (అనగా నిర్వికల్ప) అనుభవమే దర్శనమున కాధారము, ప్రమాణము అగును. సాక్షాత్సంవేదనచే తెలియబడు, దానిచే రుజువగునట్టి విషయములే అప్పుడు అంగీకార యోగ్యము లగును. శుద్ధ అనుభవముల ప్రవాహమే మూల జగత్తు. వ్యావహారిక వైజ్ఞానిక జగత్తులు అందుండి నిర్మింపబడినవి. వ్యవహారమును సందేహింపక పరీక్షింపక అంగీకరించుట విచారమును ఉపేక్షించుట యగును. అట్లుగాక స్వీయ అపరోక్ష అనుభవముతో ప్రారంభించుట వలన ఇతరుల ఉనికిని, దానినిబట్టి వ్యవహారమును సిద్ధము చేయుటో, నిరస్తము చేయుటో జరుగును.

సమస్త జ్ఞానమునకు ఆధారములగు వ్యక్తిగతము (విషయి నిష్ఠము - Subjective) లగు అనుభవములను కనుగొని, ఈ శుద్ధ అనుభవములనుండి విశ్వ పునర్నిర్మాణము చేయుట ఈ పద్ధతి లక్షణము. అట్లు చేయుటలో ప్రతి విశ్వాసమును, ప్రత్యయమును విశ్లేషణచేసి చూచి, ఏ సాక్షాత్సంవేదనలనుండి అది నిర్మితమో పరీక్షింపవలెను. అట్లు చేయుటవలన అన్ని భావములు, సూత్రములు, ప్రతిపాదనలు, విశ్వాసములు, జ్ఞానము, విజ్ఞానము, వ్యవహారము ఏ ఆధారములపై ఉన్నవో, వాటి స్వరూప మేమో, ఎంతవరకు అవి ఆధార రహితములో తెలియవచ్చును. సంశయమునకు తావీయని సాక్షాత్సంవేదనాంశములను తప్ప దేనినైనను సంశయించుటకు, విమర్శించుటకు, అవసరమైనచో పరిత్యజించుటకు సిద్ధము కానిదే ఈ పద్ధతి సాగదు. సందేహమున కాస్కారము లేని స్పష్ట విశద శుద్ధ సంవేదనాంశములను కనుగొనుట వలన జ్ఞానపు పునాదులు వెలుగులోనికి వచ్చును. విశ్వ స్వరూపము అవగతమగును. మనలను, ప్రపంచమును, ఈరెంటి సంబంధమును అర్థము చేసికొనుటకు వీలగును.

**4. వస్తుతంత్ర విచారణ:** వ్యక్తిగత అనుభవము సంకుచితము, ప్రత్యేకము. ఒక వ్యక్తికి ప్రధానమనియో, మూలభూత మనియో, ఆదిమ మనియో తోచినది మరొకనికి అట్లు తోచక పోవచ్చును. స్వీయానుభవములో స్పష్టము, మూలము అని తోచిన దానినే అధిష్ఠానముగా గ్రహించుట దురాగ్రహము. ఈ విధముగా ఆలోచించి కొందరు మానవానుభవమునకు సామాన్యమైన దేదో దానినుండియే దర్శనము బయలుదేరవలె నందురు. వ్యక్తిగత విషయి నిష్ఠ విచారముగాకుండ వస్తుగత (వస్తుతంత్ర) విషయ నిష్ఠ విచారమే దర్శనమునకు ఆధారము కావలె నని వీరి వాదము. ఇది రెండు విధములుగ చేయవచ్చును. ప్రత్యేక విజ్ఞాన శాఖలందు, లోక వ్యవహారమునందు కల భూతార్థములను గూర్చిన సిద్ధాంతముల నన్నింటిని సమాహారము చేసి వాటి నుండి వ్యాప్తి నిర్ణయముద్వారా ఒక విశాల వ్యాపక సామాన్యీకరణము (generalisation) ఈ పద్ధతికి లక్షణము. లబ్ధములైన విజ్ఞాన పర్యవసానములన్నిటిని వ్యవహార దృష్టికి భంగము కలుగని రీతిని సంగ్రహించిన ఒక విశాల విశ్వదృష్టి ఏర్పడును. మరొక సూక్ష్మ విధముగ ఈ పద్ధతి నుపయోగింపవచ్చును. ప్రతి యుగపు ఆలోచనలోను, సంభాషణ, సాంఘిక సంస్థలు, విజ్ఞానము, కవిత్వము, మతము, మానవ ప్రవృత్తులలోను కొన్ని సామాన్య భావములు ఇమిడి యుండును. వీటిని కనుగొని, స్పష్టముగ ప్రతిపాదించి మన అనుభవము నితోఒధికముగా సార్థకముచేయుటకు

వాటి నన్నిటిని ఒక సుసంగత వ్యవస్థగా నేర్పరచు ఓయే దర్శనము. ప్రత్యక్షము వలన, అనుమానము వలన విలక్షణము, విశదము అగువాటిని కనుగొనుట వలన ఈ సామాన్యభావములు తెలియరావు. భావనా శక్తితోకూడిన ప్రజ్ఞయే (imaginative insight) వాటిని గుర్తించును. ఒక సంకుచిత అనుభవక్షేత్రము నుండి వీటిని నిష్కర్షింప వీలులేదు. అవి మానవ విచార ప్రవృత్తుల అన్ని క్షేత్రములలోను అంతర్గత ములుగా నుండునవి కావలెను. అవి పరమ సామాన్య ములు (ultimate generalities), ఆదిమ సూత్ర ములు కావలెను. బుద్ధి వాటిని దాటి పోలేకుండ నుండవలెను. వాటి యథార్థతకు ప్రమాణ మేమన అవి కొన్ని అనుభవాంశములను సార్థకముగా వ్యాఖ్యా నింపగలుగుచు, తక్కిన అనుభవాంశములను ఉపే క్షించుటో, వాటినిగూర్చి చిత్తవిభ్రమము కలిగించుటో చేయరాదు. రాబోవు అనుభవములను కూడ వివరింప గలిగి ఉండవలెను. పూర్తిగా సామాన్యములైన ఇట్టి భావములు లభ్యములు కాకపోవచ్చును. ఒక కాలమున సామాన్య భావములుగ గ్రహింపబడినవి తరువాత అట్టివి కావని తేలవచ్చును. కాబట్టి మారని శాశ్వత దర్శన మొకటి ఉండదు. మానవాలోచన, కర్మ, ఉద్రేక, ఆశయ, విశ్వాసములు మారుచుండును. వీటి అంతర్గత భావములు మారుచుండును. కాబట్టి ఒకా నొక యుగములో, లేదా సంస్కృతిలో వర్తమానము లగు వివిధ భావములను, ప్రవృత్తులను, ఉద్రేకము లను సమన్వయపరచు (co-ordinate) ఏ దర్శన మైనను ఆ యుగమునకు, సంస్కృతికి మాత్రమే వర్తించును; పర్యాప్తమగును. తత్త్వజ్ఞాన మంతయు తాత్కాలికమే. ఆ యా కాలములందలి జీవితానుభవ ములను, సమస్యలను, సన్నివేశములను ప్రకాశ పరచి, వాటి కొక అర్థము కాన్పింప చేయుటయే ఇట్టి దర్శనముల ప్రయోజనము. అనుభూతాంశము లన్ని టిపై భావనాశక్తితో మననము చేసి ఊహా పూర్వక ముగ వాటి నన్నిటిని పునర్నిర్మాణము చేయుటే దర్శనము.

**5. విశ్లేషణ పద్ధతి :** సకలముగ, సమగ్ర ముగ కనపడు వాటిని అవిభాజ్య అంత్యములు అని నమ్ముటకు వీలైనవి దొరకువరకు విభజించుట ఈ పద్ధతి లక్షణము. ఈ అంత్యములు (ultimates) భావములు, వస్తువులు, భాష ఏదైన కావచ్చును. కాని అంత్యములు అమిశ్రితములుగ, సుగమములుగ ఉండ వలెను. 'జ్ఞానము, వస్తువులు అన్నియు ఆణవికములు, అసంహార్యములు (irreducibles) అగు తత్త్వ ముల సంఘాతములు. వీటి వ్యవస్థీకరణము కొన్ని పరిమిత సంఖ్యాకములైన సరళ ప్రక్రియల చేత సంబంధములచేత నియంత్రిత మగును' అని ఇట్టి దార్శనికుల పూర్వకల్పన. ప్రకృతి పరిమిత సంఖ్యా కములైన స్వతంత్ర పదార్థముల సమాహార మని, దాని సంస్థానము (structure) కనుగొనుటకు వీలైనట్టిదని, దానిని సాంగోపాంగముగ విశ్లేషణ చేయ వచ్చు నని, చరమ భేదము లన్నియు సంఖ్య (quantity) పై ఆధారపడియుండు నని వీరల విశ్వాసము. అట్లే ప్రతిపాదన వాక్యము (propositions) లన్నియు మూలవాక్యములు (basic propositions) గ విశ్లేషణ చేయబడుటకు వీలుగా నుండవలెననియు, అవి ఆ యా భూతార్థముల యథార్థ రూపమున కనువుగా నుండుననియు ఈ పద్ధతి నవ లంబించు వారందురు. అట్లు విశ్లేషణ చేయబడుటకు వీలులేని ప్రతిపాదనవాక్యములు నిరర్థక ప్రలాపము లని వీరి అభిప్రాయము. ఇంద్రియానుభవమును వర్ణించు వాక్యములే భూతార్థముల యథార్థ సంస్థాన మును వక్కాణించును. నిరర్థక ప్రలాప వాక్యములు గాక పునరుక్తి వాక్యములు కూడా ఉండునని, కొన్ని రకముల నిరర్థక ప్రలాపములకు ఆవేశ పూర్వకమగు (emotional) సార్థకత ఉండవచ్చునని వీరు ఒప్పు కొందురు. విశ్లేషణ కయోగ్యమయిన దంతయును, విశ్లేషణ జరిగినప్పుడు నిస్సారముగ నిరర్థకముగ కన్పడున దంతయును ఈ పద్ధతిలో ఉపేక్షింపబడును.

**6. స్పష్టీకరణ పద్ధతి :** ప్రతి మానవుడును దార్శనికుడు అయినను కాకున్నను కొన్ని విశ్వాస ములు కలిగియుండును. అందు కొన్ని పరంపర

గాను, చుట్టుప్రక్కల నున్నవారి నుండియు సంక్రమించినవి. కొన్ని అతని చిత్తవృత్తుల, ప్రత్యక్షానుభవముల వలన అతనికే తెలియకుండ ఏర్పడినవి. కళ, నీతిశాస్త్రము, మతములలోని చాల విలువల, లక్ష్యముల ఆశయముల పట్ల గల శ్రద్ధ తార్కిక నిరూపణచే గాని, వైజ్ఞానిక నిరీక్షణలచే గాని ఏర్పడదు. అట్లే మానవుని ఆధిక్యము, శ్రేష్ఠత, గమ్యములను గూర్చి, వ్యక్తి గౌరవమును గూర్చి ఉండునట్టి విశ్వాసములు కూడా ప్రత్యక్షానుమానములపై ఆధారపడి లేవు. వీటన్నిటిని తృప్తికరముగ రుజువు చేయలేము. వీటిని పరీక్షించి వీటి మూలములు ఏవో తెలిసికొన ప్రయత్నింపవచ్చును. 'ఏ విధములైన అనుభూతులు ఈ విశ్వాసములకు ఆధారములై వాటియందు అంతర్లీనముగ నున్నవి? ఈ విశ్వాసములు అసత్యములైనచో దాని పర్యవసాన మేమి?' ఇట్టి విచారమునకు ఇతోఽధిక జ్ఞానము లక్ష్యము కాదు. మన కీవరకే తెలిసిన దానిని స్పష్టముగ, విశదముగ చేసికొనుట (clarification); మనము అవితర్కితముగా, అవిపక్షితముగా గ్రహించి యున్న దానిని సువ్యక్తము, సుస్ఫుటము చేసికొనుట దీని లక్ష్యములు. ఇట్టి స్పష్టీకరణమువలన విశ్వాసము తనకు తాను విజ్ఞాపితమైన సంబుద్ధ మగును. ఇంతే గాక, మన కున్న కొన్ని విశ్వాసములు- అవి మన వైఖరులకు, చేష్టలకు ఆధారము లైనప్పటికిని- మనకు తెలిసియుండక పోవచ్చును. మన అనుభవమును, ఆచారమును విచారము చేయుట వలన అవి వెలుగు లోనికి వచ్చును.

ఇట్టి విచారమువలన క్రొత్త పర్యవసానములు ఏర్పడవు. ఈవరకు లేని జ్ఞానము కలుగదు. కాని వస్తువులను ఇదివరకు ఎరిగియున్న విధమున గాక వేరు విధముగ ఎరుగగలము. మన మీవరకే ఎరిగిన దానిని సాక్షాత్కరింప జేసికొనుట, మన విశ్వాస ప్రత్యయముల మూలములను అనుభవములో కనుగొనుట - ఇదియే దర్శనము. ఇంద్రియ ప్రత్యక్ష, విజ్ఞాన, గణిత శాస్త్రీయ తర్కాదులవలె ఇది క్రొత్త నిగమనములను చేయదు. క్రొత్తభూ తార్థములను కని పెట్టదు. కాని ఇది మననాత్మక అవేక్షణము ద్వారా మనము ఎరిగినట్టి, విశ్వసించునట్టి విషయములను ప్రకాశపరచి స్పష్టము చేయును. మన పూర్వ ధారణలను, మనకున్న శ్రద్ధను దృఢముగా చేయును. ఆదర్శములలో, లక్ష్యములలో, విలువలలో మన కున్న నిష్ఠకు, శ్రద్ధకు మూలమేదో ఎక్కడ ఉన్నదో వెతుకుట, తెలిసికొనిన దానిని విశ్వసించిన దానిని విమర్శతో వివరించుకొని స్ఫుటము చేసికొనుట మన శ్రద్ధ, జీవిత దృక్పథముల అభ్యుపగమములను బోధపరచుకొనుట దార్శనిక కృషి యని వీరల అభిప్రాయము.

ఇట్లు కొన్ని ముఖ్యములైన దార్శనిక పద్ధతులను చర్చించితిమి. ఇంకను ఎన్నియో కలవు. మనము పరిష్కారము చేయబూనిన సమస్యనుబట్టి, మన కాసక్తి కలిగించిన విషయమును బట్టి పద్ధతియు నుండును. పూర్వ కల్పనలు, లక్ష్యములు పద్ధతులను నిర్ణయించును. ఉపయోగించు పద్ధతిబట్టి దర్శన స్వభావ ముండును. రెండు మూడు పద్ధతులను కలిపి వాడవచ్చును. కాని కొన్ని పద్ధతులకు మాత్రము పొత్తు కుదరదు. దార్శనిక లక్ష్యములలో, పద్ధతులలో గోచరించు భేదములే నిశ్చిత మగు, సర్వజనాంగీకారము బడసిన దార్శనిక సిద్ధాంతము లేకుండుటకు కారణములు. ఇందు వలననే ఏ యొక దర్శనము కూడ ఇదియే సత్యమగు చరమ దర్శనముగా నిస్సందిగ్ధముగా స్థాపింపబడలేదు. ఏ యొక దర్శనము తక్కిన అన్నిటికంటె గూడ ఉత్కృష్ట మని కూడ నిర్వివాదముగ, ఏకగ్రీవముగ చెప్పుటకు వీలు లేదు. అట్లు చెప్పువా రందరును తమ తమ పూర్వ కల్పనల పైన, అభిరుచులపైన, విశ్వాసములపైన ఆధారపడి చెప్పుదురు. అవి ఏవియు తక్కినవాటికంటె శ్రేష్ఠమని రుజువు కావు. విజ్ఞానమున కనుకూలముగా నున్న దర్శనములు సరియైన వని అనెద మన్న విజ్ఞాన శాఖలు పెక్కు లగుటచేత, ప్రతిదానికిని ప్రత్యేకమగు తర్కవిధానము, పద్ధతి, దృక్పథము, పూర్వకల్పనలు ఉండుటచేత, ఏ విజ్ఞానశాఖను, లేదా సిద్ధాంతములను ప్రమాణముగా తీసికొనవలెను అను విషయములో నిర్ధా

రణ కష్టము. కొన్నిటిని గ్రహించినచో వాటి దృష్ట్యా కొన్ని దర్శనములు సరియైన వని తోచవచ్చును. మరి కొన్నిటిని గ్రహించినచో అట్లు తోచక పోవచ్చును. కాక వైజ్ఞానిక పద్ధతులు మారుచుండును. వానిని బట్టి ఏ దర్శనము యొక్క ఉపాదేయతయు సిద్ధము కాదు. లోక వ్యవహారమునకు అనుగుణముగ నుండు దర్శనములు సత్యములందు మనిన, 'లోక వ్యవహారము భ్రమపై అధారపడియున్నది. అది మిథ్య. పరమార్థ సత్యము దానికి భిన్నము. దానిని బాధించును' అనునట్టి దర్శనములు కలవు. కాక లోకవ్యవహార, వ్యక్త్యనుభవములను అవేక్షణచేసివాటిపైవిచారము,మననము చేసి సత్యమును కనుగొను దర్శన శాస్త్రము సరియైనదా కాదా యని వాటిని ప్రమాణముగా గొని నిర్ణయింపబూనుట అనుచితము. మనుష్యుల నుత్తమ కార్యాభి ముఖులుగ, కర్తవ్య పరాయణులుగ, శ్రేష్ఠ జీవితవిధానము నవలంబించు వారినిగ చేయు దర్శనము సరియైన దని యనెద మనిన-'ఏ కార్యములు, ఏ విధానములు ఉత్తమములు? ఏది కర్తవ్యము?' అను ప్రశ్నలకు ఐకమత్యముతో గూడిన సమాధానములు లేవు. అదిగాక, దర్శనము మానవుని ఎంత వరకు ప్రభావితము చేయగలదు? ఎంతవరకు చేసినది? దర్శనము మానవ కార్యాచరణ ప్రవృత్తులకు కారణమా?' ఈ విషయములు నిశ్చయముగా నిర్ణయింప వీలు కానివి. కాన అర్థక్రియాకారిత్వము దర్శనములకు ప్రమాణము కాజాలదు. ఇంకొక విశేష మేమన పరస్పర వ్యాఘాత యుక్తము లైన దర్శనములు సామాన్యమగు, అనగా ఒకే తీరగు వ్యవహారమును, ఆచారములను విధింపవచ్చును. పర్యవసన్న మగు కార్యాచరణను బట్టి తత్ప్రేరక దృక్పథపు స్వరూపమును, ఔచిత్యమును నిర్ణయింపలేము. ఇవన్నియు గాక, ఏ దర్శనమైనను ఒక ప్రత్యేక జీవిత విధానము పైనను, వస్తువుల ఉత్పత్తి సాధనములపైనను ఆధారపడియుండు నని కొంద రందురు. దార్శనిక లక్ష్యములకు, పద్ధతులకు, వాటి సాంఘిక రాజకీయార్థిక పరిస్థితులకు గల పరస్పర సంబంధములు, దార్శనిక లక్ష్యములకు పద్ధతులకు, ఆ యా దార్శనికుల వ్యక్తిగత స్వభావ మనస్తత్త్వములకు గల పరస్పర సంబంధములు మన కొక సమస్యను తెచ్చిపెట్టుచున్నవి. 'దార్శనిక రీతులలో పరివర్తన పరిణామములకు కారణమేమి?' అనునది ఒక అనుసంధాన విషయము. ఈ అన్ని సమస్యలను గూర్చిన ఆన్వీక్షణము ఒక రకపు దార్శనిక విచారమే!

# దర్శన శాస్త్రోపయోగము

మనకు తృప్తికలుగునట్లు ప్రశ్న లన్నిటికిని సమాధానము లీయలేక పోయినను, దర్శనము ప్రపంచము పట్ల మన యాసక్తివృద్ధికాగల ప్రశ్నలను వేయ గలదు. తద్ద్వారా అనుదిన వ్యవహారములోని సాధారణ వస్తువుల మాటున గూడ ఎంతో వైచిత్ర్యము, ఆశ్చర్యము కల వని తెలియును. దర్శనము జ్ఞానము నిచ్చు నను వారు ఆ జ్ఞానముకూడ విజ్ఞానము వంటిదే యందురు. అయితే ఈ రెంటికిని భేద మేమన దర్శనములో విమర్శ (criticism) అధికము. అది విజ్ఞానమందు, లోకవ్యవహారమందు ఉపయోగింపబడు సూత్రములను విమర్శతో పరీక్షించును. అట్లే 'ఏ వస్తువులను గూర్చి ప్రతిపాదన చేయగలము! వేటిని గూర్చి చేయలేము? వస్తు, అవస్తువుల భేదమేమి?' అను విచారముచే జ్ఞాన మని చెప్పబడునది విశ్లేషింపబడి పరీక్షింపబడును. కాబట్టి దర్శనము జ్ఞాన విమర్శ యని అన్నప్పుడు అది ప్రతి దానిని సంశయించు ననుకొనరాదు. సంశయాస్పదములైన వాటినే సంశయించును. ప్రతిదానిని గుణదోష విమర్శ చేసి,

పరీక్షానంతరము జ్ఞాన మని తోచిన దానిని స్వీకరించి, ఇతరమును త్రోసివేయును. ఇది కొందరి మతము. వీరి ప్రకారము దర్శనము మనలను భ్రమ ప్రమాదములనుండి, అపరీక్షిత విషయములను యథార్థ జ్ఞానముగా గైకొను అమాయకత్వమునుండి రక్షింప యత్నించును. కొందరు దర్శనము సమస్త విశ్వమును గూర్చిన సమగ్రదృష్టి నిచ్చు నని, అది జ్ఞాన మని, అదియు ప్రామాణిక మని అందురు. కొందరు 'అట్టి దృష్టి అబ్బుట సత్యమే గాని, అది జ్ఞానము కాదు; శ్రద్ధ మాత్రమే' నందురు. మొదటి విధముగా చూచినచో జ్ఞాన ప్రాప్తివలన, అందులో విశ్వమును గూర్చిన వ్యవస్థీకృత (systematised) జ్ఞానము సిద్ధించుట వలన ఉపయోగము స్పష్టమే. రెండవ విధముగా చూచినను మనుష్యుడు శ్రద్ధా మయుడు, శ్రద్ధ కనురూపుడు ("యో యచ్ఛ్రద్ధః స ఏవ సః" అను గీతోక్తిప్రసిద్ధము). కాబట్టి అంధశ్రద్ధగాకుండ, పరీక్షింపబడి విమృష్టమైన శ్రద్ధ అత్యంతోపాదేయము కదా! మన విశ్వాసములను, పక్షపాతములను, పూర్వ కల్పనలను పరీక్షించి, వాటి స్వరూప ఆధార అభ్యుపగమములను తెలిసికొని, వాటి పర్యవసానములను గమనించి ఆపైన వానిని అవలంబించుచునే యుండుటో, లేదా వాటిని మార్పు, వృద్ధి చేసికొనుటయో, లేదా వాటిని విసర్జించుటో చేయవచ్చును ఇటువంటి విమర్శ, పరీక్షలవలన జీవితముపై కొంత ప్రభావము పడును. పైగా విజ్ఞానము నిశ్చిత సమాధానముల నీయలేని ప్రశ్నల ప్రాముఖ్యమును చూపి, వాటి పరిష్కారములను గూర్చి చింతన చేయుటకు ప్రోద్బలము చేయుటచే మన ఊహాపూర్వక మగు ఆసక్తికి అవకాశ ముండును. కొన్ని మూల ప్రశ్నలకు దర్శనము సమాధానముల నిచ్చి విజ్ఞాన, లోక వ్యవహారముల కందని జ్ఞానము నిచ్చుట సత్యమైనచో చాల మంచిదే; అట్లుగాకపోయినను దార్శనిక చింతనకు స్వతస్సిద్ధమైన విలువ కలదని దీని సారాంశము. 'ఆచారము, పరిపాటి, సంఘము, సంస్కృతి- వీటి చేతను, ఆయా దేశ కాలములచేతను పరిగ్రహింపబడు భావములు విశ్వాసములు; స్వతస్సిద్ధ సత్యములును కావు, ఋజువైన సత్యములును కావు' అని తేల్చి, వాటిని అన్వీక్షణ చేయుటవలన నిర్దిష్టముగాను, సొంతముగాను, స్పష్టముగాను కనపడినది అంతయు పోయి, ఆచార విచారములలో సాధ్యములైన అనంతావకాశములు, సంభావ్యతా శక్యతలు గోచరమై, మన ఆచార విచారముల స్వాతంత్ర్య సీమలు విస్తరిల్లును. కాక, దార్శనిక చింతనకు విషయములైనవి మహావిషయములగుటచే అట్టి చింతన సంకుచిత స్వార్థ లక్ష్యముల నుండి కొంతవరకు మానవుని ముక్తుని చేయును. దార్శనిక చింతన వలన స్వాతంత్ర్యము, శాంతి, మన స్సమాధానము, పక్షపాత రాహిత్యము (నిస్సంగత్వము) కొంతవరకు కలుగును. దోష దుఃఖానుదర్శనమువలన, అనుభవము వలన కలుగు ఉద్విగ్నతకు, నైరాశ్యమునకు, అధి క్లేశములకు, సంతాపమునకు దర్శనము సమాశ్వాసనోపశమనముల నీయవచ్చును. నిశ్చయత లేకున్నను బ్రతుకు విధమును, ఆశంకా చలచిత్తతలచే స్తంభితుడు గాకుండు తీరును, తృష్ణ, ఆశ, భయములను నియంత్రణ చేసికొను పద్ధతిని దర్శనము నేర్పగలదు.

ఏదో ఒక విజ్ఞానశాఖ నధ్యయనము చేసిన ప్రతివానికిని వైజ్ఞానిక మనస్తత్త్వము (scientific attitude of mind) అబ్బినట్లే దర్శనాధ్యేత లందరికిని ఈ ఉపయోగములు కలుగకపోవచ్చును. ఒక్కొక్కపరి క్రొత్త సిద్ధాంతములు కనిపెట్టిన, క్రొత్త ఆవిష్కారములు చేసిన కొందరు మహా వైజ్ఞానికులు కొన్ని విషయములలో అంధవిశ్వాసములకు, దురభిమాన దురాగ్రహములకు ప్రాకృతజనుల వలె దాసులుగ నుందురు. అనుదిన జీవితములో జరుగు వ్యవహారమందు వారు వైజ్ఞానిక దృక్పథమును ప్రవేశపెట్టుటకు కూడ ప్రయత్నింపరు. ఇట్లే కొందరు పెద్ద పెద్ద దార్శనికులు వ్యవహారములోనికి తమ చింతనను పరివర్తన చేయరు. నిత్య వ్యవహారమునకు, దార్శనిక చింతనకు సమన్వయమును తమ వ్యక్తిత్వములో సాధించిన వారిలో చాలవరకు పక్షపాత శూన్యత, ఒక విధమైన నిస్సంగత్వము, నిర్మోహత్వము, సిద్ధాంతములందు సంస్కృతియందు మతములందు దురభినివేశ రాహి

త్యము, విశ్వము పట్ల, జీవితముపట్ల, ఒక విధమైన ఆశ్చర్యాన్విత గౌరవ భావము, పరమ సత్యము సంపూర్ణముగ తమకు కరబదరమైన దని తలప కుండుట, వినయము, పరమత సంస్కృతి సహనము కానవచ్చును. ఇవన్నియు సరియగు దార్శనిక చింత నకు లక్షణములు. కాని ఇవన్నియు తక్కిన సద్గుణ ములవలెనే ఏ దార్శనికునిలోను పరాకాష్ఠ నందుకొనవు. కొందరిలో వీనిలో కొన్ని హెచ్చుగను, తక్కినవి తక్కువగను ఉండును. కొందరిలో కొన్ని యుండవు. ఉత్కృష్ట దార్శనికచింతన చేయగలిగినమరికొందరిలో ఇవన్నియు ఇంచుమించుగ మృగ్యములు కావచ్చును. వీటిలో నెద్దానికిని దర్శన శాస్త్రము బాధ్యత వహింపలేదు. కొందరికి సత్య మేమో, ధర్మ మేమో తెలిసినను అందు అనురక్తి, ప్రవృత్తులు ఉండవు. అసత్యములు,అధర్మములు అని తెలిసినను వాటినుండి వారు విరక్తులు, నివృత్తులు కాలేరు. వీటికి వారి వారి సహజ స్వభావము, వారి కీయబడిన శిక్షణ, కరపబడిన విద్యా బుద్ధులు, చుట్టుప్రక్కల నున్న వారి ఆచరణ, వారి సంస్కృతి సంఘ కాలముల తీరు, వారి పరిస్థితులు కారణములు. విజ్ఞాన అధ్యయన కౌశలములు నరునికి నిత్య వ్యవహారమందు నియత ముగా వైజ్ఞానిక దృక్పథము నీయలేవు. వైద్యులంద రును ఆరోగ్యసూత్రము లన్నిటిని అనుసరింపరు. న్యాయశాస్త్ర వైదుష్యము గాని, న్యాయాధికారము గాని, రాష్ట్రపాలనా బాధ్యత గాని ప్రతివానిని నీతి మంతునిగా చేయలేవు. అట్లే దర్శనాధ్యయన పాండి త్యము లున్నంతనే తదనుకూల ఆచరణ వ్యవహార మందు కూడ దార్శనిక దృక్పథము నియతముగా ఉండు ననుకొనుట అవివేకము. కొందరు వేదవేత్తలు రాక్షసులు. ఒక్కొక్కసారి కంచెయే చేనును మేయును. దార్శనికుల యందును ఈ రీతికి అప వాదము లేదు. దీనివలన దర్శనములో దోష మున్న దని రుజువు కాదు.

'దర్శనమువలన ఉపయోగము లేదు, అది కూటికా గుడ్డకా?' అనువారును కలరు. భౌతిక అవసర ములను తీర్చుటయే ఉపయోగమునకు ప్రమాణమైనచో దర్శనము స్వయముగా అట్లు చేయలేదు గాన అది నిరుపయోగమే. ఈ దృష్టిలో శుద్ధ గణితము (pure mathematics), లలిత కళలు, ఇతిహాసము, సాహిత్యమే గాక, సైద్ధాంతిక మూల విజ్ఞానశాఖ (branches of basic theoretical science) లన్నియు నిరుపయోగములే.'మానసిక మూల్యములు, లక్ష్యములు, ఆదర్శములు, ఊహాచోదిత విచారము (imaginative thinking) పై అర్థముతో నిరుప యోగములు కావున అవి త్యాజ్యములు' అను వారి దృష్టిలో నిశ్చయముగా దర్శనము సోమరులు, మూర్ఖులు, వ్యామోహితులు చేయవలసిన పని. 'మానసిక మూల్యములు పురుషార్థములు కావు, అవి లాభము లేనివి. వాటివలన హితాహితములు చేకూరవు' అని తలచువారికి దర్శనము నిరుపయో గమే! కాని, ఇది బాగుగా ఆలోచించిన సత్యము కాదు. పైన సూచించినట్లు దర్శనము విచారాచార ముల పరిధిని విస్తరించి, మానవ జీవితమునకు నూతన అవకాశములను, సంభావ్యతా శక్యతలను గోచరింప చేయు ననియు, అది విజ్ఞాన జ్ఞానములుగా ఎంచబడు దానిని బాగుగా పరీక్షించి వాటి నిజస్వరూపమును బయటపెట్టు ననియు, దర్శనమును సరిగా జీర్ణము చేసి కొనినచో జీవితములో అది హితకర పరిణామమును చూపు ననియు, దార్శనిక ఊహలు, సిద్ధాంతములు, అంతర్దృష్టులు క్రొత్త మార్గములను నిర్దేశించి విజ్ఞాన ప్రగతికి, సంఘవ్యవస్థకు, రాజ్యతంత్రములలో పరి ణామములకే గాక, విప్లవములకును తోడ్పడిన వనియు గుర్తుంచుకొంటి మేని దర్శనముయొక్క శక్తి, ఉపయో గము అవగతమగును. యాజ్ఞవల్క్యుడు, సోక్రటీస్, బుద్ధుడు, కౌటిల్యుడు, శంకరుడు, లాక్, రూసో, హెగెల్, మార్క్స్, నీచే మొదలగు వారల సిద్ధాంత ములు, ఊహలు, ఉక్తులు ప్రపంచము నెంతగా కది లించినవో, ఎన్ని విప్లవములు తెచ్చినవో జ్ఞాపక ముంచుకొనినచో దర్శనమునకున్న శక్తి తెలియును. విజ్ఞానము నధ్యయనము చేయు ప్రతివాడును న్యూటన్, డార్వినులవలె పెద్ద నిర్వాహము చేసి లోకోద్ధరణ చేయక పోవచ్చును. అట్లే దర్శనము

నభ్యసించునట్టి, అందు నిష్ణాతుడైనట్టి ప్రతియొకడును సోక్రటీస్, స్పినోజాలవలె విశుద్ధ నైతిక జీవితము గడపకపోవచ్చును. బుద్ధుడు, మార్క్సులవలె విప్లవ కారకుడు కాకపోవచ్చును. అంత మాత్రమున దర్శనోపయోగము అసిద్ధము కాదు. 'వృత్తి విద్యయే విద్య. వైద్య యంత్ర స్థాపత్యాది శాస్త్రములు, వ్యావహారిక విజ్ఞానము (operational knowledge), సాంకేతిక కౌశలము వలననే ఉపయోగము. తక్కినవి నిరుపయోగములు' అను దృష్టి సంకుచితము. ఇది విజ్ఞాన స్వరూపేతిహాసములు తెలియక పోవుట చేత ఏర్పడినది. వినియుక్త విజ్ఞానశాస్త్రము లన్నియు శుద్ధ గణిత సైద్ధాంతిక మూలవిజ్ఞానముల పైన ఆధారపడిన వని, ఇవి ఒకానొక తర్కపద్ధతిని, కొన్ని ఊహ విశ్వాసములను అవలంబించుటవలన పురోగమించినవని ఎరిగినచో ప్రచలిత పద్ధతులను ఊహ, విశ్వాసములను విమర్శించునది, నూతనము లగు శ్రేష్ఠతరములైన వాటి ఆవిష్కార ప్రతిపాదనలు చేయునది దర్శనమని గుర్తించినచో దర్శనముల ఆవశ్యకత స్పష్టమగును.

**విశ్వదృష్టి :** సర్వజ్ఞత్వము, త్రికాలజ్ఞానము మానవునికి సాధ్యము కావు. కాని విశ్వ సామస్త్యమును గురించి, వస్తుతత్త్వమును గూర్చి, తనను గూర్చి, తన పుట్టు పూర్వోత్తరములను గురించి,జీవిత సార్థక్య ప్రయోజనములను గురించి అనివార్యముగా నరునికి కలుగు సంశయాశ్చర్యకుతూహలాసక్తులకు సమాధానముగా అనుశీలన చింతనలు జరిగి, అవి ఏదో ఒక భావవ్యవస్థ (system of ideas)లో అవసన్నము కానిదే మనస్సునకు శాంతి యుండదు. జీవితనౌకకు కర్ణ ముండదు. అయితే, కొందరు ప్రతిభావంతులు స్వయముగ తమకు తృప్తి నిచ్చు భావ వ్యవస్థల నేర్పరచుకొన గలుగుదురు. కొందరు ఇతరులు సృజించిన వాని పరిణామమో, పరిష్కారమో, వృద్ధియో, లేదా ఖండన విధ్వంసములనో చేయగలరు (ఉదా. హ్యూమ్, కాంట్‌లు తమ పూర్వగుల దర్శనములను చెండాడిరి). కొందరు ఉపనిషదృషుల అంత ర్దృష్టులను బాదరాయణ గౌడపాదులు, వారి సిద్ధాంతములను శంకరులు పరిష్కరించిరి; అభివృద్ధి చేసిరి. శంకర దర్శనములో పద్మపాద వాచస్పత్యాదులు కొన్ని మార్పులను చేసిరి. కొంద రిది ఏదియు చేయలేక ఇతరుల దర్శనములకు కేవలము అనువాదమో, వివరణమో చేయగలరు. మరికొందరు కేవలము వాటిని స్వీకరించుటకు మాత్రమే శక్తులు. 'తాము నిర్మించిన, లేదా స్వీకరించిన విశ్వదృష్టియే సంపూర్ణము, సనాతనము, పరిణామము నపేక్షింపదు' అని కొందరు తలచెదరు. వారి ధైర్యమునకు కారణము తమ దర్శనములు అతిలౌకిక విధముగ ప్రకాశపరచబడిన నిత్యసత్యముపై స్థాపిత మను విశ్వాసము కావచ్చును (ఉదా. వేదాంతులు, తామస్ అనుయాయులు); లేదా తాము విశ్వప్రక్రియా (world process) సూత్రములను, విశ్వ సంస్థాన (world structure) విధానమును స్పష్టముగ, నిర్దిష్టముగ కనిపెట్టగలిగినా మని, తమది శాశ్వత నిస్సందిగ్ధ నిరూపణయోగ్య మగు జ్ఞాన మని విశ్వాసము కావచ్చును (ఉదా. హెగెల్, మార్క్స్). కొందరు యోగాది సాధనల వలననో, సర్వశక్తి యగు ఈశ్వరుని మహాప్రసాదమువలననో పరమ సత్యమును సాంగముగ, పూర్ణముగ, నిశ్శేషముగ అవగతము చేసికొనవచ్చు ననియు, దానిని యథాతథముగ ఇతరులకు శాశ్వతముగ ఉపయోగించు రీతిని వ్యక్తము చేయవచ్చు ననియు నమ్మెదరు. ఉదాహరణమునకు 'యావద్ధర్మ స్వరూపము, బ్రహ్మజ్ఞానము పరిపూర్ణ రీతిని వేదమందు నిహిత' మని కొందరు, 'కాదు ఖురాన్ నందు మాత్రమే వ్యక్త'మని కొందరు విశ్వసించి, వాటి ఆధారముపై దర్శనముల నిర్మించిరి (ఉదా. శంకరుడు, అల్ ఘజాలి). కొందరు తమ అనుభూతులు పరమ సత్యమును పూర్ణముగా గ్రహించిన వని నమ్మిరి (ఉదా. ప్లోటినస్, మహావీరుడు). కాని ఈ రెండు రకముల వారికి తమ ఈ విశ్వాసముల నిజస్వరూపము తెలియరాక, అవి స్వతస్సిద్ధ సాక్షాత్ సత్యములుగా తోచును; లేదా రుజువు చేయుటకు వీలైనట్టివిగా తోచును. అన్యుల కిది స్పష్టము కావున వారు ఇట్టి దర్శనములను, వాటి ఆగ్రహాభి

నివేశములను ఖండింప వెరవరు. కొందరు దార్శనికులు తాము నిర్మించిన, లేదా స్వీకరించిన విశ్వదృష్టి నిస్సందిగ్ధము, శాశ్వతము, అపరిణమ్యము నగు సంపూర్ణ జ్ఞానము కాదనియు, తమ సంస్కృతి దేశకాలములలో తమ పరిస్థితులకు, అభిరుచులకు యోగ్యమైనట్టిది మాత్రమే ననియు గుర్తించెదరు. దీనికిగల పెద్ద కారణ మేమన-మానవుడు సర్వజ్ఞుడు కాడు, కాలేడు. ఏ వ్యక్తియు విశ్వపు లోతును, అంతమును ఊహింపలేడు, కనుగొనలేడు. ఎంత తెలిసినను ఇంకను అజ్ఞాత ముండును. శాశ్వతముగా అజ్ఞేయము కూడ ఉండవచ్చును (కొందరు అట్టి విశ్వాతీతమును కొన్ని అనుభవముల ఆధారముపైన, మనకు లభ్యమైన జ్ఞాన, విజ్ఞాన స్వభావములను పరీక్షించుట ద్వారాను ఉపపాదన చేసెదరు). 'ఒకవేళ లోకోత్తర రీతిగ సత్యము అభివ్యక్తమైనను మానవుడు దానిని సాకల్యముగ యథాతథముగ గ్రహింపలేడు. ఒకవేళ గ్రహించినను భాషలో వ్యక్తము చేయలేడు' అను విశ్వాసము.

ఏది ఎట్లున్నను తాత్కాలికమో, లేదా శాశ్వతమని నమ్మబడినదియో అగు నొక దర్శనము, ఒక భావవ్యవస్థ, ఒక విశ్వదృష్టి ఒక మానసికావసరమును తీర్చుటకు జీవితమున కాధార స్తంభముగా ఉపయోగించును. అట్టిది శ్రద్ధ కావచ్చును. లేదా జ్ఞానమని తలపవచ్చును, లేదా నమ్మవచ్చును. కొందరికి ప్రయోజనము మతము వలన సిద్ధించుచున్నది. అట్టి వారి విశ్వదృష్టిలో మాదే సత్యమను ఆగ్రహము, విమర్శారాహిత్యము హెచ్చు. కొందరికి అవసరమును తమ కాలపు విజ్ఞానము తీర్చుచున్నది. ప్రత్యక్ష విజ్ఞానముల నతిక్రమింపగల శ్రద్ధా జ్ఞానములలో వారికి ఆస్థ లేదు. అట్టివారికి విజ్ఞాన వ్యవహారముల ఆధార అభ్యుపగమములను, పర్యవసాన పద్ధతులను విమర్శచేయు నదియే దర్శనము. అంతకన్న అది చేయగల్గినది లేదు. కొందరు వీరితో చాలవరకు ఏకీభవించుచు, ప్రచలిత విజ్ఞానశాస్త్రశాఖలలోని సిద్ధాంతములను, అనుభవమును సమన్వయ సమ్మేళనములు చేసి సామాన్యభావములను కొన్నిటిని కనిపెట్టి, వాటిద్వారా ఒక విశ్వదృష్టిని నిర్మించి, దాని తాత్కాలికతను గ్రహించియు, మరొక విశ్వదృష్టి అవసరమని తేలువరకు దాని నాలంబనముగా గొని విశ్వమును జీవితమును అర్థము చేసుకొనుటకు, దానినుండి నూతన ఆచార విచార విధానములకు ప్రేరణను పొందుటకు ప్రయత్నింతురు(ఉదా. జాన్ డ్యూయి, వైట్ హెడ్).

**ఆత్మతుష్టి :** కొందరికి ఏ విధమైన విశ్వదృష్టియు అవసర ముండదు. వారు అనాలోచితముగా పరామర్శింపకుండ సహజప్రవృత్తుల(instincts)ను తమ సంఘపు, తమ పూర్వగుల విశ్వాసములను, రీతిరివాజులను అనుసరించుచు, పరిస్థితులు నిర్దేశించిన విధముగా బ్రతికెదరు. వారికి తమ స్వభావ ప్రాదుర్భావ గమ్యములను గూర్చిగాని, సంఘ రాష్ట్రములను గురించి గాని, విశ్వమును గురించి గాని, విజ్ఞాన వ్యవహార మత స్వరూపములను గూర్చి గాని, వాటి ప్రతిపాదనలను గూర్చిగాని ఎట్టి సంశయములు, ఆశ్చర్యము కలుగవు. ఒకవేళ కాదాచిత్కముగా కొంచెముగ కలిగినను వాటిని సరకుచేయక విదలించివేసి నైసర్గిక లోకవ్యవహారమందు నిమగ్నులగుదురు. కొందరు మానవులకు కొన్ని ప్రవృత్తులు (ఉదా. కామము, క్రోధము) ఉండకపోవచ్చును; లేదా చాల మందముగా నుండవచ్చును. అట్లే కొందరికి కొన్ని అభిరుచులు ఉండవు (ఉదా. సంగీతము చాలమందికి అనవసరము, అర్థరహితము). ఆవిధముగనే కొందరు మానవులకు దర్శనము అనవసరము, నిరర్థకము. శ్వాసోచ్ఛ్వాస, ఆహార, నిద్రలవలె గాక ఇది లేకున్నను ప్రాణము పోదు. కళా సాహిత్య విజ్ఞానములు కూడ మానవునికి ఉపయోగకరములును, అధికతర సుఖమును, ఆత్మతుష్టిని ఇచ్చునవియే గాని, అవియు (పై అర్థములో) ఆవశ్యకములు కావు. దర్శనము కూడ ఈ కోవకు చెందినదియే. అయితే అది సాక్షాత్తుగ ఆత్మతుష్టిని మాత్రమే ఈయగలదు. అందుచేతనే కొందరు వీటన్నిటిని మానవునికి కృత్రిమత్వమును నేర్పి అతనిని భ్రష్టుని చేయున వనియు, ఇవి లేకుండుటలోనే మానవునికి ప్రకృతితో సామీప్య సాయుజ్యములను, బాలగోపాలక ఆటవికాది అమాయికులతో సారూప్యమును కలుగు ననియు, అందువలన నాగరక

సంఘములకు, వ్యక్తులకు సంభవించు అనేక విపత్తులు, సంకటములు సంభవింపవనియు చెప్పిరి (ఉదా. రూసో, రస్కిన్, గాంధీల కొన్ని రచనలు). దర్శనానర్థకతను, మనన విమర్శాహేతుమత్తల నిష్ప్రయోజనత్వమును చూపి, సహజప్రాకృత జీవితపు విలువను, సార్థకతను ప్రతిపాదించుటయు నొక విధమగు దర్శనమే. నిదర్శనపూర్వకముగా, యుక్త్యనుభవ పురస్సరముగా బుద్ధిమత్త్వము (rationality) ను సంశయ విమర్శపూర్వకమగు చింతనను, దర్శన శాస్త్రమును ప్రత్యాఖ్యానము చేయుట యనగా మరొక రకపు దర్శనమును ప్రపంచింప ప్రయత్నించుటయే. పెద్దరికము, అనుభవము, నాగరికత, పాండిత్యము, విచారశక్తి - వీటిని గూర్చి నిర్వేదన చెంది, వాటిని పరిత్యజించి, బాల్యమందు తిరిగి "తిష్ఠ" వేసినచో - అనగా బాలుల వలె తిరిగి అమాయికులమైనచో1 అప్పుడు సత్యమైన దర్శనము, పరమ సత్యప్రాప్తి సంప్రాప్తమగు నను వారును కలరు. అట్టివారికే స్వర్గలోకము, లేదా మోక్షము దొరుకునట!

# వివిధ దార్శనిక చింతనలు—దర్శన శాఖలు

వ్యవహార విజ్ఞానముల విమర్శాయుత అన్వీక్షణము దర్శన మన వచ్చు నంటిమి. వస్తుతత్త్వ స్వరూప జిజ్ఞాస లోకజ్ఞాన విజ్ఞానాభ్యుపగమములతోను, ఫలితములతోను తృప్తినొందక వాటి కతిక్రాంతమో, అన్యమో అగు సత్యము నన్వేషించుట దర్శనమనవచ్చు నంటిమి. లోకానుభవమందు వస్తువులను, వాటిమధ్య జరుగు సంఘటనలను చూచుచున్నా మని నమ్ముచున్నాము. ఈ వస్తువుల నిజతత్త్వమేమి? వాటి మధ్య గల సంబంధములు, వాటిలోను, వాటిమధ్యను జరుగు సంఘటనలు ఏవి? అవి ఎట్లు జరుగును? ఇదంతయు మన మెట్లు తెలిసికొనుచున్నాము?

ఈ ప్రశ్నలు అనుదిన ప్రత్యక్షమునుండి మనము ఏర్పరచుకొను సాధారణ భావములను, వాటి వలన ఏర్పడు దృక్పథమును కొంతవరకు సంక్షుభితము చేయనిదే ఉత్పన్నము కావు. నిత్య వ్యవహారములు మన కొక సమస్యగా తోచినప్పుడే దర్శనోత్పత్తి జరుగును. ఇది వ్యవహారమును చింతన చేయుట వలన, లేదా ఏదో ఆశ్చర్య భయాది ఉద్రేకముల వలన, లేదా సంఘర్షమువలన వచ్చిన సన్నివేశములలో సంభవించునని చెప్పి యున్నాము.

**అతిభౌతిక శాస్త్రము :** మనకు వస్తువులు, సంఘటనలు ఆ యా విధములుగ కన్పడుచున్నట్లు వాటి రూపకల్పన చేసికొనుచున్నాము. ఈ ప్రశ్నలు ఆ రూపకల్పనను సందేహింప సన్నద్ధుల మైనా మని తెల్పును. ఒకవేళ మనది భ్రమ యేమో, మనము జ్ఞాన మనుకొన్నది కాదేమో, అంతకంటె నిశ్చయత నిచ్చునది కలదేమో అను సంశయములు ఈ ప్రశ్నలకాధారములు. అప్పుడు మనము మొదట వస్తుస్థితి (reality) యనుకొనినది ఆభాసము (appearance) మాత్రమేమో ననియు, దాని వెనుక యథార్థ వస్తుస్థితి వేరొకటి గలదేమో ననియు ఒక సంభావ్యత తోచును. విమర్శ చేయబడని అనాలోచితములైన ప్రత్యక్షముల ప్రకారము, అభిప్రాయముల ప్రకారము వస్తుస్థితి యని తలచబడునది నిజముగా కాదనియు, మనకు కనపడునది (ఆభాస) వస్తుస్థితి కాదనియు తోచు ఊహ విజ్ఞానమందు, దర్శనమందు కూడ అంతర్గతము. ఇంద్రియముల ద్వారా గృహీత

---

1. బాలురు ఏమంత అమాయికులు కారని వారం దరిలోను కామ క్రోధ అసూయాది ప్రవృత్తులన్నియు గలవని మన స్తత్త్వశాస్త్రము చెప్పుచున్నది; అది వేరు విషయము.

మగు ప్రపంచ స్వరూపము సత్యమైనది కాదు. బుద్ధి చేతనో, ప్రజ్ఞచేతనో మాత్రమే వస్తుస్థితి గ్రాహ్యమగును. ప్రపంచపు సారము, పరమ తత్త్వము (ultimate reality), యథార్థ వస్తువు (thing-in-itself) చూడబడునది కాదు. చూడబడునది (దృశ్యము - ఆభాస) అస్వతంత్ర వస్తు స్థితి. అది యాదృచ్ఛికము; వ్యావహారికము; తక్కువ రకపుది; అర్ధ సత్యము. దీని వెనుక దీని కధిష్ఠానముగ నుండునది స్వతస్సిద్ధ స్వతంత్ర వస్తు స్థితి; అది అపరిహార్యము; అబాధితము, పారమార్థికము; పూర్ణ సత్యము. ఈ సారభూత స్థితి విచార చింతనములకు, లేదా ప్రజ్ఞకు విషయము కాగలదు; ఆభాసము ఇంద్రియ ప్రత్యక్ష విషయము. ఆభాసముల వెనుకనున్న అసలు వస్తుస్థితి (సత్-being)ని తెలిసికొనగోరుట, సత్తా చింతనల (being and thought) సూత్రముల నవగాహనము చేసికొన ప్రయత్నించుట అతి భౌతిక శాస్త్ర (metaphysics) మనబడును. ఇంద్రియ సంవేదనలు, అవిమర్శిత ప్రత్యక్షము, వ్యవహారముల కతీత మగు, సత్య మగు వస్తుస్థితిని గూర్చిన శాస్త్ర మిది. దానిచే తెలిసికొనబడునది పరమార్థ సత్యము; తదితరము వ్యావహారిక సత్యము. ఆదిమము, స్వతస్సిద్ధము నగు పరమార్థ వస్తుస్థితి నిరపేక్ష సత్యము; కేవలము (the absolute) అతీతము (transcendental). కేవల మనగా దానికదియే ప్రమాణము, స్వతంత్రము, మౌలికము, పరమము. అతీత మనగా ఇంద్రియజ్ఞాన విజ్ఞానముల కతీతము; కొందరి మతములో బుద్ధికి కూడ నతీతము; అంతర్దృష్టి, శ్రద్ధ, లేదా ప్రజ్ఞచే మాత్రమే పరిగ్రాహ్యము. ఇక దీనినుండి వచ్చినదైనట్టి అస్వతంత్రము, సాపేక్షము, ప్రాపంచికము నగు వ్యావహారిక వస్తుస్థితి ఇంద్రియజ్ఞానమునకు, విజ్ఞానమునకు విషయము; పూర్తిగ జ్ఞేయము. మనకు దృశ్య మగునది సత్యముగ అనుభూతము, అసలు వస్తుస్థితి యొక్క కార్యము (effect), లేదా సంఘటన (event) అని కొందరును, మనస్సు తన స్వభావాను సారముగ పరమార్థవస్తుస్థితిని గూర్చి ఏర్పరచుకొనిన ప్రత్యయములు (concepts) మాత్రమే అని కొందరును చెప్పుచున్నారు. దృశ్యజ్ఞానము విషయగతము[1], వస్తుతంత్రము (objective), యథాభూతము అని మొదటిపక్షపు తాత్పర్యము. దృశ్యజ్ఞానము విషయిగతము,[2] బుద్ధ్యపేక్షము (subjective), మానవుల మతిపై ఆధారపడియున్న దని రెండవ పక్షపు తాత్పర్యము. కాబట్టి వస్తుస్థితి, ఆభాసముల - పారమార్థిక, వ్యావహారిక సత్యముల - యథార్థ, ప్రతీయమాన సత్తల-విభేదము అంగీకరించినంతనే 'ఆభాస, లేదా, దృశ్యము వస్తు తంత్రమా, అనగా సత్యమైన వస్తుస్థితియొక్క అభివ్యక్తియా, లేదా కార్యమా, లేదా పరిణామమా, లేదా సృజనమా? కానిచో, వస్తుస్థితియొక్క మనోనిర్మిత ప్రత్యయముల ఉపస్థితి మాత్రమేనా?' అను మరొక సమస్య వచ్చును.

అయితే ఇది యంతయు నిరర్థక చింతనయనియు, దృశ్యముతో తృప్తిచెందుటే వివేకమనియు కొందరందురు. ఇట్టివారు ప్రత్యక్ష జ్ఞాన సత్తావాదులు (positivists). భూతార్థములను స్థాపించు విజ్ఞాన శాఖలు ప్రత్యక్ష జ్ఞాన సత్తావాదకములు. వానిపై మాత్రమే ఆధారపడు దర్శనము ప్రత్యక్ష జ్ఞాన సత్తావాదము (positivisim). సమస్తమైన చింతనకు, జ్ఞానమునకు విషయము మనము ప్రత్యక్షముగా చూచు భూతార్థములే కావలయు ననియు, వీటి నతిక్రమించి సత్యమైన వస్తుస్థితికై అన్వేషించుట భ్రమ యనియు వీ రందురు. ఈ వాదము ప్రకారము ఆభాసము వెనుక దృశ్యము కానిది ఏమియు లేదు. ఇంద్రియ జ్ఞానమునకును, దానిపై ఆధారపడిన అనుమానములకును అజ్ఞేయ మగునది లేదు. ఇట్టి వారికి అతిభౌతికశాస్త్ర మొక భ్రాంతి, పిచ్చి. అనుభవ విషయముల నాభాస లేదా దృశ్య మని. ఆ దృశ్యమున కధిష్ఠానముగ, కారణముగ నొక అదృశ్య

---

1. చూడబడునది, లేదా గ్రహించబడునది, లేదా చింతించబడునది 'విషయము' (object).

2. చూచునది, గ్రహించునది లేదా చింతించునది విషయి (subject).

యథార్థ వస్తుస్థితి ఉన్న దని వాదించుట దోష మని వీరి అభిప్రాయము.

'వస్తుస్థితి మన కజ్ఞేయము, కాని ఆభాస వెనక దాని యథార్థాస్తిత్వము కలదు' అను వాదము మరొకటి కలదు. ఇది అజ్ఞేయతావాదము (Agnosticism). అజ్ఞేయతావాదులు దృశ్యమున కావల దాని అధిష్ఠానమగు కేవలమును ప్రతిపాదింతురు గాని దాని జ్ఞాన మసంభవ మందురు. కాబట్టి వీరును అతి భౌతిక శాస్త్రమును ప్రత్యాఖ్యానింతురు.

కాని మానవేతిహాసమును, దర్శన శాస్త్ర చరిత్రను సమీక్షించినచో దృశ్యమును దాటి పోయి దాని కావల వస్తుస్థితి యొకటి గల దని భావించుట, దానిని గూర్చి చింతించుట మానవునికి గల సహజ మనఃప్రవత్తు లనియు, వీటిని అణచివేయుటకు వీలు కాదనియు, అన్ని దేశములందు, అన్ని కాలము లందు ఇవి తల ఎత్తు ననియు తేలును. మనస్సు భూతార్థములతోను, ప్రపంచమందలి వస్తువులతోను అతృప్తి చెందినప్పుడు, వీటికంటె ఉత్తమమైన, శాశ్వతమైన, నిరవధికమైన వాటిని అన్వేషింప యత్నించినప్పుడు, విశ్వము నొక సామరస్య యుక్త మగు సుందర సుసంగత సామస్త్యము (whole)గా చింతింప సమకట్టినపుడు అతిభౌతిక చింతన బయల్వెడలును. అందుచేతనే దీనికి, మతమునకు సారూప్యము కలదు. ఆదర్శముల, మూల్యముల, పూర్వరూపము (prototypes) లను గూర్చి ధ్యానించుట, వాటి నాకళించుకొనుట సదా కొందరు మానవుల ఉద్య మమై యున్నది. అదియు కాక, దృశ్యమాన భూతార్థములు, విశుద్ధచింతన, వైమర్శిక అన్వీక్షణలలో అపేక్షింపబడు సక్రమ అనుసంధానమునకు తృప్తి నీయలేవు. అప్పుడు యథార్థముగ వస్తుస్థితి యను కొనుటకు వీలైన దేదో యొకటి ప్రత్యయములతో నిర్మింపవలసి వచ్చును. అది తార్కికాదర్శముపై వస్త్వారోపణ (hypostatisation) చేయుట అగును. ఇవి అలీకములు కావనియు, వ్యాఖ్యానాత్మక (interpretative reflection) కు తృప్తి నీయలేని ఇంద్రియజగత్తున కధిష్ఠానముగ పరమార్థసత్తను ప్రతిపాదించుట వలన, ఆ భావమును గూర్చిన నిదిధ్యాసనము చేయుటవలన యథార్థ వస్తుస్థితిని గూర్చిన జ్ఞానము కలుగు ననియు కొందరి మతము. 'నిరపేక్ష కేవల సత్త లేనిదే విచార మనన ములు మనజాలవు; అవి అదేమిటో కనుగొనలేవు' అనునది వేరు విషయము. దాని ఉనికియందలి ఆస్థ మనస్సునకు తృప్తినిచ్చును. ఈ ప్రత్యక్ష విషయము కాని యథార్థ సత్తను గూర్చిన ఆలోచనయే సత్యమగు జ్ఞాన మని, దృశ్యమును గూర్చినది, జ్ఞాన మను కొనబడునది అభిప్రాయము (opinion) మాత్రమే నని కొంద రందురు. ఏలన సనాతనము, నిరపేక్షము, అపరిణామము అగుదానిని గూర్చియే జ్ఞానము సంభవము గాని అశాశ్వతము, సాపేక్షము, నిత్య పరిణామి యగునది జ్ఞాన విషయము కాదని వీరి తలపు. యథార్థ వస్తుస్థితిని గూర్చిన జ్ఞానము వ్యావహారిక విజ్ఞానములకు భిన్నము గాన దానిని పొందు పద్ధతియు వ్యావహారిక పద్ధతులకు భిన్నముగా నుండవలెనని వీరిలో కొందరు తలచి, ద్వంద్వ తర్కాదులను (dialectic) దర్శన శాస్త్ర విశిష్ట పద్ధతిగా భావించిరి. ఏది సరియగు దార్శనిక పద్ధతి యను దానిని గూర్చి ఐకమత్యము లేదు.

**సత్తాశాస్త్రము** (Ontology) : సత్త ఆభాసము నుండి పూర్తిగా భిన్నము అని నొక్కి పలుకు వారు పరమార్థ వస్తుస్థితికి, ప్రతీయమాన వస్తు స్థితికి తీవ్ర వైరుధ్యమును ఉపకల్పించి, పరమార్థ సత్తను తెలిసికొనుట శుద్ధ చింతనకో, లేదా ప్రజ్ఞా శ్రద్ధలకో మాత్రమే సాధ్యమని ఎంచి ఒక విశిష్ట పద్ధతి నుపయోగింప యత్నింతురు. ఆభాసమునందు కన్పడునదే సత్తాసారము అని తలచువారు ప్రత్యేక విజ్ఞానశాఖ లందు ఉపయోగింపబడు మార్గములనో, వాటికి తుల్య మార్గములనో అవలంబించి ఆభాసము నతిక్రమించి పోగోరుదురు. మొదటి రకమువారు ఆభాసమునకు సరియైన వివరణ చెప్పలేరు. ఏ దృశ్యమువలన పరమార్థ సత్తను గూర్చిన ప్రత్యయ నిర్మాణము చేయవలసి వచ్చినదో దానినే వారు ఉపేక్షింపవలసి వచ్చును. రెండవ రకమువారు ఆభాసము పైననే

తమ దృష్టిని కేంద్రీకరించుటచే వానిని - ప్రత్యేక విజ్ఞానశాఖలలోని భావములను - అతిక్రమించి పోలేక పోవుట జరుగును.

ప్రతి అనుభవము సావధికము, సీమితము గాన దాని కతీతమైన దేనితోనో అది సంబద్ధముగా నున్నట్లు, దానితో కలసిన ఒక ఐక్యమందు అది అంతర్భూతముగ నున్నట్లు సూచించును. మనస్సునకు సమన్వయ పూర్వకముగ సంయోజనము చేయుట, వివిధ గృహీత విషయములపై నొక ఏకత నాపాదించి వాటి నర్థము - చేసికొనుట సహజ స్వభావము. ప్రత్యక్షీకృత విషయముల వాస్తవిక సుసంగతత్వము (coherence)లపై ఆధారపడిన పరస్పర సంబంధ భావముల చింతన చేయుటయే జ్ఞాన మంతటికి గమ్యము. ఇట్టి చింతన అనంతత్వమును నిరవధిక తను సూచించును. చింతన, భావనాశక్తులు హద్దులను, పూర్తియగు విభిన్నతలను, స్వయంపూర్ణము లగు ప్రత్యేకతలను, ఉపాధులను సరకుచేయక వాటి కతీత మైన యొక నిరుపాధిక, నిరవధిక వస్తువు అను నట్టియో, లేదా ప్రత్యేకములగు సోపాధిక దృశ్యము లన్నిటి సమష్టి యనునట్టిదియో ప్రత్యయమును నిర్మించువరకు శాంతి నొందవు. తార్కిక ఆవశ్యకత (logical need) ఊహ భూతార్థముల నధిగమించి పరమార్థ సత్యమును నిర్మించును. ఏలన, బుద్ధి (reason)కి విచారశక్తికి గల అవసరములు, అపేక్షలు అనుభవమునందు పూర్తిగావు. అందుచే నవి అనుభవాతీతము, వ్యావహారికాతిరిక్తము అగు అతి భౌతిక వస్తుస్థితిని నిర్మించును. నిరుపాధికము, అనంతము అనుభవమందు దత్తాంశము కాదు. కాని అది బుద్ధికి దత్తాంశముల సమన్వయముచేసి అర్థము చేసికొనుటకును, బుద్ధి ఆరాటము తీరి దానికి విశ్రామ స్థానము లభించుటకును - ఆవశ్యకము. ఈ అతీత వస్తువు నుపపాదించుట మాత్రమేనా బుద్ధి చేయగలిగి నది? దాని జ్ఞానముకూడ సాధ్యమా? ఈ ప్రశ్నకు కొందరు సాధ్యమని, కొందరు అసాధ్యమని ఉత్తర మిచ్చెదరు. 'అతిభౌతిక సమస్యలు అనివారణీయముగ తల యెత్తును. కాని వానికి ఎన్నడును పరిష్కారము లుండవు' అని కొందరి మతము. 'అటులకాదు. బుద్ధికి వస్తుస్థితికి, విచారమునకు సత్తకు అత్యంత సన్నిహితత్వము (అభేదము, ఐక్యము కూడ అని కొందరు) కలదు. కాబట్టి బుద్ధి వికాసము (విచార ప్రగతి) అబాధితము, సుసంగతము అయినంత వరకు పరమార్థ వస్తుస్థితి స్వరూపమునకును, ఒకవేళ దానికి వ్యాపార మున్నచో దానికిని అనుకూలముగను, ప్రకాశముగను ఉండును' అని కొందరి మతము. ఇట్టివారు పరమార్థ సత్తను గూర్చిన జ్ఞానము సాధ్యమందురు. అది ప్రమాణజన్య వ్యావహారిక జ్ఞానము కంటె ఇంకను ఉత్కృష్టము అని ఎంచెదరు. ఈ రెంటికి వైరుధ్య ముండదని కొందరు, ఉన్నదని కొందరు తలచెదరు. ఉన్నదను వారు వ్యవహార జ్ఞానమును ధిక్కరించి దీనినే ఆశ్రయింపవలె నందురు. ఏలన, వారి దృష్టిలో ఇంద్రియ జన్య జ్ఞానమందు వ్యాఘాతములు, అసంగతత, అపూర్ణత కలవు. శుద్ధ బౌద్ధిక జ్ఞానములో అవి యుండవు. కేవలము వస్తు స్థితిని, సత్తా స్వరూపమును వివేచన చేయు మీమాంస సత్తా శాస్త్ర (Ontology) మనబడును. 'అట్టిది లేనేలేదు. అదియొక భ్రమ. సత్తా శాస్త్రములోని వాక్యము లన్నియు నిరర్థక ప్రలాపములు' అను దార్శనికులు కల రని ఇదివరకే చెప్పితిమి. 'సత్తా శాస్త్రము బుద్ధిచేతను, తర్కముచేతను నిర్మింప వీలు కాదు. ఏలన - సత్తా స్వరూపము ననుమానము చేయుటకు ప్రతిజ్ఞా వాక్యములు లేవు కాన వ్యాప్తియు, దానికి అనుభవమందు ఉదాహరణములు దొరకవు కాబట్టి వ్యాప్తి జ్ఞానమును (induction) ఉండవు. కాని అది అలౌకిక ప్రమాణములచే (ఉదా. వేదాది గ్రంథములు, ప్రవక్తల బోధలు, యోగుల అనుభూతులు) లభ్యము కావచ్చును' అనువారు కలరు. అప్పుడు అట్టి ప్రమాణములచే ఉపపాదితమగు సత్యములను గ్రహించుట, వివరించుట, ఉపబృంహణము చేయుట దార్శనిక కార్య మగును. దీనిని కూడ కొంద రొప్పుకొనరు. అట్టివారు వస్తుస్థితి ప్రజ్ఞ చేతనో, శ్రద్ధచేతనో గ్రాహ్యమనెదరు. అయితే,' వీని ద్వారా విజ్ఞానమందు ఉపలభ్య మగు దానికి సదృశ మగు జ్ఞానము రాదు' అని వీరందరు. శ్రద్ధావిషయ

మెప్పుడును నిర్దిష్టము (precise), ఇదమిత్థముగా నిరూపణ యోగ్యము, మేయము (measurable, quantified) కాదు. కాబట్టియే అది సార్వ లౌకికము (universal) గా అందరిచే అంగీకరింప బడదు. శ్రద్ధావిషయముతో సంబద్ధుల మగుట, అను భవాతీతమందలి ఆస్థచే జీవితమునకు గమ్యము, ప్రయోజనము ఏర్పడుట జరుగును. కాని దాని జ్ఞాన మసంభవ మని వీ రందరు. ఇట్టి వారికిని సత్తాశాస్త్ర ముండదు.

వ్యవహారమందు వస్తువుగా ఎంచబడునది పరి ణామములను పొందియు, అవస్థాంతరములను చెందియు 'అదే వస్తువు ఇది' అని గుర్తు పట్టుటకు వీలగుచున్నదనిన దాని నిజమగు స్వభావము ఈ మార్పుల కతీతమని, ఇన్ని మార్పులు జరుగుచున్నను అందులో మార్పు లేని దేదో కల దని తలచవచ్చును. ఈ వస్తు సారము లేదా సత్యవస్తువు ద్రవ్య (substance) మనియు, దానికి సంభవించుచుండు సంబంధములు, అది మనకు కన్పడు తెరగులు, దాని కార్యప్రవృత్తులు దానితో పోల్చిచూచిన వచ్చుచు బోవుచు నుండునవే కాని అది వీనితో పోల్చిన చిర స్థాయి అనియు, వీటిని ఆ ద్రవ్యపు గుణ కర్మలన వచ్చుననియు తలపవచ్చును. కన్పడు వస్తువులు ద్రవ్యములు కాకపోవచ్చును. వాటి కధిష్ఠానములుగ నుండునవి, మనకగుపడు గుణ కర్మల కాశ్రయములు ద్రవ్యములు. ద్రవ్యములే సంఘటనలకు, అన్య వస్తువులకు సత్యమగు కారణములు. స్వయముగ దేనిని ఆశ్రయింపక, ఇతరమున కాశ్రయమై, పరిణామముల, అవస్థల మధ్య వాటికి ఆధార మయ్యు స్వయముగ మార్పు లేనిది ద్రవ్యము. ద్రవ్యమునకు గుణము లుండును; కార్యము (effects) లుండును; కర్మ, లేదా వ్యాపారము (action) ఉండును; ద్రవ్యమునకు ఆగంతుకము (accidental) లైన అనేక లక్షణము లుండును. ఇవి ద్రవ్యముతో అవినాభావముగ నుండవు. వచ్చుచు పోవుచు నుండును; అవి తటస్థములు; తనకు తానై స్వతంత్రముగ నుండునది ద్రవ్యము. మరొక దాని యందు ఉండునది అస్వతంత్రము, ఆగంతుకము, లేదా గుణము. అట్లే ద్రవ్యములు కారణములుగ వాటి మధ్య జరుగునది, వాటిపై ఆధారపడునది కర్మ.

బుద్ధికి గ్రహణయోగ్యముగా నుండుటకు సత్త ఉన్నదనో, లేదనో తలచబడనక్కరలేదు. భావా భావా త్మకమగు ప్రశ్నను, అనగా దానికి అస్తిత్వ మున్నదా లేదా యను సమస్యను లేవదీయ కుండ సత్తను గురించి భావింప (conceive) వచ్చును. ఉదాహర ణమునకు త్రికోణము, ఉపవిష్టుడు, ఈ నరుడు - అను విషయములను అవి యున్నవా లేవా యను ప్రశ్న వేయకుండ మనస్సుచే గ్రహింపవచ్చును. వాటిని గూర్చి చింతన చేయవచ్చును. ఏ ఆలోచనా విషయ ములో నైనను బుద్ధికి ఏది ప్రాథమిక దత్తాంశమో (primary datum), దేనిని గురించియైన భావ మేర్పడు నప్పుడు ఏది ప్రప్రథమముగా, సాక్షాత్తుగా మనస్సున కుపస్థిత మగునో అది సారము (essence) అనబడును. చతురస్రవృత్తము (square circle) మొదలగు వ్యాఘాతములు గల మిథ్యా భావములు గాక ఏ భావ మైనను మనస్సున కేదో యొకటి గోచరింపజేయును. అదియే సారము లేదా స్వభావము (nature). ఏ విషయమును గురించి యైన విచారించుటకు ప్రారంభించినంతనే సద్యముగ, సాక్షాత్తుగ బుద్ధికి స్ఫురించునది దాని సారము. సారముల కునికి ఉన్నదా లేదా యని అడుగకుండ వాటిని గురించి చింతింపవచ్చును. వాస్తవిక అస్తి త్వము (ఉనికి) మన భావవిషయములందు దాని కదిగా ముందుగా ఇమిడియుండదు. ఆలోచనకు విషయ మగు దేనికైనను మన ఇంద్రియ సంవేదనల పై అపరోక్షముగానో, లేదా అనుమానము ద్వారా పరోక్షముగానో ఆధారపడియే మనస్సు వాస్తవిక అస్తిత్వారోపణము చేయగలదు. ఇంద్రియ సంవేదనల సహాయాపేక్ష లేకుండ మనస్సు విచార విషయముల వాస్తవికాస్తిత్వమును నిర్ణయింపలేదు. కొన్ని విచార విషయముల కస్తిత్వ ముండదు. వాటి కస్తిత్వము తార్కికముగా శక్యము (లేదా సాధ్యము) (possible) అయినను వాస్తవముగా నుండదు. బుద్ధిచే

గ్రాహ్య మగుటకు ఒక వస్తువు ఆవశ్యకము గాను, ప్రధానముగాను ఏది అయి ఉండవలెనో అది దాని స్వభావము. ఒక ప్రత్యేక విషయము మనస్సునకు ప్రధానముగ ఏమిగా గోచరించునో అది దాని సారము. స్వభావాస్తిత్వముల సంబంధము, వాటి స్వరూప విచారణ సత్తాశాస్త్రమున ప్రాముఖ్యము వహించును.

ప్రత్యక్షానుభవము వలన వస్తువులు మారుచున్నవని, కదలుచున్న వని తెలియును (ఉదా. లేడి ఉరుకును; అన్నము మాంసముగా మారును). మార్పుల మధ్య చలనమున కాధారముగా ఏదో ఒకటి కలదనియు, సత్త పరిణామ వికారములకు ముందు నుండి ఉండున దనియు, వాటికి మూల భూతమనియు కొంద రనెదరు. కొందరు 'పరిణామమే మూల భూతము, సత్త కంటె ముందు నుండి ఉండునది' అనెదరు. ఈ రెండవ రకము వారు మారునది లేకుండగనే మార్పు కల దనియు, మార్పునకు ముందు ఒక విశిష్ట వస్తు వనునది ఉండ దనియు అనెదరు. మొదటి తరగతికి చెందినవారు పరిణామమును విశ్లేషణ చేసినచో సత్తను రెండు విధములుగ వర్గీకరింపవచ్చు నందురు: ఏది యైయున్నదో అదియు, ఏది అగుటకు వీలున్నదో అదియు. ఇందు మొదటిదానిలో రెండవ దానిగా అగుట కావశ్యకమగు సాధనము, లేదా ఉపకరణము (means) కలదు ఉదాహరణమునకు-'ఈ లేడి ఇక్కడ ఉన్నది, మరెక్కడను లేదు.' కాని ఇది అక్కడ (వేరొక నిర్దిష్ట స్థానములో) ఉండగలదు. దాని కవసరమగు సాధనము కలిగియున్నది. అట్లే అన్నము అన్నమే, కాని అది అన్నముగా నుండుట మాని కొన్ని పరిస్థితులలో (తినబడి జీర్ణమైనప్పుడు) మాంసముగా మార్పు నొందగల శక్తి కలిగియున్నది. గాబట్టి సత్తకు (ఉన్నట్టి వస్తువునకు), అసత్తకు (కానట్టి, లేనట్టి వస్తువునకు) మధ్య సత్తాశక్తి యొకటి కలదు. వస్తువులు ఏవైయున్నవో, ఎట్లు ఉన్నవో అట్లే ఉండిపోవలె నని నియమము లేదు. అవి మరొకటిగా నగుటకు, మరొక విధముగా నుండుటకు శక్తి గలిగి ఉన్నవి. ఉదాహరణమునకు ఒక నిద్రించుచున్న మనుష్యుడు చూడడు, మాటలాడడు, నడవడు. కాని అప్పుడు కూడ అతనిలో ఈ శక్తులు కలవు. వేరే కొన్ని శక్తులు (ఉదా. పక్షివలె ఎగురగల శక్తి) లేవు. ఈ శక్తి సత్త కాదు. ఇంకను వాస్తవికతను పొందలేదు. కాని అసత్తయు కాదు. అనగా అలీకము కాదు. ఏది కాగలదో అట్టి శక్తిని అవ్యక్తశక్తి, లేదా (బీజరూపముగ నున్న) అంతర్నిహితశక్తి (potentiality) అనవచ్చును. సత్త ఎప్పుడును అనిశ్చితము, అవ్యక్తము, అసిద్ధము, అసంపూర్ణము. అప్పుడది అవ్యక్త శక్తి రూపముగ నుండును. దీనికి విరుద్ధముగా సత్త దాని సంపూర్ణార్థములో గ్రహింపబడినప్పుడు, అది నిశ్చితము, అభివ్యక్తము, సిద్ధము అయినప్పుడు అది నిష్పన్నము, లేదా వాస్తవికము, (actual) అగును. సిద్ధమగు వాస్తవిక సత్తనుండి పరిణామము సంభవించదు. అసత్తనుండియు సంభవింపదు. అవ్యక్త శక్తియగు సత్తనుండియే పరిణామములు సంభవించును. అవ్యక్త అంతర్నిహిత సత్తా శక్తి అభివ్యక్త సిద్ధ వాస్తవిక సత్తగ రూపొందు పరివర్తనమే పరిణామము. 'ఏది ఉన్నది (సిద్ధ వాస్తవిక సత్త)? దాని స్వరూప మేమి? అది ఏదిగా కాగలదు (అనగా దానిలో ఏయే శక్తులు కలవు)? ఉన్నది ఎటువంటి అవ్యక్త సత్తా శక్తినుండి ఏర్పడినది?' అను మీమాంసకూడా సత్తాశాస్త్రమున జరుగును.

సత్తను అస్తిత్వ దృక్పథముతో జూచినచో ద్రవ్యభావోత్పత్తి, బౌద్ధిక దృక్పథముతో జూచినచో సారభావోత్పత్తి, కర్మదృష్టితో చూచినచో వ్యక్తావ్యక్త (లేదా శక్య, సిద్ధ) సత్తా భావముల ఉత్పత్తి జరుగును. ఏది సత్యముగా, స్వతంత్రముగా నుండునది? ద్రవ్యము. ఏది మనకు తట్టునటువంటి మూల భావము? సారము, లేదా స్వభావము. వస్తువుల మార్పునకు వివరణ మేమి? సత్తాశక్తి. ఈ మూడు విధముల మీమాంసయు సత్తాశాస్త్రమే.

ద్రవ్యము నిర్వచనమును బట్టి ఒకటే కావలసి యున్నది. ఏలన పూర్తిగ స్వతంత్రములు, స్వయంపూర్ణములు అగు రెండు వస్తువు లుండుట

అసంభవము. కనపడు నానాత్వము అభాస మాత్రమే. దృశ్య బాహుళ్య మున్నను అది ఒకే ఒక ద్రవ్యపు పరిణామములు, లేదా వికారములు, లేదా వికాసములు, లేదా దానినుండి వచ్చిన ఉద్గారములు (సూర్యుని నుండి కిరణములు, సముద్రము నుండి తరంగములు వలె), లేదా దాని ప్రతిబింబములు, లేదా దాని వివర్త ములు. ఇట్టి వాదము ఏకత్వవాదము. ఆ కేవల ద్రవ్యము భౌతికము[1]గా భావింపబడినచో భౌతికవాద మును, చేతనముగా ఊహింపబడినచో ఆధ్యాత్మిక వాద మును బయల్దేరును. రెండును కాదను అనుభయవాదము (neutralism) కూడ సంభవము. వైయక్తికముగా గూడ నది ఉపపాదింపబడవచ్చును. ఏకత్వ వాదముల ప్రకారము దృశ్యము పరమపదార్థమగు ద్రవ్యము కన్న తక్కువ యథార్థత్వము కలిగియుండును. లేదా కొన్ని రకముల ఏకత్వవాదములలో అది భ్రమగానో, మిథ్యగానో ఎంచబడును. 'దృశ్యము పరమద్రవ్యపు వికారము' అను వాదములో రెండును సమాన సత్తా కములే. 'అనేక ద్రవ్యములు కలవు. లేకున్న ఈ దృశ్యమాన నానాత్వమునకు, తర్కమునకు సంగతి కుదురదు' అను వాదము బహుత్వ (లేదా నానాత్వ) వాదము. ఈ వాదములో ద్రవ్యములు అన్నియు ఒకే తరగతి చెందవు. కొన్ని బహుత్వ వాదములలో సంపూర్ణము, స్వతంత్రము నగు తత్త్వ మొకటియే యుండును. తక్కినవి దానిపై ఆధార పడిన ప్రకారములో, కార్యములో కావచ్చును. చాల ఈశ్వర వాదములు ఈ కోవకు చెందును. కొన్ని బహుత్వవాదముల ప్రకారము ద్రవ్యములలో గుణ భేదము మాత్రమే ఉండును. కొన్నిటిలో పరిమాణ భేదము మాత్రమే ఉండును. 'పరమ ద్రవ్యములు రెండే రెండు. అంతయు వాటి వికారమో, వికాసమో అను వాదము ద్విత్వవాదము (dualism). సాధా రణముగ ఇట్టి వాదముల ప్రకారము అందొకటి ఆధ్యాత్మిక తత్త్వము, మరొకటి భౌతిక తత్త్వము. ఇవన్నియు వివిధ అతిభౌతిక[1]వాదములు.

సత్త్వశాస్త్రచర్చ మానవుని విషయముగ స్వీక రించినప్పుడు క్రింది విధములైన ప్రశ్నలు కలుగును. అసలు మానవుడెవరు? కనపడు వ్యక్తియేనా? అందంత రతమగు నొక ద్రవ్యమా? అయినచో దాని స్వభావ మేమి? దానికిని, దృశ్యమాన శరీరమునకును గల సంబంధము. పరస్పర వ్యాపారము ఎట్టిది? చైతన్యము- ఆలోచన - ఎట్లు పుట్టును? దాని స్వభావ మేమి? వివిధ మానసిక వ్యాపార, ప్రత్యక్ష అను భవములలో జరుగున దేమి? ఎట్లు జరుగును? వాటి సూత్రము లేవి? మరణానంతరము మిగులున దేమైన కలదా? లేదా? (అంటే శవము గాక) అది ఎట్టిది? దాని గతి ఏమి? వీటిలో కొన్ని ప్రశ్నలకు ఊహా చోదితములైన అతిభౌతిక సమాధానములు మాత్రమే సాధ్యము. కాని వీటిలో కొన్ని ప్రశ్నలకు - నరుని ప్రవర్తన (behaviour), మానసిక వ్యాపార జీవిత ములను గూర్చిన వాటికి-స్వీయ మనోవృత్తుల విశ్లేషణ (introspection) వలన, ఇతరులయు, తనయు ఆచరణలను గమనించి వాటినిగూర్చినవిచారమువలన, వివిధ పరిస్థితులలో-వీలైన ప్రయోగశాలలలో-వ్యక్తుల నుంచి వైజ్ఞానికముగా అనుశీలనము చేయుటవలన వైజ్ఞానిక సమాధానములను బడయవచ్చును. అప్పుడది మనస్తత్వశాస్త్ర మగును. మనః స్వభావ వ్యాపార ములను, మానవాచరణను ప్రాయోగికముగా (experimentally), సాంఖ్యికశాస్త్ర దృష్టితో (statistically) అనుశీలనము చేయు పద్ధతులు ఇటీవలనే వృద్ధి చెందినవి. అప్పటివరకు దర్శనాంగ ముగా ఉండిన మనస్తత్వశాస్త్రము తదుపరి ప్రత్యేక విజ్ఞానశాఖగా పెంపొందినది.

**నిశ్చయతా వాదము- యదృచ్ఛా వాదము :** ప్రపంచమందు ఒక నియమము కలదు; ఏక రూపత కలదు. ఒక పరిస్థితిలో నొక విధముగ జరిగినచో అట్టి పరిస్థితులు మరల సమకూడినప్పు డెల్ల అట్లే

---

1. భౌతికము = అచిత్ తత్త్వము.

1. అతిభౌతిక శబ్దములో భౌతిక మనగా వ్యవహార విజ్ఞానము లందు అనుభూతమగునట్టి, పరిశీలన చేయ బడునట్టి వస్తుజాతము.

జరుగును. కొన్ని వస్తువులకు, సంఘటనలకు పూర్వమున మరికొన్ని నియతముగ నుండును. లేకున్న అవి సంభవింపవు. ఒక వస్తువు ఉన్నప్పుడు మరొకటి దానికి తప్పక సహచరముగ నుండుట, ఒక వస్తువు కొన్ని పరిస్థితులలో మరొకటిగా నగుట, లేదా మరొక దానిని ఉనికిలోనికి తెచ్చుట జరుగుచున్నది. ఒక్కొక్కసారి ఒక వస్తువు వేరొకటిగా కనపడి కార్య సాధన చేయుచున్నది. రెండు, లేదా అంతకు మించిన సంఖ్య గల వస్తువుల మధ్య గల ఈ సంబంధము పూర్వాపరభావముపైన, నియతత్వముపైన ఆధార పడియున్నట్లు తోచును. ఈ సంబంధమును కార్య కారణ సంబంధ మందురు. ఇది అనేక విధములు. 'దేని నుండి? ఎట్లు?' అను ప్రశ్నలకు కార్యకారణ జ్ఞానము కొంతవరకు సమాధాన మీయగలదు. ఈ సంబంధము నిజముగా వస్తువుల మధ్యనున్న వాస్తవిక సంబంధమా? లేదా మనస్సు వస్తువుల నర్థము చేసి కొను అనివార్యమగు పద్ధతియా? లేదా ఒక సహజ విశ్వాసమా? దీనిని నిరూపింపగలమా? లేదా, ఇది లేనిది వ్యవహారము సాగదు కాబట్టి ఇదియొక అభ్యుపగమమా? అయితే వ్యవహారము అర్థవంతము, సఫలము అగుచున్నది కాబట్టి ఇది నిజమని ధ్రువపడుట లేదా? 'ప్రపంచమందన్ని వస్తువులును సకారణములే.' 'కొన్ని కావు'. 'ఏవియు కావు' అని ఇట్లు పలు వాదములు కలవు. ఇందు మొదటిది నిశ్చయతా వాదము (determinism). రెండవది స్వేచ్ఛకు కొన్ని విషయములలో అవకాశ మిచ్చును. చివరిది యదృచ్ఛా వాదము. చివరిది నిజమైనచో ఎట్టి జ్ఞానమును సాధ్యము కాదు. మొదటిది నిజమైనచో ఎక్కడను కూడ స్వచ్ఛందత, స్వేచ్ఛ ఉండవు. మానవ ఆచరణ, విచారము కూడ పరిస్థితులచే, పూర్వవర్తులగు వస్తువులచే, లేదా సంఘటనలచే పూర్తిగా నియతము లగును. 'వస్తు సమష్టిని తీసికొని, దానికి-అనగా విశ్వమునకు - కారణము ఉన్నదా యని ప్రశ్నించుట అయుక్తము. విశ్వమందలి ప్రత్యేక వస్తువులకు కారణములుండును గాని, యావద్విశ్వమునకు కారణ మెట్లుండును? ఏలన, విశ్వమునకు ఆవల ఏమియు లేదు కదా!' అని కొందరందురు. 'ఒకవేళ విశ్వ కారణము ఒకటియున్నచో దానికి కారణముండదా?' యని వారి వాదన. 'విశ్వస్థ వస్తువు లన్నియు అపూర్ణములు, ఆగంతుకములు, అస్వతంత్ర ద్రవ్యములు. కాబట్టి వీటి సమష్టి యగు విశ్వమును అట్టిదే. కాబట్టి దానికి ఈ దోషములు లేని పరిపూర్ణ మగునదేదో ఒకటి అధిష్ఠాన రూప మగు కారణము కావలెను. విశ్వమున కట్టి కారణము కలదని తలచుట, దానిని ప్రతిపాదించుట అయుక్తము కాదు. అట్టిది - అనగా పూర్ణము, సర్వ స్వతంత్రము, పరమము అగునది ఒకటియే కావలెను. అది ఆగంతుకము, యాదృచ్ఛికము (contingent) కాదు. కావున దానికి కారణ ముండదు.' ఇది కొందరి మతము.

మానవుడేది చేయబూనినను సోద్దేశ్యముగ ప్రయోజన మర్థించి చేయును. 'లేనిది ఒకటి జరుగ వలెను. కావలెను; లేదా ఉన్నది యొకటి వేరు విధముగ నుండవలెను' అను ఉద్దేశ్యముతో మనుష్యుని వ్యాపారము ప్రవృత్తము. లేదా 'ఉన్నది యొకటి లేకుండ పోవలెను; లేదా వేరు విధముగా కావలెను' అనునవి కూడ అతని ఉద్దేశ్యములు. ఇట్లు మానవ వ్యాపార మంతయు ఒక లక్ష్యమును సాధించుటకై, ఒక గమ్యమును చేరుటకై జరుగును. కాబట్టి ప్రయోజనము (purpose) వ్యాపారమును పురికొల్పును. దానిని నియమితము చేయును. ప్రయోజన సిద్ధి వాస్తవ మగుటకే ఆచరణ వ్యవహారము జరుగును. ప్రయోజన రహితములగు వ్యాపారములకు, ప్రక్రియలకు అర్థము ఉండదు. 'అయితే, మానవుల సందర్భములో చూడబడిన ఈ ప్రయోజనత్వము విశ్వమునకు కూడ కలదా? విశ్వప్రక్రియకు - ప్రపంచమందలి సాంఘిక, రాజకీయ, ప్రాకృతిక సంఘటనల కన్నిటికి ఒక ఉద్దేశ్యము, ప్రయోజనము కలదా, లేదా? విశ్వము సార్థకమా? నిరర్థకమగు నొక నిర్మాణమా? ఈ ప్రశ్నలు అయుక్తములు. ఏలన ప్రయోజన మనునది ఒక మానవ భావము. ఇది మానవ చేష్టలకు, వ్యాపారమునకే వర్తించును. జంతువులకు, అచేతన వస్తుజాతమునకు ప్రయోజన ముండదు. కాబట్టి

యావద్విశ్వమునకు ఒక ప్రయోజన ముండదు' అని కొందరి వాదము. వీరి మతములో ఒకటి కంటె నెక్కువ సంఖ్యగల లక్ష్యములను, గమ్యములను భావనచేసి అందొకటి ఏరుకొని దానినెట్లు సాధించుట యని యోచనచేసి ప్రవర్తిల్లినప్పుడే 'ప్రయోజన' మను నది ఉండును. యాంత్రికముగా, అనివార్యముగా జరుగు సహజ నైసర్గిక ప్రక్రియలలో ప్రయోజన మెట్లుండును? కాబట్టి విశ్వమునకు ప్రయోజనము లేదు. వేర్వేరు ప్రత్యేక మానవ కార్యములకే ప్రయోజన ముండుటయును, లేకుండుటయును. యావజ్జీవితమును తీసికొన్నను దానికి ప్రయోజనము లేదు. అందుకే 'మానవుడు ఎందుకు పుట్టినాడు?' అను ప్రశ్న 'కుక్క ఎందుకు పుట్టినది?', 'హిమాలయమున మంచు ఎందుకున్నది?' అను ప్రశ్నలకంటె ఎక్కువ సార్థకము కాదు. ఇది వీరి వాదము. దీనికి విరుద్ధ ముగా విశ్వమును ప్రయోజన భావము ద్వారా తప్ప అర్థము చేసికొనలేమని, ప్రయోజన రహిత విశ్వము ఒక అవ్యవస్థిత పదార్థ సమూహమో, ఒక పెద్ద యంత్రము వంటిదో అగునని, అట్లు తలంచుటకు కొన్ని అనుభవాంశములు ఒప్పవని, ప్రయోజన భావము నవలంబించుటవలన విశ్వమును గూర్చిన మన చింతనకు ఏకత అబ్బునని, కాన అది కార్య కారణ భావమువలె నుపాదేయ మని కొందరనెదరు. అయితే వారు కూడ కార్యకారణ భావము నుపయో గించుట వలన వచ్చు జ్ఞానము వంటివి ప్రయోజన భావోపయోగము వలన రాదందురు. విశ్వము సార్థకము, సప్రయోజనము; మానవ జీవితము కూడ సఫలము, సలక్ష్యము అను శ్రద్ధ దీనివలన ఉత్పన్న మగును. కొంద రిదియు జ్ఞానమేనని వాదింతురు. ప్రపంచ మంతయు కార్యకారణ నియమ వ్యాప్తము. యాంత్రికముగా ప్రతిది జరుగుచున్న దనినచో మానవ స్వేచ్ఛకు కూడ తావుండదు. అట్లుగాక సోద్దేశ్యకత, ప్రయోజకత్వము విశ్వలక్షణముగా ఒప్పుకొని ఆధ్యా త్మిక తత్త్వముల కిది సాధ్య మన్నచో ఆధ్యాత్మిక తత్త్వముగా భావింపబడిన మానవుడును స్వతంత్రుడు అనవచ్చును. పురుషార్థమునకు అప్పుడు సార్థకత వచ్చును. లేకున్న తానెట్లు పుట్టి, మని, గిట్టినను విశ్వమున కొకటే యను భావము మానవునకు కలిగి, మానవుని నీచత్వ, హేయత్వములు పర్యవసితము లగును. విశ్వమున కొక ప్రయోజనము, లక్ష్యము, ఉన్న దను విశ్వాసము, లేదా జ్ఞానము విశ్వాతీత మగున దేదో కల దను వాదములో పర్యవసింప వచ్చును. ఏలన - అదియే కదా విశ్వమునకు లక్ష్య నిర్దేశ్యము చేయునదియు, లక్ష్యము వైపునకు నడిపించునదియు. అట్టిది ఆధ్యాత్మిక, లేదా చిత్ తత్త్వమే కావలెను. ఇట్లుగాక విశ్వము స్వయముగనే ఒక లక్ష్యము వైపునకు సనాతనముగా పురోగమనము చేయుచున్నచో సావయవ జీవద్ద్రవ్యము (orga- nism), విశ్వేతిహాసము సప్రయోజన మగు ప్రగతి యని తలచి విశ్వాతీతమును పరిహరింపవచ్చును. ఇదేదియు గాక, 'విశ్వము ఒక పెద్ద యంత్రము వంటిది. అది అనివార్యముగ, అచేతనముగ, నిరుద్దే శ్యముగ ప్రవర్తిల్లు చున్నది' అని తలచవచ్చును. 'ఈ ప్రక్రియ ఆద్యంతశూన్యము. దీనికొక గమ్యము లేదు, విశ్రామము లేదు. విశ్వమున కర్థములేదు.' ఇదియు నొక విధ మగు వాదమే. ప్రత్యక్షానుమాన ములు ఇందు దేనిని ధ్రువపరచవు.

**జ్ఞాన మీమాంస :** మానవుడు వస్తుస్థితిని చూచుచున్నాడు, గ్రహించుచున్నాడు, తెలిసికొను చున్నాడు. దీని ఫలితముగా జ్ఞానము కలుగుచున్నది. దీనిని ఆధారము చేసికొని అతడు కార్యాచరణకు దిగును. రాబోవు వస్తుస్థితిని, జరిగిన దానిని, చూడని దానిని నిశ్చయించును. కొన్ని సారుల తరువాత వచ్చు స్వీయానుభవములు, పరుల అనుభవములు ఈ నిశ్చయములు సరియైనవి కావని తేల్చును. కొంత జ్ఞానము మన అనుభవముపై గాని, దాని నాధారము చేసికొనిన విచారముచే గాని కాక ఇతరులు - నమ్మదగినవారు - చెప్పిన దానిని బట్టి కలుగును. ఒక్కొక్కసారి జ్ఞానమని తలపబడినది భ్రాంతి యని తేలును. అనగా ఒక ప్రత్యక్షము మరొక ప్రత్యక్షమును బాధించును. ఒక్కొక్కసారి ప్రత్యక్షము అనుమానముచే బాధింపబడును. ఉదాహ

రణమునకు పాము అనుకొనినది తర్వాత త్రాడని రుజువగును. కొండపై మేయుచున్న ఆవులు కొండ క్రిందివానికి చాల చిన్నవిగా కన్పడును. కాని వాటి యా పరిమాణము వాస్తవము కాదుకదా! కొన్ని అనుమానములు ఇదివరకు తెలియని భూతార్థములు తెలియవచ్చుటచే అసిద్ధము లగును. జ్ఞానము ఏది? అజ్ఞాన మేది? వీటిని నిర్ణయించుట ఎట్లు? జ్ఞాన సాధనములు లేదా మార్గములు (ప్రమాణములు) ఎన్ని? వాటి స్వభావమేమి? వీటిలో ఏది పరమము? జ్ఞానము ఎందుండి ఉద్భవించును? జ్ఞాతృ జ్ఞేయముల (విషయి విషయముల) సంబంధ మెట్టిది? ఈ రెండును అసంబద్ధ స్వతంత్ర పదార్థములా? లేదా ఇందొకదానిపై రెండవది ఆధారపడి యున్నదా? ఈ రెండును భిన్నములు, విరుద్ధ లక్షణములు గలవైనచో వాటి మధ్య వ్యాపారము సాగి ఒకదానిపై మరొకటి ప్రభావము నెట్లు చూపుచున్నది? రెంటిలో నొకటియే స్వతంత్ర తత్త్వమైనచో విరుద్ధ ధర్మములు గల రెండు వస్తువులుగా ఎందుకు తోచుచున్నవి? ఈ విషయములను గూర్చిన విచారము జ్ఞానమీమాంస (epistemology). లేదా బౌద్ధిక విషయములను గూర్చిన విచారణ (noetics), లేదా ప్రమాణ మీమాంస అనవచ్చును.

**విషయి నిష్ఠ వాదము - విషయ నిష్ఠ వాదము :** 'ఎరుగబడున దంతయు ఎరుగుదాని సృష్టియే. ఎరుగునదే సద్వస్తువు. జ్ఞేయము జ్ఞాతపై ఆధారపడి యున్నది. దానిచే నిర్మితము.' అను వాదము విషయినిష్ఠ వాదము (subjectivism). దీని ప్రకారము మనో నిరపేక్ష మగు వస్తుస్థితి లేదు. దృశ్యము, జ్ఞేయము అంతయు మనఃకల్పన; మన స్సృష్టి. దీనికి విరుద్ధముగా 'జ్ఞేయము యథార్థము. అది జ్ఞాతృనిరపేక్షము.జ్ఞానము దానిపైననే ఆధారపడి యున్నది.' అని కొందరి మతము. 'మనస్సు వస్తుస్థితిని గ్రహించును. తెలిసికొనును. కాని దానిని సృజింపదు; నిర్మింపదు' అని వీరి అభిప్రాయము. దీనిని విషయనిష్ఠ వాద (objectivism) మన వచ్చును. మొదటి మతము ప్రకారము ప్రపంచము మనఃపరికల్పితము. ఇందు విభేదములు కలవు. వైయక్తిక మనః కల్పితమనుట; మనస్సులోని సార్వలౌకిక (universal), ఆవశ్యక (necessary), నిర్మాణాత్మక (constructive) సూత్రముల ననుసరించి కల్పింప బడిన దగుటచే అది వైయక్తికము గాక వాస్తవమనుట, ప్రపంచము ఒక నిత్య మనస్సు యొక్క విషయమనుట. రెండవ మతము ప్రకారము జ్ఞాతలు వేరు, జ్ఞేయము వేరు. జ్ఞాత లేకున్నను వస్తుస్థితి యథాతథముగ నుండును. అది జ్ఞాతకు పూర్వవర్తి. మనస్సునకు విషయములను, వస్తువులను తెలిసికొనగల సామర్థ్యము కలదు. జ్ఞాన మనగా వస్తువుల నవి యున్న రీతిగా గ్రహించుట, తెలిసికొనుట. మనస్సుకు బాహ్యముగా వస్తుస్థితి కలదు. రెండును స్వతంత్రములు. ఇట్టి వాదమును వాస్తవికతా వాదము, యథార్థతా వాదము (realism) అనవచ్చును. దీనికి విపరీతముగా 'వస్తువులు పరమ సత్యములు కావు, అవి భావములచే ఉపకల్పితములు. భావమే సత్త, పరమార్థము. వస్తుస్థితి భావాత్మకము' అను వాదమును భావవాదము లేదా ప్రత్యయవాదము (idealism) అనవచ్చును.

**అనుభవ వాదము :** అనుభవము ద్వారానే వస్తుస్థితి తెలియును, అనుభవముపై ఆధారపడని బుద్ధి వ్యాపారము వలన జ్ఞానము కలుగదు. జ్ఞానమంతయు అనుభవము తర్వాతనే కలుగును. అనుభవ నిరపేక్ష మగు భావములు వస్తుస్థితిని తెలుపునవా కావా యని ప్రశ్న వచ్చినప్పుడు అనుభవమునకు సరిపోవునవియే యథార్థము లని తేలును ఇట్టి వాదమును అనుభవ వాద (empiricism) మందురు. 'బుద్ధి వ్యాపారము వలననే జ్ఞానము కలుగును. ఏది సుసంగతమగు భావమో, ఏది స్వతస్సిద్ధ సత్యముగ తోచునో అదియే సత్యము; వస్తుస్థితిని గ్రహించునది. ఇంద్రియానుభవము దోష భూయిష్ఠము, నిశ్చయ రహితము. విచార పర్యవసానము నిస్సందిగ్ధము, సత్తాద్యోతకము. కాబట్టి నిజమగు జ్ఞానము బుద్ధిద్వారా వచ్చును' అను వాదము బుద్ధివాదము (rationalism). ఈ రెంటిని కొందరు సమన్వయము చేసి

ఇంద్రియానుభవముచే దత్తాంశములను బుద్ధి వ్యవస్థీకరించి క్రమబద్ధముగా చేసినప్పుడు వచ్చునది జ్ఞానమని అందురు. ఈ వ్యవస్థీకరణము అనుభవముచే నీయబడని సూత్రములచే జరుగు నని వారందురు. అట్టి సూత్రములు బుద్ధికి సహజము అని వారి విశ్వాసము.

'జ్ఞానపు ప్రామాణ్యము స్వతస్సిద్ధము. అబాధితము, సుసంగతము అగునది జ్ఞానము' అనువారు స్వతః ప్రామాణ్యవాదము (దీనిని coherence theory అనవచ్చును) నుపపాదింతురు. జ్ఞాన ప్రామాణ్యము. తదుపరి వచ్చు అనుభవము వలననో, యుక్తుల వలననో నిర్ణయము కావలె ననుట పరతః ప్రామాణ్యవాదము. ఏది వస్తుస్థితికి వర్తించి దానితో సంవదించునో అది జ్ఞానము అని దీని అభిప్రాయము. వస్తుస్థితి ననుకరించుట, అనువర్తించుట (correspond) జ్ఞాన మను దీనిని అనుకరణ వాద మనియు అనవచ్చును. వస్తుస్థిని యథార్థముగా తెలిసికొనుటకు ఒకటే మార్గమున్నది. అది ఏమన మన భావములను, విశ్వాసములను అనుసరించి మనము కార్యాచరణమునకు కడంగగా మన మాశించిన ఫలితములు కలిగినచో మన భావములు, విశ్వాసములు జ్ఞానము అని తేలును కానిచో అవి జ్ఞానము కావని తేలును. భావములపై ఆధారపడిన వ్యవహారము సఫలమైనచో అవి జ్ఞానము. మన మాశించిన ఫలముల నీయలేని వ్యవహారమునకు ఆధార మగునది జ్ఞానము కాదు కదా! దీనిని వ్యావహారిక సత్యతా వాద (pragmatism) మందురు. అర్థక్రియాకారి యగునది మాత్రమే జ్ఞాన మగు నని వీరి తలపు.

**తర్కశాస్త్రము** (Logic) : అనుభవముపై ఆధారపడి చూడబడని భూతార్థముల ఉనికిని, లేదా భూతార్థములను గూర్చి అనుభవముచే గాని పూర్వ విచారముచే గాని తెలిసికొనిన అంశములపై ఆధారపడి ఇతరాంశములను కనిపెట్టగల విచారము అనుమానము. ఇది ద్వివిధము. సామాన్యము నుండి ఒక విశేషమును బయటికిలాగుట నిగమనము. విశేషముల పర్యాలోకనము చేసి వాటినుండి సామాన్యము నొక దానిని పైకి లాగుట వ్యాప్తి గ్రహణము. ఈ రెండు విధములగు విచారములలోను జరుగు ప్రక్రియ ఏ సూత్రములచే నియంత్రితమో అనుసంధానము చేయుట, అసలు ఆలోచనా సూత్రములు ఏవో తెలిసికొనుట, ఉక్తులను వాక్యములను గురించిన విచారణ, వాటిని రుజువుచేయుట యన నేమో అరయుట, వివిధ విజ్ఞానశాఖలందలి, ఇతిహాసమందలి పద్ధతులు, దర్శనమందలి పద్ధతులు ఏవో కనిపెట్టి వాటి వర్గీకరణ వివరణముల చేయుట, అనగా జ్ఞాన పద్ధతులను గురించిన మీమాంస, శబ్దార్థములను అర్థ విభేదములను గురించి యాలోచించుట, వాక్యములను విశ్లేషణ చేసి అవి ఎంతవరకు భూతార్థముల ననువర్తించునో గమనించుట, వానిని గూర్చి విచారించుట, సత్యమును పొందవలె ననిన ఊహలను, వాదములను, తర్కములను ఎట్లు నడిపింపవలెనో నిశ్చయించుట, వాని తెరగులను నిశ్శేషముగ కనుగొనుట, వీటియందు ఎన్ని విధములుగ ఎట్టి దోషములు కలుగుటకు వీలున్నదో నిర్ణయించుట-ఈ కృషి యంతయు తర్కశాస్త్రము.

**మూల్య మీమాంస** (Axiology) : వ్యవహార మంతయు దేని కొరకో ఒక దాని కొరకు ప్రవృత్తము. ఏది మనకు దొరకవలె నని, అబ్బవలె నని కోరెదమో అది అర్థము. పురుషుడు దేనికొరకై పాటుపడునో, ఏవి అతనికి లక్ష్యములో, ఏవి యాతడు పొందగోరునో అవి పురుషార్థములు. వీటిలో కొన్ని భౌతికములు. అనగా ప్రపంచమందు అనుభవ విషయములు; అస్తిత్వము కలవి; ఇదమిత్థములు. ఉదాహరణమునకు-నరుని జీవితము నిలబెట్టునవి, ఇంద్రియ సంతోషము నిచ్చునని అగు ఆహారము, ఆవాసము, భార్యా పుత్రాదులు, ధన పరికర వస్తు వాహనములు. ఇవిగాక మరికొన్ని అభౌతికములు: సౌందర్యము, సత్యము, శివము (మంచిదైనది - the good) మొదలైనవి. వీటిని గూర్చిన భావములు ఎటుల, ఎందుకు కలిగినవి ? వీటిలో నేవి సత్యములు ? ఏవి కావు ? ఇవి వాస్తవములా, లేక పురుష బుద్ధ్యపేక్షములగు భావములు మాత్రమేనా ? వాస్తవ

ములు కానిచో, మన కెట్లు ప్రకృతములు (relevant)? అట్టిచో, వీటిని గూర్చి వివిధ విరుద్ధభావము లుండుటకు వీలున్నది-వాటిలో నేది సరియైనది? తరువాత నివి వస్తువులా? వస్తుధర్మములా? శాశ్వతములా? మన పరిశ్రమచే సృజింపబడవలసినవా? వీటిని మూల్యములు (విలువలు), లేదా పురుషార్థములు అనవచ్చును. ఏలన-వీటితో సంబద్ధము లగుటచేతనే, వీటికొరకే వస్తువులు, లేదా వ్యాపారములు మన కిష్టములు, ప్రియములు, కాంక్షితములు అగుచున్నవి. ఇవి ఆత్మ తుష్టి నీయగలవు. వీటి ద్వారా పొందదగినది లేదు. వీటి అనుభవమే పరమము. అది మరొక ప్రయోజనార్థము జరుగదు. ఇవి కృతకృత్యత నిచ్చును. ఇవి ఘట, పటముల వలె ఇంద్రియ గ్రాహ్యములు. ధనము, భార్య ఇత్యాదుల వలె నిర్దిష్టములు కావు. ఇవి లక్ష్యములు (ideals). ఇవి వస్తువులందు, వ్యక్తులందు, ఆచరణయందు ఎప్పుడు ఏ విధముగా ఏ కారణములచే అభివ్యక్తి నందును? లేదా వస్తుత్వ సిద్ధి (realisation) నందును? మంచిని గూర్చి, అందమును గూర్చి, నిజమును గూర్చి, ఇట్టి మీమాంస సాధ్యము. దీనిని మూల్య మీసాంస, లక్ష్య విచారము అనవచ్చును.

**నీతిశాస్త్రము** (Ethics) : మంచి, శ్రేయస్సు, ఇష్టమైనది, హితమైనది అనగా నేమి? ఇవన్నియు సమానార్థకములా? కావా? కానిచో, ఏవి ఆ అర్థములు? మంచిపనులు చేయుటచే వచ్చునది ధర్మ (virtue) మనబడును; పుణ్య మనియు అనవచ్చును. దాని స్వభావమును నిర్ణయించుట, అది ఎట్లు తెలియ నగునో, ఎట్లు దానిని సాధింపగలమో, ఎందుకు దానిని సాధింపవలెనో విచారించునది నీతిశాస్త్రము, లేదా ధర్మమీమాంస. దీనివలన కర్తవ్యాకర్తవ్యముల భేదము, స్వరూపము, నిర్ణయించు విధానము మొదలగునవి స్పష్ట మగును. 'ధర్మమును గూర్చి ప్రమాణ జన్య జ్ఞానము సాధ్య' మని కొందరు; 'లౌకిక ప్రమాణములు లేవు. ఈశ్వరుని ఆజ్ఞలో, ఋషుల ఉపదేశమో, లేక నిత్యజ్ఞానమో మాత్రమే దాని నీయగలదు' అని కొందరు; 'సౌఖ్యము నిచ్చునదే ధర్మము, అయితే ఇతరుల సౌఖ్యమునకు అడ్డము పోకుండుటలో మనకును చివరికి విశేష సౌఖ్యముండును' అని మరి కొందరు. ఇట్లు అనేక విప్రతిపత్తులు నీతిశాస్త్రమున కలవు. దీని కనురూపముగానే కర్తవ్యము నెట్లు నిర్ణయింప వలె నను విషయములో కూడ ఐకమత్యము లేదు.

**సౌందర్య మీమాంస :** ఇట్లే సౌందర్యమును గురించిన మీమాంస (aesthetics) కూడ సాధ్యము. సౌందర్య నిర్ణయము, సౌందర్యమునకు కళకు గల భేద సామ్యములు, సౌందర్యమునకు సుఖ దుఃఖాది ఉద్రేకములకు గల సంబంధము, 'సౌందర్యము స్వతంత్ర తత్త్వమా? కేవల భావమా?' యను చర్చ, సౌందర్యము వలన కలుగు మనోవికారము (దీనిని రస మనవచ్చును) ను గూర్చిన విచారణ, కళాత్మక వస్తువులు (చిత్ర శిల్ప కవిత్వాదులు) ఏ పరిస్థితులలో సృజింపబడును? వాటి సృష్టికి పూర్వ భావి యగు ప్రకృతి, భావనా శక్తి, స్మృతి, ప్రతిభాదుల విమర్శ ఇది యంతయు సౌందర్య మీమాంసయం దంతర్భాణము.

ఇట్లు అనూచానముగా దర్శనశాఖ లనబడు వానిని గూర్చి కొంచెముగా చెప్పితిమి. మతము, విజ్ఞానము, గణితము, ఇతిహాసము, సంఘము, రాష్ట్రము-వీటన్నిటిని గూర్చి కూడా దార్శనికముగా చింతన చేయవచ్చును, కొందరు ప్రసిద్ధ దార్శనికులు అటుల చేసిరి. అట్టి చింతనలును అప్పుడు దర్శన శాఖలుగ నగును. కొందరు వీటిలో కొన్నిటిని గురించి విచారించుటయే దార్శనిక చింతనము, తక్కినది కాదందురు. 'అతిభౌతిక శాస్త్రము, సత్తా శాస్త్రము అంతయు నిరర్థకము, ధర్మమును గురించి, సౌందర్యమును గురించి విశ్వాసములు, అభిప్రాయములు తప్ప జ్ఞానము అసంభవము, వాటిని గూర్చి శాస్త్రములు లేవు' అను దార్శనికులు కలరు. అట్టి వారికి తర్క శాస్త్రమే దర్శనము, లేదా విజ్ఞానమును గురించి చేయు విచారమే దర్శనము. మరి కొందరు అతిభౌతిక శాస్త్రమును, సత్తా శాస్త్రమును సమాద

శీలించియు, 'వాటి యందు లభ్యమగునది జ్ఞానము కాదు. శ్రద్ధయో, ప్రజ్ఞావీక్షణల ఫలమో' అని అను చున్నారు. తమ తమ భిన్న భిన్న రుచుల ప్రకారము, తమ పరిస్థితుల సంస్కృతుల శిక్షణల ప్రభావము ననుసరించి, తమ శక్తి విచార పద్ధతుల ననుసరించి వీరిటుల ఎన్నో రకములుగ దర్శన స్వభావమును, లక్ష్యమును, పద్ధతిని వివరించిరి. కొందరు 'మానవునికి దర్శనావశ్యకత తీరినది. ఇక దాని అవసరము లేదు. విజ్ఞానమే పర్యాప్తము' అను వారును కలరు. దర్శన మేదియో నిర్ణయించి, ఇతిహాసమును సమీక్షించి, హేతువులతోను, ఉదాహరణములతోను, దర్శన నైరర్థక్యమును నిరూపింప బూనుటయు నొక విధమగు దర్శనమే! కొందరు ప్రసిద్ధ దార్శనికులు ఈ నిర్వాహమును చేసిరి.

# భారతీయ దర్శనము - వైదిక దర్శనము

ఉపలబ్ధ ప్రపంచ మత గ్రంథములలో అతి ప్రాచీనమైనవి వేదములు. హిందూ మతమునకు, భారతీయ దర్శనములకు అవి ప్రభవ స్థానములు. అతీంద్రియార్థ విజ్ఞానోత్పత్తి కవి ప్రమాణము లని, ఇష్టప్రాప్తికి అనిష్ట పరిహారమునకు మార్గమును అవి తెల్పు నని హిందువుల నమ్మిక. బ్రహ్మమును, ధర్మమును గురించిన జ్ఞానము వేదముల ద్వారా మాత్రమే కలుగునని దీని యర్థము. ఇందులో ధర్మము వస్తువు కాదు కాబట్టి, ఇంద్రియ గోచరము. చిహ్నములు కలది కాదు కాబట్టి వేదమే దానికి ప్రమాణ మని హిందూ దార్శనికులు అందరు నొప్పు కొందురు. బ్రహ్మము ఇంద్రియగోచరము కాకపోయి నను, సత్పదార్థము కాబట్టి, జగత్తు దాని కార్యము కాబట్టి అనుమాన యోగ్య మని కొంద రందురు.

**వేద విభాగము :** వేదములు మంత్ర బ్రాహ్మణాత్మకములు. దేవతల స్తోత్రములు, అర్థవంతములు అగు వాక్యములు మంత్రములు. వీటి సముదాయములగు సంహితలు నాలుగు - ఋక్, సామ, యజుః, అథర్వములు. యజ్ఞాద్యనుష్ఠానములను వివరించునవి బ్రాహ్మణములు. వృద్ధి చెందునది, చెందించునది బ్రహ్మము. యజ్ఞమునకు బ్రహ్మశబ్దము వాడు చుండిరి. దానిని వివరించునవి బ్రాహ్మణములు. వాన ప్రస్థుల కుచితము లగు విషయములను తెల్పునవి, యజ్ఞాది కర్మలను గుహ్యములుగ ఆధ్యాత్మిక విధముగా అర్థము చేసుకొనునవి, అరణ్యములందు పఠనీయములు అగు వేదభాగములు ఆరణ్యకములు. ఈ మూడును కర్మకాండ. వేదముల అంతిమ భాగములు ఉపనిషత్తులు; అవి జ్ఞానకాండ. వాటిలో ఎక్కువగా బ్రహ్మ-ఆత్మల, అనగా జగత్కారణమును గురించి, మానవుని స్వభావము అతని గతి - వీటిని గూర్చి విచారము కలదు.

పృథివి, అంతరిక్ష, ద్యు లోకములలో నుందు రని విశ్వసింపబడు దేవతల స్తుతులు వేదమందు కలవు. అగ్ని, ఇంద్ర, సూర్య, విష్ణు ఆది దేవతలు అందు ప్రధానులు. విశ్వతశ్చక్షువు, ధృతవ్రతుడు, సుక్రతువు, సమ్రాట్టు, శుభాశుభకర్మల ద్రష్ట, ఫల ప్రదాతయగు వరుణుడు వేదమం దొక ప్రధాన దేవత. భోగభాగ్యముల నిచ్చుటకు, శత్రువులపై విజయము పొందుటకు, దీర్ఘజీవితమునకు, మేధ ఆరోగ్యాదులను పొందుటకు దేవతల ఆరాధన, స్తుతి చేయబడుచుండెడివి. 'ప్రాకృతిక శక్తులకు, ప్రక్రియలకు వ్యక్తిత్వారోపణము చేసి గాని, వాటి కధిష్ఠానముగ, ఘటకులుగ అతిమానవ వ్యక్తులున్నా రని తలచి గాని, వేదకాలము వారు దేవతలయందు విశ్వాసమును వృద్ధిచేసికొనిరి' అని అధునాతనులు కొందరు అనెదరు. నానాదేవతలు ఉన్నా రని తలచుట ప్రారంభక దశ. ఏ దేవతను

స్తుతిచేయునప్పుడు ఆ దేవతే సర్వోచ్చ మని, సర్వ గుణాకార మని తన్మయులై భావించుట తర్వాతి దశ. నానా దేవతలను, వారి స్వభావములను, కర్మలను బట్టి వర్గీకరించుట (ఉదా. ఆదిత్యులు విశ్వే దేవతలు) మరొకదశ. దేవతలందరికి ఒకే అధిపతి ఉండవలె నని, అతడే విశ్వమును చేసినవాడు (విశ్వకర్మ), ప్రజాపతి, విశ్వ రక్షకుడు అని తలచుట తరువాతి దశ. 'ఉన్న దసలు ఒకే ఈశ్వరుడు, అతడే సత్తు. అతనినే ఇంద్ర, యమ, మాతరిశ్వాది నామములతో విప్రులు పిలుతురు' అనునది చరమ దశ. ఒకడే యగు పరమ పురుషుడే విశ్వముగ మారె నని తలచుట. అతడు కులాలుడు కుండను చేసినట్లు విశ్వమును చేసెనను విశ్వాసము తరువాత వచ్చు భావన. అట్లే కేవలము వాంఛాపూర్తి, శత్రునాశము చేయు వారినిగా గాక, జగత్తును నియమవంతముగను, విశ్వమందు కార్య కారణ విధానము, సువ్యవస్థ వర్తిల్లునట్లుగను, సుకర్మ దుష్కర్మలకు సుఖ దుఃఖ ఫలములను ఇచ్చు వ్యవస్థ ఉండునట్లుగను (ఇదంతయు ఋత మన బడును), ప్రాయశ్చిత్తముగ హృదయపరివర్తన చెందిన వారిని పాపరహితులుగా చేయునట్టియు, జగత్ప్రభువుగా నొకానొక దేవతను (ఉదా. వరుణుడు) భావించుటలో నైతిక సర్వేశ్వర వాదము (ethical monotheism) వికసించుట వేదములో కన్పడును. ఈ పై దృష్టితో వేదమును చూచుట కొందరు అధునికుల కిష్టము. "వైదిక ఋషులు క్రమ క్రమముగా బహుదేవతారాధన నుండి ఏకేశ్వరవాదమునకు, ఈశ్వరుడే సర్వము, జగత్తు అతని పరిణామము, అయ్యు అతడు దాని నతిక్రమించియే యున్నా'డను వాదమునకు, విశ్వమూలమగు సత్పదార్థము ఒకటే అను చివరి సిద్ధాంతమునకు వచ్చి"రని, 'దీనికి వేదములందు నిదర్శనములు కల'వని వారు అనెదరు.

**ఏకదేవతారాధన** : దీనికి వ్యతిరేకముగా వేద సూక్తము లన్నియు ఆద్యంతముగా మహాభాగ్యము (ఐశ్వర్యము)గల ఒకే దేవతాత్మను బహు విధములుగ స్తుతిచేసిన వని, దేవతలందరు దాని ప్రత్యంగములని, వేదములు స్వతంత్రు లగు నానా దేవతలు గలరను వాదము నసలు ప్రతిపాదింపలే దని ప్రాచీన కాలమునుండి కొందరు వేద వ్యాఖ్యాతలు (ఉదా. యాస్కుడు) తలచిరి. నానావిధ యజ్ఞ ఉపాసనల ద్వారా మీమాంసింపబడినది ఈ ఒకటే యని ఐతరేయ ఆరణ్యకాదులు చెప్పినవి ("ఏతం హ్యేవ బహ్వృచా మీమాంసంతః"). అందరు దేవతలలో నున్న గొప్పదగు 'అసురత్వము' (అసువు - ప్రాణశక్తి) ఒకటే యని, అదే జగదంతః పాతి యగు శక్తి యని ఋగ్వేదమందే కలదు ("మహద్దేవానా మసురత్వ మేకమ్"). 'ఒకే సర్వేశ్వరుని వివిధ శక్తుల, గుణముల, రూపముల ప్రతీకములు నానా దేవతలు. వారు ప్రకృతి శక్తులపై వ్యక్తిత్వారోపణచే గాని, స్వతంత్రులగు అతి మానవ వ్యక్తులుగా తలచుటచే గాని ఏర్పడ లేదు' అని ఈ వాద సారాంశము. అభౌతిక, మానసిక ప్రక్రియలను సాంకేతిక భాషలో చెప్పుట వలన అమృతత్వము నిచ్చు గుహ్యము లగు ఉపదేశములు అనధికారుల కగ్రాహ్య మగుటకు సూర్య సోమాది దేవతలు పలువురున్నట్లు తోచునట్లుగా వేద సూక్తములు కన్పడినను వాటి తాత్పర్య మది కాదని కొందరనుచున్నారు. "అసలు ఈశ్వరుడు లేడు. అతని ప్రస్తావనయు వేదమందు లేదు; ధర్మాధర్మముల స్వరూపమును స్వతః ప్రమాణముగ తెల్పు నిత్య అపౌరుషేయవాక్కు వేదము. ఒకవేళ దేవత లున్నచో వారొక విధమగు జీవులు. పశు పక్షి మానవుల వలె వారును విశ్వాంతర్గతులు. వారి ఆగ్రహానుగ్రహములు ఆయా ఫలముల నిచ్చును. కర్మమే లోకమును ఏలుచున్నది. విశ్వము సువ్యవస్థితము, నైతిక నియమ బద్ధము. అలౌకిక కామ్యకర్మ లగు యజ్ఞాదులు 'అపూర్వము' ద్వారా ఈప్సితములను తీర్పగలవు. కాని వానిని చేయుట అనివార్యము కాదు. సత్య అహింసాదులే సార్వభౌమ ధర్మము అని వేదబోధ" అని కొందరు ప్రాచీన కాలమునుండి చెప్పుచున్నారు. వీరే మీమాంసకులు.

వేదమునందలి హిరణ్యగర్భ, ప్రజాపతి, అదితి, పురుష, స్కంభ సూక్తములందు విశ్వమునకధిపతి, ప్రభవము, ఆధారము అగునది ఒకటే

యనియు, నానా యజ్ఞముల ద్వారా ఉపాసింపబడు నది అదియే యనియు ప్రతిపాదింపబడినది. త్రికాలస్థ మగు ఉన్న దంతయు ఆ పురుషుడే నని, లేదా అదితి (హద్దులు లేనిది) యని, సుంభ (ఆధార) మని, అందే విశ్వ మున్న దని అదే సర్వమునకు అధీశ్వరు డని చెప్పబడినది (పురుష ఏవేదం సర్వం). (అదితి ర్జాత మదితి ర్జనిత్వమ్). దానిని తెలిసికొనువానికి మృత్యు భయము లేదు. (తమేవ విద్వాన్ న బిభాయ మృత్యోః). 'వసుజాత మంతయు నాశ మొందిన పిదప ఏది ఎప్పటికి మిగిలిపోయియుండునో (శేష పదార్థము; అది శేషికి భిన్నము) అది ఉచ్ఛిష్టము. నామ రూపములు - లోకము యావత్తు - దానిపై ఆహితము. దానిలో నున్నవి. దానినుండి వచ్చినవి' అని యొక సూక్త మనినది. (ఉచ్ఛిష్టే నామ రూపం చోచ్ఛిష్టే లోక ఆహితః).

దేహాత్మ భేదము, పరలోకమందు విశ్వాసము వేదములందు కొన్నిచోట్ల గానవచ్చును. ఇహమున పునర్జన్మ సిద్ధాంతము ప్రతిపాదింపబడినట్లు తోచదు. కాని బ్రాహ్మణములలో పునర్జన్మ సిద్ధాంతమునకు ప్రాతిపదికములుగ నుండు వచనములు దొరలినవి.

ఋగ్వేద నారదీయ సూక్తమున 'విశ్వము యొక్క మూల మేది? సృష్టి ఎట్లు జరిగెను?' ఇత్యాది ప్రశ్నలకు సమాధాన మీయ ప్రయత్నింపబడినది. అప్పుడు సత్తు లేదు; అసత్తు లేదు. అంతరిక్షము, దానికి పరమగు వ్యోమము లేవు. ఎవరు అంతను ఆవరించెను? ఎక్కడ? ఎవనిచే రక్షింపబడియుండెను? అప్పు డక్కడ గహర మగు గంభీర మగు నీరుండెనా? అప్పుడు మృత్యువు లేదు. అమృతమును లేదు. అహోరాత్రుల భేదము లేదు. అప్పుడు ఆ ఒక్కటే (త దేకం) వాయు రహిత మయ్యు స్వశక్తిచే శ్వసించుచుండెను. దానికి వేరైనది, లేదా పర మగు నది మరొకటి ఏదియు లేదు (తస్మాద్ధాన్యన్న పరః కించ నాస). ఋషులు తమ హృదయములందు వెద కుచు అసత్తునందు సత్తుయొక్క యోజక సంబంధ మును కనుగొనిరి. ఏ మూలమునుండి విశ్వోత్పత్తి అయినదో, అది కృతమా అకృతమా యనునది సర్వోచ్చద్యులోకమునుండి శాసనము చేయు ఆ సమ దర్శి యగు ప్రభువే ఎరుగును; లేదా ఎరుగడు.

ఇట్లు ఏక మగు సత్తే విశ్వకారణ మని, అదే నానావిధముల ఊహింపబడి పిలువబడు నని, జగన్నియమనము చేయుచు, ప్రకృతియందు, మానవుని యందు అంతర్వర్తి యగుచు అది యున్నదని వేదములలోని కొన్ని సూక్తము లనుచున్నవి.

"భౌతిక వాదమును, దేహాత్మ భావమును సమర్థించునట్టి, దేవతల అస్తిత్వమును శంకించునట్టి 'పరమార్థము ఎవరికిని తెలియ'దను సందేహవాద (scepticism) ఛ్ఛాయలను కనపరచునట్టి వేద వాక్యములున్నవి కాని వాటి తాత్పర్య మదికాదు. అవియు అధ్యాత్మికములే" అను వారును కలరు.

## ఔపనిషద దర్శనము

ఉపనిషత్తులు వేద అంతిమ భాగములు. అందుచే అవి వేదాంతము. ఒక దృష్టిచే నవి వేద సారము. దాదాపు అన్ని భారతీయ దర్శన ప్రస్థాన ములకు అవి మూల స్రోతములు. గురువు దగ్గర కూర్చుండబెట్టుకుని అధికారియగు శిష్యుని కుపదేశించు రహస్యము ఉపనిషత్తనబడును. ఇది యొక అర్థము. 'సద్' ధాతువునకు గల విశరణ, గతి, అవసాదన అను అర్థములు తీసికొనినచో అవిద్యను నాశనము చేయునది, బ్రహ్మమును పొందించునది, దుఃఖమును శిథిలము చేయునది ఉపనిషత్తు. బ్రహ్మ విద్యయే ఉపనిషత్తు. ఆ విద్యనిచ్చు గ్రంథములును గౌణార్థ మున ఉపనిషత్తులు.

**ఔపనిషద సమస్యలు:** జగత్తు ఎట్లు, ఎందుకు, దేనినుండి సృజింపబడినది? సుఖ దుఃఖము లేల కలుగు చున్నవి? శాశ్వతానందము నిచ్చున దేది? మరణా నంతరము మానవునిలో మిగులున దేమి? ఏమియు లేదా? జగ దధిష్ఠాన మగు తత్త్వమునకు, మానవుని నిజతత్త్వమునకు గల సంబంధ మేమి? మానవుడు అమర్త్యుడు కాగలడా? అయినచో అమృతత్వ మెటుల బడయనగును? ఈ దిన ముండి రేపు పోవు భోగాదుల వలన ప్రయోజనమేమి? ఇవి ఉపనిషత్తులలో ఆలో

చింపబడిన సమస్యలు. మానవునికి శాంతి, ఆనందము, స్వాతంత్ర్యము (స్వారాజ్యము), ఉపలబ్ధి ఎట్లగును అనునదే ఉపనిషదన్వేషణ. మహాప్రతిభావంతులు, కవిహృదయులు అగు ఋషుల అంతర్దృష్టులు ఉపనిషత్తులలో గలవు. ఉపనిషత్తులు వివిధ కాలములందు భిన్న భిన్న వ్యక్తులచే సంపాదితములు. ఉపనిషత్తులలో విరోధములు కన్పట్టును. 'ఇవి ఆభాసమాత్రములు. సమన్వయముచే ఇవి నిరస్తములై ఏకవాక్యత కుదురును' అని బాదరాయణాదులు నిరూపింప యత్నించిరి. బుద్ధి నుత్తేజించుటలోను, విశ్వరహస్యముల ఉద్ఘాటనకు పరిష్కారమార్గములను సూచించుటలోను, దార్శనిక వ్యవస్థలకు బీజప్రాయముగ నుండదగు మౌలిక భావములు కలిగియుండుటలోను, 'ప్రాణారామము'1 ను, 'మన ఆనందము'2 ను, శాంతి సమృద్ధిని ప్రసాదించుటలోను ఈ గ్రంథములు నిరుపమానములు.

అయితే ఉపనిషత్తులు స్పష్టముగ, తాత్పర్యభూతముగ బోధించున దేమి? ఈ ప్రశ్నకు సర్వసమ్మతమగు సమాధానము లేదు. అదే వాటి గొప్పదనము. అఖండ మేధావంతులకు వాటిలోని ఆ యా సిద్ధాంతములు తృప్తి నీయగా, వానిని దృష్టిలో పెట్టుకొని తక్కిన వాక్యము లన్నిటిని అర్థము చేసుకొనుటకు ప్రయత్నములు జరిగినవి. ఉపనిషత్తులలో గూఢార్థములు పెక్కులు. వాటిలో గల ఊహాపోహలు స్ఫురణములు, విచారములు లెక్కలేనన్ని, వాటిలో గల తార్కికమగు వ్యవస్థ యొకటి అరిస్టాటిల్, హెగెల్ ఇత్యాదుల రచనలలో వలె కానరాదు. కాని వాటిలోని దార్శనిక భావములు అనేక సుసంగత దర్శన వ్యవస్థలుగా రూపొంద యోగ్యములు. కాబట్టి యావ దుపనిషత్సాహిత్యమును ఒకటిగా తీసికొని వ్యవస్థాత్మకముగా బ్రహ్మము, ఆత్మ ఇత్యాది విషయములను గూర్చి వ్యాసములు వ్రాయక, ప్రాచీన ఉపనిషత్తులను తీసికొని ప్రత్యేకముగా ప్రతిదానిలోని కొన్ని మూల భావములు క్రోడీకరింతుము. ఇట్లు చేయుటచే ఉపనిషత్తుల స్వచ్ఛందత, అవి ఎట్లు పరస్పరము విరుద్ధములుగ కానవచ్చు ప్రగాఢ భావముల కాకరమైనది, ఎట్లు అవి విభిన్న మతములకు, సంప్రదాయములకు అవకాశ మిచ్చినది తెలియనగును. చాలమట్టుకు వాటి భాషలోనే సిద్ధాంతములు సంగ్రహించినాము. దీని వలన ఉపనిషత్తులెట్లు వివిధ ప్రకారములుగ అర్థము చేసికొనుటకు తావిచ్చునో కూడ తెలియును. ఇదమిత్థమని వాటికి చేయబడిన భాష్య వ్యాఖ్యానాదు లన్నియు వాటి కర్తల స్వోపజ్ఞలపై ఆధారపడినవే కాని, వాటి కేటికిని సర్వసమ్మతమగు నిశ్చితత లేదు.

**ప్రాచీన ఉపనిషత్తులు :** ఉపనిషత్తులు నిర్ణయసాగర ముద్రాశాలచే 112 ప్రకటింపబడి ఉన్నప్పటికిని, అడయారునుండి దివ్యజ్ఞాన సమాజము మరి దాదాపు 70 ఉపనిషత్తులు ప్రకటించినను వీటిలో క్రింది 13 మాత్రమే ప్రాచీన ఉపనిషత్తులు : ఈశ, ఛాందోగ్య, బృహదారణ్యకములు (క్రీ. పూ. 700); ఐతరేయ, తైత్తిరీయములు (క్రీ. పూ. 600-500); ప్రశ్న, కేన, కఠ, ముండక, మాండూక్యములు (క్రీ. పూ. 500-400); కౌషీతకి, మైత్రి, శ్వేతాశ్వతరములు (క్రీ. పూ. 200-100). కొందరు క్రీ పూ. 1,000-200 ఉపనిషత్కాల మందురు. ఈ విషయమై ఐకమత్యము లేదు.

**1. ఈశోపనిషత్తు :** ఈశ్వరుని సర్వవ్యాపకత్వము, కర్మయొక్క అనివార్యత, అవిద్య (అనగా వ్యవహార జ్ఞానము), విద్య (అనగా పరమార్థ జ్ఞానము)ల సమాన ప్రాధాన్యములను గురించి ఇది ప్రస్తావించినది. ఇందు జ్ఞాన కర్మ సముచ్చయ మార్గము సూచితము. 'జగత్తులో నున్న దంతయు ఈశ్వరునిచే వ్యాప్తము. కాబట్టి త్యాగముతోడ ననుభవింపవలెను. ఇతరుల ధనము నాశింపకుము' అనునది ఈ ఉపనిషత్సారాంశము. 'కర్మలు చేయుచునే నూరేండ్లు బ్రతుకగోరవలెను; నరునికి కర్మ అంటదు' అనునది మరొక ప్రధాన భావము.

**2. ఛాందోగ్యోపనిషత్తు :** దీనిలో ఉద్దాలక ఆరుణి ప్రధాన చింతకుడు. కాని శుద్ధ కార్మికులను,

1. ప్రాణమునకు హాయి. 2. మనస్సున కానందము.

ఉదర పోషణార్థము సామగానము, యజ్ఞము చేయువారిని తూలనాడును. అట్టివారిని అన్నము కొరకు మొరుగుచు ఒకదాని వెంట నొకటి తిరుగు కుక్కలతో పోల్చినది. రైక్వ, సత్యకామ, జాబాలుల ప్రసంగములు, జాబాల శిష్యుడగు ఉపకోసలుని కథ ఇందే కలవు. జైవలి, అశ్వపతి కైకేయుల బోధలు ఇందే కలవు. ఇందలి ఆరవ అధ్యాయమున ఆరుణి ఋషి ఉపదేశమును, ఏడవ అధ్యాయమున సనత్కుమారుడు నారదునికి చేసిన బోధయు, ఎనిమిదవ అధ్యాయమున ఇంద్ర ప్రజాపతి సంవాదమును, ఆత్మ సాక్షాత్కారమును గూర్చిన యుక్తియు కలవు.

ఈ ఉపనిషత్తు కర్మ కాండను జ్ఞాన కాండతో బలపరుప జూచును. 'విద్యాఽవిద్యలు భిన్నములు. కాని కర్మను విద్య, శ్రద్ధ, ఉపనిషత్తులతోపాటు చేసినప్పుడు అది దృఢమగును.' (ఛాం. 1-1-10).

ఈ ఉపనిషత్తులోని కొన్ని సిద్ధాంతములను క్రింద పొందుపరచుచున్నాము :

బ్రహ్మమును ప్రతీకముల ద్వారా ఉపాసన చేయు విధానములు ఎక్కువగా ఛాందోగ్యమందున్నవి. దహరాది విద్య లిట్టివి.

ఈ జగత్తంతయు మొదట ఒక అద్వితీయ సత్తు. కొందరు మొదట అద్వితీయ అసత్తున్న దని అందురుగాని, అసత్తునుండి సత్తెటులవచ్చును? ఆ సత్తు "నేను బహు (చాల)గా అయ్యెదను గాక" అని ఈక్షణము (కోరుట) చేయుటవలన నానా వస్తువులు సృజింపబడినవి. ఇది ఛాందోగ్యమందలి సృష్టిని గూర్చిన యొక వాదము.

పెరుగును చిలుకుటవలన సర్పిస్సుపైకి వెడలునట్లు తిన్న అన్నమందలి సూక్ష్మాంశము మనస్సగును. నిద్రయందు మనస్సు ప్రాణముల నాశ్రయించును. ప్రాణమునకు, మనస్సునకు బంధము. స్వప్నమందో? అది ఇటు అటు తిరుగును. మనస్సు త్రాటిచే గట్టిన పక్షి వంటిది. ఇటునటు నడయాడును. చివరకు ఎటు పోలేక ప్రాణమునే (పక్షి త్రాటినివలె) అంటిపెట్టుకొని ఉండును. నిద్రలో పురుషుడు సత్తుతో సమాగమము చెందును. తనను తాను పొందును (స్వం - అపీతి - స్వపితి). ప్రతిరోజును ప్రజ (ప్రాణు) లందరును ఇట్లు బ్రహ్మమున గలసియు, అనృతముచే కప్పబడియుండుటచే దానిని పొందుట లేదు. సువర్ణనిధిదల క్షేత్రముపై దాని నెరుగక తిరుగాడు వారు దానిని పొందలేరు కదా! తేనెటీగలు చేసిన తేనె నానా వృక్షముల రసములనుండి సంచయింపబడినను, అందు ఆ రసములు తమ భేదములను గ్రహింపలేవు. ఇట్లే ప్రజలందరును సత్తునుపొందియు పొందినట్లు ఎరుగరు.

ఆత్మనెరిగి ప్రయాణము చేయువారు (చచ్చువారు) సర్వలోకములందును స్వేచ్ఛగ విచరింతురు. ఇతరులు అట్లు చేయలేరు. ఏ యే "అంతము"ను (విషయమును) ముక్తుడు కోరునో అది సంకల్ప మాత్రముచే అతనికి ఉపస్థితమగును. దానిని పొంది అతడు మహాన్ (గొప్పవాడు) అగును.

జ్ఞానికి కమల పత్రమునకు నీరు అంటనట్లు పాపకర్మ మంటదు. జ్ఞానము ముక్తికి ఆవశ్యకము. జ్ఞానమున కాచార్యుడు కావలెను. గాంధార దేశము నుండి కళ్ళు కట్టబడి చాలమంది ఉన్న స్థానమందు వదలబడినవాడు నలు దిక్కులకు వినపడునట్లు గోలగ అరచిన విని, ఎవరైన అతని కండ్ల కట్టు విప్పి, గాంధార మేదిక్కున నున్నదో చూపినచో, వాడు తెలివి కలవాడు, బుద్ధిమంతుడు అయినచో ఊరూరున అడుగుచు తిరిగి గాంధారము చేరుకొనగలడు. అట్లే ఆచార్యుడు గలవాడు బ్రహ్మము నెరుగును. విమోక్షము కలుగు నంతవరకే అతని కాలస్యము. వెంటనే బ్రహ్మమును పొందును.

ఇక్కడ రమణీయ (మంచి) ఆచరణ గలవారు రమణీయ యోనులందు-బ్రాహ్మణ క్షత్రియ వైశ్యయోనులందు-పుట్టెదరు. చెడు ఆచరణ కలవారు శునక, సూకర, చండాలాది యోనులందు పుట్టెదరు. మంచి కర్మలు చేయువారు (ఇష్టాపూర్తదానములు చేయువారు)* వాటి ఫలములను పొందుటకు పితరుల

---

*ఇష్టాపూర్తము లనగా యజ్ఞము, పరోపకారము లగు కర్మలును.

మార్గము (పితృయానము)న పరలోకములకు పోదురు. తిరిగి ఆ త్రోవనే వచ్చి ధాన్య ఓషధ్యాదులుగా పుట్టెదరు. ఏయే అన్నము తినిన, వీర్యమును సేవించిన అది తిరిగి అట్లే అగును. ముక్త పురుషులు దేవతల మార్గము (దేవయానము) న పోయి బ్రహ్మమును పొందెదరు. ఇదే బ్రహ్మపథము. ఈ మార్గమున పోయినవారు తిరిగిరారు. పునర్జన్మ సిద్ధాంతము ఇట్లు ఛాందోగ్యమందు ప్రథమముగ ప్రతిపాదిత మన వచ్చును.

పశు పక్షుల వలె కర్మాధికారము లేనివారికిని, అధికారులయ్యు ఎప్పుడును అశుభకర్మలు చేయు వారికిని ఈ రెండు యానములు గాక, వారికెప్పుడు చచ్చుచు పుట్టుచుండు నిర్విరామ గతి పట్టును.

"ఇది యంతయు బ్రహ్మమే" (సర్వం ఖల్విదము బ్రహ్మ), "అది నీవే" (తత్త్వమసి) యను బోధలు ఛాందోగ్యమందలివే మూడవ అధ్యాయమున (14 వ ఖండము) 'ఈ జగత్తంతయు నిశ్చయముగ బ్రహ్మమే. అనగా జగత్తు బ్రహ్మము నుండియే ఉత్పన్నమై, అందే లీనమగుసదై, అందే చేష్టావంతము' అని బోధింపబడినది. ఇది "తజ్జలాన్" అనగా తజ్జము-తల్లము-తదనము[1]అను వాక్యముచే వివరింపబడినది. శాంతుడై ఇట్లు ఉపాసింపవలెను. ఏలన-పురుషుడు క్రతుమయుడు (నిశ్చయము, అధ్యవసాయము కలవాడు). ఈ లోకమున పురుషు డెట్టి క్రతువు (నిశ్చయము) కలిగియుండిన, అట్లే ఇక్కడనుండి చనిపోయిన పిమ్మట అగును. సర్వమైనట్టి, సర్వమును అన్నివైపుల నుండి వ్యాప్తముచేసి ఉన్నట్టి, వాగాది ఇంద్రియరహితమైనట్టి, అనాదర మగునట్టి (సంభ్రమములేని, ఆప్తకామమైనట్టి) బ్రహ్మమును, అంతర్ హృదయమందు వ్రీహి యవ సర్షప శ్యామాక[2]ముల కంటె సూక్ష్మ మగునట్టి ఆత్మయు ఒకటే. బ్రహ్మ మిట్లు వ్రీహ్యాదులకంటె అణీయము, పృథివ్యంతరిక్షముల కంటె పెద్దది. అంతర్హృదయమందలి ఆత్మే సర్వము, నిరింద్రియము, ఆప్తకామము అగు బ్రహ్మము. ఇటనుండి చనిపోయినప్పుడు ఇదియే అగుదు నని నిశ్చయము కలవాడు దానినే పొందును.

'ఆత్మయే అన్నివైపుల నున్నది. ఆత్మయే ఇది యంతయు (ఆత్మైవేదం సర్వం)' అని చూచువాడు, మననము చేయువాడు, ఎరుగువాడు ఆత్మరతియు, ఆత్మక్రీడుడు, ఆత్మమిథునుడు, ఆత్మానందుడు, స్వరాట్టు అగును. వారిదే స్వారాజ్యము; ఇతరులదికాదు.

పాపము, భయ జరా మృత్యు శోక క్షుత్పిపాసలు లేనట్టిదే ఆత్మ. అది సత్యకామము, సత్యసంకల్పము. శరీరము ఆత్మ కాలేదు. ఏలన దీనికి అలంకార నిరలంకార, అంధత్వ కాణత్వాది దోషములు, మర్త్యత్వము కలవు. దుఃఖాద్యనుభవము కలదు గావున స్వప్నములో మహీయమానమై విచరించునదియు ఆత్మ కాదు. పూర్తిగా సంప్రసన్నముగ సుషుప్తిలో మనునదియు ఆత్మ కాదు. ఏలన నేనున్నానను జ్ఞానము గాని, ఈ భూతముల (వస్తు) జ్ఞానము గాని సుషుప్తిలో లేకుండగా అప్పుడు ఆత్మ యున్నదని ఎట్లు అనుకొనగలము? ఆత్మనాశమే అచ్చట కనపడును. మర్త్యము, ప్రియాప్రియములచే గ్రస్తము నగు ఈ శరీరమే ఆత్మ కధిష్ఠానము. కాని ఆత్మ అమృతము; అశరీరము. సశరీరముగ నున్నప్పుడే ఆత్మను ప్రియాప్రియములు తాకును. అశరీరముగ నున్నప్పుడు తాకవు. అశరీర స్థితియే దాని స్వరూప స్థితి. చక్షుర్ఘ్రాణాదుల ద్వారా అనుభవించుచు అనుభవించుచున్నట్లు తెలిసికొనునది, మననము చేయుచు మననము చేయుచున్నట్లు ఎరుగునది ఆత్మ. అనగా ఆత్మ ద్రష్ట, విషయి, మాత (మననము చేయునది). ఆత్మకు మనస్సు కన్నువంటిది. దాని ద్వారా భోగముల గాంచుచు రమించును.

ఒక మృత్పిండమును తెలిసికొనుట వలన మృణ్మయ పదార్థము లన్నిటి జ్ఞానమును కలిగి,

1. తజ్జము-దాని (బ్రహ్మము) నుండి పుట్టినది. తల్లము-దాని యందు లీనమగునది. తదనము- దాని యందు అననము(ప్రాణనము)చేయునది, చేష్టించునది.

2. శ్యామాకము ఒక విధమగు ధాన్యపు గింజ-చామలు.

'వికారము లన్నియు నామమాత్రములు; మృత్తికయే సత్యము' అని ఎట్లు తెలియునో, ఒక లోహ పిండము నెరుగుటవలన 'లోహమయ పదార్థము లన్నిటి జ్ఞానము కలిగి, వికారములన్నియు నామ మాత్రములు. లోహమే సత్యము' అని ఎట్లు తెలియునో, అట్లు దేనిని తెలియుట ద్వారా వినని దంతయు విన్నట్లగునో, ఊహింపబడనిదంతయు ఊహింవబడునో, తెలియనిదంతయు తెలిసినట్లగునో - అట్టి దొకటి కలదు. అది బ్రహ్మము. అది అద్వితీయ మగు సత్తు. దాని ఈక్షణమువలననే నానా వస్తువులు సృజింపబడినవి. అది జగన్మూలము: అణీయము. అన్నిటి ఆత్మయు అదియే (ఐతదాత్మ్యము). అదియే సత్యము; అదియే ఆత్మ; నీవే అది. వృక్షరసములు మధువునందు తమ ప్రత్యేకతలను, నదులు సముద్ర మందు కలసి తమ ప్రత్యేకతలను కనుగొనలేనట్లు ప్రాణులు సత్తునుండి వెలువడి, సత్తులోనే లయ మందియు ఈ సంగతి నెరుగరు. ఆత్మచే నోతప్రోత మగుట చేతనే జీవులు ఆనందించుచున్నవి. జీవాపేత మైనది చచ్చును; జీవుడు చావడు. న్యగ్రోధ ఫలమును పగులగొట్టి చూచినచో చిన్న చిన్న అణువులవంటి గింజలుండును. వాటిని పగులగొట్టి చూచిన ఏమియు కనపడదు. అందలి అణిమ - సూక్ష్మ త్వము- కానరాదు. కాని అందుండియే మహావృక్షము వెలువడును. కనపడు మహా న్యగ్రోధమునకు కార ణము కనపడని ఆ అణిమ. అట్లే ఈ జగత్తంతయు కానరాని సత్తునుండి వచ్చిన దని విశ్వసింపవలెను. నీటిలో బాగుగా కలసిపోయిన ఉప్పు కానరాదు. కాని ఆ నీరు ఆచమించిన ఉప్పగ నుండును. అట్లే సత్తు ఇక్కడ అంతటను ఉన్నది. కాని కానరాదు. తెలిసిన వాడెవడైన (ఆచార్యుడు) ఉపదేశించినచో ఇది తెలి యును- గాంధారమునుండి అభినద్ధాక్షుడై తేబడిన వానికి కట్టు విప్పి దిఙ్నిర్దేశము చేసినప్పుడు తెలిసినట్లు జ్ఞానము లేనివాడు చచ్చును, మరల పుట్టును. జ్ఞాని సత్తును పొందును, మరల పుట్టడు. బ్రహ్మము నిరతి శయము; మహాంతము (భూమ). అదే సుఖము. అది తన మహిమయందు ప్రతిష్ఠితము. అది శుద్ధ ద్రష్ట. ఇది తెలిసికొనినవాడు మృత్యువును, రోగమును, దుఃఖిత్వమును చూడడు. సమస్తము ఆత్మ రూపముగ జూచును. వాని కన్ని గ్రంథుల విప్రమోక్షమగును.

తపస్సు, దానము, ఆర్జవము, అహింస, సత్యము- ఇవి లేనిదే ఆత్మాన్వేషణ సఫలము కాదని ఛాందోగ్యము చెప్పినది.

**3. బృహదారణ్యకోపనిషత్తు :** ఉపనిష ద్దార్శనికులలోని కెల్ల ప్రముఖుడగు యాజ్ఞవల్క్యుని విచారములు బృహదారణ్యకమున కలవు. అజాత శత్రు గార్గ్య సంవాదము, దధ్యఙ్ఙాథర్వణుని ఉపదేశములు, జనక ప్రవాహణ జైవలి ప్రసంగములు ఈ ఉపనిషత్తునందే కలవు.

వేదములు ఇత్యాదులు మహాభూతపు (బ్రహ్మము) నిశ్వసితము లని బృహదారణ్యక మనును. ఇందలి సిద్ధాంతములను కొన్ని క్రింద క్రోడీకరించినాము :

ఆత్మ సర్వభూతములకు రాజువంటిది. రథ చక్రపు నాభి నేములందు ఆర లన్నియు సమర్పింప బడి (చొప్పింపబడి) యుండునట్లు, ఆత్మయందు అన్నియు సమర్పితములు. బ్రహ్మకు రెండు రూప ములు- మూర్తము, అమూర్తము; మర్త్యము, అమృ తము. జగత్తు బ్రహ్మరూపములలో నొకటి.

బ్రహ్మము నిర్గుణము. దానిని ఎరిగియున్నచో ప్రతివస్తువును వస్తుగుణములను ఉదాహరించి "ఇది కాదు, ఇది కాదు" (నేతి నేతి) అని మాత్రమే వర్ణింప నగును. అది ఇట్టిదని నిర్దేశింప వీలుపడదు.

విజ్ఞానము, ఆనందము, బ్రహ్మయను బ్రహ్మ స్వరూప లక్షణము ఈ ఉపనిషత్తులోనిదే.

ఈ ఉపనిషత్తులో సృష్టిని గూర్చి చెప్పబడిన కొన్ని వాదము లివి: ఇది యంతయు ఆదిలో లేదా యెను. మృత్యువుచే, అశనాయా (ఆకలి)చే ఇది యంతయు కప్పబడియుండెను. తానాత్మవంతము కావలెనని అది అర్చించెను (కోరెను). అప్పుడు క్రమ క్రమముగా జలాది భూతములు పుట్టెను.

ఆత్మ యొకటే ఆదిలో ఉండెను. తనకు భిన్న మైనదేదియు అది కానదాయెను. తానున్నా నని

గ్రహించి మొదటగా నుడువుటచే దాని పేరు 'అహం' ఆయెను. ఒంటరితనముచే అది భయపడి ద్వితీయము నిచ్ఛగించెను. కాన తన యాత్మనే రెండుగ జేసి కొనెను. దానినుండి పతి పత్నులు కలిగిరి.

బ్రహ్మమే మొదట ఉండెను. అది తనను బ్రహ్మముగా నెరిగెను. దాని నుండియే అంతయు ఏర్పడెను. ఎవరెవరు 'నేను బ్రహ్మమును' అని ఎరుగుదురో వారు ఇది యంతయు అయ్యెదరు. ద్వితీయ భావన చేసి, రెండవ దేవతాదుల నుపాసించు వాడు దేవతలకు పశువువలె నగును.

నిప్పునుండి విస్ఫులింగములు బయల్వెడలినట్లు ఆత్మనుండి అన్ని ప్రాణులు, లోకములు, దేవతలు, భూతములు బయల్వెడలెను.

దమము, దానము, దయ అనుష్ఠానయోగ్యము లగు ప్రధాన ధర్మశిక్ష యని బృహదారణ్యకము బోధించినది. సత్య, శమ, దమ, ఉపరతి, తితిక్షా సమాధానముల ప్రాధాన్యమునుకూడ అది బోధించినది.

యాజ్ఞవల్క్యుని ప్రతిపాదనలలో కొన్ని ఇవి: పురుషుడు చచ్చినప్పుడు ప్రాణము లతని వెంటపోవు. ఇక్కడే ఉండును. నామము మాత్రమే వానిని వదలదు. చచ్చిన పిమ్మట శరీర ఇంద్రియాదులు పృథివ్యాది భూతములందును, ఆత్మ ఆకాశమందును కలసిన పిమ్మట ఆ పురుషుడిక ఎక్కడుండు ననిన- ఇది నలుగురిలో సమాధానము ఈయదగిన ప్రశ్న కాదు. పుణ్యకర్మ చేయువాడు పుణ్యపురుషుడును, పాప కర్మచే పాపియు అగును.

సాక్షాత్తు అపరోక్షమగు బ్రహ్మ సర్వాంతర మగు ఆత్మ. ప్రాణాదులచే ఆయా పనుల జేయించు నది, దృష్టిని చూచునది, శ్రుతిని వినునది, మతిని మననము చేయునది, విజ్ఞాతిని తెలిసికొనునది అదియే ఇదియే ఆయా వ్యక్తులలోని ఆత్మ. అనగా అది దేనికిని విషయము కాదు. సర్వాంతర మగు దీనికి భిన్నమగు నది ఆర్తము (తుచ్ఛము). ఇది శోక మోహ క్షుత్ పిపాసా జరా మృత్యువుల కతీతము. దీనిని తెలిసి కొనిన బ్రాహ్మణులు పుత్ర ధన లోక (సమ్మాన) ముల నిచ్ఛగింపక భిక్షాచారు లగుదురు. పాండిత్య మును వదలి బాల్యమందు అధివసింతురు. బాల్య పాండిత్యముల వదలి మునులగుదురు. మౌనమును వదలి తిరిగి బ్రాహ్మణులుగను అయ్యెదరు.

విచారించి చూడగా సమస్తమును బ్రహ్మలోక మందు ఓతప్రోతము. అది ఎందు ఓతప్రోత మని యడుగుట అతిప్రశ్న. అట్టిప్రశ్నలు వేసినచో బుర్ర పగులును. ప్రశ్నల హద్దు దాటి పోగూడని దేవతల విషయమున అతిప్రశ్న కూడదు.

సమస్తము ఆకాశమునందును, ఆకాశము అక్షరమందును ఓతప్రోతము. అక్షరము (అవినాశి) నిర్గుణము. అది కర్త కాదు; విషయము కాదు. దాని శాసనము వలననే జగత్తు నియతిని కలిగియున్నది. లోకము క్రమబద్ధము. అక్షరమును తెలిసికొనకయే చేయబడు యజ్ఞము, తపస్సు మొదలైనవి అంతము కలవి (అనంతఫలము నీయలేవు). అక్షరమును తెలిసి కొనకయే ఈ లోకమును విడిచిపోవువారు కృప ణులు (దురదృష్టవంతులు). తెలిసికొని పోవువారు బ్రాహ్మణులు. ఇది ఎప్పుడును విషయము కాదు. ఇదిగాక మరొక శ్రోత గాని, మంత గాని, విజ్ఞాత గాని లేడు. ఆత్మ ఔపనిషదుడగు (ఉపనిషత్తులచే ప్రతి పాదితుడగు) పురుషుడు. అగృహ్య, అశీర్య, అసంగ మగు నీ సమాన ఆత్మయందు ప్రాణ శరీరాదులు ప్రతిష్ఠితములు.

సర్వలోకములు, సర్వ భూతములు వాయువు అను సూత్రమందు గ్రుచ్చబడియున్నవి.

పృథ్వి అగ్ని అంతరిక్ష వాయు ద్యౌ రాదిత్య దిశా చంద్ర తారాకాశ తమస్ తేజములందు, సర్వ భూతములందు, ప్రాణ వాక్ నేత్ర శ్రోత్ర మన స్త్వక్కులందు, విజ్ఞాన వీర్యములందు ఉండియు ఏది వానినుండి భిన్నమో, వానిచే తెలియబడక, వానిని శరీరముగా గలిగి, వానిని లోనుండి నియ మించుచున్నదో (అంతర్యామియో) అదే నీ ఆత్మ; అంతర్యామి; అమృతము. అది అవిషయము; ఏక మాత్రమగు విషయి. తదన్యము తుచ్ఛము.

నేతి నేతి యగు, అగ్రుహ్యము, అసంగము నగు అత్మను తెలిసినవాడు అభయము పొందును. పురుషుడు చరమ విచారము చేసిచూడగా ఆత్మజ్యోతి; దాని యాలోకమందే అతడు కర్మల జేయును.

ఇహ పర లోకములందు, స్వప్నములందు సమానముగ సంచరించు హృదయాంతర్గత జ్యోతి పురుషుడు. నిద్రయందు అకాముడై 'నేనే ఇది యంతయు' అని తలచును. ప్రియాలింగితు డగు పురుషుడు బాహ్యాభ్యంతరములు ఎరుగునట్లు, ప్రాజ్ఞ ఆత్మ (బ్రహ్మము)చే ఆలింగితుడై మరేమియు నెరుగడు. అది అతని రూపము. అచట శోక మోహ పాపములు, సంబంధములు, వర్ణ వర్గాదులు ఉండవు. అతడు కేవలము ద్రష్టగా నుండును గాని అతనికి భిన్నము, ద్వితీయము ఉండదు. అదే బ్రహ్మలోకము, చరమానందము.

విత్తమువలన అమృతత్వము లభింపదు. ఏ వస్తువు ప్రియమైనను అది తన ఆత్మ కామన (భోగము) కొరకే ప్రియమగును. ఆయా పుత్ర కళత్రా విత్తాదుల కొరకు కాదు. ఆత్మే ద్రష్టవ్యము, శ్రోతవ్యము, మంతవ్యము, నిదిధ్యాసితవ్యము. ఆత్మ దృష్టము, శ్రుతము, మతము (మననము చేయబడి నది), విజ్ఞాతము కాగా ఇది యంతయు విజ్ఞాత మగును. ఆత్మకు వేరగా బ్రహ్మను ఎరుగు వానిని బ్రహ్మము నిరాకరించును. నీళ్ళన్నింటికి సముద్ర మేకాయతన మైనట్లు, ఆత్మే సర్వము. ఉప్పుకల్లు ఎట్లు ఎక్కడ రుచి చూచినను ఉప్పగనున్నట్లు ఆత్మ లోపల బయట యావత్తు ప్రజ్ఞాన ఘనము 'నేనే ఆత్మ'. శరీరాదులనుండి లేచిపోయి వాని తర్వాత వినష్టమగును. చచ్చిన పిదప సంజ్ఞయుండదు. దీని యర్థమేమి? ఆత్మ అవినాశి. అది ఉచ్ఛిన్నము కాదు. ద్వైత మున్నప్పుడు చూచుట, ఎరుగుట మొదలగునవి ఉండును. అంతయు ఆత్మయే ఆయినచో ఎవరెవరిని చూచెదరు? ఎవరిని తెలిసికొందురు? అగ్రుహ్యము, అసంగము. సమస్తమును తెలిసికొనుదానిని ఎట్లు తెలిసికొననగును? ఇదే అనుశాసనము, ఇదే అమృతత్వము.

**4. ఐతరేయోపనిషత్తు** : ఇందు కూడా ఆత్మ ఒకటే మొదట ఉండెననియు, అది లోకములను సృజింపవలెనని ఈక్షణము చేసి, జలాదుల సృజించె ననియు, జలమునుండి పురుషుని సృజించి అతనిని కంపితుని చేసె ననియు, అందుండి క్రమముగ తది తరములు బయల్వెడలె ననియు సృష్టిగాథ కలదు.

జ్ఞానము లేదా చైతన్యము ప్రజ్ఞాన మనియు, అదే బ్రహ్మము, అదే అన్నిటికిని ప్రతిష్ఠ అనియు ఈ ఉపనిషత్తు అనుచున్నది.

**5. తైత్తిరీయోపనిషత్తు** : ఇదికూడ బ్రహ్మ సత్తని, అది అసత్తని తలచువాడు స్వయముగ అసత్తగునని చెప్పినది. బ్రహ్మనే విధముగ ఉపా సించిన అట్లే సిద్ధి కలుగును. శరీర (అన్న) ప్రాణా దులు అసలు ఆత్మ కావు. వాటికి భిన్నము, వాటన్నిటి కంటే అంతరతమము అగునది ఆనందమయాత్మ.

ఆనందము పుచ్ఛము ప్రతిష్ఠ బ్రహ్మము.

దేనినుండి భూతములుజన్మించి, దేనిచే జీవించు చున్నవో, దేనివద్దకు పోవునో, ఎందు సంవేశించునో (లయమొందునో) అదే బ్రహ్మము. దానినే తెలిసికొన వలెను. అది ఆనందము అన్న మనః ప్రాణ విజ్ఞా నాదులను బ్రహ్మ మని తలచుట క్రింది స్థాయిలో జరుగును. బ్రహ్మమే అంతటను - ఆదిత్యునియందు, పురుషునియందు, బ్రహ్మాండ పిండాండములందు - కలదు. మనో వాక్కులు దానిని చేరలేక తిరిగి వచ్చును.

సత్యము, జ్ఞానము, అనంతమే బ్రహ్మ యను ప్రసిద్ధ బ్రహ్మ లక్షణము ఈ ఉపనిషత్తులో కలదు.

తైత్తిరీయమందు ఒకచోట అసత్తే మొదట ఉండెనని, దానినుండి సత్తు పుట్టెనని, అది తనను స్వయముగ చేసికొనెనని కలదు.

బ్రహ్మము "బహుగా నయ్యెదను గాక! పుట్టిం చెదను గాక!" అని కామన చేసి, తపము చేసి ఈ ఉన్న దంతయు సృజించెను. సృజించి అందే ప్రవే శించెను. ఇట్లు అదియే సత్తు త్యత్తు (అది) లు, వ్యాఖ్యాతా వ్యాఖ్యాతములు, నిలయన (దాగియుండు

చోటు) అనిలయనములు, విజ్ఞానావిజ్ఞానములు, సత్యానృతములు అయెను.

సత్య ధర్మ స్వాధ్యాయములు, ఆచార్యసంతుష్టి, సంతానోత్పత్తి, దేవ పితృ కార్యపరత, మాతృపితృ ఆచార్యాతిథులను దేవతలనుగా గౌరవించుట, పెద్దల నిర్దోష కర్మలను మాత్రమే అందరును ఆచరింపవలెననుట - ఇది తైత్తిరీయము బోధించిన నీతి.

**6. ప్రశ్నోపనిషత్తు :** దీనిలో కూడ సృష్టి గాథే కలదు. ప్రజాపతి ప్రజల (సంతానము) నిచ్ఛగించి తపము చేసి, వీరు నాకొరకు చాలమంది ప్రజలను సృష్టిచేసెద రని ఒక మిథునమును ఉత్పత్తి చేసెను. రయి (ధనము, భూతములు), ప్రాణము లా మిథునము. ప్రపంచమందలి ప్రతిది ఈ రెంటిలో నొకటి. ఉదా : సూర్యుడు ప్రాణము; చంద్రుడు రయి. వీటిలో ప్రాణము సర్వ శ్రేష్ఠము. అదే ప్రజలను ధరించునది, ప్రకాశింపజేయునది.

నదులు సముద్రమందు అస్తమించినచో వాటి నామ రూపములు పోయినట్లు బ్రహ్మను పొందినవారి నామ రూపములు పోవును. అదే ముక్తి; అమృతత్వము.

అనృతము పలుకువాడు సమూలముగ ఎండి పోవును గాన సత్యమే వచింపవలె నని ప్రశ్నోపనిషత్తు బోధించినది.

**7. కేనోపనిషత్తు :** ఇందుగల బోధలలో కొన్ని 'శరీరమునకు భిన్నమగు ఇంద్రియములను ప్రేరేపణ చేయు తత్త్వము ఆత్మ. అదే చరమ సత్యము; పూజనీయము. అదే అన్ని ప్రక్రియలకు, వస్తువులకు అంతస్తత్త్వము. దాని నెరిగినవారు ముక్తులై అమృతులగుదురు.'

బ్రహ్మ అవిషయము, చెప్పరానిది. ఉపాసింపబడునది బ్రహ్మము కాదు. జగత్తునకు వెనుకగల అపరిమేయ శక్తి బ్రహ్మము.

**8. కఠోపనిషత్తు :** దీనిలో యమ నచికేత సంవాదము కలదు. ఇది "చచ్చిన వారిని గూర్చి 'వారున్నారు', 'లేరు' అని విరుద్ధముగ చెప్పుట కద్దు, ఇందేది నిజము? పరలోకమున్నదా లేదా?" అను ప్రశ్నలకు సమాధానము నన్వేషింప బూనును.

అందలి బోధ లివి : బ్రహ్మము అణువుకంటె అణువు; మహత్తు కంటె మహత్తు. అది మనో బుద్ధీంద్రియములకు, వీటి ఉద్భవ స్థాన మగు అవ్యక్తమునకు కూడ పరము. దాని కంటె పరము లేదు. అదే పరాకాష్ఠ. ఊర్ధ్వమూలము, అధశ్శాఖము అగునది సనాతనము, శుక్రము, అమృతము, లోకాశ్రయము. దాని ప్రకాశముచే అంతయు ప్రకాశించును; దాని నేదియు ప్రకాశింప చేయలేదు. నిప్పు భువనమందు ప్రవేశించి ఎట్లు రూపరూపమందు ప్రతి రూప మైనదో, అట్లే అన్ని భూతములందు బ్రహ్మము అంతరాత్మ. అయినను అది దుఃఖాదులచే అలిప్తము - జగచ్చక్షువగు సూర్యుడు కంటి బాహ్యదోషములచే లిప్తుడుగానట్లు.

బ్రహ్మమును గూర్చి వినుట చాలమందికి అలభ్యము. వినినను అనేకులకు తెలియదు. దానిని గూర్చి చెప్పువాడుండుట ఆశ్చర్యము. దానిని పొందువాడు కుశలుడు. వానిచే ఉపదిష్టుడగు జ్ఞాతయు ఆశ్చర్యమే. ఏలన, అది కూర్చొనియు దూరము పోవును కదలక యుండియు అన్నిచోట్లకు పోవును. అది అణువుకంటె చిన్నది. మహత్తుకంటె మహత్తు.

ఆత్మ శరీర భిన్నము, అజరామరము, శాశ్వతము, అకర్త. శరీర రథమున కది రథి; బుద్ధి సారథి; ఇంద్రియములు గుర్రములు; మనస్సు కళ్లెము.

లేచి, మేల్కొని, వరములను పొంది బ్రహ్మము నెరుగవలెను. క్షురధార వలె దాటుటకు దుర్గమము బ్రహ్మ పథము. ఏలన ప్రవచనములచేతను, మేధాసంపదచేతను బహుశ్రుతము చేతను గాని అది లభింపదు. సూక్ష్మవిషయమగు నిది ఇతరులు (ఆచార్యుడు) చెప్పనిదే తెలియదు. ఊహ (తర్కము) చే దీనిని గూర్చిన జ్ఞానము (మతి) లభింపదు. ఎవనిని అది వరించునో వానికే అది లభ్యము. వానికే తనను తాను తెలియపరచు కొనును.

ఇంద్రియములను రంధ్రముల గుండ బయటికి జూచుట మనుష్యుని కలవాటు. అంతర్ముఖిత్వము లేదు. ఇంద్రియముల నరికట్టి అమృతేచ్ఛచే లోపల

ఆత్మను జూచు ధీరులు కొద్దిమంది. ఇంద్రియాదులచే, వాక్కుచే, తపఃకర్మలచే, దేవతోపాసనచే బ్రహ్మము లభింపదు. శుద్ధ జ్ఞానముచే పూతమనస్కుడైన వానికి ధ్యానము చేయుచుండ నిష్కల బ్రహ్మ దర్శన మగును. సర్వభూతములందును గూఢముగనున్న ఈ ఆత్మ బయటికి ప్రకాశింపదు. సూక్ష్మదృష్టి గలవారు తమ సూక్ష్మ తీవ్రబుద్ధిచే దానిని జూతురు

కాని జ్ఞాన ధ్యానములు సదాచారముపై ఆధార పడి యుండవలెను. దురాచారుడు, అశాంతుడు, ఏకాగ్రత లేనివాడు జ్ఞానముచే బ్రహ్మమును పొందడు.

**9. ముండకోపనిషత్తు** : ఇది యజ్ఞాది కర్మలను అదృఢము లగు ప్లవము లనినది. కర్మకాండ పరాయణులు జరా మృత్యువులను పొంది, పుణ్యలోకములకు పోయి పుణ్యము క్షీణింపగా తిరిగి మర్త్యలోకమునకు వచ్చెదరు. అవిద్యయందే వీ రుందురు. కాని తపశ్శ్రద్ధలతో భిక్షాటనము చేయుచు అరణ్యములందుండు శాంతు లగు విద్వాంసులు నిష్పాపులై సూర్య మార్గమున అమృత అక్షయ పురుషుని పొందెదరు.

వేదములందు, శిక్షా కల్ప వ్యాకరణాదులందు కలది అపరవిద్య. అక్షరము దేనిచే అవగమ్యమగునో అది పరవిద్య పరవిద్యచే బ్రహ్మమును తెలిసినచో సర్వము విజ్ఞాత మగును.

అదృశ్యము, అగ్రాహ్యము, గోత్ర వర్ణ ఇంద్రియ రహితము, నిత్యము, విభువు, సర్వగతము, సూక్ష్మము, అద్యయము, సమస్తభూతములకు యోని (కారణము) అగు దానిని ధీరులు ఎల్లెడల గాంతురు. సాలీడు మగ్గమును నేసి మ్రింగినట్లు, పృథివియందోషధులు బుట్టునట్లు, సజీవుడగు పురుషుని యందు కేశలోమాదులు పుట్టునట్లు విశ్వము అక్షరమునుండి సంభవించును

తపస్సుచే బ్రహ్మము ఉపచయ (వృద్ధి) మందును. దానినుండి అన్నము, తదుపరి ప్రాణము, మనస్సు ఇత్యాదులు పుట్టును.

బ్రహ్మము ఎల్లెడల - క్రింద, పైన, వెనుక, ముందు కలదు. అది సర్వశ్రేష్ఠము, సర్వమును. ఇది యంతయు పురుషుడే బుద్ధి యను గుహలో దాగిన అతనిని తెలిసికొనినవాడు అవిద్యాగ్రంథిని ఛేదించును. అచింత్యము, సూక్ష్మాతిసూక్ష్మము, దివ్యము అగు ఆ బ్రహ్మము దూరాతిదూరము; కాని చూడగలవారికి గుహలో దగ్గరనే కలదు.

యజ్ఞ దాన వేదాధ్యయనములు కావు ముక్తికి మార్గములు. సత్య జ్ఞాన తపో బ్రహ్మచర్యములచే బ్రహ్మము ప్రాప్త మగును. క్షీణదోషు లగు యతులు శరీరస్థ ఆత్మను జూతురు. సత్యమే జయించును. (సత్యమేవ జయతే); అనృతము కాదు. సత్యము వలననే ఆప్తకాము లగు ఋషులు సత్యమునకు పరమ నిధానమగు పదమును పొందెదరు. బలహీనుల కీ యాత్మ దొరకదు. విషయాసక్తి (ప్రమాదము) చే, లింగ (సన్న్యాస) హీన మగు తపస్సుచే గూడ అది దొరకదు. సరియగు ఉపాయములచే ప్రయత్నించుచు జ్ఞాని యాత్మ బ్రహ్మధామమును ప్రవేశించును.

కర్మచే చితమైన (లభించిన) లోకములను పరీక్షించి, 'బ్రహ్మము అకృతము, అది కృతము (కర్మ)చే లభింపదు' అని నిర్వేదము (వైరాగ్యము)ను చెంది, బ్రాహ్మణుడు సమిత్పాణియై శ్రోత్రియుడగు బ్రహ్మనిష్ఠుని వద్దకు పోవలెను. వైరాగ్య వివేకముల ప్రాధాన్యము నిట్లు ముండకము బోధించినది.

ధ్యానముచే, తన్మయ చిత్తముచే అక్షరము లక్ష్యముగా గొని దానిని పొంద ప్రయత్నింపవలెను.

ఆత్మచే వరింపబడిన వారికే అది తన స్వరూపమును వ్యక్తము చేయునని ముండకము కూడా చెప్పినది.

ఆత్మనే ఎరుగవలెను. ఇతరమైన మాటలు వదల వలెను. అదే అమృత సేతువు. దాని జ్ఞానముచే ధీరులు సర్వత్ర ఆనందామృత రూపమును, ప్రకాశమానమును అగు దానిని జూతురు.

కర్త, ఈశ్వరుడు, ప్రకృతికి యోని అగు ప్రకాశమానుడగు పురుషుని ఎప్పుడు విద్వాంసుడు చూచునో అప్పుడాతడు పుణ్యపాపములను విసర్జించి

నిరంజనుడై (నిర్లేపుడు, విగతక్లేశుడు) పరమ సామ్యమును చెందును.

జీవ పరమాత్మలు ఒక వృక్షముపై ఎప్పుడును కలిసియున్న రెండు పక్షుల వంటివి. అం దొకటి ఫలములను తినును. మరొకటి తినక చూచుచుండును. నిమగ్నుడగు (అనగా ప్రకృతియందు, అవిద్యయందు) పురుషుడు అనీశుడై దుఃఖించును. సమ్మోహితు డగును. తనతో కలసియున్న అన్యుడగు, పూజ్యుడగు ఈశ్వరుని, అతని మహిమను ఎప్పుడు చూచునో అప్పుడు వీతశోకు డగును. అనగా కర్మఫలముల దినుచు సంసారమందు దీనుడై అనాథుడై యున్న జీవుడు ఈశ్వరుని తన సఖునిగా, సేవ్యమానునిగా జూచి నప్పుడు దుఃఖరహితు డగును.

నదులు సముద్రమున గలసి నామ రూపములు గోల్పోయినట్లు విద్వాంసుడు పరాత్పరుని పొందును. బ్రహ్మమున ప్రవేశించిన ఋషులు జ్ఞానతృప్తులై కృతకృత్యులై శాంతులగుదురు.

వేదాంత విజ్ఞానముచే సునిశ్చితార్థు లయిన వారు, సన్న్యాస యోగముచే శుద్ధచిత్తు లగు యతులు అంత్యకాలమందు బ్రహ్మలోకములందు పరమ అమృతులై అన్ని వైపులనుండి ముక్తులగుదురు.

**10. మాండూక్య ఉపనిషత్తు** : ఓంకారమును బ్రహ్మతో నేకీకరించి, భూత భవిష్యద్వర్తమానములు, దానికి పరమం దున్నది కూడా ఓంకారమే అని ఈ ఉపనిషత్తనినది.

అంతయు బ్రహ్మమే ఆత్మ బ్రహ్మము. ఆత్మకు నాలుగు పాదములు : 1 జాగ్రదవస్థలో బాహ్య జ్ఞానము కలదియై ఇంద్రియా యుక్తమగునది. దీని పేరు వైశ్వానరము. ఇది స్థూలభోగి. 2. స్వప్నావస్థలో అంతరజ్ఞానము గలిగి, ఇంద్రియాది యుక్తమగునది. దీని పేరు తైజసము ఇది ఏకాంతభోగి. 3 సుషుప్త్య వస్థలో ప్రజ్ఞానఘనము. ఏ భోగమును కోరనిది. ఏ స్వప్నమును చూడనిది. ఆనందమయము దీని పేరు దీని భోజన మానందము. ఇదే సర్వేశ్వరుడు. ఇది సర్వజ్ఞము, అంతర్యామి, సర్వమునకు యోని, భూతముల ఉత్పత్తి వినాశము. 4. బాహ్యాంతర ప్రజ్ఞలు కాని, రెండును కాని లేనట్టి, ప్రజ్ఞము కాని అప్రజ్ఞము కాని కానట్టి, అదృష్ట అవ్యవహార్య అగ్రాహ్య అలక్షణ అచింత్య అవ్యపదేశ్యమగు ప్రపంచోపశమము, శాంతము, శివము, అద్వైతము, కేవలము ఆత్మ జ్ఞాన సారము - ఇది నాల్గవ పాదము. ఇది తురీయావస్థ. ఆత్మ నిజరూప మిదియే. దీని నెరుగవలెను.

**11. కౌషీతకి ఉపనిషత్తు** : దీనిలో పితృయాన దేవయానములను గూర్చి ఇంద్రప్రతర్దన సంవాదము, గార్గ్య వాలాకి అజాతశత్రువుల సంవాదము ఇత్యాదులు కలవు.

ఆయువే ప్రాణము ; ప్రాణమే ఆయువు. ఏది ప్రజ్ఞయో అదే ప్రాణము. ఈ రెండును కలసియే శరీరమందుండును. కలసియే వెడలును. ఈ ప్రాణమే ప్రజ్ఞాత్మ, ఆనందము, అమరము. ఇది కర్మచే మార్పు నొందదు.

కత్తి ఒరలో నున్నట్లు, పక్షి గూటిలో నున్నట్లు ప్రజ్ఞాత్మ శరీరమందు నఖలోమముల వరకు ప్రవిష్టము.

**12. మైత్రి ఉపనిషత్తు** : దీనిలో శాక్యాయన బృహద్రథుల సంవాదము, షడంగ యోగవిధి, చార్వాకు డగు బృహస్పతి దర్శనము, జ్యోతిషము - వీటి ప్రస్తావన కలదు. మైత్రి శాక్యాయనుని గురువు.

శరీరమందు ప్రాదుర్భూతమై, స్వమహిమచే ప్రకాశించుచు, కుమ్మరి చక్రమును వలె శరీరమును సంచలింపచేయు శుద్ధాత్మ ఒకటి కలదు. కాక, అవాగ్గమనము* చేయు భూతాత్మ ఒకటి కలదు. ఇది కర్మ ప్రభావమునకు లోనగునది.

శకటమువలె అచేతనమగు శరీరమును ప్రేరేపించునట్టి శుద్ధము, నిత్యము, శాంతమునగు స్వతంత్ర ఆత్మ కలదు.

శరీరపు ఒక భాగమందు గల అంగుష్ఠ మాత్రము, అణువుకంటె నణువు నగు ఆత్మ కలదు. దాని ధ్యానము వలన పరమపదము లభించును.

---

* చేసిన కర్మ ననుసరించి ఉత్కృష్ట నికృష్ట యోనుల చెందుట.

చర్మాస్థి మాంస రక్త మజ్జా కఫ విష్టాణ్మూత్రా దులచే యుక్తమగు నిస్సారము, దుర్గంధ భూయిష్ఠము అగు ఈ శరీరమందు కామోపభోగములవలన ఏమి వచ్చును? అట్లే నశ్యమానము, కామక్రోధాదులచేత, క్షుత్పిపాసా జరా శోక మృత్యువులచేత, ప్రియ వియోగాప్రియ సంయోగములచేత పీడితము నగు శరీరము ద్వారా కామోపభోగమునకు విలువ ఏమి కలదు? జీవులు నల్లులు, దోమలు, తృణముల వలెనే పుట్టుచు, చచ్చుచు ఉందురు. సముద్రములు సైతమెండును. కొండలు పడును. దేవతలు మారుదురు. ఇది సంసారము. అంధకూపమందు కప్పవలె అజ్ఞానులిందు ఉందురు. వైరాగ్యముచే ఈ లోకపు అనిత్యతను తెలిసికొని వివేకులు ఆత్మాన్వేషణ చేయుదురు.

**13. శ్వేతాశ్వతర ఉపనిషత్తు** : రుద్రుని మహిమ, యోగవిధి, ప్రకృతిపురుషుల చర్చ, కపిల ఋషి మహిమ, జీవబ్రహ్మల విచారము, సృష్టివివరణ, బ్రహ్మ జ్ఞానమును గూర్చిన వివరణ ఈ ఉపనిషత్తులో గలవు.

ఇందలి సిద్ధాంతముల సంక్షేప మిది :

బ్రహ్మచక్రమందు హంస (జీవుడు) తిరుగాడును. ప్రేరకమగు, వేరగు ఆత్మ పృథగాత్మను తెలిసికొని దానితో యుక్తమై అమృతత్వమును పొందును

అజ్ఞుడు (జీవుడు), జ్ఞుడు (ఈశ్వరుడు) రెండును జననము లేనివి. అందొకటి ఈశము (స్వతంత్రము); రెండవది అనీశము(పరతంత్రము). అజమగు ప్రకృతి భోక్త యగు జీవునికి భోగవస్తువు. ఆత్మ అనంతము, అకర్త. క్షరము (నశించునది) ప్రకృతి, లేదా ప్రధానము. అక్షరము (నాశములేనిది) అమృతము. రుద్రుడు క్షరముపైన, ఆత్మపైన దేవుడై శాసించుచున్నాడు. ఎల్లప్పుడును ఆత్మయందున్న అది తెలియదగినది. భోక్తృ భోగ్యులు, (జీవ ప్రకృతులు) ప్రేరకులు (ఈశ్వరుడు) - ఇదే త్రివిధ బ్రహ్మము; బ్రహ్మత్రయము.

ఎరుపు, తెలుపు, నలుపు రంగులు గలట్టి, అనేక ప్రజలను ప్రసవించునట్టి అజమగు ప్రకృతిని భోగించుటలో అజుడగు జీవుడు ఆసక్తుడు. అన్యుడు దీనిని వదలును. "జీవేశ్వరులు ఒకే వృక్షముపైగల మిత్రులైన రెండు పక్షుల వంటివారు. అందొకరు కర్మ ఫలాస్వాదన చేయుదురు; మరొకరు చేయరు." అను కథ ఇందు కూడ కలదు. మాయి యగు (మాయ = కల) ఈశ్వరుడు విశ్వమును సృజించును. దాని యందు రెండవవాడు బద్ధుడు. ప్రకృతియే మాయ; మహేశ్వరుడు మాయి.

నిత్యుల (జీవుల) మధ్య నిత్యుడు, చేతనుల మధ్య చేతనుడు, అనేకుల కోర్కెల పూర్తి చేయునట్టి ప్రధాన క్షేత్రజ్ఞుల (జీవుల) యజమాని అగు ఈశ్వరుడు మోక్షస్థితి బంధహేతువు.

జీవులందు లింగ భేదము లేదు. ఏ శరీరమును గ్రహించిన దానితో నుండును. జీవుడు సూక్ష్ముడు. కేశాగ్రమును నూరు భాగములు చేసి, అందొక దానిని మరల నూరు భాగములు చేసిన అందొక భాగము జీవుని పరిమాణముతో సమానము.

ఈశ్వరుడు సూక్ష్మతమము, మహత్తమము. అతనిచే జగత్తు పూర్ణము. అతనికి పరమైనది, వేరైనది లేదు. అతడు సమస్తమును సృజించినాడు; అంతను ఆవరించినాడు; గుణియు (గుణములు కలది), సర్వవేత్తయును. అతడు ఈశ్వరులలో పరమ మహేశ్వరుడు. దేవతలలో పరదేవత. పతులలో పరమ పతి, పూజ్యుడు, భువనేశ్వరుడు. అతనికి కార్య కారణములు లేవు. ఎవరును సమానులు, అధికులులేరు. అతడే బ్రహ్మను (చతుర్ముఖుని) మొదట సృజించి, వానికి వేదముల నిచ్చెను. అతడే రుద్రుడు, శివుడు, లోకేశ్వరుడు, భూతములలో నిగూఢుడు.

సాలెపురుగు దృష్టాంతముతో సృష్టిని శ్వేతాశ్వతరము కూడ బోధింప జూచినది. ఒకడైన దేవుడు సాలెపురుగు వలె ప్రధానమునుండి ఉత్పన్నము లగు తంతువుల ద్వారా స్వభావముచే విశ్వము నాచ్ఛాదించి యున్నాడు.

ఒక బ్రాహ్మణుని పిలిపించుకొని తన వద్ద ఉంచుకొని బార్హస్పత్య (బృహస్పతి చెప్పిన) మత సిద్ధాంతము లను చెప్పించుకొనినా డని, అపుడే ద్రౌపదియు ఆమె సోదరులును వాటిని విన్నా రని మహాభారతములో కలదు (వనపర్వము, III. 97)[1]. అంగుత్తరనికాయ, వినయపిటకాది బౌద్ధగ్రంథములలో కూడ బ్రాహ్మణులు నేర్చుకొనెడి శాస్త్రములలో ఒకటి లోకాయత మని ఉదాహరింపబడినది. బాణుని హర్ష చరితములో కాపాలిక, జైన, వైశేషిక, ఔపనిష దాదులతో పాటు లోకాయత మొక దర్శన విశేషముగా పేర్కొనబడి నది. మనుస్మృతి హేతుశాస్త్రమును, దానిని అభ్యసించి అనుసరించు హైతుకులను గూర్చిచెప్పినది. వీరు పాషండు లని, వికర్మస్థు లని, బిడాలవ్రతికు లని మనువు చెప్పినాడు. వీరిని శిక్షింప వలె నని ఆయన ఉద్దేశ్యము ఎందుచేత? వీరు పరలోకమును, దాన యజ్ఞ యాగములను, వేదప్రామాణ్యమును నిరాకరించినారు కాబట్టి; వీరి తర్కము వేద విరుద్ధము కాబట్టి. ఈ కారణము మేధాతిథి, కుల్లూక భట్టుల టీకలలో స్పష్టమైనది (IV, 30). మనువు చెప్పిన హైతుకులు, నాస్తికులు లోకాయతికులే నని మేధాతిథి అభిప్రాయము (III. 150; IV. 30; VIII. 22; III. 309). "దత్తము, హుతము, పరలోకము లే" వని ఈ నాస్తికుల బోధ. శుక్రనీతిసారములో శాస్త్రములను, విద్యలను పేర్కొను చోట నాస్తికుల తర్కప్రావీణ్యము, వారి శాస్త్రము ప్రసంగింపబడి నవి. ఈశ్వరుని, వేదప్రామాణ్యమును నిరాకరించి, సర్వమును స్వాభావికమే అని చెప్పుట వీరి మతమని శుక్రనీతి చెప్పినది. అర్థశాస్త్ర, వాల్మీకి రామాయణాది హిందూగ్రంథములందు, కూటదంత సుత్తము మొదలగు ప్రాచీన బౌద్ధగ్రంథములందు ఉదాహరింపబడిన లోకాయత మతి ప్రాచీన దర్శనమని, దీనిని కొందరు రాజులు, బ్రాహ్మణ పండితులు సమాదరించెడివా రని దీనినిబట్టి తేలుచున్నది. అయితే కేవలము హేతువాదముపై ఆధారపడి స్వతంత్రాలోచన చేయుచు, భౌతిక వాదములో పర్యవసించుచున్న ఈ దర్శనము వేదప్రామాణ్యము నంగీకరించు వారికి పరలోక, పునర్జన్మ, ఈశ్వరాస్తిత్వాదులను విశ్వసించు వారికి గిట్టలేదు. కాబట్టి వారు లోకాయతమును నిరసించిరి; తూలనాడిరి. దాని అధ్యయనమును వారించిరి. స్మృతులు దానిని చదువువారికి శిక్షలు విధించినవి.

1. చార్వాకు డను బ్రాహ్మణుడు మహాభారత యుద్ధానంతరము జ్ఞాతులను, గురువులను వధించి నందులకు పాండవులను నిందించె ననియు, తక్కిన బ్రాహ్మణు లాతనిని కాల్చిచంపి రనియు ఉన్నది. (శాంతి పర్వము. 1. 20)

**అసురులు - లోకాయతులు :** అసురుల రాజగు విరోచనుడు, దేవతల రాజగు ఇంద్రుడు ద్వాత్రింశత్ వర్షములు ప్రజాపతి వద్ద బ్రహ్మచర్యముతో ఉండి, ఆయనను ఆత్మజ్ఞాన మిమ్మని ప్రార్థించిరి. అప్పుడాయన 'ఒక నీటిపాత్రలో మిమ్ము చూచుకొనుడు, ఆత్మ తెలియవచ్చు'నని చెప్పగా అట్లు చేసి, నఖలోమ పర్యంత మగు తమ్ము తాము చూచుకొనిరి. తమ్ముతాము అలంకరించుకొని మంచి బట్టలు వేసికొని చూచుకొనగా అట్లే తమకు కానవచ్చిరి. అదే అమృతము, అభయము అగు ఆత్మ, బ్రహ్మ అని ప్రజాపతి చెప్పెను. విరోచనుడు శాంతచిత్తుడై అసురుల వద్దకు వెళ్ళి, 'ఆత్మయే (తనకు తానే; కానవచ్చు దేహమే) పూజనీయము, పరిచరనీయము. ఇహమున ఆత్మనే (తనకు తననే) పూజించుకొని సేవించుకొనుటవలన ఉభయలోకములను పొందుదురు' అని బోధించెను. నాటినుండి దానము చేయని వానిని, శ్రద్ధలేని వానిని, యజ్ఞము చేయని వానిని అసురు డందురు. శరీరమే ఆత్మ యను బుద్ధిచే తమతమ శరీరములను పూజించుకొనుచు, వాటి సౌఖ్యమును చూచుకొనువారు అసురులు. వారు పిల్లికి బిచ్చము పెట్టరు. స్వసుఖము వారి ఆదర్శము. మృతుల దేహములను అన్నము, వస్త్రములు, అలంకారములతో సంస్కరించి దానివలన పరలోకమును జయింతుమని తలంచెదరు. ఇట్లొక గాథ ఛాందోగ్యమున(8.8) కలదు. తమ దేహమే సర్వస్వము, పరమార్థము అని

ఎంచి దానికి పోషణ, పూజనలు చేయుట అసురుల ధర్మమని, మృతదేహములను కూడ వారు గౌరవింతు రని సారాంశము. ఆత్మను కోరి అసురులు బ్రహ్మ వద్దకు వెళ్ళి రని, వారికి నచ్చునట్టి ఆత్మనే ఆయన వారికి బోధించె నని, ఆ సిద్ధాంతము ననుసరించియే మూర్ఖులు అసత్యమును సత్యమని నమ్మి, ఈ లోకము పట్ల అసక్తితోడను, కామము తోడను జీవింతు రని మైత్రాయణీ ఉపనిషత్తు (VII. 10)లో ఒక గాథ కలదు. 'దేహ మాత్రమే ఆత్మ. దానికి భిన్నమగు, తదతిరిక్తమగు ఆత్మ వేరొండు లే'దను ఈ సిద్ధాంతము లోకాయతిక సిద్ధాంత మని శంకరులు సూత్ర భాష్యమున మూడు చోట్ల చెప్పిరి. అట్లే "అసురులకు 'జగత్తు అసత్యము, అప్రతిష్ఠము[1], అనీశ్వరము, అపరస్పర సంభూతము[2], కామమే కారణముగా గలది' అను దృష్టి ఉండును" అని భగవద్గీత చెప్పినది (VXI. 8). ఇట్లనువారు చార్వాకులే అని శంకరుల అభిప్రాయము. శ్రీధర స్వామియు ఇది లోకాయత మత మనినాడు.

'మాయా మోహము'చే వంచింపబడి అసురులు ఇట్టి దర్శనము నవలంబించి, వేదమార్గ చ్యుతులై దేవతలచే ఓడింపబడిరి అని విష్ణుపురాణ మందును, ఇంద్రుని సంరక్షణార్థము దేవతల విజయము కొరకు బృహస్పతియే శుక్రుడై ఈ 'అవిద్య'ను సృజించినాడని, దీని నాశ్రయించినందున దైత్యులు దేవతలచే హతులైనా రని మైత్రాయణీ ఉపనిషత్తునందును కలదు. బౌద్ధ, జైనములు పాషండ మతము లని, కుమార్గము లని, నరకమునకు స్రోవతీయున వని పురాణములలో, స్మృతులలో చాలచోట్ల కలదు. దైత్యులను అపమార్గమున నడపి, వారి పతనము జరుగుటకై విష్ణువు బుద్ధావతార మెత్తి వారికి అసన్మార్గమగు బౌద్ధమతమును బోధించె నని కొన్ని పురాణములందు కలదు. మాయావాద మసచ్ఛాస్త్ర మని, దుర్మార్గుల వినాశమునకై శివుడు శంకరాచార్యులుగా బుట్టి, అద్వైతమును బోధించెనని కొన్ని పురాణములందును, శంకరాచార్యులు ఒక రాక్షసుని అవతార మని కొన్ని ఇతర వేదాంత సంప్రదాయ గ్రంథములందును కలదు. ఆ విధముగనే చార్వాకుడు రాక్షసు డని, లోకాయతము దైత్యుల దర్శన మని కొన్ని శ్రౌత మతము నభిమానించు గ్రంథములు ఘోషించును. హేతువాదముతో నెగ్గలేనప్పుడు, సహనము తగ్గినప్పుడు ఇట్లు అన్యమతములపై అపవాదములు వేయుట జరుగును.

అయితే ప్రాచీన గ్రంథములందు పేర్కొనబడిన అసురు లెవ్వరు? వీరు అస్సిరియా - సుమేరియా వాసు లని, సింధులోయ నాగరికత వారి నిర్మాణ మని కొందరి మతము. ఇండో - ఇరానియన్ జాతులలో హెచ్చు సంస్కృతి కలవారు అసురు లని గో పాలన వ్యవసాయములు చేయుచు తక్కువ సంస్కృతి కలవారు దేవత లని కొందరి ఊహ. ఆర్యుల ఆక్రమణలను అరికట్ట ప్రయత్నించిన భారతదేశమందలి ఆదిమజాతులే అసురు లని కొందరు పండితు లందురు. తమకు శత్రువులైన వీరిని ఆర్యులు దెయ్యములుగా, రాక్షసులుగా వర్ణించుట సహజమే నని కొందరు ఐతిహాసికుల మతము. ప్రాచీన వైదిక వాఙ్మయములో ప్రాణము గలది, స్పందనము గలది ('అసు' కలది) అసురమనియు, అసుర మనగా ఆధ్యాత్మికము, అశరీరము, దివ్యము అను అర్థములలో ఉపయోగించుటయు కలదు. దీనికి 'భయంకరమైన', 'విపరీతమైన' అను అర్థములుకూడ కలవు. ఉదా : వరుణుడు అసురుడు.

**లోకాయత సిద్ధాంతము :** ఇంతకును అసురు లెవరైనప్పటికిని, దేహాత్మవాద దర్శనమును వారు లేవదీసి రని, ఇది తరువాత కొందరు ఆర్యులు (బ్రాహ్మణులు) కూడ పరిగ్రహించిరని, దీనికి తర్కము, ఇంద్రియానుభవము మూలస్తంభములని తెలియనగును. జనసామాన్య మీ ద[illegible]నము నంగీకరించుటచే ఇది లోకాయత మనబడెను. బ్రహ్మజాల

1. ఆధారము లేనిది.

2. స్త్రీ పురుష సంబంధమువలన కల్గినది. లేదా సాంఖ్యాదులలో ఉపనిషత్తులలో అన్నట్లు క్రమక్రమముగా వికసించినది కానిది.

సుత్తాదులలోను, త్రిపిటకములలోను ఈ వాదము చాల చోట్ల వర్ణింపబడినది. దీని నా గ్రంథములు సాధారణ ముగ "తం జీవం తం శరీరం" ముఖ్య సిద్ధాంత ముగా గలవి యని చెప్పుచున్నవి. ఇది కొందరు బ్రాహ్మణులు, శ్రమణులు అంగీకరించినట్లు కూడ అచ్చట కాననగును. ఈ సిద్ధాంత సారాంశమును బౌద్ధ గ్రంథము లిట్లు వర్ణించినవి : 'ఆత్మ కాకృతి కలదు. నాలుగు భూతములచే[1] అది నిర్మితము. అది తల్లి దండ్రులనుండి ఉద్భవించినది. శరీరము నశించి నంతనే అదియు ఉత్పన్నమగును. మరణానంతర ముండదు. అప్పుడు పూర్తిగ నశించును' (రీస్ డేవిడ్స్, డయలాగ్స్ ఆఫ్ ది బుద్ధ, 1, 46).

బృహదారణ్యక మీ సిద్ధాంతమునే రెండు చోట్ల వర్ణించినది : 'ఈ భూతములనుండి ఏర్పడి, వాటిలోనే అంత మొందును. మరణానంతరము సంజ్ఞ ఉండదు' (II. 4. 12; IV. 5, 13). శంకరుని భాష్యాను సారము బ్రహ్మసూత్రములు అభివర్ణించిన లోకాయత మత మిదియే. శంకరుని అభిప్రాయము ప్రకారము లోకాయత మత సంగ్రహ మిది : "దేహమాత్రమే ఆత్మగా జూచు లోకాయతికులు దేహ వ్యతిరిక్త మగు ఆత్మ లేదని తలచెదరు. సమస్త వ్యస్తము లగు, బాహ్యములగు పృథివ్యాది భూతములే శరీరాకారముగ పరిణమించిన వనియు, కానరాకపోయినను వాటియందే చైతన్యము ఉండు ననియు భావింతురు. కిణ్వాది[2] ప్రత్యేక మాదక ద్రవ్యములనుండి మదశక్తి ఉద్భవించినట్లు చైతన్యము భూతముల విశిష్ట సంఘాతము వలన ఏర్పడు నందురు. చైతన్య విశిష్టమగు శరీరమే పురుషుడు. స్వర్గమునకు పోవుటకు గాని, అపవర్గము నందుటకు గాని సమర్థమగు దేహవ్యతిరిక్తమగు ఆత్మ లేదు. దేహమందు చైతన్యము ఆత్మకృతము కాదు. దేహమే చేతనము, ఆత్మయు అని వారందురు. దీనికి వారిచ్చు హేతు విది: 'ఏది యుండగా ఇంకొకటి ఉండునో, ఏది లేనప్పుడు ఆ ఇంకొకటియు ఉండదో అది దాని ధర్మ మనబడును.' ఉదా : ఉష్ణత, ప్రకాశము అగ్ని ధర్మములు. ప్రాణము, చేష్ట, చైతన్యము, స్మృతి మొదలగునవి ఆత్మ ధర్మము లని ఆత్మవాదు లందురు. కాని అవియు దేహమందే ఉపలబ్ధ మగుచున్నవి ; బయట నగుట లేదు. అందుచేత దేహవ్యతిరిక్త మగునట్టి మరే ధర్మియు[3] సిద్ధము కానందున, అవి దేహధర్మములే కానగును. కాబట్టి దేహము నుండి ఆత్మ అవ్యతిరేకము" (సూత్ర భాష్యము, III. 3. 53.).

అభౌతిక పారలౌకిక తత్త్వములను నిరాకరించిన లోకాయతము అర్థ కామ సాధనను ప్రధానముగా ఎంచిన దని, వీటిని గూర్చిన శాస్త్రములు లోకాయతులు రచించి ఉండవచ్చు నని ఊహింపవచ్చును. బార్హస్పత్య అర్థశాస్త్రమును భాసుడు ప్రతిమా నాటకములో ఉల్లేఖించినాడు. బార్హస్పత్య మతములో వార్తా దండనీతులే శాస్త్రము లని కౌటిల్యుడు నుడివెను. అర్థ సంపాదనకు ప్రాధాన్యము నిచ్చిన చింతకులు ధర్మమునకు ప్రాధాన్య మిచ్చిన చింతకులను అమాయికులుగను ఛాందసులుగను భావించిరి. రాజధర్మము మొత్తము మీద లోకాయత సూత్రముల పైననే నడచిన దని కౌటిల్యుని అర్థ శాస్త్రమును, మహాభారతాంతర్గత రాజధర్మ ప్రకరణములను, శుక్రనీతిని చదివినచో తెలియును. ధర్మార్థముల మధ్య గల సంఘర్షణ యాజ్ఞవల్క్య, నారద స్మృతులలోనే గమనింపబడినది. కౌటిల్యుని గ్రంథములలోను, మహాభారత రాజధర్మములోను వీటికి సంఘర్షణ ఉన్నదని అంగీకరింపబడినది. వీలైనంత వరకు ధర్మాచరణ చేయవలె ననియు, అయితే రాజ్యకాంక్ష, అర్థార్జన, శత్రువిజయము ఆదర్శములుగా గలవారు సత్య, అహింసలను మాత్రమే అంటిపెట్టుకొనుట వలన ఈప్సితమును బడయ రనియు, ఇవి కావలసినవారు నానోపాయములవలన వాటిని పొంది, ఆపై ప్రాయశ్చిత్తాములద్వారా, యజ్ఞ దానముల ద్వారా పాపములను క్షాళనము చేసికొనవచ్చు ననియు ఈ గ్రంథములు సూచించును. నిశిత హేతువాదమును, లోక స్వభావమును అరసినవారు భారత దేశములో అర్థ

1. గాలి, నిప్పు, మట్టి 2. మద్యము చేయుట కుపయుక్త మగు ఒకానొక బీజము - కిణ్వము - కల్లు మడ్డి. 3. ధర్మి - ధర్మములు కలది.

శాస్త్రమునకు పునాది వేసిరి. వారి ప్రభావమే నీతి గ్రంథములపైన రాజధర్మముపైన కన్పడును. కాక, అర్థసాధనకాలమున అందరును లోకాయతులే అని బృహస్పతి చెప్పినది నిజము.

**ఇతర దర్శనములపై లోకాయత ప్రభావము :** ప్రాయికముగా మీమాంస లోకములో లోకాయతముగా చేయబడినది అని కుమారిలభట్టు మొత్తుకొనినాడు. దీనిని బట్టి మీమాంసపై దాని ప్రభావము తెలియవచ్చును. సాంఖ్య దర్శన ప్రధానాచార్యులలో ఒకడు ఆసురి అనియు, "కపిలుడు ప్రహ్లాదుని కొడుకు, అసురుడు, అనేక విభాగములు చేసినవాడు. వానిని సరకుగొనరాదు" అని బోధాయనుడు చెప్పినాడనియు గుర్తుంచుకొనినచో లోకాయతమునకు, సాంఖ్యమునకు సన్నిహిత సంబంధ ముండెనని తెలుసు. సాంఖ్యకారికా భాష్యములో బిడ్డ స్త్రీపురుషుల కలయిక వలన పుట్టినట్లే, సృష్టి ప్రకృతి పురుషుల కలయిక వలన అయినదని గౌడపాదుడు చెప్పినది (కారికా భాష్యము, 21) అపరస్పర సంభూతమని గీత వర్ణించిన ఆసుర దృష్టికి దగ్గరగా నున్నది. సాంఖ్యము ప్రారంభమున నిరీశ్వరము, భౌతికవాదము. శాశ్వత ఆత్మ నొప్పలేదు. తర్వాతి సాంఖ్యములో కూడ పని చేయున దంతయు ప్రకృతియే; సమస్తము దాని వికృతులే, శరీరము, మనస్సు కూడ భూతముల కలయికయే. పురుషుడు నామమాత్రమే. అతడేమియు చేయజాలడు; అకించిత్కరుడు. అట్టిచో ఈ సిద్ధాంతమునకు, లోకాయతమునకు గల పెద్ద భేద మేమియని సూత్రకృతాంగాది జైన గ్రంథములు ఎప్పుడో అడిగినవి. కాక కొన్ని ప్రాచీన ఉపనిషత్తులలో పురుష శబ్దము విశిష్ట శరీర నిర్మాణము గల మానవుడను అర్థములో వాడబడినది; ఆత్మ అను అర్థములో కాదు. అనుమానము ద్వారా, శ్రుతి నాశ్రయించని తర్కము ద్వారా ధర్మ బ్రహ్మముల ప్రతిపాదన జరుగదను మీమాంసా వేదాంతముల సిద్ధాంతము హైతుకులగు లోకాయతుల దాడి కోర్వలేక ప్రతిపాదింపబడిన దగును. ఆత్మేశ్వరులను, శాశ్వత వస్తువులను కాదను బౌద్ధము, నిరీశ్వరమగు జైనము కూడ కొంతవరకు లోకాయత ప్రభావమునకు లోనైనవే. చరకుని ఆయుర్వేదముపై కూడ భౌతికవాద ప్రభావము మెండుగా కలదు.

**లోకాయతము - కాపాలికము :** కామమునకు ప్రాముఖ్యము నిచ్చు లోకాయతమునకు, నానా విధ విపరీతాచారములు గలిగి స్త్రీ పురుష సంపర్కము ద్వారా ఏదేదో సాధింపజూచు కాపాలిక మతమునకు సంబంధము కలదని గుణరత్నాదులు కొందరందురు. గీత వర్ణించిన ఆసుర దృష్టి వంటిదే కొంతమంది తాంత్రికులకు సమ్మతము. అయినచో వారందరును లోకాయతికులు కారా? 'దేహమే సర్వస్వము, సంభోగమే పరమార్థము' అని ఎంచు సహజీయులు అను బౌద్ధ సంప్రదాయము ఉన్నది. 'ఇవన్నియు ఒక ఉరు భౌతిక వాదము నుండి వెలువడిన భిన్న దర్శనములు, ఆరంభమున తంత్రమును భౌతిక వాదమే' అని దేవీప్రసాద చట్టోపాధ్యాయ 'లోకాయత' అను తన గ్రంథమున ప్రతిపాదించినాడు. ఎచ్. పి. శాస్త్రి, డి. ఆర్. శాస్త్రి అంతకుముందే లోకాయత, కాపాలిక, సహజీయ (కాబట్టి తాంత్రిక) సంప్రదాయముల పరస్పర సంబంధములను గుర్తించిరి. లోకాయతులు కూడ మద్య మాంస మైథునములను సేవించెద రని గుణరత్నుడనుటచే, తాంత్రికులకు వారికి అభేదమాయను సందేహమునకు తావు కలదు.

ఇక్కడ ఒకటి గుర్తునం దుంచుకొనవలెను. బౌద్ధ హిందూ గ్రంథములలో బ్రాహ్మణపండితులచే అధ్యయనము చేయబడుచునట్లు, రాజసభలలో చర్చింపబడుచున్నట్లు, తక్కిన దర్శనములతోపాటొక ప్రధాన దర్శనముగా పరిగణింపబడుచున్నట్లు వర్ణింపబడిన లోకాయతము మద్యమాంస మైథునములను సేవించు చౌక రకపు సంప్రదాయము కాజాలదు. 'పర లోకమును, ఆత్మను నిరాకరించి ఇహ లోకమున సుఖముగా బ్రతుకుడు' అని చెప్పిన దీని సిద్ధాంతమునకు ప్రతి వ్యక్తియు తన స్వసుఖమును (ముఖ్యముగా ఇంద్రియ సుఖమును) స్వలాభమును సాధింపవలెననియు, ఆదర్శములను, కట్టుబాట్లను, మర్యాదలను వీడి విచ్చలవిడిగ ప్రవర్తింపవలెననియు అర్థము చే

అటుల బ్రతుకు సంప్రదాయములు తరువాత ఏర్పడి యుండవచ్చును. వీరు సంఘమునకు రాజదండము నకు జడిసి, తా మొక మతమువార మని, కాపాలికుల మనియో, తాంత్రికుల మనియో చెప్పుకొనుటయు జరిగి ఉండవచ్చును. ఉదాత్తమైన ఎపిక్యూరస్ బోధ లిట్లే అపార్థము చేయబడి నికృష్టుల ఏహ్య జీవితము నకు, విమర్శకుల ఖండనలకు గురియైరవని పాశ్చాత్య దర్శన శాస్త్ర చరిత్ర చెప్పుచున్నది కదా!

**లోకాయత సారస్వతము :** బృహస్పతి లోకాయత ప్రవర్తకు డని ఉపనిషాదాది గ్రంథము లలో కలదు. లోకాయతుల సాహిత్య ముండె నని, అందు మూలగ్రంథము బృహస్పతి సూత్రము లని చంద్రకీర్తి, ఆర్యదేవు లను బౌద్ధ పండితులు వ్రాసిన గ్రంథములలో వక్కాణింప బడినది. పుష్పదంతుని కృతికి టీక వ్రాసిన వాని మతానుసారము అందు పేర్కొనబడిన పురందరుడు ఒక చార్వాక మత గ్రంథకర్త. ఇతడు 7వ శతాబ్దము వాడని దాస్‌గుప్త అభిప్రాయము. వాదిదేవసూరి యను జైనుడు పురందర సూత్రము నొకదాని నుదాహరించెను. పతంజలి, భాస్కరుడు (బ్రహ్మసూత్ర భాష్యకర్త) ఇరువురును లోకాయత గ్రంథము లుండెనని వ్రాసిరి. పతంజలి లోకాయత భాష్యకర్త భాగురి యని చెప్పెను. దీనినిబట్టి భాగురి క్రీ.పూ. 150కి ముందు వాడని తెలును. 1921లో 'బృహస్పతి సూత్ర' మను పుస్తకమొకటి ప్రకటింపబడెను. కాని ఇది నిజముగా లోకాయత ప్రవర్తకుడు వ్రాసిన గ్రంథము కాదని పెక్కుమంది విద్వాంసుల అభిప్రాయము. 1940లో జయశ్రీ (17వ శతాబ్దము) వ్రాసిన 'తత్త్వోపప్లవ' మను గ్రంథము ప్రకటింపబడెను. ఇతడు బృహస్పతిని తన గురువుగా పేర్కొనెను. అన్ని ప్రమాణము లను నిరాకరింప యత్నించెను. బ్రహ్మసూత్రము (3-3-53) పైన, భగవద్గీత (16.11) పైన, అనగా లోకాయత సిద్ధాంత ప్రసక్తి వచ్చినచోట్ల, ఆ మత మును వర్ణించుట పట్ల భాష్యకారులు, టీకాకారులు కొన్ని బృహస్పతి సూత్రముల నుదాహరించిరి. అవి ఇవి: "పృథివ్యప్ తేజోవాయువులు తత్త్వములు. వాటి సముదాయము వలన శరీరేంద్రియములు, విషయ ములు, సంజ్ఞ (చైతన్యము) ఉద్భవించును. కిణ్వాదుల నుండి మదశక్తి వలె వాటినుండియే చైతన్యము, విజ్ఞానము వచ్చును. చైతన్య విశిష్టమగు కాయమే పురుషుడు. కామ మొక్కటే పురుషార్థము. మరణమే అపవర్గము." చార్వాక సాహిత్యము నంతను కావలె నని దానిని ద్వేషించువారు నాశనముచేసి రని నెహ్రూ అభిప్రాయము (డిస్కవరీ ఆఫ్ ఇండియా 1956, పుట 100). ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్ర ములు, భగవద్గీతలలో ఆసుర దృష్టి లోకాయత వాదమే అయినచో, మనుస్మృత్యాదులలోని హైతుకులు లోకా యతులైనచో, కౌటిల్యుడు దీనిని పేర్కొనినందునను, ప్రాచీన పాళీ బౌద్ధ గ్రంథములలో లోకాయత సిద్ధాంతములు సంగ్రహముగ నున్నందునను ఇది అత్యంత ప్రాచీన దర్శనమని, ఇతర దర్శనము లన్నిటిపై ప్రభావము చూపినదని తెల్లమగును. 'సర్వదర్శన సంగ్రహము' లోను, 'షడ్దర్శన సము చ్చయ' మందును మాధవ హరిభద్రులు చార్వాక మతము నభివర్ణించిరి. గుణరత్న మణిభద్రాది తత్ టీకాకారులు దానిని విపులీకరించిరి. అయితే చాల వైదిక బ్రాహ్మణ గ్రంథములలో దొరకునది లోకాయత దర్శన యథార్థ వర్ణన గాదు. దాని విడంబనమో, వ్యంగ్య చిత్రమో మాత్రమే; దానితోపాటు దూషణ లును. బౌద్ధ జైనుల పట్ల వారి వైఖరియు ఇదియే కదా! అద్వైతము పట్ల కొన్ని విశిష్టాద్వైత, ద్వైత గ్రంథములలో కన్పడునది ఇట్టి ధోరణియే అయితే లోకాయతమును గూర్చి మనకు తెలియవచ్చున దంతయు దానిని ఖండింపబూనువారి గ్రంథములలో దొరకు సామాగ్రి యగుట విచారకరము.

**లోకాయతుల ప్రమాణము :** లోకాయతులు ప్రత్యక్ష ప్రమాణమును మాత్రమే అంగీకరించి రని, అనుమానాది ఇతర ప్రమాణముల నన్నిటిని నిరాక రించి రని దర్శన సంగ్రహములలో సాధారణముగ చెప్పబడును. కాని మనుస్మృత్యాదులచేత హైతుకు లని పిలువబడినవారును, కౌటిల్యునిచే ఆన్వీక్షికిలో అంతర్భాగముగ చెప్పబడిన శాస్త్రమును హేతు

వాదమునకు, అనుమానమునకు ప్రాధాన్యము నీయలేదనుట అసంగతము. బుద్ధఘోష దను బౌద్ధ విద్వాంసుడు లోకాయతమును వితండవాద శాస్త్రముగ చెప్పినాడు. జయంతుడు కూడ దీనిని "వైతండిక కథైవాసౌ" అనినాడు. 'పక్ష ప్రతిపక్షములను పరిగ్రహించి ఇరువురి మధ్య జరుగు కథ వాదము. ప్రతిపక్ష స్థాపన వర్జితమైనది వితండము' అని న్యాయదర్శనము చెప్పును. వాదమందు పర పక్ష ఖండనముతో పాటు స్వపక్ష స్థాపనకై ప్రయత్న ముండును. వితండమందు స్వపక్షమనునది ఏదియు ఉండదు. ఈ రెండు విధములగు తర్కములందును లోకాయతులు ప్రవీణులై యుండవలెను. 'లోక ప్రసిద్ధమైన అనుమానము చార్వాకులకును అంగీకార్యమే. కాని కొందరి కభీష్టమగు లౌకికమార్గము నతిక్రమించు అనుమానము వారిచే నిషిద్ధము' అని పురందరుడు చెప్పినాడు. పరలోకము, మరణానంతర ఆత్మాస్తిత్వము, కర్మ ఇత్యాది సిద్ధాంతముల ప్రతిపాదనకు అనుమానము పనికిరాదని దీని యర్థము. నిత్య జీవితమున ఇహ లోకమున అనుమానము ప్రమాణమే. కాని అనుభవాతీత విషయములను - అవి ఉన్నను - రుజువు చేయుట కది ఉపకరింపదు. అతీంద్రియము లనుకొనబడు విషయములలో సాధ్యమునకు, లింగమునకు గల సాహచర్యము ఏ పరిస్థితిలోను గోచరము కాదు కాబట్టి వ్యాప్తి ఉండినను దానిని గూర్చి ఎరుగలేము. ఈ కారణములచే పురందరాది చార్వాకులు అలౌకిక విషయముల పట్ల అనుమానము నంగీకరింపలేదని వాదిదేవసూరి చెప్పినాడు.

"ధర్మచ్ఛద్మ ధూర్తులు, పర వంచన ప్రవణులు ఏదో ఒక అనుమానాగమాది దార్ఢ్యమును చూపి వ్యర్థముగా ముగ్ధజనులను స్వర్గాది ప్రాప్తిచే లభించు భోగప్రలోభనతో భక్ష్యాభక్ష్య గమ్యాగమ్య హేయోపాదేయాది సంకటమున బడవేసి, ముగ్ధ ధార్మికాంధ్యమును బుట్టింతురు. కాబట్టి ప్రత్యక్షము మాత్రమే మూలప్రమాణ" మని చార్వాకు లందురు. అనుభవాభావము గల వస్తు తత్త్వము గగన కుసుమము వలె ప్రమాణ పదవి నధిష్ఠింపదు. ఇంద్రియములచే అననుభూత మగుదాని నాదరించుచు, "స్వర్గ మోక్షాది సుఖ పిపాసానుబంధ చేతోవృత్తులై దుశ్చర తర తపశ్చరణాది కష్టపిష్టికచే తమ జన్మను గడుపుకొనువారు మహా సాహసమే చేయుచున్నారు." "అప్రత్యక్షము కూడ అస్తిత్వముగా అభ్యుపగమ్యమైనచో జగత్తే నిరాకరింపబడును. దరిద్రుడు కూడ తనకు స్వర్ణరాశి కలదని భావించి అవలీలగా దారిద్ర్యమును అణగద్రొక్క వచ్చును. దాసుడు కూడ తన చిత్తమున స్వామిత్వ మవలంబించి కింకరత్వమును నిరాకరింపవచ్చును. ఎవడును తన కనభిమతమును అనుభవింపడు. అప్రత్యక్షమున కస్తిత్వ మిచ్చుట వలన సేవ్య సేవక భావము, దరిద్ర ధనిక భావము ఉండకపోవును. జగద్వ్యవస్థ విలోపింపవచ్చును. కాబట్టి సుస్థిర మగునట్టి ఇంద్రియ గోచరమే ప్రమాణము." ప్రత్యక్ష దృష్టమే వస్తు తత్త్వము అను వారి సిద్ధాంతమునకు కారణము లివి యని మణిభద్రుడు వ్రాసినాడు. (షడ్దర్శన సముచ్చయ టీక, 81) 'అప్రత్యక్షము కూడ ఉన్నదనుకొనినచో దరిద్రుడు తన దారిద్ర్యమును, దాసుడు తన కింకరత్వమును విస్మరింపవచ్చును. అమాయకులలో మతాంధత్వము ప్రబలును' అని చార్వాకు లనినట్లు మణిభద్రుడు వ్రాయుట గమనింపదగినది. భావవాదము, మతము - ఇవి ఇహలోక కష్టములను మరపించి, శ్రమజీవులకు నల్లమందుగా పనిచేసి, వారిని చిరదాసత్వములో ఉంచి, ధనిక ధూర్తుల దాసులుగా వారిని ఎప్పటికిని ఉంచు నను కొందరు అధునిక భౌతికవాదుల మతము ఇక్కడ స్మరణీయము.

**అనుమాన నిరాసము :** అనుమానమునకు వ్యాప్తి జ్ఞానము ఆధారము. 'వ్యాప్తి ఎటుల జ్ఞాన విషయమయినది? అది ప్రత్యక్షముచే తెలియరాదు. అనుమానముచే - తెలియవచ్చు' ననిన అనవస్థా దోషము వచ్చిపడును. మరి ఇతర ప్రమాణములు అనుమానమందే గతార్థము లని వైశేషికాదులే ఒప్పుకొనిరి. ప్రత్యక్షముచే ఇంద్రియముచే సంప్రయుక్త

మగు విశేష విషయము తెలియవచ్చును. భూత భవి ష్యత్తుల లోని విశేష విషయములు (వ్యక్తులు) అన్నియు తెలియవు. కాబట్టి వ్యాప్తి జ్ఞానము ప్రత్య క్షమువలన ఏర్పడదు. 'వ్యాప్తి సామాన్యజ్ఞాన' మని నచో, ఏ పదార్థముల మధ్య సాహచర్యమున్నదో అది ముందే తెలిసియున్న ఇక అనుమాన మెందుకు? అప్పు డనుమానము సిద్ధసాధనము (petitio principii) ("విశేషేఽనుగమాభావః, సామాన్యే సిద్ధ సాధ్యతా"). కాక, సామాన్యత్వముల అవినా భావము గ్రహింపబడినను వ్యక్తుల అవినాభావపు అభావ ముండనే ఉండును. ఈ విధముగా మరికొన్ని దర్శనములు శబ్ద ఉపమానాదులను అనుమానమం దంతర్భూతము చేసినట్లు అనుమానమును లోకాయ తము ప్రత్యక్షమందే గతార్థము చేయును. అను మానము స్వతంత్ర ప్రమాణము కాదు. ప్రత్యక్ష, అనుమానములలో ప్రత్యక్షమే బలీయము, మూల భూతము. అనుభవాతీత విషయములలో అనుమాన మసలు పనికిరాదని చార్వాకు లందురు (మీ మాంసా వేదాంతములు కూడ ధర్మ బ్రహ్మల విషయములో అనుమానము స్వతంత్ర ప్రమాణము కాదనియే అనును.)

**శబ్దప్రమాణ నిరాసము** : శబ్దప్రమాణమును లోకాయతులు అంగీకరింపరు. ఏలన - ఆప్తపురుషుల వచనములే శబ్దప్రమాణ మైనచో ఆ వచనములను వినుట లేదా చదువుట ప్రత్యక్షము. వాటిని విశ్వసిం చుట ఆ వచనములు ప్రత్యక్షముచే రూఢియైనప్పుడో లేదా వారు సత్యవాదు లని నమ్ముట చేతనో కల్గును. ఈ రెండవది అనుమానము. మీమాంసకుల వలెనే వీరును సర్వజ్ఞు లుందు రని తలపరు-అసంభవము కాన. కాబట్టి సర్వజ్ఞుడు రచించిన ఆగమము ఉండ జాలదు. స్వతంత్ర నిత్య గ్రంథము ఉన్న దను కొనుట, దానికి కర్త లేదనుట హేతువులచే పొసగదు. నైయాయికాదులే వేదమునకు కర్త లేదనుట హాస్యా స్పదమనిరి కదా! కాక శబ్దప్రమాణముచే ఏమి తెలియ వచ్చును? లోకస్థ విషయము లనిన అవి ఎవరికైన అనుభవైక వేద్యములే. అదృష్ట అననుభవనీయ విష యము లనినచో అవి ధూర్తులో, మూర్ఖులో చెప్పినవి కావలెను. లేదా మనోరంజన సామగ్రియైన కావలెను. ఇది లోకాయత వాదము.

'వేదములందు అనృత వ్యాఘాత పునరుక్త దోషము లుండుటచేత కర్మ కాండను కొందరు వైది కులు, జ్ఞానకాండను మరికొందరు వైదికులు అప్ర మాణ మని ప్రతిక్షేపించుటవలనను, అగ్నిహోత్రా దులు జీవికామాత్ర ప్రయోజనము కల వైనందునను వేదములు అప్రమాణములు' అని చార్వాక మతము. జర్ఫరీ తుర్ఫరీ[1] మొదలగు అర్థ రహిత శబ్దముల నుపయోగించుట వలనను, యజ్ఞ యాగములందు ఘృణిత కార్యకలాపములు[2] విధించుటచేతను, ఏదో మిషచే మాంసాదుల భక్షణము ఉపాదేయ మనుట చేతను వేదత్రయ కర్తలు భండులు, ధూర్తులు, నిశా చరులు అని చార్వాకులు అనెదరు' అని మాధవుడు వ్రాసినాడు.

**దేహాత్మ వాదము** : సమస్త వస్తుజాతము నాలుగు భూతముల సముదాయము మాత్రమే సని, ప్రపంచమందు గల దాని కంతకు స్వభావము తప్ప మరేమియు కారణము లేదని లోకాయతుల మతము. మయూరముల విచిత్ర వర్ణమునకు, కోకిలల ప్రకూ జితమునకు స్వభావము తప్ప మరేమియు కారణము లేదు (సర్వ సిద్ధాంతసార సంగ్రహము. 2. 5.). స్వభావము వలననే జగద్వైచిత్ర్యము ఉత్పత్తియై, స్వభావము వలననే విలయ మందును (భట్టోత్పలుని బృహత్సంహిత టీక, 1. 7.). లోకాయతులు 'కార్య కారణ భావము నిర్దిష్టము; నిశ్చయము' అని ఒప్పు కొనరు. కార్య మనబడు ప్రతిదానికిని అనేక సాధక ములు ఉండును. ఇందేది కారణమో, ఏది కారణము కాదో తెలియదు. వస్తువుల ఉత్పత్తి ఆకస్మాత్తుగనే జరుగును (న్యాయ కుసుమాంజలి, 1. 5).

'శరీరము లేనిదే ఎక్కడను చైతన్యముండదు. శరీరమందు మాత్రమే చైతన్యము కానవచ్చును.

---

1. ఋగ్వేదము, 10. 10. 6 - 6,

2. ఉదా : అశ్వమేధమును "అశ్వస్యాత్ర తు శిశ్నంతు పత్నీగ్రాహ్యం ప్రకీర్తితమ్"

అన్వయ వ్యతిరేక పద్ధతిలో ఇట్లు చైతన్యము శరీర ధర్మ మని తెలు' నని చార్వాకవాదము. "అన్న పానాదుల వలన, ఔషధుల వలన చైతన్యము వికాసము నొందుట చూచున్నాము. ఇట్లు భౌతిక పదార్థములకును, దానికిని అవినాభావ సంబంధము కానవచ్చును. ప్రతివాడును 'నేను లావుగనున్నాను' 'నేను నల్లటివాడను' అని తనను దేహముగనే కనుగొనుచున్నాడు. దేహాత్మల సామానాధి కరణ్యము అనుభవ సిద్ధము. లావుగ నుండునది, నల్లటిదిదేహమే కాబట్టి దానితో పురుషుని తాదాత్మ్యము వ్యవహార సిద్ధము. నిత్యానుభవ వేద్యము. ఇక 'నా శరీరము' మున్నగు వ్యవహారము ఔపచారికము. తాంబూల పూగచూర్ణముల కలయిక వలన ఎర్ర రంగు వచ్చునట్లు, కిణ్వాదుల వలన మదశక్తి వచ్చునట్లు జడ భూతముల వికారములందు చైతన్య ముదయించును" (సర్వ దర్శన సంగ్రహము, సర్వసిద్ధాంత సార సంగ్రహము).

'వేదాంతసార' కర్త సదానందుడు నాలుగు రకముల చార్వాకులున్నా రని వ్రాసినాడు. స్వశరీర రక్షణయే ప్రధాన లక్ష్యముగా ఎల్లరకు నుండుటచేత, దేహాత్మల అభేదము అనుభవ గమ్యము గాన స్థూల శరీరమే ఆత్మ యని కొందరు అనెదరు. ఇంద్రియములు లేకున్న శరీరమందు చలనము లేదు గావున 'నేను కాణుడను, నేను బధిరుడను' అను ఇంద్రియములచే గలిగిన అభేదానుభవము వలన, ఇంద్రియములే ఆత్మ యని మరి కొందరి మతము. ప్రాణము లేనిదే ఇంద్రియాదులలో చలనము ఉండదు కాబట్టి 'నా కాకలి, నాకు దప్పిక' యను అనుభవమున్నది. కాబట్టి ప్రాణమే ఆత్మ యని కొందరి వాదము. మనస్సు నిద్రించినప్పుడు ప్రాణాదుల అభావము చేతను, 'నేను సంకల్పము గలవాడను, నేను వికల్పము గలవాడను' అను అనుభవము చేతను మనస్సే ఆత్మ యని మరికొందరి సిద్ధాంతము. వీటన్నిటికిని సరిపోవు శ్రుతి వాక్యములనుకూడ ఆతడుదాహరించెను.

దేహాత్మ వాదమును పరిగ్రహించిన అసురులు స్వశరీరముల పూజనే చేయుచుండెడివా రని, భోజనాదులే యజ్ఞములుగ పరిగణించుచు జీవయాత్రయే కర్మకాండగ గ్రహించి రని ఋగ్వేదము తెలుపును. మాయవులైన వారు తమ నోళ్ళలోనే యజ్ఞమందార్యులు వేయు పదార్థముల నుంచుకొనెడివా రని, 'మనము ఇంకెవరికి ఆహుతులను, హవిస్సులను అర్పింపవలెను?' అని చింతించి తమ నోళ్ళలోనే వాటి నాహుతి ఇచ్చి రని వైదిక వాఙ్మయమున కలదు (ఋగ్వేదము, 1. 51. 5. అచ్చటనే సాయణుడు వాజసనేయా కౌషీతకుల నుదాహరించెను. శతపథమందును గలదు. సేక్రేడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్ట్, XLI. 1 ; XLIV. 22.). ఘృత మాంసాది ఉత్తమ పదార్థములను కొందరు అగ్నిలో వ్రేల్చుచుండ హైతుకులు వాటిని తమ నోటిలోనే వేసికొని, 'మేమే పూజనీయులము, మమ్ము మేమే ఆరాధించుకొనెదము' అని ఘోషించుటలో ఆశ్చర్యము లేదు. ఇది అన్యులకు విపరీతముగ, రాక్షస కృత్యముగ కనపడుటయు చోద్యము కాదు. 'యజ్ఞ మన జంతు బలులు, అగ్నిహోత్రము కలది మాత్రమే కాదు. భోజనము, స్వాధ్యాయము, సంభోగము - ఇంత ఏల జీవిత మంతయు విద్వాంసులకు యజ్ఞమే' అను ఊహ ఆత్మ వాదు లగు హైతుకులకు కూడ ఉన్నట్లు ఉపనిషత్తులు, భగవద్గీత తెల్పుచున్నవి కదా!

**వైదికమత నిరాసము :** వైదిక కర్మలను గూర్చి లోకాయతుల అభిప్రాయము ఈ క్రింది విధమున ఉండిన వట : "స్వర్గాపవర్గములు, ఆత్మ, పరలోకము లేవు. వర్ణాశ్రమాదుల క్రియలు ఫలముల నీయవు. అగ్నిహోత్ర, సన్న్యాస, భస్మ లేపనాదులు బుద్ధి పౌరుష హీనులకు జీవికా మాత్రములు. జ్యోతిష్టోమమున జంపబడిన పశువు స్వర్గమునకు పోవునట్లైన అందులో యజమాని తన తండ్రి నేలజంపడు? మృత జీవులకు శ్రాద్ధము తృప్తి నీయగల్గినచో ప్రయాణమై వెళ్ళు వారికి పాథేయము తీసుకొని పోవలసిన అవసరమేమి కలదు? ఇంట్లో నున్నవారు పర

దేశమందున్నట్టియు, పొరుగూరులలో ఉన్నట్టియు తమ బంధువులకు శ్రాద్ధములు చేసి తృప్తి నీయరాదా? ఇచ్చట దానములవలన స్వర్గస్థులు తృప్తి పొందెద రనినచో మేడపై నున్నవారి పేరుతో క్రిందనున్న వారు దానమిచ్చిన వారును తృప్తిపొందవలెను కదా! ఈ దేహమును విడచి జీవుడు పరలోకమున కేగినచో, అతడు బంధుప్రేమ సమాకులుడై తిరిగి ఎందుకు రాడు? మృతులకు ప్రేత కార్యాదు లన్నియు బ్రాహ్మణులు తమ జీవనోపాయమునకై విధించు కొనిరి*. వాటికి మరొక ప్రయోజనము లేదు" (సర్వదర్శన సంగ్రహము).

పూర్తిగా హైతుకులైన చార్వాకులు ఎట్టి క్రియా కలాపములందును సంలగ్నులు కాకపోయినను, వారి లోను కొందరు యజ్ఞములను చేయుచుండిరి. నిరీశ్వరు లగు మీమాంసకులు - దేవతల అస్తిత్వమును కూడ నంగీకరింపని మీమాంసకులు-యజ్ఞముల చేయుచుండిరి కదా! అట్లే ఈ అసురులును అట్టి వారిని గూర్చియే గీత "నామ యజ్ఞములచే దంభముతో విధి లేకుండ యజింతురు" అని చెప్పినది (XVI-17). లోకాయతులలో కొందరు మంత్రధారకు లని, యజ్ఞము లందు మంత్రములందు నిష్ణాతు లని సద్ధర్మ పుండరీకము, దివ్యావదానము అను బౌద్ధ గ్రంథములలో కలదు. అట్లే లోకాయతులు కొందరు అభిచార, వశీకరణ, సంప్రయోగ, ఇంద్రజాలాది క్రియలు చేయుచుండెడివా రని వినయపిటిక మందలి 'చుల్లవగ్గ', 'మహాశీలా'దులందు కాననగును. భౌతిక వాదులు కూడ పక్షిప్రశ్నలు, జ్యోతిషము, సాముద్రికము, అభిచార వశీకరణ విద్యలు (Magic) అభ్యసింప వచ్చును. అంధ విశ్వాసములు. అవినీతి, కుమార్గములు వీటిని ఎవరైనను భౌతిక వాదులుగాని, అధ్యాత్మవాదులుగాని అవలంబింప వచ్చును. ఈశ్వరునియందు, ఆత్మయందు ఆస లేని అనేకులు నేడు తాయెత్తులను కట్టుకొనుట, 13వ తేదీన పయనింపకుండుట, సాముద్రికము చూపించుకొనుట, గృహనిర్మాణ మప్పుడు వాస్తువిద్య నాదరించుట జూచినచో లోకాయతులలో కొందరు యజ్ఞ యాగములను మంత్ర తంత్రములను అభీష్ట సిద్ధికై అభ్యసించుచుండి రనుట ఆశ్చర్యము కాదు. ఇట్టి వారి కార్యములు ఆరాధన (worship) కాక, కౌసృతికము (Magical action) అగును. 'కొన్ని విధములుగ ఆచరించుటచే బలాత్కారముగ కొన్ని సంఘటనలు జరుగును (ఉదా: వాన కురియుట, శత్రువు చచ్చుట, పొలము బాగుగపండుట, ప్రేమించి నది వశమగుట). ప్రకృతిని, లేదా స్వభావమును, మనుష్యులను హఠముగ మన ఇచ్ఛవచ్చినట్లు విపరీతముగ వర్తించునట్లు చేయుటకు రహస్య మార్గము లున్నవి' అను విశ్వాసము కౌసృతిక కృత్యములకు కారణము. జగత్కర్త, నియంత లేడనుకొను వారే కౌసృతిక కృత్యములను తరచు చేయుదురు. ఋతమందు, అనుల్లంఘనీయ జగన్నియమమందు విశ్వసించువారు కౌసృతికము నవలంబింపరు.

**లోకాయత మత విశిష్టత** : బౌద్ధ సాంఖ్యాది కొన్ని భారతీయ దర్శనములు, కొంతవరకు వేదాంతము జీవితములోని దుఃఖ దోషానుదర్శనము చేసి, సంసారము నొక విపత్సాగరముగా వర్ణించి, దీనిని కడతేరుట ఎట్టు లని వాపోయినవి వేద సంహితలు, చాల వరకు హిందూ దృక్పథము అట్లుగాక చతుర్విధ పురుషార్థములకును సమాన మగు విలువ నిచ్చి, వాటి నన్నిటిని ఉపలబ్ధి చేసికొనుటయే మానవుని సరియైన లక్ష్యము అనినవి. ఇక లోకాయతులు అపవర్గమును పరిహరించి, త్రివర్గ సాధననే పనిగా పెట్టుకొనిరి. వారికి దేహోచ్ఛేదమే మోక్షము. అది ఎటు తిరిగినను అందరికిని సిద్ధించును. లోక సిద్ధ రాజశాసనమే ఈశ్వర శాసనముగా తలచి దానిని పాటింప వలె నని, తత్తత్కాల దేశములందు ప్రచారమందున్న న్యాయ విధులను పాటించుటే ధర్మ మని వారి అభిమతము. 'రాజు, లేదా శాసనకర్త నిర్మించు విధులే ధర్మము. అవి అపౌరుషేయములో, నిత్యములో కావు. ఇట్లు

* వాల్మీకి రామాయణము అయోధ్యాకాండలో (108 వ సర్గ) జాబాలి యను 'బ్రాహ్మణోత్తముడు' ఇటువంటి వాదనయే చేసినట్లు కలదు. దీనివలన ఈ వాదనలు చాల ప్రాచీన మని తెలియును.

రాజ నియమ బద్ధ మగు సౌఖ్యమును - అర్థ కామము లను - సాధింపు' మని లోకాయతము బోధించినది.

ప్రపంచమందు పొంద వీలగు సుఖ మంతయు దుఃఖ మిశ్రిత మని చార్వాకులు ఎరుగుదురు. "అవర్జ నీయ మగు దుఃఖము కల దని ఉన్నపాటి సుఖము వదలుకొన నగునా? ముళ్ళు ఉన్న వని చేపలు పట్టుట, తినుట మానెదరా? పొట్టు, తవుడు ఉండు నని ధాన్యములు పండించుట, సేకరించుట మానెదరా? అడవి పందులు, పశుపులు ఉన్న వని పంటలు పండిం చుట మానరు. యాచకులు వచ్చెద రని అన్నము వండుకొనుట మానరు. విషయ సంగముచే లభించు సుఖము దుఃఖోపస్పృష్ట మని వీడుట మూర్ఖుల విచారము. పైన తుష కణములచే ఉపహితము లని లోపల సితోత్తమ తండులములు గల ధాన్యమును ఏ హితార్థియు వీడడు. అట్లు దుఃఖ భయముచే అనుకూల వేదనీయ సుఖమును వదలువాడు పిరికి పంద. పశువు వలె మూర్ఖుడు'' (సర్వ దర్శన సంగ్రహము). "చచ్చిన తిరిగి రాము కాబట్టి బ్రతికి నన్నాళ్ళు సుఖముగ బ్రతుక యత్నింపవలెను. అదృష్ట పారలౌకిక సుఖవాంఛతోడనో, పుణ్యాపాపము లను భ్రమచేతనో బహు విత్తవ్యయ శరీరాయాస సాధ్యము లగు క్రియా కలాపములందు తగుల్కొనుటయు, దృష్ట ఇహలోక సుఖమును వీడుటయు మూర్ఖత్వము. రాజ శాసన మర్యాదల నుల్లంఘింపక సుఖముగ బ్రతుక యత్నించుటే ధర్మము." ఇది లోకాయత దర్శన సారము.*

# తీర్థంకర దర్శనములు

'జగత్కారణ మేమిటి? కాలమా, స్వభావమా? నియతియా, యదృచ్ఛయా? భూతములా (పృథి వ్యాదులా), పురుషుడా? వీటి సంయోగమా?' అని జగత్కారణమును గురించి వివిధ మీమాంసలున్నట్లు చివరి ఉపనిషత్తులలో నొకటగు శ్వేతాశ్వతరము వక్కాణించినది. సౌందరనందమున అశ్వఘోషుడు వీటికి ప్రకృతివాద మనుదాని నొకదానిని కలిపెను. ఆచారాంగసూత్ర టీకలో శీలాంకుడు భూతవాద, పురుషవాదముల స్థానమున ఈశ్వరవాద, ఆత్మవాద ములను పేర్కొనెను. నానావిధ వాదములు భారత దేశమందు విరివిగా నుండినట్లు ప్రాచీన జైన, బౌద్ధ గ్రంథములవలన తెలియవచ్చును. వీటిలో ముఖ్యమైన వన్నియు మధ్యకాలిక ఉపనిషత్తులకు సమకాలికములు. అన్నియు బుద్ధునికి పూర్వమున్నవి వాటిలో కొన్నిటి ప్రవర్తకులు బుద్ధుని సైతరమువారు. కొంద రింకను ప్రాచీనులు. వీరందరును "శ్రమణబ్రాహ్మణసంఘాధి పతులు, గణాధిపతులు, గణాచార్యులు, ప్రసిద్ధులు, కీర్తిగలవారు, తీర్థంకరులు, అనేకమందిచే సమ్మా నితులు'' (సంయుత్త నికాయము, 3. 1. 1.). వీరు వ్రాసిన గ్రంథము లేవియు నేడు దొరకుట లేదు. దిఙ్మాత్రముగ అచ్చటచ్చట బౌద్ధ జైన గ్రంథములు వీరి సిద్ధాంతములను సంగ్రహించినవి. అటుల చేయు టలో వాటి ఖండనమే ఆ గ్రంథముల ఉద్దేశ్యము గావున ఈ తీర్థంకరుల జీవితము గాని, బోధలు గాని యథాతథముగ వర్ణింపబడలేదు. ఒకప్పుడు భారత దేశమున జనసహస్రములచే గురువులుగా ఎంచబడి అనుసరింపబడిన ఈ మహామనీషులగు స్వతంత్రచింత

* ఈ దర్శనమును గురించి, తీర్థంకర దర్శ నములను గురించి ప్రామాణిక గ్రంథములు అరుదు. ఒకప్పు డివి ఈ దేశమున చాల ప్రభావము చూపి నట్టివి. తక్కిన అన్ని దర్శనములను కొంతవరకు తీర్చినవి. అసంఖ్యాకులు నేడాచరణలో నుంచినది వీటిలో మొదటియే. కాబట్టి వీటిని గూర్చి వీలైనంత విపులముగా చెప్పినాము.

కుల బోధలు ఈ గతిలో నుండుటచే భారతీయ దర్శనేతిహాసము అసంపూర్ణముగనుండుట విచారకరము.

తన కాలమునాటి దార్శనికులను జైన తీర్థంకరుడగు మహావీరుడు మూడువిధములుగ విభజించెను: అక్రియావాదులు, అజ్ఞానికులు, వినయవాదులు అని (ఉత్తరాధ్యయన సూత్రము, XVIII,23). దాదాపుగ ఇటులనే బుద్ధుడును దృష్టివాదులు, విచికిత్సకులు, శీలవ్రత పరామర్శకులు అని వారిని విభజించెను (రతన సుత్తము ; ధమ్మ సంగణి). క్రియా జీవాది పదార్థములు లేవనువారు అక్రియావాదులు. వీరు క్రియకు (కర్మకు) శక్తి లేదని, జీవ పదార్థము (అజీవమునకు భిన్నమగునది) లేదని అందురు. వీరిలో ఏకవాదులు, అనేకవాదులు, నిత్యవాదులు, సముచ్ఛేదవాదులు - ఇటుల అనేక రకములు కలరు. కుశలులయ్యు (తెలివికలవారయ్యు) సత్యము నెరుగక, విచికిత్స (preplexity, puzzlement) ను బాపుకొనలేక, తెలియకయే తెలియని శిష్యుల కజ్ఞానమును పరీక్షింపక మృషావాదన చేయువారు అజ్ఞానికులు (agnostics) వినయము (formalistic moral discipline) వలననే పరలోకము నపేక్షించుచు, నైతిక సూత్రముల ప్రకార మాచరించుచు, అర్థ (కోరిన) విషయము లన్నియు వినయము వలననే సమకూడు ననుకొనువారు వినయవాదులు. వీరికి నిజముగా సత్యము తెలియదు. ఎవరు మంచివారో ఎరుగరు (సూత్రకృతాంగము-శీలాంకుని టీక). ఏదో ఒక సిద్ధాంతమును ఉపపాదించి 'ఇదియే సత్యము, తక్కిన దంతయు మోఘము' అను దృష్టి కలవారు దృష్టివాదులు, లేదా దృష్టిగతులు (dogmatists). 'లోకము నిత్యము', 'లోకము అనిత్యము'; 'ఆత్మ శాశ్వతము, అనిర్మితము, అవధ్యము'; ఆత్మ అశాశ్వతము, మహాభూత నిర్మితము, ఉచ్ఛిన్నమగునది', - శాశ్వతవాద, ఉచ్ఛేదవాద దృష్టుల కివి యుదాహరణములు (దీఘ మజ్ఝిమ నికాయములు). ఏదియు నిశ్చితముగ చెప్పక, అర్థ వైకల్యమును వక్రోక్తులను వాక్ఛలములను ఆశ్రయించి, ప్రతి సమస్యపట్లను తాటస్థ్యము వహించి, పాదరసమువలె చిక్కక, జలవ్యాలము (eel) వలె చిక్కినను జారిపోవుచు నుండెడువారు విచికిత్సకులు (sceptics). వీరిని సంశయభ్రాంతు (అవిద్య) లు వదలవు. వీరి విచికిత్స ఒక విధమైన మనో విక్షేపము. సత్యమునకు, ప్రజ్ఞకు అడ్డంకి. వీరిని అమరావిక్షేపకులు[1], వాచవిక్షేపకులు అని కూడ బౌద్ధ గ్రంథములు అనినవి. శ్రద్ధ, విచారము (judgement), దర్శనము (insight), భావన (introspection) వలన విచికిత్స నివారింపబడును. మనస్సు నావరించి, బంధించి ప్రజ్ఞా దృష్టికి అంతరాయము కల్గించునది విచికిత్స. అశ్రద్ధ, అనిశ్చయత, సంశయము, భ్రాంతి విచికిత్సకుల కుండును (దీఘ నికాయము, ధమ్మ సంగణి, విభంగము). శీలము లేదా శుద్ధి కేవలము నైతిక నియమములను (అహింస, అస్తేయాదులు) పాటించుట వలననే అబ్బునని తలచువారు శీలవ్రత పరామర్శకులు. 'ఏదో ఒక అంగీకరింపబడిన నైతిక చట్టమునకు గ్రుడ్డిగ కట్టుబడి యుండుటే ధర్మము, వినయము.' అని తలచువారు వీరు. ఉదాహరణమునకు - యజ్ఞయాగాదులు, తీర్థయాత్రలు, గ్రహణ సమయమున స్నానాదులు, జ్యోతిష వాస్తుశాస్త్రముల పాటించుట - ఇదియే నైతికత అనుకొనువారు. వారి కంటె కొంచెము మెరుగైన వారు శీలమాత్రమునే ముఖ్యమని తలచువారు. హింసా స్తేయాదులు వదలినంతనే ధర్మసాధన జరిగినదని తలచువారు శీలవ్రత పరామర్శకులు (అవే గ్రంథములు). 'ఇవి అల్ప విషయములు, పెద్ద విలువ లేనివి, శీలమాత్రములు. ఇంతకంటె గంభీరమైన, సూక్ష్మమైన, జ్ఞానులకు మాత్రమే తెలియనగు విషయములు కల'వని బుద్ధుని అభిప్రాయము (దీఘ నికాయము, శీలఖండము). మహావీర, బుద్ధులు తమ కాలమందున్న దర్శనముల

---

1. అమరావిక్షేప మనునది ఒక రకపు చిన్న చేప. ఇది చేతికి తొందరగా చిక్కదు. చిక్కినను జారిపోవుచుండును. వాదమందు ఏదియు స్పష్టముగా నొప్పుకొనక విమర్శ కందక జారుకొను చుండువారు అమరావిక్షేపకులు.

నీ రీతిగ విమర్శాయుతముగ విభజించిరి. తమవి కాక తక్కిన దర్శనము లన్నియు వీటిలో నేదో యొక తరగతికి చెందునని వారి భావము. ఉదాహరణము నకు శతపథాది బ్రాహ్మణ గ్రంథములలో నభివర్ణిత మగు మతము వినయవాదము క్రిందకు వచ్చును. అట్లే ఆత్మ నిష్క్రియము, నిరంజనము, శాశ్వతము అను ఏకదేశీయ ఔపనిషద వాదము అక్రియావాదము క్రిందకు వచ్చును. 'కర్మ ఆత్మకంటదు, ఆత్మ సాక్షి, నిర్గుణము' అని కదా ఆ వాదము.

జైన బౌద్ధ గ్రంథములలో అతి ప్రసిద్ధులుగ చెప్పబడిన తీర్థంకరులు[1] అయిదుగురు : పూర్ణ (పూరణ) కాశ్యపుడు, మక్ఖలి గోశాలుడు, అజిత కేశ కంబలుడు, ప్రకృథ కాత్యాయనుడు, సంజయ వేలట్ఠి పుత్త్రుడు. వీరల దర్శనముల నిక ఉటంకించెదము. వీరందరును క్రీ. పూ. 523 కంటె ముందున్నవారే. వీరందరును సమకాలికులచే గౌరవింపబడినవారు; ఎంతో శిష్యబృందము కలవారు; సంప్రదాయ ప్రవర్తకులు.[2]

**పూర్ణ కాశ్యపుడు :** బుద్ధుని 16వ ఏట ఇతడు శ్రావస్తి వద్ద నీటియందు దూకి మృతుడాయె నని ఒక గాథ కలదు. ఇతడొక దాసుడుగా మొదట నుండెనని బుద్ధఘోషుడు వ్రాసినాడు. ఇతని దర్శ నము అహేతువాద మని ఆనందుడు తలచినట్లు అంగుత్తర నికాయమున కలదు. 'దీఘనికాయ' మందలి సామన్న ఫలసుత్తము ఇతనిది అక్రియా వాద మనినది. జైనుల సూత్రకృతాంగమును అట్లే చెప్పినది.

అతని సిద్ధాంత మిది : కర్మ చేయునప్పుడు గాని చేయించునప్పుడు గాని చేయునది ఆత్మ కాదు. ఆత్మ అకర్త. కాబట్టి మంచిచెడుగులలో ఏమి చేసినను అది ఆత్మ నంటదు (సూత్రకృతాంగము). హింస, అసత్యభాషణ, పరస్త్రీగమనాదు లేవి చేసినను పాపము లేదు. సత్య సంయమ యజ్ఞ దానాదుల వలన పుణ్య ముండదు (దీఘ నికాయము). శీలాంకుడు దీనిని సాంఖ్య సిద్ధాంతముగా చెప్పెను.

బ్రహ్మజాల సుత్తమున పూర్ణకాశ్యపుని అధీత్య సముత్పాదవాదము బుద్ధుని ప్రతీత్య సముత్పాదవాద ముతో పోల్చబడినట్లున్నది. సంయత నికాయమున కాశ్యపుని వాదము 'అహేతు అప్పచ్చయ వాద'మని చెప్పబడినది. కశ్యపుని వాదము ప్రకారము అసత్తు నుండి సత్తు, శూన్యమునుండి వస్తువులు ఉత్పత్తి యగును. ప్రతీత్య సముత్పాదము ప్రకారము అసత్తు నుండి వచ్చెడిది అసత్తే; శూన్యము నుండి శూన్యమే!

**మక్ఖలిగోశాలుడు** : ఇతడు ఆజీవక[3] సంప్ర దాయపు ముగ్గురు ఆచార్యులలో ఒకడు. మొదటి ఇరువురు నందవాత్స్య, కృశసాంకృత్యులు. ఆజీవ కులు అచేలులై (నగ్నులై), సంయమ జీవితము గడుపుచు సమస్త ప్రాణులపట్ల కారుణ్యముతో నుండెడి వారు. ఇతరుల ఆజ్ఞ నెప్పుడును పాటించువారు కారు. యాదృచ్ఛికముగ లభించిన అన్నము తినెడువారు. ఇతరులకు కష్టము కలుగకుండ దొరకినట్టి దానినే తినెడివారు. శుద్ధాహారమును తీసికొనెడివారు. మద్య మాంస మత్స్యములను తినెడివారు కారు (మజ్ఝిమ దీఘ నికాయములు).

గోశాలలో జన్మించుట వలన ఇతనికీ పేరు వచ్చినదని జైన బౌద్ధ గ్రంథములు చెప్పినవి. గోశాలుడు దాసుడుగా ఉండెడివా డనియు, ఒకనాడు నూనె పాత్రతో వచ్చుచుండ అతని యజమాని 'తత్ మా ఖలి' (దానిని పారబోయకుము) అని హెచ్చ రించినను అతడు నూనెను పారబోసి, యజమాని

1. జీవిత పథ నిర్మాతలు; సంసార సాగరము నకు ఘట్టములను, రేవులను ఏర్పరచిన వారు; తరణో పాయము కనిపెట్టినవారు; సంప్రదాయ ప్రవర్తకులు; జీవిత మార్గ నిర్దేష్టలు.

2. 'మిలిందప్రశ్న'లో వీరందరును మిలిందుని సమకాలికులుగా వర్ణింపబడినను అది నిరాధారమని పండితులనిరి.

3. ప్రత్యేక నియమములతో జీవయాత్ర సాగించు వారు.

కొట్టునను భయముతో పారిపోయి పరివ్రాజకు డాయె ననియు బుద్ధఘోషుడు తెలిపినాడు. 'మా ఖలి' అని హెచ్చరింపబడుటచే అతనికి మక్ఖలి యను పేరు వచ్చెను.

జైనుల భగవతీసూత్రముప్రకారము గోశాలుడు మంఖలి యను మంఖుని కొడుకు. మంఖుడనగా మాగధుడు. మంఖలికొడుకు గాన మక్ఖలి యనబడెను. ఇతడు జైన భిక్షువుగా నుండి చాలకాలము మహావీరుని వద్ద శిష్యుడుగా ఉండెనని, అతని కేమియు సిద్ధులు రాలేదని, ఈర్ష్యచే అతడు మహావీరుని చంప యత్నించెనని, ధర్మాంధతచే బ్రాహ్మణు లారాధించు మూర్తిపై మూత్రోత్సర్జన చేయగా శిక్షితు డాయెనని, చివరికి ఉన్మత్తుడై, అజాత శత్రువునకు వజ్జి సంఘమున ప్రధానులగు లిచ్ఛవీలకు జరిగిన ఘోర సంగ్రామ కాలమున మరణించెనని జైన గ్రంథములలో కలదు. వజ్జి సంఘ వినాశము - అదే చివరికి మిగిలిన ప్రధాన స్వతంత్ర సంఘము - అతని మనో వికలతకు కారణము కావచ్చును. నృత్య గీతములు అతని కిష్టమని, అవి రెండును అతని సంప్రదాయములో 'మార్గములు'గా ఎంచబడెనని, గోశాలుడు వీణావాదనమందు, నృత్య గీతములందు ప్రవీణుడని తెలియవచ్చుచున్నది. మొదట జైనుడుగా ఉండి ఆ మతమును వీడిపోవుటచే జైన గ్రంథములు అతనిని ఏహ్యవ్యక్తిగా చిత్రించి ఉండవచ్చును. బౌద్ధగ్రంథముల ప్రకార మతడు సమకాలిక లోకముచే సమ్మానితుడగు ఆచార్యులలో నొకడు. 'మహావీరుని కంటె ముందే అతనికి కీర్తి వచ్చినదని, అతని కంటె 16 ఏండ్లముందే మరణించెనని జైనగ్రంథములే చెప్పుటచేతను, ఆజీవకులది జైనులదానికంటె ప్రాచీన సంప్రదాయ మగుటచేతను గోశాలు డెన్నడును మహావీరుని వద్ద శిష్యుడుగా నుండలేదు' అని ఆధునిక పండితుల అభిప్రాయము.

మక్ఖలి (మస్కరి) యనగా గృహమును వీడిపోయి వెదురుకర్ర (దండము)ను గ్రహించినవాడు, సన్న్యాసి అని అర్థము పాణినీయ వ్యాకరణమున కలదు. అప్పుడు మక్ఖలి గోశాలి యనగా సన్న్యాసి యగు గోశాలుడని అర్థము. అశోకుని శాసనముల ప్రకారము, పతంజలి మహాభాష్యమును బట్టి గోశాలుని సంప్రదాయము వారి కాలము వరకు ఉండుచు వచ్చినదని, దాని అనుయాయులు మస్కరులని పిలువబడి రని తెలియవచ్చును. పార్శ్వనాథాది జైన తీర్థంకరుల బోధలు గోశాలుని, ఇతని బోధలు మహావీరుని, వైశేషికులను ఉపరక్తుల చేసిన వని విజ్ఞుల ఊహ. గోశాలుడు దార్శనికుడే గాక జీవశాస్త్ర పరిశోధనలు, భౌతిక తత్త్వమును గూర్చిన గవేషణలు చేసినవాడు. గ్రీసు దేశపు అరిస్టాటిల్ వలెనే ఇతడును నానావిధ చింతనా రీతులలో అగ్రగామి.

'వస్తువు లన్నియు మరణించు చుండును. తిరిగి నవ జీవనమును పొందుచుండును' అని గోశాలుని సిద్ధాంతము. దీనిని 'పౌత్త (పరివర్త) పరిహార వాద' మందురు. సర్వసత్త్వములు[1], సర్వప్రాణులు[2], సర్వభూతములు[3], సర్వ జీవములు[4] 'పరిణతి'ని జెందుచుండును. నానా ప్రకారములుగ వివిధాస్తిత్వ ప్రకారములను జెందుచుండును. గోశాలుని మతములో రాళ్ళు, దుమ్ము, లోహములు, నీళ్ళు, కప్పలు, పురుగులు, నిప్పు, గాలి, వృక్షజాతులు, పశు పక్షులు, మానవులు, దేవతలు-అన్నియు జీవము కలవియే; ఇంద్రియములు కలవియే. కొన్నిటిలో ఒక ఇంద్రియ ముండును; కొన్నిటిలో రెండు, మూడు, నాలుగు, అయిదు ఉండును. మానవునిలో పంచేంద్రియములు కలవు. వీటిలో కొన్ని జంగమములు, కొన్ని స్థావరములు. మనుష్యులను ఆరు 'అభిజాతులు'గా విభజింపవచ్చును. వారి వారి పరిస్థితులనుబట్టి, 'కాయములను' బట్టి, బాహ్యవస్తువుల ప్రభావముచే ఏర్పడిన మార్పును బట్టి అభిజాతులు నిర్ణయింపబడును. దొంగలు, హంతకులు ఇత్యాదులు

---

1. జంతువులు.
2. సేంద్రియ వస్తువులు.
3. అండజ గర్భజాది వివిధ రకములగు జీవులు.
4. వ్రీహి యవాదులు.

(ఈ నాలుగును బుద్ధఘోషుడు 'సుమంగళ విలాసిని' టీకలో చెప్పిన అర్థములు).

తక్కువ రకపు (నల్లని) అభిజాతివారు. వీరిది నీల కాయము. ఆజీవక తీర్థంకరులు పరమోత్కృష్ట మగు, స్వచ్ఛమగు తెల్లని అభిజాతివారు. వీరిది శుభ్ర శ్వేత కాయము (దీఘ నికాయము; భగవతీ సూత్రము).

సంధావించుచు (ఒక జన్మనుండి మరొక జన్మకు పరుగిడుచు), సంసరించుచు (జన్మ మృత్యు జన్మమను అనుపూర్వీక సతత పరివర్తనకు లోనగుచు), జీవులన్నియు 'శుద్ధి' చెంది 'దుఃఖాంతము' చేసికొనును. దీనిని 'సంసార శుద్ధి' వాద మందురు. అనగా నిష్ప్రయత్నముగ కేవలము సంసరణము (పున రపి జననం పున రపి మరణం) వలననే జీవులు పరిపూర్ణత (ముక్తి, నిర్వాణము, దుఃఖాంతము) నొందెదరను వాదము. జీవుల సంసరణము ఎల్లప్పుడును ఉన్నతి వైపునకే. పూర్ణత్వము వైపునకే పురోగమనము అని దీని భావము (దీఘ నికాయము; మహాబోధి జాతకము; మజ్ఝిమ నికాయము; భగవతీ సూత్రము). ఇది గోశాలుని సిద్ధాంతము.

'నియతి' వలననే విశ్వ మంతయు నియంత్రితమని గోశాలుని అభిప్రాయము. సత్త్వముల సంక్లేశము (చిత్త మాలిన్యము) నకు, చిత్త విశుద్ధికి కూడ హేతువు లేదు. బల వీర్య దార్ఢ్య పురుష పరాక్రమములు లేవు. తమ వశము, బలము, వీర్యముల ప్రమేయము లేకుండనే అన్ని ప్రాణులు (జీవులు) నియతికి వశములై జన్మ మరణములకు, సుఖ దుఃఖములకు లోనగుచున్నవి. శీల వ్రతముల వలన, తపో బ్రహ్మచర్యముల వలన సాధింపబడునది ఏమియు లేదు. సుఖ దుఃఖములు ద్రోణముచే కొలువబడి యున్నవి. సంసారమందు పెరుగుట, తరుగుట, ఉత్కర్షాపకర్షలు లేవు. దారపు బంతిని ఒక కొనను పట్టుకొని చేతితో విసరినప్పుడు దారపు పొడ వెంత వరకున్నదో అంతవరకే అది విప్పుకొని పడగలదు. ఆ విధముగనే జీవులు నియతిచే నిర్దిష్టవిధముగ విసరబడి సంసారమందు పడినారు. తమ ప్రయత్నముచే ముందుకు పోలేరు; వెనుకకు రాలేరు. మూర్ఖులుగాని, పండితులు గాని సంసరించుచు (ఆవాగమనము చేయుచు), నిర్ణీత సమయమునకే దుఃఖాంతము నొందగలరు. అంతవరకు నానా యోనులలో, అభిజాతులతో, కల్పములలో, లోకములలో పుట్టుచు గిట్టుచు ఉండవలసినదే. పురుష కారము వ్యర్థము; నిష్ప్రయోజనము. విశ్వము యొక్క మూల సూత్రము, సమస్త పరివర్తనల, చలనముల (change, motion) కారణము నియతియే. అందరును ఎప్పుడును దానికి వశులే (దీఘ నికాయము).

వస్తువుల 'సంగతి' (class or species)ని బట్టి, 'పర్యాయము'ను బట్టి, 'సంగతి'లో వాటి స్థానమును బట్టి వాటి ప్రవర్తన, ధర్మము ఉండును. అనగా వస్తువుల యొక్క స్వభావ, ప్రవర్తన, ఇతి హాసములు అవి ఏ జాతికి (సంగతికి) చెందునో దానిని బట్టి ఉండును. దీనిని బట్టి ప్రతి వస్తువునకు దాని స్వంత 'భావము' (స్వ భావము) ఒకటి ఉండును. అనగా ప్రతి వస్తువునకు నియతశక్తి యుండును. దానిని బట్టియే ఆ వస్తుగతి యుండును. దాని నతిక్రమించుట అసంభవము. లాభాలాభ, సుఖ దుఃఖ, జీవన్మరణములు అను ఆరు వైఖరులను ఎప్పుడును జీవుల నంటి పెట్టుకొని యుండును.

విశ్వమొక నియతిచే నిర్దిష్ట గతిని పరిణమించుచున్నది. అత్యంత హీన వస్తువు మనుష్యు డగుటకు 84 వందల వేల మహా కల్పములు పట్టును. హిమ బిందువు కూడ సుదీర్ఘ కాలమున తీర్థంకరుడుగా మారును. అయితే ఈ మార్పును తొందర పెట్టుట గాని, ఆపుటగాని అసంభవము. నరుని స్వేచ్ఛ అతని కర్మ నిష్ప్రయోజనములు. పుణ్య పాపములు జీవిత గతిని, విశ్వ పరిణామ క్రమమును మార్చలేవు. విశ్వమున యాదృచ్ఛికముగ ఏమియు జరుగదు. అంతయు పూర్తిగ నిర్ణీత విధినే జరుగును. మానవ స్వాతంత్ర్యము నియతిచే సీమితము. కాని అతడు త్కృష్ట జీవి గాన జినత్వమునకై యత్నింప వచ్చును. ఇంద్రియములు, మనస్సు, నైతిక ప్రవృత్తుల అభివృద్ధినిబట్టి మానవుడు ఎనిమిది 'పురుష భూముల' ద్వారా వికాసము నొందును. మానవుని అలవాట్లను బట్టి, కర్మలనుబట్టి అతని కాయములు, అభిజాతులు నిర్ణయింపబడును. కాబట్టి శ్వేతకాయ ప్రాప్తికై మను

ష్యుడు 'కాయ భావన',* 'చిత్త భావన'ల ద్వారా మాలిన్యమును పోగొట్టుకొన యత్నింపవలెను (పై పుస్తకములు; విశేషించి మజ్ఝిమ నికాయము). ఆజీవకులు విశుద్ధ జీవితము గడుపువారు.

బాల్యమునుండియు నరుడు క్రమ క్రమముగా ఎట్లు వ్యక్తిత్వమును, వివేకమును, ఇంగిత విమర్శలను, జ్ఞాన ప్రజ్ఞలను పొందునో గోశాలుడు వివరించి, పరిపూర్ణత నొందుటకు నరునకు ఎనిమిది దశలు (పురుష భూములు) కలవని చెప్పెను. ఒకేసారి ఎవరికిని జ్ఞానము పరిపూర్ణత నందుకొనదు. క్రమ వికాసమున వివిధ దశలలో నది సంభవము అని అతని భావము. బుద్ధుని 'సోతాపన్న' మొదలగు ఎనిమిది ఆధ్యాత్మిక 'పురిస పుగ్గల'ములు, హిందువుల చతురాశ్రమ సిద్ధాంతము, వేదాంతుల క్రమముక్తి సిద్ధాంతము గోశాలుని అష్ట పురుష భూమి సిద్ధాంతముచే ప్రభావితములై యుండవచ్చును (అవే గ్రంథములు.)

**అజిత కేశకంబలుడు :** ఇతడు బుద్ధుని సమయమునకే ఖ్యాతి చెందిన ఒక తీర్థంకరుడు. ఇతని జీవితమును గూర్చిన వివరములు తెలియరావు. ఇతడు కేశములతో చేసిన కంబలి ధరించుటచే కేశకంబలుడనబడెను. అతని శిష్యులును అట్లే చేసెడివారు. వీరందరును శ్రమణులైనట్లు నికాయములు చెప్పుచున్నవి.

ఈతని దర్శన మీ క్రింది విధముగా సంగ్రహింప బడినది. దాన యజ్ఞహవనములు వ్యర్థములు. సుకృత దుష్కృతములకు ఫలము లేదు. ఇహలోక పరలోకములు, తల్లిదండ్రులు, దేవతలు (ఔపపాతికులు) లేరు. సమ్యగ్గతులై,** సత్యారూఢులై, ఇహపర లోకములను స్వయముగా నెరిగి, సాక్షాత్కరించి, ఇతరులకు తెలుపగల శ్రమణ బ్రాహ్మణులు లేరు. మనుష్యుడు నాలుగు మహాభూతముల కలయికచే ఏర్పడినాడు. అతడు చచ్చినప్పుడు ఆయా శరీర భాగములు ఆయా భూతములందు కలియును. తగులబెట్టబడిన పిదప నరుని చిహ్నములు కూడా ఉండవు. దానము చేయుమనుట మూర్ఖుల ఉపదేశము. ఆస్తిక వాదము (మరణానంతరము జీవాస్తిత్వ ముండుననుట) 'తుచ్ఛ' మగు అసత్యము. మూర్ఖులు గాని, పండితులు గాని శరీరము వదలిన పిమ్మట అందరును ఉచ్ఛిన్ను లగుదురు; వినష్ట మయ్యెదరు. చచ్చిన పిదప ఏమియు ఉండదు (దీఘ మజ్ఝిమ నికాయములు).

అజితుడు ఇహలోకము, తల్లిదండ్రులు లేరని చెప్పినట్లు బౌద్ధ సుత్తములం దున్నను, భావి జీవితము లేదని అతడు మనుష్యుల నాతతాయులై ఇంద్రియ సుఖముల ననుభవింపు డని బోధించినట్లు జైన సూత్రములు చెప్పినను అది నమ్మదగినట్లు కన్పడదు. అట్టివాడు తన సమకాలముననే లోకసమ్మతు డగు ఆచార్యుడు కాడు గదా! రాజులు అతనిని తీర్థంకరునిగా గౌరవింపరు కదా! అతడును, అతని అనుయాయులును నగ్నులుగా, ముండితులుగా నుండి బ్రహ్మచర్య తపములు జేసెడివా రని బౌద్ధ గ్రంథములే చాటుచున్నవి. ఈర్ష్యచే అతని కా బోధ లాపాదింపబడి యున్నవి.

**లౌహిత్య పాయాసులు :** అజితుని రాద్ధాంతములు లోకాయతుల 'తం జీవం తం శరీర' వాదము ననువదించు చున్నట్లును, 'అన్యం జీవ మన్యం శరీర' వాదమునకు విరుద్ధముగను ఉన్నవి. అనగా ఇతడు దేహాత్మవాదము నంగీకరించినట్లును, ఆత్మ దేహములు భిన్నము లను వాదమును, నిత్యవాద ఆస్తికవాదములను ఖండించినట్లును తోచును.

బుద్ధుని కాలమున ఇట్టి వాదులు చాలామంది ఉండినట్లు కానవచ్చును. ఉదాహరణమునకు - కోసల దేశపు సాలవికా నగరమున లౌహిత్యు డను బ్రాహ్మణ సామంతుని అభిప్రాయములు లివి యట : సరియైన మంచి ధర్మమును తెలిసికొని ఇతరులకు చెప్పు శ్రమణుడు గాని, బ్రాహ్మణుడు గాని ఈ జగత్తులో లేడు. ఒకడు ఇంకొకని కేమి ఉపకారము చేయును? ఎందుకు చేయును? ప్రతి క్రొత్త ధర్మము ప్రాత బంధనమును త్రెంపి క్రొత్త బంధనమును కట్టుటయే. ప్రతిది పాప లోభముల మూటయే (దీఘ నికాయము).

* భావన శుద్ధి చేసికొనుట.

** సత్యమువరకు వెళ్ళిన.

ఇటులనే ఆ దేశముననే మరొక సామంతుడగు పాయాసీ అను రాజన్యుడు 'ఇహము లేదు, పరము లేదు. జీవులు చచ్చిన తిరిగి పుట్టరు. మంచి చెడు కర్మలకు ఫలముండదు' అను మతమును బోధించు చుండెనట. దీని కాతడు చెప్పిన కారణములు ఇవి : 1. చచ్చిన వాడెవడును తిరిగివచ్చి మరొక లోక మున్నదని చెప్పలేదు. 2. ధర్మాతులగు ఆస్తికులు కూడ చచ్చుటకు వెరతురు. వీరికి స్వర్గప్రాప్తి నిశ్చ యమైనచో ఈ వెర పెందుకు? 3. మృత శరీరపు బరువు తగ్గదు. కాబట్టి అందుండి జీవుడు నిర్గమించి నట్లు కన్పడదు. జాగ్రత్తగా చంపి చూచినను జీవుడు వెడలిపోవుచున్నట్లు కన్పడదు. పాయాసీ వృత్తాంతము 'రాయపసెణి' అను జైన ఉపాంగమందు కూడ కలదు. జైనగ్రంథముల ద్వారా తెలియున దేమన - ఒరనుండి కత్తిని వేరు చేసినట్లు ఆత్మను శరీరము నుండి వేరు చేయలేము అని పాయాసీ మతము.

శ్రీమంతులు, సామంతులు, సన్న్యాసులు, బ్రాహ్మణులు విరివిరిగ ఇట్టి వాదములను ప్రచారము చేయుచుండి రన నాటి భారతదేశమున గల విచార స్వాతంత్ర్యము, విమర్శన శక్తి, అంకురిత ఆలోచనా ప్రౌఢిమ తెలియవచ్చును.

**ప్రకృధ కాత్యాయనుడు** : ప్రశ్నోపనిష త్తులో పిప్పలాదుని సమకాలికులలో నొకడుగా కాత్యా యనుడను నత డొకడు కల డని ఉన్నది ఇతనికి గూనియో, వీపుననొక మూపురము వంటిదో ఉండుట వలన ఇతనికి కకుద కాత్యాయన నామము వచ్చెను. 'ఇతడొక బ్రాహ్మణుడు. ఎల్లప్పుడు వేడి నీటి నుపయో గించెడివాడు. కొన్ని ఆచారములు పాలించెడివాడు' అని తప్ప ఇతనిని గూర్చి మరేమియు తెలియదు.

ఇతని దర్శనమును సామన్న ఫలసుత్తము 'సప్తకాయ వాద' మనినది. అనగా ఇతడు ఏడు పదార్థముల నంగీకరించెను. సూత్ర కృతాంగము దీనిని 'ఆత్మ షష్ఠ వాదము' అనినది. అనగా ఆత్మను ఆరవ పదార్థముగా అంగీకరించిన వాదము. సూత్ర కృతాంగము వలన సత్తునుండి వినాశముగాని అసత్తు నుండి అస్తిత్వముకాని రాదని ఇతని సిద్ధాంతమని తెలియును. శీలాంకుడు తన టీకలో కొందరు వేద వాదులు, సాంఖ్యులు, శైవాధికారులు కూడ ఆత్మ షష్ఠవాద మంగీకరించి రని చెప్పి, ఆత్మ షష్ఠత్వమును గూర్చి భగవద్గీత నుండి ఉదాహరణల నిచ్చినాడు. కాత్యాయనునిది 'శాశ్వత వాద'మని మహావీర, బుద్ధు లనిరి.

అతని దర్శన సంగ్రహ మిది : పృథ్వి, జలము, అగ్ని, వాయువు, సుఖ దుఃఖములు, జీవము అను ఈ ఏడు 'కాయములు' అకృతములు, అనిర్మి తములు, కూటస్థములు. వీటికి చలన వికారములు లేవు. ఒకదానివలన మరొకదానికి సుఖదుఃఖములు కాని, హాని గాని లేవు. ఈ కాయముల మధ్య వివ రము (ఛిద్రము* - ఖాళీస్థలము) కలదు. అందుచేత ఎంతటి తీక్ష్ణ శస్త్రముతో ఎంతటి గట్టి ప్రహారమైనను ఆ వివరమందు పడవలసినదే! అసలు కాయములను తాకదు. ఇహలోకమున హంతకులు హతులు, విని పించువారు వినువారు, ఎరిగినవారు ఎరిగింపబడు వారు లేరు. శస్త్రముతో కోసియు ఎవ్వరును ఎవ్వ రిని చంపరు (దీఘ నికాయము).

అస్పష్టములు, నిత్యములు, నిర్వికారములు అగు నీ కాయములు క్రొత్తదానిని దేనిని సృజింపవు. అకర్తలుగ పర్వతశిలల వలె నవి ఎప్పటికిని చలన రహితముగ నుండును. ఈ కాయములు అతని దర్శ నమున మూల తత్త్వములు, ధాతువులు, లేదా స్థిర సత్త్వము లన్నమాట (బుద్ధఘోషుడు కాయమనగా 'సమూహ' మని అర్థము చేసినాడు. కాని ఇక్కడ కాయమునకు గోశాల, మహావీరుల దర్శనములందలి అర్థము లేదు.) బౌద్ధ గ్రంథములతని సప్తమ పదార్థ మును జీవమనగా, సూత్రకృతాంగమున కాత్యాయ నుని ఏడవ పదార్థము ఆత్మగా చెప్పబడినది. అశనాయాపిపాసల వలన పదార్థము లొకదాని నొకటి గ్రహించును అని కొన్ని వేద వాక్యములు చెప్పి నట్లును, ప్రేమ ద్వేషముల వలన పదార్థముల సంయోగ వియోగములు కలుగునని ఎంపిడాక్లీస్

---

* Pores - బుద్ధఘోషుని టీక.

అనినట్లును కాత్యాయనుడు సుఖదుఃఖముల వలన కాయముల కలయిక, ఎడబాటు కలుగునని ఎంచినట్లు తోచును. 'ఆత్మ అకర్త, అవధ్యము, చంపదు, చంపబడదు' అను అతని సిద్ధాంతము వేదాంత సిద్ధాంతమును తలపింపజేయును.

**సంజయ వేలట్ఠిపుత్రుడు :** అజ్ఞానికుడు (agnostic) గాను, తీర్థంకరుడుగాను బౌద్ధ గ్రంథములందు వర్ణింపబడిన సంజయవేలట్ఠిపుత్రుడు బుద్ధుని ప్రధాన శిష్యుడగు సారిపుత్రుని తొలి గురువగు సంజయుడగునో కాదో తెలియదు. సారిపుత్రుడు తన సహచరులతో సహా అతనిని విడిచిపోగానే ఆతడు స్పృహతప్పి చనిపోయెను అని తరువాతి బౌద్ధ గ్రంథములు (ఉదా : మహావగ్గము) చెప్పుచున్నవి. ఇది నిజము కాకపోవచ్చును.

సంజయుడు వేలట్ఠి గణమునకు చెందినవాడు. అతని ముఖ్య శిష్యులలో ఒకడు సుప్రియుడు. సుప్రియ లనబడు పరివ్రాజకులకు అశోకుడు ఒక గుహా విహారము నిచ్చినట్లు తెలియుచున్నది. బుద్ధుడు వీరిని 'అవిరుద్ధకుల'నుగా ఎంచినట్లు తోచును. గ్రీకు దేశ సంశయవాది యగు పిర్రో భారతీయ దార్శనికుల (gymnosophists) వద్ద అధ్యయనము చేసినది నిజమైనచో వారు సంజయ సంప్రదాయము వారు కావచ్చును.

సంజయుని దర్శన సంగ్రహ మిది: "ఉన్నది ఉన్నట్లు కుశలమేమో, అకుశల మేమో ఎరుగము. కాబట్టి ఇదమిత్థముగా వీటిని గూర్చి చెప్పుట గర్వము చేతనో, అహంకారము చేతనో ('ఛందో వా రాగో వా' అని మూలము), లేదా దుర్బుద్ధి వలననో, ఓర్మి లేకనో (దొసో వా పతిఘొ వా) అగును. అట్లు చేసినచో చెప్పినది మృషా వాదన మని తేలిన దుఃఖ కోపములో, లేదా తప్పైనను చెప్పిన దానినే అంటి పెట్టుకొని యుండుటో ('ఉపాదానము') జరిగి శాంతి ఉండదు. కొందరు తెలివి కలవారు, సమర్థులు, తార్కికులు ఇతరుల దృష్టులను (విశ్వాసములను, సిద్ధాంతములను) ఖండించుచుందురు. మాకంత తెలివి లేదు గాన, కుశలాకుశలములను గూర్చి మేము నిశ్చితముగ ఏదైన చెప్పినచో, వారు దానికి కారణములు అడుగ వచ్చును. మా దోషములు చూప వచ్చును. దానివలన మాకు దుఃఖ అశాంతులు కలుగ వచ్చును.

"మాచే చెప్పబడిన అభిప్రాయము తప్పని రుజువగుట, ఉపాదానము కలిగియుండుట, వాదన చేయుట అనిన మాకు భయము, అనిష్టము. కాబట్టి దేనిని కూడ మేము మంచి అనము; చెడు అనము. ఎవరైన మమ్ములను ప్రశ్నించినచో ఇట్లు అని గాని, అట్లు అని గాని, అన్యథా గాని కాదు అందుము. ఇది కాదనియు అనము. 'ఇదియు కాదు, అదియు కా' దనియు అనము. 'ఇదియును అవును అదియును అవును' అని కూడ అనము. పరలోకమును గూర్చి గాని, దేవతలను గూర్చి గాని, కర్మను గూర్చి గాని, 'తథాగతులు మరణానంతరము ఏమగుదురు?' అను దానిని గూర్చి గాని ఎటులను చెప్పము." సంజయుని సందేహవాదము పై విధముగ బౌద్ధ గ్రంథములందు వర్ణింపబడినది.

సూత్రకృతాంగ టీకలో శీలాంకుడు అజ్ఞానికుల వైఖరి నీ విధముగ చెప్పినాడు: "చిత్తశుద్ధి, చిత్తభ్రాంతులను దాటి - అనగా విచికిత్సను వీడి యుండక పోవుటచే ఏదైన దృష్టిని ఇది మంచిది అని ప్రతిపాదించినను మేము సత్య మెరుగ మనియు, మా జ్ఞానమున కిది విషయము కాదనియు మాకు తెలియును. అందుచే నానావిధ సిద్ధాంతములను ప్రతిపాదించు దార్శనికులకు పరస్పర ఐకమత్యముండదు. పరస్పర విరుద్ధములగు ఈ సిద్ధాంతముల వలన ఎన్నో దోషములు కలుగవచ్చును. కాబట్టి వీటికంటె అజ్ఞానమే ఉత్తమము."

దీనిని బట్టి సంజయుడు 'ఆత్మ యున్నదా? అది ఎట్టిది?' మొదలగు ప్రశ్నలకు ఎట్టి సమాధానము నీయలేదని, తన మనస్సునందు కూడ వీటిని గూర్చి ఎట్టి నిర్ణయమునకు రాలేదని తేలును. 'ఇటువంటి ప్రశ్నల కుత్తరము నిర్దిష్టముగా ఈయలేమని నిశ్చయించుకొనినందువలన మనస్సమాధానము, శాంతి వచ్చును' అని అతని తాత్పర్యము. పిర్రో మతము

కూడ ఇదియే. కొన్ని సమస్యలు అకథనీయములు, అవ్యాకృతములు అని బుద్ధుడు అనుట కూడ ఇట్టి ప్రభావమునకు లోనగుటచే కావచ్చును. మహావీరుని స్యాద్వాదమునకు, సంజయుని వాదమునకు భేద మేమన - పై ప్రశ్నలకు సంజయుడు 'కాదు' అను సందర్భము లన్నిటిలో మహావీరుడు 'అవును' అనును. 'అన్ని వికల్పములు, అన్ని సిద్ధాంతములు ఏదో ఒక దృక్పథముతో జూచిన సరిగానే కన్పడును. మరొక దృక్పథముతో జూచిన అటుల కన్పడవు. సమగ్రజ్ఞానము పూతాత్ములకు కలుగును' అనునది జైనుల అభిప్రాయము. 'మానవులకు యథార్థవస్తు జ్ఞానము కలుగదు' అనునది సంజయుని అభిప్రాయము.

భౌతికవాది యగు అజితుడు, అకర్మణ్యతా వాదియగు గోశాలుడు, అక్రియావాది యగు పూర్ణుడు, శాశ్వతవాది యగు కాత్యాయనుడు, అజ్ఞానికు డగు సంజయుడు-అందరును మానవుడు చేయు కర్మవలన ప్రయోజనము లేదని, పుణ్యపాపములు లేవని అనిరి. కాని వీరందరును సంయమ జీవితములు గడుపుచు, శ్రమణులై, తాము సత్యమని ఎంచినది ఎల్లరకు బోధించుట పనిగా పెట్టుకొని లోక హితమునకై పాటు పడిరి. "తక్కిన అన్ని వృత్తుల వారికిని ఇహలోకముననే ఏదో ఒక దృష్టఫలము అబ్బుచున్నది. సన్న్యాస జీవితము గడుపు శ్రమణులకు తత్క్షణము ఇహలోకమున కలుగు దృష్టఫల మేమిటి? ఏమి కోరి బ్రహ్మచర్య, తపస్సంయమాదుల ఆచరణము? పర లోకమో, స్వర్గమో, బ్రహ్మలోకమో, ఈశ్వరా నుగ్రహమో ఉన్నదని, కావలె నని అనుకొనువారు దానికై పాటుపడుచున్నా మన వచ్చును. కాని వారును నిశ్చిత ఐహిక దృష్ట ఫలము తమ కార్యముల కుండు నని నిరూపించుట కష్టము. ఇక పరలోక పునర్జన్మ పుణ్య పాపాదులు లేవను వారియొక్కయు, ఆత్మ అకర్త నిర్గుణము అనియో, ఆత్మలేదు అనియో చెప్పు వారి యొక్కయు సంయమ సన్న్యాసాదు లెందుకు?" ఈ ప్రశ్నకు తీర్థంకరు లెవరును సరియైన సమాధాన మీయలేకపోయిరని, తాను వారి నీ ప్రశ్న వేయగా అప్రస్తుత ప్రసంగములు చేసి రని, వారి జవాబులు మామిడిపండు ఏమిటన పనసపండు ఏమిటో వివరించి నట్లున్న వని అజాత శత్రు వను రాజు చెప్పియున్నాడు (సామన్న ఫలసుత్తము, దీఘ నికాయము). విశ్వము వంధ్య, కర్మ నిష్ఫలము, పురుషకారము నిష్ప్ర యోజనము అని చెప్పియు వీరేల క్రియాశీలులై శ్రమణులై నిరతము పాటుపడిరి? ఈ ప్రశ్నయే కొందరు వేదాంతుల సిద్ధాంతముల నధ్యయనము చేసి నప్పుడును కలుగ వచ్చును.

జైన, బౌద్ధ గ్రంథములు ఒకసారి ఒకని ఉపజ్ఞమైన వనిన సిద్ధాంతములే మరొకసారి మరొక నిచే సృష్టింపబడినవని అనినందున ఏ సిద్ధాంతములు వ్యక్తిగతముగ ఎవరివో చెప్పుట కష్టమని, వీరంద రును అసలు ఐతిహాసిక వ్యక్తులా యని కొందరు పాశ్చాత్యులకు సందేహము పొడమినది. వీరందరికిని కొన్ని సామాన్య సిద్ధాంతము లున్నను, ఒకసారి ఒకరి వనినవి మరొక సారి ఇంకొకరికి ఆపాదింప బడినను వాటిని సవిమర్శగా విడదీయుట అసంభవము కాదని ఇతర విద్వాంసులు నిరూపించిరి.

# జైన దర్శనము

ఋషభదేవునితో ప్రారంభించి 24 గురు తీర్థంకరులచే ప్రచారము చేయబడినది జైన దర్శనము. భారతదేశములోని అతిప్రాచీన దర్శనములలో ఇది ఒకటి. ఋషభుడు మను వంశపు నాభి చక్రవర్తి కుమారుని గాను, భరత చక్రవర్తి తండ్రిగాను, విష్ణువు అవతారముగాను పురాణములందు కీర్తింపబడినాడు. కాశీరాజగు అశ్వసేనుని కుమారుడగు పార్శ్వనాథుడు (క్రీ.పూ. 817) 23 వ తీర్థంకరుడు. గార్హస్థ్య రాజవైభవాదులను వదలి, భిక్షువై, జ్ఞానియై ఈయన అహింసా సత్య అస్తేయ అపరిగ్రహముల ననుష్ఠింపుడని బోధించుచు ధర్మవ్యాప్తి గావించెను. క్రీ.పూ. 599లో లిచ్ఛవీ సంఘమునకు చెందిన 'జ్ఞాతృ' అను పేరు గల క్షత్రియ వంశమున వైశాలి నగరమున జన్మించిన వర్ధమానుడు చివరి (24 వ) తీర్థంకరుడు. ఈయన తండ్రి సిద్ధార్థుడు, గణసంస్థ సదస్యుల (రాజుల) లో నొకడు. ఈయన జ్ఞాతృపుత్రుడు (పాళిలో 'నాతపుత్తుడు') అనియు, భవబంధపు గ్రంథులు (ముడులు) విడగొట్టుకొనుటచే 'నిర్గ్రంథు' డనియు, రాగద్వేషాదులను జయించుటచే 'మహావీరు' డనియు పిలువబడెను. తల్లిదండ్రుల మరణానంతరము అన్న యనుమతితో ఇల్లును, భార్యను 30 ఏండ్ల వయస్సుననే విడచి యతియై, 13 ఏండ్లు కఠోర తపస్సుచేసి, కైవల్యజ్ఞానము(సర్వజ్ఞత్వము)ను పొందెనని ఈయన చరిత్ర చెప్పుచున్నది. అంగ మగధ కౌశాంబీ మొదలగు రాజులకు ఈయన గురువు. అర్ధమాగధిలో తన ప్రవచనముల నిచ్చి అనేకులను తన యనుయాయులుగా చేసికొని, 72 వ ఏట మృతి నొందెను. ఈ 24 గురు తీర్థంకరులును సర్వజ్ఞులు, రాగ ద్వేష రహితులు, పరమార్థవాదులు, పూజితులు, సమర్థులు అనియు, అందుచే వారు 'అర్హత్' శబ్ద వాచ్యులనియు, రాగ ద్వేషములను జయించినవారు కాన వారు 'జిన' అభిధానమునకు యోగ్యులనియు వారి అనుచరులు తలతురు. వీరిచే బోధింపబడినదే ఆర్హత లేదా జైన ధర్మ దర్శనము.

**దిగంబరులు - శ్వేతాంబరులు :** పార్శ్వనాథుడు 'యతులు కూడ వస్త్రధారణ చేయవచ్చు' నని తలచెను. కాని మహావీరుని వైరాగ్యము తీవ్రతరము గాన 'యతులు వస్త్రములు ధరింపరా'దని ఆయన చెప్పెను. మహావీరుని మరణానంతరము చాల ఏండ్లకు మగధ యందలి జైన భిక్షువులు 'యతులు తెల్లని బట్టలు ధరింపవచ్చు'నని ఆమోదించి అట్లాచరింప దొడగిరి. దీని నొప్పుకొననివారు దిగంబరులని, ఒప్పుకొనినవారు శ్వేతాంబరు లని జైనులందు రెండు సంప్రదాయము లేర్పడెను. కేవల జ్ఞానము బడసిన వారు ఆహారము తినరని, స్త్రీలకు (తిరిగి పురుష జన్మ ఎత్తిన తప్ప) మోక్ష ముండదని దిగంబరుల విశ్వాసము. ఇది వీరికి రెండవ సంప్రదాయము వారిలో గల పెద్ద భేదములలో ఒకటి. నగ్నముగ తిరుగుచు, పాణితల భోజనము చేయుచు, నగ్న విగ్రహముల పూజించుచు, నెమలి పింఛముల ధరించుచు, తమకు నమస్కారము చేయువారికి మోక్ష మార్గము చూపుచు నుండిన మరొక జైనసంప్రదాయము వారు 'గోప్యులు' అను పేర బరగిరట. వీరు కొన్ని శ్వేతాంబర సిద్ధాంతములను, కొన్ని దిగంబర సిద్ధాంతములను అంగీకరించు చుండిరి.

**జైన గ్రంథములు :** అర్ధమాగధి భాషలో వ్రాయబడిన 11 అంగములనబడు జైన ఆగమ గ్రంథములు, వాటిపై ఆధారపడిన మరి 34 గ్రంథములు దొరకుచున్నవి. 'ఆచారాంగ సూత్ర', 'సూత్ర కృతాంగ', 'భగవతీ సూత్రా'దులు అంగములలో హెచ్చు ప్రచారము గలవి. అంగములు చంద్రగుప్త మౌర్యుని సమకాలికుడగు స్థూలభద్రుని అధ్యక్షతను పాటలీ పుత్రమున కూడిన జైన భిక్షులచే స్థిరీకరింపబడెనని శ్వేతాంబరు లందురు. దిగంబరులు అంగములు, వాటికి మూల గ్రంథము లగు 'పూర్వము'లు

కూడ నశించె నందురు. ఉమాస్వాతి, కుందకుందాచార్యుడు, సమంతభద్రుడు అను వారు విక్రమ ప్రథమ శతాబ్దము చతుర్థ శతాబ్దముల మధ్య జీవించి, 'తత్త్వార్థ సూత్రములు', 'నియమసారా'ది పంచ గ్రంథములు, 'ఆప్త మీమాంసా'ది గ్రంథములు వ్రాసి, జైన దర్శనమునకు దృఢాధారము కల్పింపగా, విక్రమ పంచమ శతాబ్ది తరువాత వచ్చిన సిద్ధసేన దివాకర, హేమ చంద్రాదులు దానిని విస్తరించిరి.

మహావీరుడు సంయమము ('సంవరము')నకు అహింసకు, మనో వాక్కాయ దండముల (కర్మల)కు ప్రాముఖ్యము నిచ్చెను. తపస్సు (అనశనము, నగ్నత ఇత్యాదుల అభ్యాసము) ద్వారా పూర్వము చేసిన పాపము నాశనము కాగా, సంయమముచే భవిష్యత్తులో పాప కర్మఫల వారణము కాగా మనుష్యుడు మల (ఆస్రవ) రహితుడై, కర్మ క్షయముచే దుఃఖముక్తుడగును. శారీరక కర్మ (తపస్సు)చే పాప నిర్మూలనము చేసి, కైవల్యము పొందవచ్చు ననుట, జడ, అజడ తత్త్వము లన్నియు సజీవములు గాన అన్ని విధములగు హింసను పరిత్యజింప వలె ననుట మహావీరుని బోధలుగా కనపడును. అనేకాంతవాదమును తరువాతి జైనులు సంజయ వేలట్టిపుత్రుని దర్శనము నుండి గ్రహించినట్లు తోచును.

**జైన సిద్ధాంతములు :** అన్నిటియందును అన్నియు ఉండవచ్చును - అని జైనుల ఊహ. ప్రతి వస్తువును అనంత ధర్మములు కలది. ఇందు కొన్ని వస్తువునకు గల సత్తాత్మక ధర్మములు; ఇవి స్వపర్యాయము లనబడును. మరికొన్ని వస్తువునకు లేని నిషేధాత్మక ధర్మములు; ఇవి పరపర్యాయములు. వీటిని బట్టియే ఒక వస్తువు ఇతరముల నుండి వేరగుచున్నది. ఇవి అనంతములు. వీటన్నిటి కలయికయే వస్తువు; సత్తు నిత్యమును కాదు, అనిత్యమును కాదు. ఉత్పాద వ్యయ ధ్రౌవ్య యుక్త మగునది సత్తు. ఇది ఒప్పుకొనకపోవుట ఏకపక్షీయ దృష్టి. ఉత్పత్తియగుచు, నాశ మొందుచు, తోడ్తోడ ధ్రువముగ నుండునదే సత్తు. ఉదాహరణమునకు - మట్టిముద్ద నశించి, కుండ ఏర్పడును. అదియు నశించును. కాని ఈ మూడు అవస్థలలో మట్టి యను ద్రవ్యముండును. ద్రవ్యము ఒకేపరి పరివర్తన శీలము, అపరివర్తన శీలము కూడ. ఒక దృష్టిలో ఉన్నది; మరొక దృష్టిలో లేదు. స్వజాతిని వీడకుండుటయే నిత్యత్వమని జైనులందురు. అనగా కుండగ నున్నను, మూకుడుగ నున్నను, మట్టిగా నున్నను మట్టి మట్టితనమును వీడదు. అదే దాని నిత్యత్వము. ఆకారాదులయందు మార్పులచే అది అనిత్యమే! 'వస్తువుల ఉనికికి ఆవశ్యకములై ఎప్పుడును ఉండు ధర్మములు 'గుణములు'; అట్లు కాని పరిణామశీలము లగు ధర్మములు 'పర్యాయములు'; గుణములు, పర్యాయములు కలది ద్రవ్యము - అని జైనుల నిర్వచనము.

ద్రవ్యము లన్నిటిని జీవములుగా, అజీవములుగా వర్గీకరింపవచ్చును. ఆకాశ, ధర్మ, అధర్మ, పుద్గలములను నాలుగు అజీవ తత్త్వములును, జీవ తత్త్వమును కలిపి పంచాస్తికాయము లందురు. ఉన్నట్టివి, కాయము వలెనే వ్యాప్తి కలవి, బహు దేశములందు ఉండునని అగుటచే ఇవి 'అస్తులు', 'కాయములు'ను. ఇట్లు కానిది అనస్తికాయము. కాలము అట్టిది.

జీవము అనగా ఆత్మ. ఇది జ్ఞానమునుండి భిన్నమును కాదు, అభిన్నమును కాదు. భిన్నాభిన్నమును కాదు. జ్ఞానము పూర్వాపరముగా కలది. జీవము భూతముల పరిణామము కాదు. శరీరము దాని అధికరణము. జీవము లనేకములు. జీవము సర్వవ్యాప్తియు కాదు, అణువును కాదు. అది మధ్యమ పరిమాణము కలది. అనగా, శరీరమెంత యుండిన జీవము (ఆత్మ) అంత ఉండును. చీమలోని ఆత్మ చీమ శరీరమంత ఉండును. ఏనుగులోని ఆత్మ ఏనుగు శరీమంత ఉండును. దీపపు వెలుగు ఎంత గదిలో ఉండిన అంతగా విస్తరించును; లేదా సంకోచించును. అట్లే ఆత్మయు తానాశ్రయించు శరీరమునుబట్టి పెరుగును, తరుగును. ఆత్మ నిత్యము. వేర్వేరు జీవులలో ఇంద్రియముల సంఖ్య వేరు వేరుగ నుండును. ఉదాహరణమునకు, వృక్షజీవమున ఒక్క స్పర్శేంద్రియమే కలదు. చీమలో స్పర్శ, రస, గంధములు మూడు

కలవు. మనుష్యునిలో స్పర్శ, రస, గంధ, దృష్టి, శబ్ద, మనస్సులను ఆరు ఇంద్రియములు కలవు.

చచ్చుచు, తిరిగి పుట్టుచు సంసరించు చున్నవి సంసారులగు జీవులు. ఇవి కర్మయను ఆవరణచే కప్పబడియున్నవి. తపస్సంయమాదులచే కర్మావరణమును ఛేదించుకొనిన జీవులు ముక్తులు. కొన్ని సంసార జీవులలో సంజ్ఞ (చైతన్యము), మనస్సు ఉండవు. కొన్నిటిలో ఉండును. కొన్ని కదలలేవు. అవి స్థావరములు. ఉదా: వృక్షాదులును, పృథివ్యాధులును. కొన్ని ఉద్దేశ్యపూర్వకముగ కదలగలవి, త్రసములు. ప్రపంచము నిగోదముల (జీవుల గుంపుల)తో నిండి యున్నది. అనాదినుండి ఇంత వరకు ఒకటి రెండు నిగోదములలోని జీవములే ముక్తులైనవి. ఇంక లెక్కలేనన్ని నిగోదములు కలవు. కాబట్టి లోకములోని జీవులన్నియు ముక్తులై సంసార ముడ్చిన్న మెన్నటికిని కాదు.

ప్రతి జీవము స్వభావతః అనంత జ్ఞాన సామర్థ్యాది గుణములచే సంపన్నమయ్యు కర్మచే వీటి ఉదయముకాదు; అవి ఆవరింపబడును. ఆవరణము తొలగగానే ఈ గుణములు జీవమున ఉదయించును. జ్ఞాన సామర్థ్యాదులను బట్టి జీవులందు తారతమ్యములు కలవు. కర్మల కర్త, కర్మఫలముల భోక్త జీవమే. వస్తువుల జ్ఞాతయు అదియే చైతన్యోపలబ్ధిచే జీవుల ఉనికి సిద్ధమగుచున్నది. స్వ సంవేదనము వలన కూడ దాని జ్ఞానము సాధ్యము. జీవమునకు రూపము లేదు. కాని శరీరానుకూల రూపమును, పరిమాణమును అది పొందు చుండును.

వ్యాపించు స్వభావము కల జీవాది ద్రవ్యములకు అవకాశ మిచ్చునది ఆకాశము. అనుమానము వలన ఇది ఉన్న దని తెలియును. సంసారులుండు లోకమునకు పైన ముక్త జీవులుండువరకు కూడ ఆకాశము వ్యాపించి యున్నది.

జైన దర్శనమున ధర్మమనగా విశ్వవ్యాప్తమగు నొక చాలక తత్త్వము; గతి (motion) వలన దీనిని అనుమానింప నగును. జీవాది ద్రవ్యముల కదలికకు ధర్మము సహకారి కారణము; చేప కదలికకు నీరువలె. ధర్మము జీవుల కదలికకు సహాయపడును. దానిని ప్రేరేపించదు. దీనికి విరుద్ధమగు విశ్వవ్యాప్త మగు నొక రోధక తత్త్వము అధర్మము. కదలిక లేని అవస్థ (స్థితి) వలన దీనిని అనుమానింప వచ్చును. అలసిన బాటసారి ఆగుటకు చెట్లనీడ సహకరించునట్లు, జీవుల స్థితికి అధర్మము సహాయపడును. విశ్వసంచలనము-సృష్టి స్థితి ప్రలయములు - ధర్మా ధర్మముల వలన జరుగును.

స్పర్శ రస గంధ వర్ణములు[1] కలది పుద్గలము; అనగా భౌతిక పదార్థము ఏ పదార్థములు వృద్ధి నొందునో (నిండుకొనునో, విస్తరించునో), సడలుచుండునో (వదులై పట్టుచిక్కి విచ్ఛిన్నములై నశించునో) అవి పుద్గలములు (పూరయంతి గలనిచ అని నిరుక్తి). అత్యంత సూక్ష్మములై నిరవయవములుగ, అవిభాజ్యములుగ నుండునవి 'అణు' పుద్గలములు. వీటి సంయోగముచే ఏర్పడునవి 'సంఘాత' పుద్గలములు. శరీరాదు లన్నియు సంఘాతములే. కర్మ కూడ పుద్గలమే. అనగా భౌతిక పదార్థము. ఇదియే జీవుల నావరించి దుఃఖమయ ప్రపంచమందు వారి నుంచునది. జ్ఞానాదులు దీనిచేతనే మూసికొని పోయి మోహాదులు ఉత్పన్న మగును. జీవుల దేహ సంబంధము - సంసార బంధము - కర్మ వలననే.

పరిణామమునకు సాధారణ కారణము కాలము. పదార్థములు అనేక క్షణముల వరకు ఉండుట (స్థితి) కాలము లేనిదే జరుగదు. పూర్వాపరములు గల క్రియలు, జ్యేష్ఠ కనిష్ఠ కల్పనలు, కాలము లేనిదే సిద్ధము కావు. వర్తన పరిణామము, క్రియ, పరత్వాపరత్వములు-ఇవి కాలము యొక్క 'ఉపకారములు.'

జీవులలోనికి కర్మ ప్రవహించుట 'ఆస్రవము' అనబడును. కాలువ లోనికి నీరు వచ్చినట్లు మనోవాక్కాయముల క్రియలచే రాగాదులును, వాటి కార్యము లగు 'కర్మ' పుద్గలమును జీవులలోనికి ప్రవేశించుట ఆస్రవము.

---

1. జైన దర్శనమున శబ్దము మూలగుణము కాదు; సూక్ష్మత్వ స్థూలత్వాదులవలె తరువాత ఏర్పడు మార్పు.

క్రోధ మోహాది కషాయములచే జీవులు లిప్తులై, విషయాసక్తులై, కర్మ చే ఆవరింపబడి, సంసరించుచు, దుఃఖము చెందుట 'బంధము'. జీవుల కర్మల అన్యోన్యానుగమము బంధము. మిథ్యాత్వము (నిజము కాని దానిని నిజము అనుకొనుట), అవిరతి (త్యాజ్యముల వదలకుండుట), ప్రమాదము (కర్తవ్యమును జాగరూకతతో పాటింపక పోవుట), కషాయము (సమభావము లేక క్రోధ రాగాదులకు వశమగుట), 'యోగము' (మనోవాక్కాయ క్రియలు) - ఈ అయిదును బంధ కారణములు.

ఆస్రవ మార్గమును అరికట్టి, కర్మల నిక రాకుండ చేయుట సంవరము (సంయమము). మనోవాక్కాయముల రక్షించుకొనుట (దీనిని 'గుప్తి' అందురు), ప్రాణుల రక్ష, హిత ప్రియభాషణము, శుద్ధ భిక్షపై బ్రతుకుట. అన్ని వేళలను వస్తువుల నుపయోగించు నపుడు ప్రాణిహింస చేయకుండుట, ప్రపంచమును వదలుట (త్యాగము) - ఈ అయిదింటిని 'సమితి' అందురు. వీటి అభ్యాసము సంవరము. ఇది మానసికము, కాయకము, వాచికము కూడ.

'ఆస్రవము భవ హేతువు. సంవరము మోక్ష కారణము' అనునదియే జైన ధర్మ సారాంశము.

జన్మాంతరము నుండి సంచితము లగు కర్మలను నిర్జరణము (నాశనము) చేయుట 'నిర్జరము', వెంట్రుకలు పీకుకొనుట, నగ్నముగ శీతాతపములకు తాళుట మొదలగు తపస్సులచే నిర్జరము సిద్ధించును. దీనివలన సంచిత కర్మలు నిష్ఫలములై ఇంకిపోవును. బంధహేతువు నశించును.

**జైనుల మోక్షము :** సమస్త కర్మల క్షయమే 'మోక్షము'. మోక్షమందు జీవులు అనంత జ్ఞాన అనంత సుఖములచే దేదీప్యమాను లగుదురు. ముక్తులు అనంత జ్ఞానము, అనంత వీర్యము, అనంత శ్రద్ధ, అనంత శాంతి యను 'అనంత చతుష్టయ' మనుభవింతురు. ఇది జీవుల నిజ స్వరూపము. దీనిని కేవలావస్థ, లేదా కైవల్య మనికూడ అనెదరు. బద్ధావస్థయందు ఇది ఆవరింపబడి శుద్ధ స్వరూపము మలలిప్త మగును. ముక్తులు ఇతర జీవుల మంగళము కొరకు పాటుపడెదరు. చివరకు లోకాకాశమును దాటి సిద్ధుల నివాస స్థానమును చేరి 'అనంత చతుష్టయానుభూతి'లో అచలముగ నుందురు. దుఃఖ అభావము, అనంత అమిశ్రిత సుఖము - ఇదే మోక్షము.

జీవాజీవ, ఆస్రవ, బంధ, సంవర, నిర్జర, మోక్షము లనెడు ఏడును సప్త పదార్థములు. వీటికి పుణ్యపాపములు కలిపిన తొమ్మిది పదార్థము లగును. జీవులపై పడు సుఖసాధన మగు నొక సంస్కార విశేషము పుణ్యము. ఇది పరమాణువులచే ఏర్పడును. జీవులను అంటుకొని యుండును. సత్కర్మపుద్గలములు పుణ్యము. పుణ్యము నుండి కూడ విడుదల కానిదే ముక్తి ఉండదు. పై ధర్మములు కలిగి దుఃఖసాధన మగునది పాపము.

సమ్యక్ దర్శనము, సమ్యక్ జ్ఞానము, సమ్యక్ చారిత్రము - ఈ మూడును మోక్ష మార్గములు. జైన తీర్థంకరులు చెప్పిన తత్త్వార్థములందు శ్రద్ధ సమ్యగ్దర్శనము. జైన శాస్త్రములచే ప్రతిపాదితము లగు తత్త్వముల సత్యత్వమును నిశ్చయముగ నెరుగుట సమ్యక్ జ్ఞానము. సదాచారము లేదా శీలము సమ్యక్ చారిత్రము. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము - అను పంచ మహావ్రతముల అనుష్ఠానమే చారిత్రము. యతులు వీటిని చాల కట్టుదిట్టముగా పాలింపవలెను. గృహస్థుల విషయమున హింసాయుక్తముగాని సరియైన మార్గమున ధనార్జన చేయుట సంతోషము - అపరిగ్రహము. కులీన సతిని వివాహమాడి దాంపత్య జీవితము గడపుట బ్రహ్మచర్యము. భోగముల అనిత్యత, శరీరపు అశుచిత్వము గురించి, దుఃఖ మృత్యువులనుండి రక్షించుటకు లోకమున ఎవరిని శరణు జొచ్చినను లాభములేదని తరచు భావించుచు, మానసిక ఏకాగ్రతను వృద్ధి చేసికొని సంయమము అభ్యసించుచు, కరుణా సంతోషాది భావనలు కలిగియుండుట కూడ మోక్ష సాధనమే !

**స్యాద్ వాదము :** ప్రతి వస్తువునకు అనంత ధర్మములుండును కాబట్టి, అవి యన్నియు కేవల జ్ఞానము లభించిన అర్హతులకే తెలియును. సాధా

రణులు ఏవో కొన్ని ధర్మములే ఎరుగగలరు. ఇట్లు పాక్షికముగ, ఏకదేశ విశిష్టముగ వస్తు ధర్మముల నెరుగుట 'నయ' మనబడును. ఉన్నదానిని దేనినైనను అది ఉన్నది అని గ్రహించుట నయము. కాని వేరు విధములుగా వేరు దృష్టులతో చూచిన అది నిషేధింపబడును. అప్పుడు దానిని లేదు అనవచ్చును. దేనినైనను ఇది ఉన్నది కావచ్చును (సత్ స్యాత్) అని ఎరుగుటయే సరియైన జ్ఞానము. ప్రతి వస్తువును గురించిన అంశమాత్ర జ్ఞానము, అనగా ఆ వస్తువు యొక్క ఏదో ఒక విశేషమును నిరూపించు జ్ఞానము నయము. మానవ జ్ఞాన మంతయు నయమే. తీర్థంకరుల జ్ఞానము పూర్ణము-వారు సర్వజ్ఞులు కాన.

ఉన్నట్టి ఒక వస్తువును గూర్చి మనము 'ఉన్నది' అని చెప్పరాదు. ఏలన, వర్తమాన దేశ కాలములందే, ప్రస్తుత పరిస్థితులలో ఆ వస్తువు ఉన్నది. అన్ని దేశ కాలములందు అన్ని అవస్థలలో అది ఉండదు కదా! కాబట్టి దానిని గూర్చి 'ఉన్నది కావచ్చును' (స్యాత్ అస్తి) అని మాత్రమే చెప్పుట సమంజసము. కాక, సత్త అనేకాంత మని అంగీకరింపగనే ఉన్నదానిని గూర్చి పలు విధములుగ చెప్పుట సమంజస మగును.

ఉదాహరణమునకు ప్రస్తుతము ఉన్నట్టి ఒక కుండను గూర్చి 'ఉన్నది కావచ్చును', అనగా 'ఈవేళ ఒక విశేష స్థానమున, ఒక విశేషరూపమున కుండ ఉన్నది' యనియు, 'లేనిది కావచ్చును' (స్యాత్ నాస్తి) అనగా 'వేరొక చోట వేరొక రూపమున అది లేదు' అనియు అర్థము. ఈ సత్తాత్మక, నిషేధాత్మక, జ్ఞానములను కలిపినచో 'ఉన్నది, లేనిది కూడ కావచ్చును' (స్యాత్ అస్తి చ, నాస్తి చ) అను నిర్ణయము అగును. అనగా 'ఈ కుండ ఫలాని చోట ఉన్నదియు, ఫలాని చోట లేనిదియు కావచ్చును' అని అర్థము. కుండ పచ్చిమట్టితో మొదట చేయబడినప్పుడు ఒక రంగు కలిగియుండెను. కాల్చబడిన పిమ్మట దానికి మరొక రంగు వచ్చెను. కుండ యథార్థ స్వరూప మేది? ఇది అవక్తవ్యము (చెప్పుటకు వీలు లేనిది) కావచ్చును (స్యాత్ అవక్తవ్యం). అనేక పరిస్థితులు కలవు. విరోధించు నానా ధర్మములు ఒక చోట ఉండగలవు. వీటిని బట్టి కుండ స్వరూపము మారుచుండును. ఏది దాని అసలు స్వరూపమో అవక్తవ్యము. ఈ నాలుగు విధము లగు నయములను కలుపుట వలన మరి మూడు నయములు ఇటుల వచ్చును. ఉన్నదియు అవక్తవ్యమును కావచ్చును; లేనిదియు అవక్తవ్యమును కావచ్చును; ఉన్నది లేనిది కూడ కావచ్చును, అవక్తవ్యమును కావచ్చును. ఇట్లు ఏ పదార్థమును గూర్చి యైన ఏడు విధములగు పాక్షిక వైకల్పిక జ్ఞానములు (నయములు) ఉండును. ఇవి 'సప్తభంగీ నయ' మనబడును. దేనిని గూర్చి యైన ఇద మిత్థ మని ప్రతిపాదింప వీలులేదు. 'కావచ్చును' (స్యాత్) అని మాత్రమే చెప్పగలము. ఈ వాదము 'స్యాద్వాదము'.

మొదట సంజయుడు పరలోకము, దేవతలు, కర్మఫలాదుల విషయమున 'ఉన్నది' అని కాని, 'లేదు' అని కాని, 'ఉన్నది లేదు కూడ' అని కాని, 'లేదు ఉన్నది కూడ' అని కాని-ఈ నాలుగు విధములలో ఏ విధముగాను చెప్పలేమని అనేకాంత వాదము నొకదానిని లేవదీసెను. దేనిని గూర్చియు ఒక విధముగ (ఏకాంతముగ) చెప్పలేమని దీని తాత్పర్యము. తరువాత మహావీరుడు 'ఆత్మ ఉన్నది', 'ఆత్మ లేనిది', 'ఆత్మ అవక్తవ్యము కావచ్చును' అని మూడు విధముల చెప్పుటకు వీలున్నదని సూచించి, త్రిభంగీ నయమునకు చోటిచ్చెను. తరువాత ఇది సప్తభంగి యాయెను. అన్ని నయములను అంగీకరించుటచేతనే వస్తువుల సమగ్ర జ్ఞానము వచ్చును. పక్షపాత బుద్ధి పోవును. ఇక పరిపూర్ణజ్ఞానము ముక్తులకు మాత్రమే లభ్యము.

# బౌద్ధ దర్శనము

క్రీ. పూ. 6వ శతాబ్దములో భారతదేశమున ఎన్నో వాదములు ప్రచారమం దున్నట్లు క్రిందటి పుటల వలన తెలియును. 'పరలోక మున్నదా? లేదా?' 'మరణానంతరము జీవుని అస్తిత్వమున్నదా? లేదా?' 'కర్మ, దాని ఫలము ఉన్నవా? లేవా?' - ఇట్లెన్నో ప్రశ్నలు వాటికి విభిన్నములగు సమాధానములు నాడు ప్రచారమం దుండెను. వేద ప్రామాణ్యము నంగీకరింపక, యజ్ఞయాగాది క్రియా కలాపములు వ్యర్థము లని ఎంచుచు, ఏ కర్మ వలనను ప్రయోజనము లేదని, మృత్యువు పిమ్మట జీవాస్తిత్వము లేదని నమ్ముచు, సంసారమును వదలి ముండితులై, బ్రహ్మచారులై తిరుగుచుండెడి పరివ్రాజకులు 'శ్రమణు' లనబడుచుండిరి. కష్టము (శ్రమ)ల పాలై వ్రతోపవాస బ్రహ్మచర్యాదుల నాచరించుటచే వీరికా పేరు వచ్చెను. వీరి ఎవరో ఒక 'శాస్త' (ఉపదేశించి నియమించు తీర్థంకరుడు)కు అధీనులై అతనిచే స్థాపింపబడిన సంఘమందు చేరుచుండిరి. అయితే శ్రమణులలో కొందరు జీవాస్తిత్వమును, కర్మసిద్ధాంతమును అంగీకరించుచుండిరి. ఇట్టివారు కొద్దిమందే! ఏ శ్రమణుడును సృష్టికర్త గాని, కర్మఫలప్రదాత గాని ఉన్నాడని తలచలేదు. ముండితుల దర్శనమును అశుభమని ఎంచుచు, వైదిక ధర్మమనుష్ఠించుచు, కర్మ నిరతులై సంసార జీవితము గడుపువారుగ బ్రాహ్మణు లుండిరి. క్రమముగా శ్రమణులలోను వీరివలన వర్ణాశ్రమ ధర్మము స్థాపింపబడెను. వారిలోనూ కర్మకాండకు, యజ్ఞకలాపములకు విరుద్ధముగ సత్యాహింసాస్తేయాదులచేత నుపబృంహితమై, జ్ఞాన ప్రాధాన్యము నామోదించిన బ్రహ్మదర్శనము కాలక్రమమున బయల్వెడలెను. అదే ఉపనిషత్తులలో హెచ్చుగా కానవచ్చును. అప్పటికి బ్రాహ్మణులలోను పరివ్రాజకులు (సంసారమును వదలి వెళ్ళువారు), సన్న్యాసులు, వైఖానసులు సిద్ధమైరి. అరణ్యమున వృక్షమూల నివాసము, ముండన సంయమములు, పాంసుశూలధారణాదులు చేయుట వీరి నియమములు. దార్శనిక ప్రశ్నలపై విచారము హెచ్చుగా నున్న గృహస్థులుకూడ సత్యాన్వేషణ కొరకై భిక్షువులై, వనముల కేగుచున్నట్టి కాలమున శాక్య వంశమున సిద్ధార్థ గౌతముడు జన్మించెను.

సిద్ధార్థుడు క్రీ.పూ. 563 ప్రాంతమున జన్మించెను. శాక్యులది గణ సంస్థ. పాలకవర్గ సదస్యులందరును రాజు లనబడుచుండిరి. అట్టి రాజులలో నొకడగు శుద్ధోదనుని కుమారు డీయన. తరుణావస్థ నుండియు సిద్ధార్థుడు విచారశీలుడు, సంసార సుఖము లన్న కొంచెము విరక్తుడు. ఈ వైఖరి మారునేమో అని తండ్రి వివాహము చేసెను. కాలక్రమమున పుత్రోత్పత్తి జరిగెను. కాని వార్ధక్యము, రోగము, మరణము, ప్రవ్రజనము (సన్న్యాసము) - వీటిని చూచుచు మననము చేయుచుండిన సిద్ధార్థుని విరక్తి పక్వము కాగా, ఆయన కాషాయధారణము చేసి, ఇంటినుండి సమస్తము త్యజించి అభినిష్క్రమించెను. అప్పు డాయనకు 29వ ఏడు. ఆలారకాలాముడు, ఉద్రక రామపుత్త్రుడు అను తాపసుల వద్ద కేగి జరా మరణ రోగముల నుండి జీవు డెట్లు విముక్తు డగు నని అడిగి వారి బోధలను వినెను. కాని అవి ఆయనకు తృప్తి నీయలేదు. 'శ్రద్ధా వీర్య స్మృతి సమాధి ప్రజ్ఞలు నా యందును కలవుకదా! నేనేల స్వయముగ ధర్మ సాక్షాత్కారము చేయలేను?' అని తలచి, ఆయన బోధిగయవద్ద ఇంచుమించు ఆరేండ్లు భీషణ అనశన తపస్సు గావించెను. దీని వలన ఆయన త్వగస్థి శేషముగ అగుట, ఎంతో దుర్బలత్వము నొందుట మాత్రమే జరిగెను గాని బోధి (జ్ఞానము) లభింపలేదని గ్రహించి, ఆయన తిరిగి భోజనాదులు చేయుచు క్రమముగా శరీర మనస్సులను స్వస్థముచేసికొనెను.

రమణీయ ప్రదేశమున స్థితుడై ఆయన జన్మాదులను గురించి తీవ్రముగ ధ్యానము చేయగా ఆయనకు చివరకు దర్శనము (సాక్షాత్కారము) కలిగెను. 'దుఃఖము ఉన్నది. దానికి సముదయము (హేతువు) ఉన్నది. దానికి నిరోధము (వినాశము) ఉన్నది. ఈ నిరోధమునకు మార్గ మున్నది' అని ఆయనకు సాక్షాత్కార మాయెను. వస్తువులు, సంఘటనలు (వీటిని 'ధర్మము' అందురు) అన్నియు హేతు ప్రభవములు. ఆ హేతువు లేమిటో, వాటి నిరోధమెట్లో ఆయనకు గోచరించెను ('యే ధర్మా హేతు ప్రభవా హేతుం తేషాం తథాగతో హ్యవదత్; తేషాంచ యో నిరోధః' - శారిపుత్ర మౌద్గల్యాయనులను ప్రసిద్ధ బుద్ధ శిష్యులు ఇది ఆయన శిక్షాసార మనిరి). బోధి లభించుటచే నాటినుండి సిద్ధార్థుడు బుద్ధుడాయెను. అప్పుడాయనకు 36 వ ఏడు. ఏడు వారములు ఆయన తన విముక్తి సుఖ మనుభవించి, కాశీదగ్గర 'ఋషి పత్తన మృగదావము' నకు వెళ్ళి పూర్వము తనతో కొంత కాలము తపస్సు చేసిన అయిదుగురు భిక్షువులకు మొదటగా ధర్మము నుపదేశించెను. ధర్మ చక్ర మిట్లు మొదటగా ప్రవర్తితమైన ఈ ప్రదేశము (సారనాథ్ అనబడునది) నేడు బౌద్ధులకు పుణ్య క్షేత్ర మయినది.

కామ సుఖమందు మగ్నమగుట, అనశనాదుల జేసి శరీరమును పీడించుకొనుట అను రెండు అతి మార్గములను వదలి, జ్ఞానమును, శాంతిని ఇచ్చు మధ్యమ మార్గము ననుసరింపవలెను. 1. అసత్య కటు భాషణాదులను వదలి ప్రియ సత్య వచనములను భాషింపవలెను. 2. హింస, స్తేన, వ్యభిచారాదులు కాని కర్మనే చేయవలెను. 3. ప్రాణిహింస లేని, మద్య విషాది వ్యాపారములు కాని సరియైన జీవిత మార్గము ననుసరింపవలెను. ఈ మూడు (వీటిని శీల మందురు) అలవడవలె ననిన సరియగు దృష్టి, సరియగు సంకల్పము ఉండవలెను. మంచి చెడు కర్మ లేవో సరిగా తెలిసికొనుట సరియగు దృష్టి. రాగ హింస ప్రతి హింసలు లేని సంకల్పము సరియగు సంకల్పము. ఈ రెంటిని జ్ఞాన మందురు. జ్ఞానముచే శీలము సాధ్యమగును. అప్పుడు ఇంద్రియ సంయమమునకు, చెడు భావనల నరికట్టుటకు, మంచి భావనలు ఏర్పడుటకు, ఏర్పడిన వాటిని స్థిరముగ నుండునట్లు చేసికొనుటకు సరియైన ప్రయత్నము చేయవలెను. శరీరము, మనస్సు మొదలైనవన్నియు తరచు మలిన మగు నని, క్షణ క్షణము విధ్వంస మగునని తరచు జ్ఞాపకము చేసుకొనుచు సరియైన స్మృతి కలిగియుండవలెను. అప్పుడు చిత్తమునకు ఏకాగ్రత కలుగును. మనో విక్షేపములు తొలగును. ఇదే సరియైన సమాధి. సమాధివలన బోధి, చిత్తవిముక్తి వచ్చును; దుఃఖము నశించును. జ్ఞానశీలములలోని అయిదు అంగములు, సమ్యక్ప్రయత్న స్మృతి సమాధులు (ఈ మూడును కలసి యోగ మగును) కలసిన ఆర్య అష్టాంగిక మార్గము దుఃఖ నిరోధమార్గ మని బుద్ధుడు ఉపదేశించెను. పాపముల అకరణము, కుశలముల (పుణ్యముల) ఉపసంపద (సంచయము), చిత్త పరిశుద్ధి - ఇది బుద్ధానుశాసన మని ధమ్మపదము సంగ్రహించినది.

సమస్తమును (భౌతిక పదార్థములు, మానసిక స్థితులు) దుఃఖమే! జన్మమృత్యు వార్ధక్యములు, మనః ఖిన్నత, అప్రియసంయోగ ప్రియవియోగములు, ఇష్ట అప్రాప్తి- ఇదంతయు దుఃఖము. కామ (ప్రియ భోగ) తృష్ణ (దప్పిక, తీవ్రమగు ఇచ్ఛ), భవ తృష్ణ, విభవ తృష్ణ అని తృష్ణ మూడు విధములు. తృష్ణ దుఃఖమునకు హేతువు. ఇంద్రియములకు ప్రియము లగు విషయముల (ఇవే కామములు)తో సంపర్కము, వాటి స్మృతి తృష్ణను పుట్టించును. తృష్ణను పూర్తిగ వదలుట దాని వినాశమును, దుఃఖ నిరోధమును చేయును. ప్రియ విషయముల పట్ల, వాటి సంబంధములగు విచార వికల్పముల పట్ల తృష్ణ పోగానే దుఃఖ నిరోధ మగును. ఎందుచేతనన-తృష్ణ లేనిదే విషయములను సంగ్రహించుట (దీనిని ఉపాదాన మందురు) ఉండదు. అది లేనిదే భవము (పుట్టుట), భవము లేనిదే పునర్భవము (పునర్జన్మ) ఉండవు. భవ నిరోధము వలన జరా వ్యాధి మృత్యువులు మనః ఖిన్నత్వాదులు వినష్ట మగును. ఇట్లు దుఃఖాంత మగును.

అదియే నిర్వాణము*. దుఃఖ, దుఃఖ సముదయ, దుఃఖ నిరోధ, నిరోధమార్గము లున్న వను ఈ నాల్గును ఆర్యసత్యము లనబడును. అనగా గొప్ప సత్యములు, లేదా ఆర్యులచే (విద్వాంసులచే) గ్రహణ యోగ్యము లగు సత్యములు.

ఇది బుద్ధుని ధర్మచక్ర ప్రవర్తన సూత్ర సారాంశము. అంతయు అనిత్యము, దుఃఖము, అనాత్మము అనునది బుద్ధదర్శన సారాంశము. తరువాత 44 ఏండ్లు అనేక చోట్ల ధర్మబోధ చేయుచు గడిపి క్రీ.పూ. 493లో ఆయన సిద్ధిపొందెను.

తత్త్వములను మూడు విధములుగా వర్గీకరింప వచ్చును: 1. ఆరు ఇంద్రియములు (మనస్సుతో కలసి), వాటి విషయములు (మనో విషయము, ధర్మము) కలసి పన్నెండు ఆయతనము లగును. 2. ఈ పన్నెండును, విషయేంద్రియ సంపర్కమున కలుగు ఆరు విజ్ఞానములును (ఎరుకలు)(చక్షుర్విజ్ఞాన శ్రోత్ర విజ్ఞానాదులు) కలసిన 18 ధాతువులగును. 3. రూపము (పృథివ్యాది భూతములు), వేదన (సుఖ దుఃఖానుభవము), సంజ్ఞ (గురుతించుట,అభిజ్ఞానము), సంస్కారము (మనస్సుపై పడు అంకనము, వాసన) విజ్ఞానము (చైతన్యము, మనస్సు) - అను అయిదును స్కంధములు. ఇట్లు లోకమునందలి వస్తువులన్నిటిని ఈ మూడింటిలో ఏదో ఒక రకముగ విభజింప వచ్చును. లేదా భౌతికము లగు నవి (రూపము), అభౌతిక మనఃస్థితులు (విజ్ఞానము) (నామము) అని రెండే విధములుగ అన్ని పదార్థములను విభజింప వచ్చును. ఇవి అన్నియు సవికారములు, అధ్రువములు, అనిత్యములు. చిత్తము లేదా విజ్ఞానము అనబడునది మాటిమాటికి క్రొత్తది ఏర్పడుట, ప్రాతది నష్టమగుట కనపడుచున్నది. అంతకంటె కొంచెము స్థిరమయ్యు చతుర్భూతములచే ఏర్పడిన పదార్థములు కూడ నశ్వరములే. ఉత్పన్న వస్తువు ప్రతిదియు పూర్తిగ నాశమొందుచున్నది. క్రొత్త వస్తువులు ఎప్పుడును పుట్టుచునే ఉన్నవి. అవియు పోవును. అన్నియు అనిత్యములే!

తరువాత వచ్చిన బౌద్ధులు అనిత్యత్వవాదము నుండి క్షణభంగవాదమును నిగమనమును చేసిరి. 'అర్థక్రియాకారిత వలన వస్తు సత్త నిశ్చయమగును' అని ఒప్పుకొనినచో, ఒక క్షణమందలి అర్థక్రియనే ఏ ఇతర క్షణములందు కూడ వస్తువు చేయలేదు. అందుచేత ఒక క్షణమందు అర్థక్రియాకారి యగు వస్తువు అన్య క్షణములందు కాదు. అన్య క్షణము లందు అన్యవస్తువులే అర్థక్రియాకారులు. ఒక్కొక్క క్షణమందు ఒక్కొక్క వస్తువు అర్థక్రియాకారియై తత్క్షణమే భగ్న (నాశ) మగును. ప్రతి వస్తువు క్షణభంగి, ప్రతి వస్తువు ప్రతి క్షణము తన కార్యము పట్ల జనన వ్యవహార క్షమమే. క్షణానంతరము అది ఉండదు. వేరొకటి ఉత్పత్తియై, క్షణ ముండి, భంగ మొందును. ఉదాహరణమునకు ఒక కుండ ప్రతి క్షణము అపూర్వమే. ప్రతి క్షణము జనన వ్యవహారము జరుగును. అనగా అనుక్షణము క్రొత్త క్రొత్త అర్థక్రియలు జరుగును. ఇదే క్షణిక వాదము.

"వస్తువులలో ఒకటి నశించిన పిమ్మట మరొకటి పుట్టుచుండును. ఇది యుండగా (జరుగగా) ఇది వచ్చును (జరుగును) (అస్మిన్ సతి ఇదం భవతి) అను నియమము వస్తువులకు కలదు" అని బుద్ధుని బోధ. ప్రతి వస్తువునకును ప్రత్యయము (హేతువు) కలదు. అయితే ప్రతి ప్రత్యయమును తన కార్యము ఉత్పత్తియగుటకు ముందుగా నాశమగును. ప్రత్యయ నాశము కార్యోత్పాదమునకు ముందు జరుగును.

---

* నిర్వాణ మనగా 'ఆరిపోవుట' అని శబ్దార్థము. నిర్వాణమునకు దుఃఖనాశము, విరాగము, రాగ క్షయము లక్షణము లని కొన్ని పాళీ గ్రంథములు; కొన్ని సూత్రాంశములు. అది అజాతము, అమృతము, అనన్తము అనియు చెప్పినవి. కాబట్టి అది అభావ మాత్రమా, లేదా అమృతమా యను వాదము వచ్చినది. కొన్ని చోట్ల నిర్వాణ మన వేదనయొక్క అభావ మని, కొన్నిచోట్ల అది అచల అమృతపద మని బౌద్ధ గ్రంథములు అనినవి. బుద్ధునిచే నిర్వాణ స్వరూపము అనాఖ్యాత మని కొన్ని గ్రంథముల మతము.

ఒక వస్తువు (యొక్క ఉనికి) ప్రాప్తము అగుట ప్రతీత్యము (ప్రతి + ఇ + ల్యప్). ఇది జరుగగానే మరొక వస్తువు సముత్పాదము (ప్రాదుర్భావము) అగును. 'వస్తువుల ఉత్పత్తి ప్రత్యయసాపేక్షము' అను ఈ వాదము ప్రతీత్య సముత్పాద వాద మన బడును. అన్ని స్కంధములును ప్రతీత్య సముత్పన్న ములే. విజ్ఞానము (జీవుడు) కూడ ప్రతీత్యసముత్ప న్నమే.

పంచ స్కంధములును తమ ఆహారము వలన ఉత్పన్న మయినవి. అన్ని ఆహారములకు నిదానము (కారణము) తృష్ణ. దానికి వేదన, దానికి స్పర్శము, దానికి ఆరు ఆయతనములు, వానికి నామ రూపములు వానికి విజ్ఞానము, దానికి సంస్కారము, దానికి అవిద్య నిదానములు. తృష్ణవలన ఉపాదానము (గ్రహించవలె నను, వద్దను ఇచ్ఛ), దాని వలన భవము (ఆవాగమనము), దానివలన జాతి (జన్మము), దాని వలన జరా మరణములు కలుగును. తిరిగి దీనివలన అవిద్యాదులు ఆవృత్త మగును. ఇది ద్వాదశాంగ ప్రతీత్య సముత్పాద మనబడును. ఇది ఒక గొలుసు వంటిది.

ఆత్మత్వము అనగా స్థిరమగు తనతనము. ఇది ఎందునను లేదు - శాశ్వత సత్త ఏదియు లేదు గావున. కాన బుద్ధునిది అనాత్మ వాదము. దీనిని పుద్గల ప్రతిషేధ వాద మని కూడ అందురు. కాయమందు (శరీరమందు) ఏదో ఉన్నది (సత్) అని అనుకొనుట సత్కాయ దృష్టి. ఈ దృష్టి బంధహేతువని, అది నశింపనిదే జ్ఞానప్రాప్తి కాదని బుద్ధుని మతము. సంసార తృష్ణయే సత్కాయ దృష్టికి కారణము. అనుభవ కర్త, అనుభవ విషయము అగు ఆత్మ ఉన్నదని, అది నిత్యముగ, అపరివర్తన శీలముగ, అనంతముగ ఉండును అని నమ్ముట 'కేవలము పరిపూర్ణమగు బాల ధర్మము' (మూర్ఖ విశ్వాసము) అని బుద్ధుడు చెప్పెను (మజ్జిమ నికాయము I. 1,2). బుద్ధుడు పరలోకము, కర్మఫలము లేదను వాదమును కూడ నిరాకరించెను. 'శరీరమే జీవుడు' అను వాదమును గాని, 'శరీరము వేరు, జీవుడు వేరు' అను వాదమును గాని ఆయన గ్రహింప లేదు. రెంటిని త్రోసి వేసెను. 'ఆత్మ శరీరమునకు భిన్నము. అది నిత్యము, పూర్ణము' అను వారికి బ్రహ్మచర్యాదుల అవసరము లేదు. నిత్యాత్మకు సంశుద్ధి ఎందుకు? అట్లే 'కర్మఫలము లేదు. పునర్జన్మ లేదు' అను వారికి శుభకర్మల అవసరములేదు. అందుచేత బ్రహ్మచర్యాది శుభకర్మలకు ప్రయోజనము, అవకాశము ఈయని ఈ రెండు వాదములును బుద్ధునిచే నిషిద్ధములు. ఉన్నవి అన్నియు హేతు ప్రత్యయ జనిత ధర్మములు మాత్రమే; అవే స్కంధములు. కాని జీవుడు అసలు లేడనినచో కొందరు మిథ్యాదృష్టిలో పడి శుభకర్మలు చేయరు. జీవుడున్నాడనిన 'ఉన్నవి ధర్మములే, ఆత్మలేదు' అను సిద్ధాంతమును బాధించును. కాగా, ఈ దృష్టిచే కొందరు విదీర్ణు లగుదురు. అంచేత 'ఆత్మకలదా? లేదా?' యను ప్రశ్నకు బుద్ధులు విధి నిషేధాత్మకముగ జవాబీయరు. 'బుద్ధైరాత్మేన చానాత్మా కశ్చిదిత్యపి దేశితమ్' (నాగార్జునుడు). రెండును సరియగు సమాధానములు కావు. వ్యాఘ్రి తన పిల్లను దంతములతో గట్టిగను, నిష్ఠురముగను పట్టుకొనదు. పడి పోవునట్లును, శిథిలముగను పట్టుకొనదు. ఈ విషయమున బుద్ధబోధ వ్యాఘ్ర పోతాపహారము వలె నున్నది అని కుమారలాతుడు చెప్పెను. స్కంధ సంతాన మగు, ప్రజ్ఞప్తిమాత్రుడగు జీవు డున్నాడు. కాని స్కంధ వ్యతిరిక్తు డగు, సద్ద్రవ్యమగు జీవుడు లేడు 'శాశ్వత మగు జీవుడు కలడు' 'జీవుడు మరణముతో పూర్తిగ విచ్ఛిన్న మగును. తిరిగి పుట్టడు' అను శాశ్వతవాద, ఉచ్ఛేదవాదములను, ఆత్మ నైరాత్మ్య వాదములను పరిహరించి బుద్ధుడు మధ్యమ ప్రతిపత్తిచే ధర్మాదేశన చేసెనని రత్నకూట సూత్ర మనినది.

లోకము నిత్యమా? అనిత్యమా? సాంతమా? అనంతమా? జీవుడును, శరీరమును ఒకటా? రెండా? చచ్చిన పిదప తథాగతులు ఏమయ్యెదరు? అను ప్రశ్నలు సార్థకములు కావని, బ్రహ్మచర్యాదుల కుపయోగములు కావని, నిర్వేద (వైరాగ్య), దుఃఖ

నిరోధ జ్ఞానములకు ఆవశ్యకములు కావని ఎంచి బుద్ధుడు వీనిని అవ్యాకృతము (అకథనీయము)లు అని చెప్పెను.

భిక్షువులై అష్టాంగమార్గమున కర్మక్లేశ నిరోధము చేయుట నిర్వాణ పథము. గృహస్థులు దీనిని అనుష్ఠింప లేరు. వారికి విక్షేపములు, విఘ్నములు హెచ్చు. వారు పంచశీలముల నభ్యసింపవలెను. అవి ఏవన - 1. ప్రాణాతిపాత విరతి (ప్రాణములను తీయకుండుట), 2. అదత్తాదాన విరతి (ఈయబడని దానిని తీసికొనకుండుట), 3. కామమిథ్యాచార విరతి (కామ మిథ్యాచారములను వీడుట), 4. మృషావాద విరతి (అసత్యభాషణముమానుట), 5. సురామైరేయ ప్రమాద స్థానవిరతి (మద్యము మొదలగు ప్రమాదము కలిగించు వస్తువులను ఉపయోగింపకుండుట), ధర్మశ్రవణము, ఉపవాసము, భిక్షువులకు దానము, బౌద్ధ తీర్థస్థానములయాత్ర, భద్రదృష్టి భద్రశీలములు కలిగి యుండుట, సుచరితులై ఉండుట - వీటి ద్వారా గృహస్థులు నిర్వాణమందలేరు గాని, వారికి స్వర్గోపపత్తి అగును.

బుద్ధుని బోధనలను ఆయన నిర్వాణకాలమున రాజగృహమందు మహాకాశ్యపుని అధ్యక్షతను జరిగిన ఒక భిక్షు సంగీతి (సభ) యందు సంగ్రహించి స్థిరీకరించిరి. ఆయన ఉపదేశములు 'సుత్త పిటక' మను పేర, ఆచార సంబంధములగు విషయములు 'వినయ పిటక' మను పేర అప్పుడు సంకలింపబడెను. మొదటి దానికి ఆనందు డను బుద్ధ శిష్యుడు, రెండవ దానికి ఉపాలి యను మరొక భిక్షువు ప్రధాన సంపాదకులు. సుత్త పిటకమందలి 'మాతికా' యను దర్శన సంబంధ భాగములు తరువాత 'అభిధమ్మ పిటకము'గా విస్తరించెను. సుత్త పిటకమున అయిదు 'నికాయములు,' వినయ పిటకమున మూడు అంగములు, అభిదమ్మ పిటకమున ఏడు భిన్న గ్రంథములు కలవు. ఇవన్నియు పాళీ భాషలో నున్నవి. సంస్కృతమున లభ్యములగు కొన్ని బౌద్ధ సూత్ర గ్రంథములు కలవు. ఇందు కొన్ని 179 ప్రాంతములోను (ఉదా. ప్రజ్ఞాపారమితా సూత్రములు), 147-186 మధ్యను (ఉదా. సుఖావతీ వ్యూహము) చైనా భాషలోనికి అనూదితములైనవి. అందుచే వీనిలో కొన్నియైనను క్రీస్తు పూర్వమే రచింపబడియుండవచ్చును. మహావస్తు, లలిత విస్తరాది గ్రంథములు కొన్ని సంకర సంస్కృతమున ఉన్నవియు క్రీస్తు పూర్వమే వ్రాయబడినట్లు తోచును. టిబెట్, చైనా మొదలగు దేశములలో సంస్కృత సూత్ర గ్రంథములు అతి పవిత్రములని, పరమ ప్రామాణికములని ఎంచబడుచున్నవి.

## బౌద్ధ దర్శన శాఖలు

**సర్వాస్తివాదము :** బుద్ధుని నిర్వాణానంతరము 300 ఏండ్లకు కాత్యాయనీ పుత్రుడు 'అభిధర్మ జ్ఞాన ప్రస్థాన శాస్త్రము'ను వ్రాసెను. దీనికి కనిష్కుని కాలమున 'విభాష'యను వ్యాఖ్యానము వ్రాయబడెను రెండును సంస్కృత గ్రంథములే. అభిధర్మ పిటకము బుద్ధ వచన మని నమ్మి దాని నాధారముగగొని శాస్త్రకాత్యాయనీ పుత్రుడు తన జ్ఞాన ప్రస్థాన శాస్త్రమును వ్రాసెను. సర్వాస్తివాద దర్శనము దీనిపై ఆధారపడినది. 'విభాష'ను ప్రమాణముగ గలవారు వైభాషికులు. ఈ గ్రంథము లిపుడు చైనా భాషలో గల అనువాదములలోనే లభ్యములు, వైభాషికులకు కాశ్మీరము కేంద్రముగ నుండుటచే 'కాశ్మీర వైభాషికు'లను పేరు వచ్చెను, అయితే సర్వాస్తివాదు లందరును విభాష నామోదింపలేదు. కాశ్మీరములో గూడ వైభాషికులు కాని సర్వాస్తివాదు లుండిరి. కాశ్మీరమునకు బయట నున్న సర్వాస్తివాదులు 'బహిర్దేశక', 'పాశ్చాత్య', 'అపరాంతకు' లను నామముల బరగుచుండిరి. వసుమిత్ర, ఘోషక, బుద్ధదేవ, ధర్మత్రాత, భదంతాదుల వైభాషికులు.

కాశ్మీర వైభాషిక నయము నాశ్రయించి అభిధర్మమును వసుబంధుడు (4 వ శతా.) 600 కారికలలో వివరించెను. దీనికి 'అభిధర్మకోశ' మని పేరు. దీనిపై అతడును, స్థిరమతి, వసుమిత్ర, దిఙ్నాగ, యశోమిత్రులును వ్యాఖ్యలు వ్రాసిరి. దీనిని 'కోశకరక' యను గ్రంథమున సంఘభద్రుడు ఖండించెను. వసుబంధుడు మాత్రము వైభాషికుడు కాడు. అయినను అతని గ్రంథము సర్వాస్తివాదు లందరికిని సర్వ మాన్య గ్రంథము.

అతీతానాగత ధర్మములు, స్వలక్షణము గల పదార్థములు కూడ ద్రవ్యసత్తులే యని త్రైయధ్విక ధర్మముల అస్తిత్వమును ప్రతిపాదించువారు సర్వాస్తివాదులు. బాహ్య మగు రూపము, ఆంతర మగు విజ్ఞానము - రెండును స్వతంత్రముగ ఉన్న వని వీరందురు. అయితే అన్నియు ప్రతీత్య సముత్పన్నములే. ఆలంబనము లేనిదే విజ్ఞానము ఉత్పన్నము కాదు. అతీతానాగత వస్తువు లేనిదే విజ్ఞానము నిరాలంబనమగును; ఉత్పన్నము కాదు. అతీతము లేనిదే అనాగతమున కర్మ ఫలము నీయలేదు. విపక్వ కాలమున విపాక హేతువు అతీతమే ! కాబట్టి అనిత్యము, అతీతము, అనాగతము అగునది రూపము.

స్వ లక్షణమును ధారణ చేయునది ధర్మము. ధర్మములు వ్యవకీర్ణములు. వాటిని ఏరవచ్చును (ప్రవిచయము చేయవచ్చును), విభాగింపవచ్చును. ధర్మ ప్రవిచయము ప్రజ్ఞ యను చిత్త ధర్మ లక్షణము. దాని వలన నిర్వాణము వచ్చును. ఇదే పరమ జ్ఞానము. ధర్మముల స్వలక్షణము, సామాన్య లక్షణము తెలిసికొనుటచే నిర్వాణప్రాప్తి యగును.

మల సహితములు (సాస్రవములు), మలరహితములు (అనాస్రవములు) అని ధర్మములు రెండు రకములు. ఆర్యమార్గమును వదలిన సంస్కృత ధర్మము లన్నియు సాస్రవములే. ప్రత్యయముల అన్యోన్య సమాగమముచే, అన్యోన్యాపేక్షితములై చేయబడిన (కృతాః) ధర్మములు సంస్కృతములు. ఇవి జాతి జరా స్థితులు కలవి; అనిత్యములు. స్కంధాదులు ఇట్టి ధర్మములు. అసంస్కృత ధర్మములు అనాస్రవములు. ఆకాశము, మార్గ సత్యము, ప్రతిసంఖ్యా నిరోధము, అప్రతిసంఖ్యానిరోధము - ఇవి అసంస్కృత ధర్మములు.

ఆవృతము చేయనిది, రూపముచే ఆవృతము కానిది ఆకాశము. ఇది పృథ్వ్యాదుల వలె భౌతికము కాదు. ప్రతిసంఖ్య యనున దొక ప్రజ్ఞా విశేషము. దీనివలన సాస్రవ ధర్మముల పృథక్‌పృథగ్వియోగము అగును. ఏ ధర్మమును గూర్చిన రాగద్వేషాదులు ప్రతిసంఖ్యచే నిరోధింపబడునో, ఆ ధర్మము విషయములో ప్రతి సంఖ్యా నిరోధము (నిర్వాణము - దుఃఖ నిరోధము) జరుగును. ప్రతిసంఖ్య లేకుండగనే జరుగు నిరోధము అప్రతిసంఖ్యా నిరోధము. ఏ ధర్మము విషయములో ఇది జరుగునో, అది ఇక ఉత్పన్నము కాదు. వాటిని గూర్చి రాగాదులు ఇక ఎప్పుడును కలుగవు. ఈ మూడును అసంస్కృతములు, అధ్వవినిర్ముక్తములు నగు ధర్మములు.

ప్రజ్ఞప్తి మాత్రమే ఆత్మ. స్కంధ పంచకమే ఆత్మ, జీవుడు. ఇది అపరిణామ శాశ్వత పదార్థము కాదు. వైభాషికులు సస్వభావవాదులు, బహు ధర్మవాదులు. వారు శాశ్వత ద్రవ్యమును దేనిని గాని, ఒకే మూలకారణమును దేనిని గాని ఒప్పుకొనరు.

సర్వాస్తి వాదులు 14 రకముల పరమాణువులు ఉన్న వందురు. అవి ఏవన: 5 విజ్ఞానేంద్రియములు, 5 విషయములు, 4 మహాభూతములు. రూపముల సంఘాతములోని కెల్ల సర్వసూక్ష్మములైనవి పరమాణువులు. అవి ద్రవ్యములు కావు. వీటినే కలాపము లనియు అందురు. ఉపచయము, సంతతి, జరత, అనిత్యత - ఇవి రూప కలాపముల లక్షణములు. సర్వసూక్ష్మకాలము క్షణమైనట్లు, సప్రతిఘ రూపముల సర్వ సూక్ష్మభాగము పరమాణువు. అది రూప పర్యంతరము మాత్రమే కాని అవినాశి కాదు; నిత్యమును కాదు.

**బాహ్యార్థ వాదము :** సుత్త పిటక మందలి సూత్రాంతముల (కొన్ని సూత్రముల)నే బుద్ధ వచనములుగా ప్రమాణములుగా ఎంచి, అభిధమ్మమును బుద్ధ రచనగా ఎంచనివారు సౌత్రాంతికులు. సూత్ర నికాయాచార్య లని కూడ వీరికి పేరు. తక్షశిలలో కుమారలాతుడు (2 వ శతా. చివర, లేదా 3 వ శతా.) ఈ సంప్రదాయమును ప్రతిష్ఠించెను. 'కల్పనా మండితిక' ఆతని గ్రంథము. శ్రీలాత, బుద్ధదేవ, వసువర్మాదులు తరువాతి ప్రసిద్ధ ఆచార్యులు. సౌత్రాంతిక సాహిత్య మంతయు నష్టమైపోయినది.

వీరు బాహ్యజగత్తు మాత్రమే ఉన్నదని యందురు. అందుచే వీరు బాహ్యార్థవాదులు. క్షణికమగు రూపమే మూలతత్త్వమని వీరి మతము. కాని బాహ్య జగత్తు ప్రత్యక్షముచే గాక అనుమానముచే తెలియబడుచున్నది. క్షణిక వస్తువులు ప్రత్యక్షముచే గ్రహింపబడవు.

రూపము ఒకే విధమైనట్టిది. సర్వాస్తివాదుల అసంస్కృత ధర్మములను వీరు ద్రవ్య సత్తలని ఒప్పుకొనరు. స్ప్రష్టవ్యముయొక్క అభావమే ఆకాశము. నిర్వాణమును సద్వస్తువు కాదు; అభావ మాత్రము. అన్య జన్మల అనుత్పాదమే నిర్వాణము. క్లేశ దుఃఖముల అనుత్పత్తియే నిరోధము.

సంస్కృత ధర్మముల 'అభూత్వా - భావము' (ఇదివరకు లేకుండ ఉండుట), 'భూత్వా-అభావము' (ఉండి లేకుండ పోవుట) జరుగును. ఈ ధర్మముల ప్రవాహమే వాని స్థితి. అతీతానాగతములు సద్వస్తువులు కావు.

సంస్కృత ధర్మము లన్నియు క్షణికములు. ఆత్మ లాభానంతరమే వినష్ట మగునవి క్షణికములు. వినాశము అకస్మాత్తుగ అహేతుకముగ అగును- అది అభావము కాన. సంస్కారముల ప్రవృత్తి యోగము క్షణికత్వము లేనిదే సిద్ధింపదు. క్రియ, వస్తువు క్రియాకాలములలో అంతరము లేదు. అసత్తు నుండి ఉత్పన్నమై, క్షణముండి వస్తువులు నష్టమగును. కాన భూత భవిష్యత్తులు లేవు.

సౌత్రాంతికులు జ్ఞానము స్వయంప్రకాశ్యమని, స్వసంవిత్తి కలిగినదని ఎంచెదరు. బయటి వస్తువులు అంతరములగు బుద్ధియొక్క వివిధాకారములను పుట్టించును; వాటి ద్వారా అనుమానము చేయబడును. బాహ్య వస్తువుల ఆకారములు చిత్త నిర్మితములని కొందరు సౌత్రాంతికులును, పదార్థనిష్ఠములని మరి కొందరును అనిరి. నిరవయములగు పరమాణువులు ఒకదాని నొకటి తాకవు. అవి నిరంతరములై యుండి, వాటి సంఘాతములును వాటి పరిమాణమంతే ఉండును.

**విజ్ఞాన వాదము :** లంకావతార, సంధి నిర్మోచన, ప్రజ్ఞాపారమితాది బౌద్ధ సూత్ర గ్రంథములు బాహ్యజగ దస్తిత్వమును నిరాకరించి, విజ్ఞానము మాత్రమే తత్త్వమని చెప్పినవి. అయితే క్షణికము కానిది బౌద్ధములో సత్తుగాదు గాన ఈ విజ్ఞానము కూడ క్షణికమే! 'దశభూమిక శాస్త్రము' ఈ వాదమునకు ప్రధానాధారము. 3 వ శతాబ్దమున మనిన మైత్రేయ నాథుడు 'పంచవింశతి సాహస్రిక ప్రజ్ఞాపారమిత' పై 'అభిసమయాలంకార' మను గ్రంథము వ్రాసి విజ్ఞాన వాదమును సుప్రతిష్ఠితము చేసెను. 'మహాయాన సూత్రాలంకారము' వ్రాసినది కూడ ఇతడే అందురు; కొందరు అసంగుడందురు. 'మధ్యాంత విభాగము'ను ఇతని కృతియే. వసుబంధువునకు అన్నయగు అసంగుడు (4 వ శతా.) అభిసమయాలంకారముపై టీకను, 'యోగాచార భూమి శాస్త్ర' మను ఉద్గ్రంథమును వ్రాసెను. వసుబంధువు వ్రాసిన 'వింశతికా' 'త్రింశిక'లు, దిజ్నాగుని (345-425 మధ్య) 'ప్రమాణ సముచ్చయ', తత్ టీకాదులు, ఘుఅన్‌చ్వాంగ్ (630) త్రింశికపై వ్రాసిన 'విజ్ఞప్తి మాత్రతాసిద్ధి, ధర్మకీర్తి (635-650 మధ్య) వ్రాసిన 'ప్రమాణ వార్తిక' ఇత్యాది గ్రంథములు విజ్ఞాన వాదమును గొప్ప దర్శన ప్రస్థానముగ చేసినవి.

ప్రాచీన పిటకములందు దొరలు 'యోగావచర' (యోగి) శబ్దము నుండి 'యోగాచార' శబ్దము వచ్చినది. అసంగుని ప్రసిద్ధ గ్రంథమును బట్టి ఈ

శబ్దము బౌద్ధ విజ్ఞానవాదమునకు యోగాచార మను నామము నిచ్చినది. వింశతికలోను, దానిపై గల స్వకీయ వృత్తిలోను వసుబంధువు చెప్పిన ప్రకారము విజ్ఞానవాదము నీ క్రింద వివరింతుము:

సమస్తమును చిత్తమాత్రము అనునది విజ్ఞాన వాద సారము. చిత్త, మనో, విజ్ఞాన, విజ్ఞప్తులు పర్యాయ పదములు. చిత్తముచే ఇక్కడ చైత్తమును అభిప్రేతము. బాహ్యార్థము లేదు. రూపాదులు లేకుండ గనే రూపాది విజ్ఞప్తి ఉత్పన్న మగుచున్నది. అర్థ రూపముగ అవభాసించునది విజ్ఞానమే. అర్థము అసత్తు. తిమిర రోగికి అసత్కల్పములగు కేశాదులు ధాన్యాది పుంజములలో కన్పడినట్లు అర్థమును భాసించుచున్నది.

అట్లయిన, విజ్ఞప్తి ఉత్పత్తి యగుటలో దేశకాల నియమము, సంతాన నియమము ఎందుకు ఉన్నది? ప్రతి విజ్ఞప్తియు ఏదో ఒక దేశ కాలమునందు, ఒకానొక సంతాన (పరంపర) మందు ఏర్పడుచున్నది గాని, అన్ని వేళలను, అన్ని చోట్లను, ప్రతి సంతాన మందును ఏర్పడుట లేదు. తైమిరికునికి కలుగు కేశాది భావమును అతని విజ్ఞాన సంతానమున కల్గుచున్నది; ఇతరులకు అగుట లేదు. స్వప్నాదులందు కన్పడు అర్థములు క్రియావంతములు కావు. కలలో తిన్న అన్నము ఆకలిని, విషము ప్రాణమును పోగొట్టవు కదా! గంధర్వ నగరము నగర క్రియా సంపన్నము కాదు. అనగా అందు జీవులు నివసింపరు. 'అర్థము అభావమైనచో, దేశకాల సంతాన నియమము, కృత్య క్రియా యుక్తత ఉండవు' అని విజ్ఞానవాదముపై పూర్వపక్షము చేయవచ్చును.

దీనికి విజ్ఞానవాదులు ఇట్లు సమాధాన మిచ్చిరి: బాహ్యార్థములు లేకుండగనే దేశాది నియమములు సిద్ధించును. స్వప్నమందు కనపడు వస్తువులు కూడ ఏదో ఒక దేశవిశేషమందు, ఒకానొకప్పుడే కన్పడు చున్నవి. సర్వత్ర సర్వదా కన్పడుట లేదు కదా! వాటి కర్థములు లేవు. కాబట్టి దేశ కాల నియమములు అర్థ అభావమున కూడ సంభవములే. ప్రేతములు అన్నియు ఎప్పుడును మూత్ర పురీష పూర్ణమగు ఒక నదిని చూచుచుండును. దండ ఖడ్గములను ధరించిన పురుషులచే పరివేష్టితములై యుండును. అన్ని ప్రేతములకు అసలు అట్టి అర్థములు ఆ దేశమున లేకున్నను అట్లు కానవచ్చును. కాబట్టి సంతాన అని యమము ప్రేతములకు వలెనే సిద్ధము. స్వప్న దర్శ నమునకు కృత్యక్రియ ఉండదనుట అసత్యము. స్వప్నమందు ద్వయసమాపత్తి లేకుండగనే శుక్ర విసర్గమగుట ఎరుగుదుము కదా!

నరకమందలి వారికి అందరికి-ఒకనికి కాదు- నరకపాలాదుల దర్శనము, వారు పీడించునట్లు కన్పడును. ఇది అసత్కల్పమే. ఏలన నరకపాలురు సత్త్వములు కారు. నారక దుఃఖానుభవము వారికి లేమిచే నరకపాలాదులు నారకులు కారు. నరకమందు అనారకుల ఉత్పత్తి కాదు. 'నరకపాలాదులు, వారు పెట్టు బాధలు కూడ నారకుల కర్మచే సంభూతములై వారికి భయము కలిగించు కర్మలు చేయుచున్నట్లు కన్పడును' అని ఆగమములు చెప్పినవి. అట్లే, జీవుల కర్మవలన విజ్ఞానము పరిణామమొంది బాహ్యార్థ ములుగ కనపడును. వాస్తవములగు పంచభూతాదుల కల్పనలో లాఘవము లేదు.

ఒకానొక ద్రష్టగాని, మంతగాని లేదు. పుద్గల నైరాత్మ్యమే (అనాత్మమే) సత్యము. విజ్ఞప్తి ఒకటియే కలదు. అదే రూపాది ధర్మములుగ ప్రతిభాసించు చున్నది. అయితే, రూపాది ధర్మములకు సర్వథా అభావమానమైనచో, విజ్ఞప్తి మాత్రము ఉండునా? దీనికి సమాధానము: 'ధర్మములు నైరాత్మ్యములు. ఏలన వాటికి మూర్ఖులు పరికల్పించిన గ్రాహ్య గ్రాహ కాది స్వభావము లేదు. కల్పిత ఆత్మత్వము (తన తనము) వాటికి లేదు. కాని బుద్ధులకు విషయమగు అనభిలాప్య మగు ఆత్మత్వము వాటికి కలదు. కాన పరమార్థమున ధర్మనైరాత్మ్య విపర్యాసమే కలదు'.

రూపాది విజ్ఞప్తులే ఉన్నవి. వాటి విషయము లకు అస్తిత్వము లేదు. ఎందుచేత? రూపాది ఆయ తనము అవయవి రూపముగా ఒకటియా? లేదా పర మాణుశః అనేకమా? అవయవముల కన్య మగు

అవయవి రూపగ్రహణము ఎప్పుడును కాదు కాబట్టి ఒకటి విజ్ఞప్తి విషయము కాదు. పరమాణువులందు ప్రతి ఒకదాని గ్రహణము జరుగదు గాన అనేకమును విజ్ఞప్తి విషయము కాదు. రూపాది ఆయతనము పరమాణు సంహత మనినచో పరమాణువు ఒక ద్రవ్యమని సిద్ధము కాలేదు గాన, సంహతములగు పరమాణువులు విజ్ఞప్తి విషయములు కావు.

పరమాణువులు దిగ్భాగ భేదములు కలవని గాని లేనివని గాని చెప్పుటవలన ఆపత్తి* కలదు. మొదటి పక్షమున అది విభాజనీయమగును. రెండవ పక్షమున పిండము (పరమాణువుల సంహతి) సంభవము కాదు. కాన పరమాణువు లసిద్ధములే. కాక, నిరవయవము లగు పరమాణువులు ఎట్లు సంయోగము చెందును? సంఘాతము లెట్లేర్పడును? దిగ్భాగ భేదము గల పరమాణువునకు ఏకత్వము, ద్రవ్యత్వము అసిద్ధములు. అట్టి భేదము లేనిదే ప్రతిఘాత సంఘాతములు ఏర్పడవు. అట్టి భేదము లేనిదే పరమాణువుకు ఆవరణ ఉండదు. పరమాణువులు అసిద్ధమైనందున రూపాదుల అనేకత్వము కూడ దూషిత మయినది. ద్రవ్యానేకత్వము లేదు. రూపమును ఒక ద్రవ్య మనియు ధ్రువపరచలేము. ఏలన చక్షుర్విషయము ఒకే ద్రవ్యము అని కల్పన చేసినచో దాని అవిచ్ఛిన్న ఉపలబ్ధి ప్రత్యక్షము కావలెను కదా! అనుభవము దీనికి వ్యతిరేకము.

కాన, పరమాణువులు అసిద్ధములు. వాటి సంఘాతములు అసిద్ధములు. రూపాదుల విషయత్వమును అసిద్ధమే. విజ్ఞప్తి మాత్రమే సిద్ధము.

ప్రమాణముల వలన అస్తిత్వ, నాస్తిత్వములు రుజువగును. ప్రమాణములలో ప్రత్యక్షము బలవత్తమము. అర్థము అసత్తయినచో ప్రత్యక్ష బుద్ధి ఎందుకు కలుగుచున్నది? ఈ ఆక్షేపమునకు విజ్ఞానవాదులు చెప్పిన సమాధాన మిది : "క్షణికవాదులు విషయములు ప్రత్యక్ష మగుటను అంగీకరింపలేరు. ఏలన క్షణిక మగు విజ్ఞానము విషయముగా తెల్పిన క్షణమందే రూప రసాదికములు నిరుద్ధము లగును. ప్రత్యక్షబుద్ధి కలిగిన క్షణమందే అర్థము కానరాకుండ పోవును. ఏలన అప్పుడే మనో విజ్ఞానము ద్వారా పరిచ్ఛేదము, చక్షుర్విజ్ఞాన నిరోధము జరిగియుండును".

ప్రత్యక్షమందు అనుభూతార్థ స్మరణ జరుగుట లేదు. చక్షుర్విజ్ఞానాదిక మగు విజ్ఞప్తియే అర్థరూపమున భాసించును. దీనిచే స్మృతి సంప్రయుక్తమగు రూపాది మనోవిజ్ఞప్తి ఉత్పన్నమగుచున్నది. స్వప్నమందు చూచిన అభూతార్థము మేల్కొనువరకు అభావముగ అవగతము కాదు. అట్లే వితథ వికల్పముల అభ్యాసమునకు వశుడై వాసనా నిద్రలో నున్న పుద్గలము (పురుషుడు) అభూతార్థమును చూచుచు కూడా అది అభావమని ఎరుగ నేరడు. లోకోత్తర నిర్వికల్ప జ్ఞానముచే ప్రబుద్ధుడైనపుడు దీని నెరుగ గలడు.

విజ్ఞప్తు లన్నియు ఆయా విజ్ఞప్తి సంతానముల పరిణామముననే ఉత్పన్నమగును; అర్థ విశేషములచే కాదు. అట్లే ఒక చిత్త సంతానపు విజ్ఞప్తి విశేషము సంతానాంతరమందు విజ్ఞప్తి విశేషమును పుట్టించ గలదు.

విజ్ఞప్తి మాత్రత అచింత్యము; తర్క విషయము కాదు. బుద్ధులకే అది సర్వథా గోచరము.

వసుబంధువు వింశతికలో పై విధముగా విజ్ఞానవాదమును వివరించినాడు.

విశ్వముయొక్క మూల తత్త్వము ఆలయ విజ్ఞాన మని లంకావతారాది సూత్రగ్రంథములు చెప్పినవి. ఆలయ మగు విజ్ఞానము, విజ్ఞానముల ఆలయము, సర్వ ధర్మములయందు కారణ భావముగా ఆలీనమగునది - ఆలయ విజ్ఞానము. "గాలిచే ప్రేరితమై సముద్రము నుండి ఎగురుచున్న తరంగములు పుట్టి, వాటి ప్రవాహము విచ్ఛేదము కానట్లు విషయ రూపమగు గాలిచే- ప్రేరితమై చిత్ర విచిత్రముగ నాట్యము చేయు విజ్ఞాన తరంగములచే ఆలయ సముద్రము ఎప్పుడును క్రియాపరాయణమై ఉండును" అని లంకావతార మనినది. దానినుండి వచ్చు

* అనిష్ట పర్యవసానము అను తర్క దోషము.

ఇంద్రియ మనో విజ్ఞానములు ప్రవృత్తి విజ్ఞానములు. జడజగత్తు కూడ దానినుండియే వచ్చినది. ఆలయ విజ్ఞానముకూడా క్షణికమే. కాన ఒకటియు, అభిన్న మును కాదు. స్రోతము వలె ఇది వర్తమాన మగు చున్నది. కాన ఇది శాశ్వతమును కాదు ; ఉచ్ఛిన్న మును కాదు. ఇది అనాది. ప్రతి క్షణమును ఉత్పన్న మగుచు, నిరుద్ధ మగుచు, సంతాన బీజముల ధరించుచు, వాటి సంరక్షణ చేయుచు, పూర్వమునుండి అపరము లోనికి ప్రవర్తించును. దీనికి హేతుఫలభావమున్నది. అసంగ, వసుబంధు, హుఆన్ చ్వాంగ్‌లు ఇటుల దీనిని వివరించిరి.

వస్తువులలో ఎట్టి స్థిర తత్త్వమును లేదు. అవి శూన్యములు ; సారము లేనివి ; క్షణికములు. బాహ్యా భ్యంతర పదార్థము లన్నియు స్వభావముచే భంగు రములు. స్కంధములలో భాసించు స్థిరత్వము భ్రమయే. అవి అన్నియు నురుగు బుడగలు, బుద్బుదములు, మృగమరీచికలు, కదళీగర్భముల వంటివి. సత్తు లేదా ఆత్మ ఎందునను లేదు. అన్ని ధర్మములును తమకు తామే కారణములు. వాటి నెవరును పుట్టింపరు ; స్వయముగాను ఉత్పన్నము కావు. ప్రత్యయము ఉన్నప్పుడు క్రొత్త క్రొత్త భావములు (పదార్థములు) పుట్టును. స్వయముగ స్వభావముచే క్షణ భంగురము లగును. వస్తువులు నిఃసత్త్వములు (అనాత్మలు) గాన అనిత్యములు ; కాననే గతిశీలములు ; కాబట్టి పరతంత్రములు ; అందుచే హేతువు (కారణము) నందు ఫలము (కార్యము) ఉండదు. ఇదే ప్రతీత్య సముత్పాదము. 'ఒక వస్తువు ప్రగతిమనము చేసి మరొకదాని ఉత్పత్తి జరుగుట ప్రతీత్య సముత్పాదము ; లేదా గతిశీల మగు అత్యయము (వినాశము) ప్రత్యయము. దానితో పాటు ఉత్పత్తి ప్రతీత్య సముత్పాదము. లేదా ప్రత్యయము (అతీతము, ముగిసినది) వలన దాని ప్రవాహమున ఉత్పత్తి జరుగుట ప్రతీత్య సముత్పా దము' అని అసంగుడు 'యోగాచారభూమి'లో చెప్పి నాడు. పరమార్థ మద్వయార్థము ; సత్తుకాదు, అసత్తు కాదు ; నైరాత్మ్యాత్మకము. ఆత్మ, లోకము కూడ మాయోపమములు. హస్తి అశ్వాదిసువర్ణాకృతులందు హస్త్యాది అభావ మున్నట్లు, గ్రాహ్య గ్రాహక రూప ముగ కన్పడునది ద్వయభ్రాంతి. ద్వయాభాసత కలదు; ద్వయభావము మాత్రము లేదు. మహాయాన సూత్రాలంకరణమున అసంగు డిటుల చెప్పినాడు.

దిజ్ఞాగుడు, ధర్మకీర్తి ఆలయవిజ్ఞానము నొక మూల తత్త్వముగా నొప్పుకొనరు. అట్టి దానిని ప్రతిపాదించినచో అందు ఆత్మభ్రమ కలుగవచ్చును. అందేదో శాశ్వత సత్త ప్రచ్ఛన్నముగ, నిగూఢ ముగ నున్నట్లు శంక కలుగును. అందుచేత మంజు ఘోష డను టిబెటన్ రచయిత అన్నట్లు అట్టి ప్రతిపా దన చీకటిలో బాణములు వేయుట వలె అపాయ కరము.

అర్థములను చింతన చేసినంతనే అవి భిన్నా భిన్నములై లుప్తమగును. ఘటపటాది వస్తువులు చూచు నప్పుడంతా మనకు కానవచ్చునది నీలాది వర్ణములు, లావు పొడవు మొదలగు గుణములు. ఇక మనస్సు చేయు నిర్ణయములు ఇంద్రియజ్ఞానముపై నిర్భృత ములు. వీటిలో ఎక్కడను రూపము కానరాదు. వస్తువుల ద్వారా విజ్ఞానమే సిద్ధమగుచున్నది. ఒకే విజ్ఞానము చిత్తముగను (గ్రాహకముగను), అర్థము గను (గ్రాహ్యముగను) ఉన్నది. విజ్ఞాన మభిన్నము గాన అది భిన్నముగా ప్రతిభాసించుట భ్రమ. గ్రాహ్య గ్రాహక అభిన్నతయే జ్ఞాన తత్త్వము. అర్థముల ఆకారము లన్నియు గ్రాహ్య గ్రాహకాకారములే! ఇవి నిరాకార విజ్ఞానపు రెండు రూపములు. కాననే అన్ని పదార్థములును నిరాకారములు. ఇట్లు ప్రమాణ వార్తికము బోధించినది.

బాహ్యార్థములలోని భిన్నత్వమునకు ఆయా జ్ఞానములచే ఉత్థాపితము లగు వాసనలే (పూర్వ సంస్కారములే) కారణములు. బాహ్యార్థముల అను భవము అసలు మనకు లేదు. ఒకే విజ్ఞానము రెండు రూపములలో కానవచ్చును; స్మరింపబడును. దీని పరి ణామమే స్వసంవేదనము. మంత్రాదులచే బంధి

తేంద్రియు డగు వానికి ఒక విధమైన పదార్థములు మరొక విధముగ కన్పడునట్లు, బాహ్యార్థరూపము అసలు లేకపోయినను భాసించుచున్నది. లోక వ్యవహారము ననుసరించునప్పుడు తత్త్వార్థమును వదలి, జ్ఞానులు కూడ బాహ్యార్థముల చింతన చేయవలసి వచ్చును. నాశము సత్తామాత్రముతో అనుబంధితము. ఏది సత్తో అది క్షణికము (జ్ఞానశ్రీ). అర్థక్రియ యందు సమర్థ మగునది పరమార్థ సత్తు కానిది సంవృత్తి సత్తు. ఘట పటాదులు అర్థక్రియా సమర్థములు కాన పరమార్థ సత్తులు. అవి వీటిని తెచ్చుటకు, కట్టుకొనుటకు పనికి వచ్చుచున్నవి కదా! కాని ఘటత్వ పటత్వాది సామాన్యములు (జాతులు) సంవృత్తి - సత్తు. వాటిచే అర్థక్రియ కాదు గాన. వ్యక్తులు, వాటి నానాత్వము మాత్రమే పరమార్థ సత్తు. ధర్మకీర్తి ఈ విధముగ దిఙ్నాగుని అనుసరించి స్వతంత్ర విధముగ విజ్ఞానవాదమును వృద్ధిచేసెను. బాహ్యార్థముల క్షణిక వాస్తవికతను స్వీకరించుచు, వాటి మాయికత్వము నొప్పుకొని, విజ్ఞానమును (స్వసంవేదన రూప జ్ఞానమును) మాత్రమే మూలతత్త్వముగా ప్రతిపాదించుట స్వాతంత్రిక విజ్ఞాన వాదపు సారము. దీనిపై సౌత్రాంతికుల ప్రభావము కన్పడును.

**శూన్యవాదము :** ప్రజ్ఞాపారమితా సాహిత్యమును ఆధారముగ గొని అపార ప్రతిభా సంపన్నుడగు నాగార్జునుడు (175) శూన్యవాదమును అభివృద్ధి చేసెను. ఈయన చాల గ్రంథములు వ్రాసెను. అందు 'విగ్రహ వ్యావర్తని', 'మాధ్యమిక కారిక' ఇప్పుడు మూల సంస్కృతమున దొరకుచున్న అతి ముఖ్య గ్రంథములు. మొదటిది 72 కారికల చిన్న కృతి. రెండవది 400 కారికలు గల పెద్ద గ్రంథము. వీటిపై తానే వ్యాఖ్యలను కూడ వ్రాసెను. 200 - 224 మధ్య ఉన్న ఆర్యదేవుడు తన 'చతుఃశతక' మందు శూన్యవాదమును పరమత ఖండన పూర్వకముగా ప్రతిపాదించెను. చంద్రకీర్తి (600-650) మాధ్యమిక కారికపై 'ప్రసన్న పద' యను టీకను, చతుఃశతకముపై వృత్తిని వ్రాసెను. బుద్ధపాలిత, భావవివేకాదులు కూడ ఈ సంప్రదాయపు ప్రసిద్ధాచార్యులు.

విగ్రహ వ్యావర్తనియందు నాగార్జునుడు శూన్యత యన నేమో వివరించెను. 'ప్రతీత్య సముత్పాదమే శూన్యత. అదియే అనేకార్థములు గల మధ్యమ ప్రతిపదము (మార్గము)' అని అతడు చెప్పినాడు.[1] భావములు నశించి క్రొత్త భావములు పుట్టుట యనునదియే శూన్యత. ఏలన-నిఃస్వభావత్వము వలన ("యఃప్రతీత్య భావానాం భావః సాశూన్యతా; కస్మాత్? నిఃస్వభావత్వాత్"). ప్రతీత్యములై (ప్రత్యయాశ్రితములై)[2] సముత్పన్నములగు భావములకు హేతు ప్రత్యయాపేక్షత్వము కలదు గాన స్వభావ ముండదు. పరాశ్రితమగునవి గాన స్వభావము, స్వసారము లేనివి. ప్రతీత్య సముత్పాదములగు భావము లన్నియు క్షణికములు. 'ఉన్నది', 'లేదు', 'ఆ రెండును', 'ఆ రెండును కాదు' అని ఉత్పాద స్థితి భంగములు గల ఏ వస్తువును గూర్చియు చెప్పలేము. ఈ నాలుగు కోటుల (చతుష్కోటి) నుండి వినిర్ముక్త మగునది తత్త్వము. అస్తి నాస్తి యను ఉభయాంతముల వివర్జించిన మార్గము గాన దీనిని మాధ్యమిక (మధ్యమ) మార్గ మందురు. వస్తుతత్త్వము శూన్యము; అనగా భావాభావ రహితము ; సత్స్వభావానుత్పత్తి లక్షణము. ఇట్లు బోధించు ఈ దర్శనము మాధ్యమిక దర్శనము.

కారక మున్నదని కర్మయొక్క నిమిత్తము (ప్రత్యయము) చేతనే చెప్పనగును. కర్మ యున్నదని కారకము యొక్క నిమిత్తముచే చెప్పగలము. వేరొక విధముగ సత్త సిద్ధించు కారణము లేదు. భావములు తమ నుండి పుట్టవు. ఏలన విద్యమాన పదార్థముల ఉత్పత్తి ఎట్లగును ? తమ నుండి భిన్నములగు వాని

1. మాధ్యమిక కారికలోకూడ "యః ప్రతీత్య సముత్పాదః శూన్యతాం తాం ప్రచక్షతే" (24.19) అనియే చెప్పినాడు.

2. ప్రత్యయ మన హేతువు.

నుండి భావములు పుట్టవు. ఏలన ఆ పక్షమున దేని నుండియైన ఏది యైనను పుట్టవచ్చును. ఈ రెండు పక్షములలోను దోషము కలదు గాన వీటి రెంటి సముచ్చయము సరిగాదు. భావములు అహేతువులు అనియు చెప్పలేము. ఏలన హేతువు లేనిదే ఫలము లుండవు. లేకున్న అన్ని భావములును ఏ భావముల నుండియైన పుట్టవచ్చును.

సత్తగు దానికి ప్రత్యయము అవసరము లేదు. అసత్తగు దానికిని ప్రత్యయము అవసరము లేదు. గాడిద కొమ్ము వంటి అసద్వస్తువులకు ప్రత్యయ మెందుకు? సద్వస్తువునకు ప్రత్యయ మెందుకు? సదసత్తులు పరస్పరాశ్రితములు. వేరు వేరుగ ఈ రెండును సిద్ధము కావు. స్వయముగ అసిద్ధమగునది ఇంకొక దాని నెట్లు సిద్ధము చేయగలదు? కాబట్టి కర్త కర్మలు, కారణ క్రియలు అసిద్ధములు. కాబట్టి అన్ని వస్తువులును ఉత్పాద స్థితి భంగములు కలిగి, పరస్పరాశ్రితములుగ నున్నవి. మరుమరీ చికను నీరనుకొని అక్కడికి వెళ్ళి 'ఇది నీరు కాదు' అని తలచువాడు కూడా మూర్ఖుడే! అటువంటిదే యగు ఈ లోకమును 'ఉన్నది' యనుకొనువాని లేదనుట కూడ మోహమే. కాబట్టి సంస్కృత ధర్మములు లేవు; అసంస్కృత ధర్మములును అసిద్ధములే!

విశ్వము అవాస్తవిక మనుట శూన్యవాదమునకు విరుద్ధము కాదు. ప్రమాణములు అసిద్ధములు కానవాటిచే భావముల వాస్తవికత సిద్ధము కాదు. ప్రతీత్య సముత్పాదము వలననే భావములలో శుద్ధా శుద్ధాది భేదములు కలవు. ఇవి పరమార్థములు కావు అట్లు గాకున్నచో శీలాదులచే వాటిని ఇచ్ఛానుసారము మార్చలేము కదా!

మనకు తత్త్వము యథార్థముగ తెలియరాకుండు టకు కారణము సంవృతి. సంవృతి యనగా మోహము; అన్ని పదార్థముల తత్త్వమును ఆవరించిన అజ్ఞానము ("సమంతాద్ వరణం సంవృతిః"-చంద్రకీర్తి. "మోహః స్వభావావరణాద్ధి సంవృద్ధి" - మధ్యమకావ తారము). సంవృతి వస్తువుల స్వభావ దర్శనమునకు ఆవరణమును, వాటిపై అసత్ స్వరూపారోపణమును చేయుచున్నది. నిఃస్వభావములు, సత్యాభాసితములు నగు వస్తువులను స్వభావము ఉన్నవానినిగా, సత్యములుగా ప్రతిభాసింప జేయునది సంవృతి. ఇది మిథ్య. లోకదృష్టిలో మాత్రమే ఇది సత్యము. అందుచే దీనిని లోక సంవృతి సత్య మందురు. ఇది ప్రతీత్య సముత్పన్నము, కృత్రిమము. దీనికి వ్యతిరేకముగా పరమార్థ సత్యము అవాచ్యము, జ్ఞాన విషయము కాదు అది స్వసంవేద్యము. అవిద్యా వాసనా రహితు లగు బుద్ధులే దృష్టితో వస్తువులను గాంతురో అది పరమార్థ సత్యము. అదర్శన న్యాయము చేతనే అది చూడ నగును. దానిని బోధింప వీలుకాదు. పరమార్థము నిష్ప్రపంచ స్వభావము. అజ్ఞాన మాత్రముచే సముత్థాపిత మగు సంవృతి సత్యమును నిఃస్వభావముగా ఎగిరి, శూన్యతను పరమార్థముగ ఎరుగుట యోగులు చేయుదురు.

పరమార్థము ప్రతీత్య సముత్పాదము. అది శాశ్వతమును కాదు; ఉచ్ఛేదము కలదియు కాదు. ఉత్పాద నిరోధములు దానికి లేవు. అది అనేకార్థ మయ్యు, అనానార్థము. అందు ఆగమ నిర్గమములు లేవు. ఇట్లెరిగిన దాని ప్రపంచము ఉపశమించును. అందు చిత్తము, చైత్తము అప్రవృత్తములు; కాన శివము. జ్ఞానజ్ఞేయ వ్యవహారమునుండి అది నివృత్తము; కాన అది జాతి జరా మరణములు లేనిది.

మాధ్యమికులకు స్వంత పక్ష మొకటి లేదు. ప్రతిజ్ఞయు ఉండదు. అందుచేత వారికి స్వతంత్రానుమాన ప్రయోగము అవసరము. సత్, అసత్, సదసత్-వీటిలో ఏ పక్షమును లేని మాధ్యమికులు ఏమియు ప్రతిపాదింపరు. ఇతరు లే దోషమును వారికి ఆపాదింపలేరు. ప్రత్యక్షాదులచే ఏ వస్తువును ఉపలబ్ధమై నట్లు ప్రమాణితము కాదు గాన మాధ్యమికులకు పక్షము లేదు. ఉపలబ్ధి ఉండిన కదా దానిని దృఢము చేయుటో, అన్యమును నివారించుటో ఆవశ్యకము! పరుల ప్రతిజ్ఞల నిషేధార్థమే మాధ్యమికుల అనుమానములు. వారికి స్వంత ప్రతిజ్ఞలని వేరుగ లేవు కావున పరులు వారిని ఖండించుటకు గాని, దూషించుటకు గాని వీలులేదు. స్వతంత్రానుమానముల జేయువాదులే ఖండింప నర్హులు.

మాధ్యమికులు ప్రమాణములను, లక్ష్య లక్షణ ములను, హేతువాదమును, గతి గంతృ గంతవ్యము లను, ద్రష్టృ ద్రష్టవ్య దర్శనములను, రూపాది స్కంధములను, సంస్కృత ధర్మములను, వస్తుభేద మును, కర్మకారకాదులను, పుద్గలాస్తిత్వమును, సంసార సత్తను, కర్మ కర్మఫల తత్సంబంధములను, ఆర్య సత్యములను, తథాగతాస్తిత్వమును ఖండించి, 'అంతయు శూన్యము, అనిర్వచనీయము' అని స్థాపింప యత్నించిరి.

'సర్వ సంస్కారములును మృషలు, మోష ధర్మములు. నిర్వాణ మొక్కటే అమోష ధర్మము, పరమ సత్యము' అని బుద్ధ వచనము. జాతి జరా మరణ సంసారము అనవరాగ్రము (ఆది అంతము అను కోటి ద్వయము లేనిది). అనగా అలాత చక్రము వలె పూర్వాపర కోటి శూన్యమగుటచే సంసారము లేదు. అది అసత్తు. అవిద్యాయుక్తులకే దాని ప్రతిపత్తి. అందుచేత నిర్వాణము కూడ లేదు. ఏలన నిత్యులు అవికారులు అయిన వారికి నిర్వాణ ముండదు. అని త్యులు అవిద్యమానులు అయిన వారికిని నిర్వాణ ముండదు. ఇక నిర్వాణ మెవరికి? 'నిర్వాణము కూడ మాయోపమము, స్వప్నోపమము' అని బుద్ధుని వచనము. బంధమోక్షములు లేవు.

నాగార్జుని మతములో నిర్వాణము రాగాదుల వలె ప్రహీణము కాదు. సంప్రాప్తమగు ఫలమును కాదు. స్కంధాదుల వలె ఉచ్ఛిన్నమును కాదు. అశూన్య[1] పదార్థముల వలె నిత్యము కాదు; అది అనిరుద్ధము, అనుత్పన్నము కూడ. నిర్వాణము భావము[2] కాదు. అభావమును కాదు. రెండును కాదు. జన్మ మరణ పరంపర హేతుప్రత్యయ సామగ్రి నాశ్రయించి దీపప్రభ వలె, బీజాంకురమువలె సాగు చున్నది. జన్మ మరణ పరంపరకు ఉపాదానము చేయని ఒక అప్రవృత్తి నిర్వాణము. అది భావాభావ ములలో ఒకటిగాని, ఉభయాత్మకము కాని కాదు. ఇట్టిదెవరు ప్రత్యక్షము చేసికొనిరి? ఎవరును చేసికొన లేదు. 'నిర్వాణము ఎవరిచేతను గృహ్యమాణముగాని, ప్రకాశ్యమానముగాని కాదు' అని మాధ్యమిక సిద్ధాం తము. కాబట్టి సంసార, నిర్వాణములలో భేదము సిద్ధముకాదు. వాటి అభేదమువలనే సంసారపు అనా దిత్వము, అనంతత్వము సిద్ధమగుచున్నవి. సంసార, నిర్వాణముల కోటుల మధ్య ఏమాత్రమును సూక్ష్మ భేదములేదు.

ధర్మము అనునది స్వభావముగ ఉండుట గాని, కొన్ని సత్త్వములు దాని శ్రోతలుగా నుండుట గాని, బుద్ధుడను దేశికుడు ఉండుటగాని జరుగలేదు. ఈ నిమిత్తముల ఉపలంభమే కాలేదు. ఒకరు బోధిం చుట ఒకరు వినుట,సంసారము నిర్వాణము పొందుట- ఇవి ఎవ్వియును సిద్ధములు కావు. అనిర్వాణమునే నిర్వాణముగా బుద్ధుడు చెప్పెను. ఆకాశముచే వేయ బడిన ముడి (గ్రంధి) ఆకాశము చేతనే విప్పబడినది. ఇది శూన్యవాద హృదయము. 'సరిగా పట్టుకోబడని పాము, దుష్ప్రసాధితమగు విద్య నాశహేతువులైనట్లు, దుర్దృష్టమగు శూన్యత మందబుద్ధులను నాశనము చేయును' అని నాగార్జునుడు శూన్యవాద పరమార్థ మును తెలిసికొనుట దుస్తరమని హెచ్చరించి యున్నాడు.

---

1. శూన్యము నిఃస్వభావము; అశూన్యము సస్వభావము. పరనిరపేక్షము, అకృత్రిమము అగునది స్వభా వము. 'స్వోభావః' అని చంద్రకీర్తి వ్యుత్పత్తి. అన్ని పదార్థములు పరమార్థముగ నిఃస్వభావములు, హేతు ప్రత్యయములు కాన శూన్యములు - అని మాధ్యమికుల వాదము.

2. భావము-ఉన్నది; జరా మరణములు కలది.

# భగవద్గీత

పురాణముని యగు వ్యాసునిచే మహాభారతము మధ్య గ్రథింపబడిన కృష్ణార్జున సంవాదము భగవద్గీతయని సంప్రదాయజ్ఞుల విశ్వాసము. భగవంతుడు (ఐశ్వర్యాది గుణోపేతుడు - ఈశ్వరుడు - కృష్ణుడు) పాడినది కాబట్టి భగవద్గీత. ఉపనిషద్గోవుల దుగ్ధము భగవద్గీత. ఇది వేదాంతసారము. కాబట్టి ఇది అన్యతమ మగు ఉపనిషత్తు. బ్రహ్మను గూర్చి చెప్పునది కాబట్టి బ్రహ్మవిద్య. ఈశ్వరునితో అభియుక్తు లగుటకు సమత్వమును, కర్మకౌశలమును బోధించునది కాబట్టి యోగశాస్త్రము (యోగ మన సన్నహనము, ఉపాయము అని శబ్దార్థములు). ఇట్లు పరంపరగ భగవద్గీత సమాదరింపబడినది. "దాని భాషను బట్టి, దాని అంతర్గత విషయములను బట్టి, ఇతర గ్రంథములు దానినిగూర్చి చెప్పిన దానిని బట్టి అది క్రీ.పూ. 5 వ శతాబ్దమందు రచింపబడియుండ వచ్చును. తరువాతి కాలములో దానిలో చాలా మార్పులు చేయబడి ఉండవచ్చును" అని డా. రాధాకృష్ణన్ చేసిన నిర్ణయము అంగీకార్యముగ తోచును (డా. దాస్‌గుప్త భగవద్గీత బహుశః ప్రాగ్ బౌద్ధ మని చెప్పినాడు). 'మూలగీత ఏది? తరువాత చేర్చబడిన భాగములేవి?' అని పాశ్చాత్య విద్వాంసులు చాల మీమాంస చేసినారు.[1] అందు రుడోల్ఫ్ ఓటో చేసిన ప్రయత్నము చాలా వరకు ప్రశంసనీయముగను, యుక్తియుక్తముగను తోచును. అతడు మూలగీత యని నిశ్చయించినది నిజముగా మూలగీత అగునో కాదో గాని అది గీతాసారమే అని పొడకట్టును. ఒకటవ అధ్యాయము; రెండవ దానిలో 1 నుండి 13 వ శ్లోకము వరకును, 20, 22 శ్లోకములును, 29 నుండి 37వ శ్లోకము వరకును; పదవ అధ్యాయములో 1 నుండి 8వ శ్లోకము వరకును; పదకొండవ దానిలో 1 నుండి 6వ శ్లోకము వరకును, 8 నుండి 12 వ శ్లోకము వరకును, 14, 17 శ్లోకములును, 19 నుండి 36 వ శ్లోకము వరకును, 41 నుండి 51వ శ్లోకము వరకును, పదునెనిమిదవ దానిలో 58 నుండి 62వ శ్లోకము వరకును, 66, 72, 73 శ్లోకములును-మూల గీత యని, అది భారతేతి హాసమున ప్రధాన అంతర్భాగమని,[2] ప్రతిభావంతుడగు ఒక గొప్ప ఐతిహాసిక కవియే (epic poet) గీతవంటి మహా గ్రంథమును వ్రాసియుండవలె నని ఓటో మతము. ఓటో ఊహ నిజము కావచ్చును; కాకపోవచ్చును. కాని కారల్ యాస్పర్స్ 1954 లో నాతో ప్రసంగించుచు అనినట్లు 'భగవద్గీతలో ఎన్నో వైరుద్ధ్యములు (contradictions) కలవు. అవి ఉండుట చేతనే అది గొప్ప గ్రంథము.' ఇవి యన్నియు అందు సమన్వయమయినవా అనినచో అయినవని హిందూ సంప్రదాయము ఘోషించును. ఎట్లు అయినవి అను ప్రశ్నకు మాత్రము ఒక టీకాకారుడు ఒక తీరున సమాధానమీయగా, మరొకడు మరొక సమాధాన మిచ్చినాడు. వారిలో ఐకమత్యము లేదు. 'వస్తుతత్త్వములో, జీవితములో వలెనే దర్శనమందును వైరుద్ధ్యము లుండిన దోషము లేదు. అవి సమన్వితములు కావు' అని కొందరి మతము. 'గీత నిశ్చిత సందేశమేమి?' అను విషయమున కూడ ఐకమత్యము లేదు. గీత అద్వైతామృతమును వర్షించుననియు, కేవల తత్త్వజ్ఞానమువలన మోక్షప్రాప్తి అగుననియు, కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠాప్రాప్తి

1. భగవద్గీతలో నూరు శ్లోకములనో, ఏడు శ్లోకములనో, ఒక దానినో ఏరి 'శతశ్లోకి గీతా', 'సప్తశ్లోకి గీతా', 'చరమశ్లోక' మను పేర మనవారును దాదాపు ఇటి ప్రయత్నమే చేసిరి.

2. 'మూలగీత' ఒకటి ఉండి యుండిన 9, 15 అధ్యాయములలోని ముఖ్యభావములు కొన్ని అందు ఉండి యుండునని తలచుట యుక్తమని తోచును.

హేతువు మాత్రమే అనియు, గీతాశాస్త్ర ప్రయోజనము సహేతుక సంసారపు అత్యంతోపరమ లక్షణమగు పరమనిశ్శ్రేయస మనియు శంకరుల భాష్యము చెప్పుచున్నది. కళ్యాణైకతానుడు, విలక్షణానంత జ్ఞానానందైక స్వరూపుడు అగు ఈశ్వరుని అంతర్యామిత్వమును, విశిష్టాద్వైతమును బోధించుచు, జ్ఞాన కర్మానుగృహీత మగు భక్తి యోగమును గీత ఉపదేశించుచున్న దని రామానుజులు చెప్పిరి. అన్యులు ఎందరో ఎన్నో విధముల జల్పించిరి. తుదకు గీత అహింసను బోధించు నని కొందరు, ధర్మ్యయుద్ధావశ్యకతను, న్యాయ్యమ్ములగు అధికారముల కొరకు' స్వాతంత్ర్య స్వత్వముల కొరకు హింసాకాండ కూడ సముచితమే అని బోధించు నని కొందరు ఆధునిక కాలమున వ్యాఖ్యానించిరి.

గీతోపదేశము ఏ సన్నివేశమున ఎట్టి పరిస్థితులలో ఎవరికి జరిగినదో గుర్తు ఉంచుకొనినచో వాటికి ఉచితములు, ఉపయుక్తములు అగు కృష్ణబోధలే గీతా సందేశ మని తలచుట సమంజసము. అర్జునుని కేది అసంగతమో, అతని పరిస్థితి కేది అప్రస్తుతమో అట్టి దానిని రణక్షేత్రమున కృష్ణుడు చెప్పియుండడు కదా ! ఇప్పుడున్న 700 శ్లోకములు యుద్ధభూమిలో ఉభయసేనల మధ్య శస్త్రసంపాత సమయమున రథము నిలబెట్టి సాక్షాత్తు కృష్ణార్జునులు పఠించిరని కొందరికి గల విశ్వాసము ఈ యుక్తిని వ్యాహతము చేయును. అట్లు విశ్వసింపనిచో కృష్ణుడు కురుక్షేత్రమున అర్జునుని మనఃస్థితికి, ఆ సన్నివేశమునకు తగినట్లు చెప్పిన విషయములను తరువాత నొక మహాఋషియు కవియు నగు ఆయన విపులముగా ఉపబృంహించె నని, తరువాతి తరములలో మరికొందరు అందులో అక్కడక్కడ తమ కిష్టమైన అంశములు చేర్చియుండవచ్చు నని తలపవచ్చును. అప్పుడు నేడు ఉపలబ్ధమగు గీతను గైకొని కురుక్షేత్ర సన్నివేశములో కృష్ణార్జున సంవాదమునకు యోగ్యవిషయ మేది యనియు, తత్పూర్వ గ్రంథములందును, సమకాలిక మత దర్శనములందును లేని ఏ అపూర్వవిలక్షణ విషయము గీతలో కలదు అనియు, గీత సోపపత్తికముగ నొక్కి తరచు చెప్పునది ఏమనియు దాని ఉపక్రమోపసంహారములను దృష్టిలో నుంచుకొని మననము చేసినచో - కృష్ణుని మూలబోధ, భగవద్గీతా తాత్పర్యము గ్రహింపబడుటకు అవకాశము కలదు.

యుయుత్సుడై యుద్ధక్షేత్రమునకు వచ్చిన అర్జునునికి బంధువులతో, ఆచార్యులతో, సఖులతో, సుహృదులతో పోరాడవలసియున్న దని ప్రత్యక్షమాయెను. అట్టి స్వజనులను చూచి ఆయనకు 'కృప'యు 'విషాదము'ను కలిగెను. "ఎవరికోసము రాజ్య భోగ సుఖాదులో వారిని చంపిన పిమ్మట అవి ఎందుకు ? స్వజనులను, బంధువులను చంపుట పాపము. ఏలన కులక్షయము, మిత్రద్రోహము దోషములు. కులక్షయము వలన కులధర్మములు నాశనమగును. కులఘ్నులు నరకమునకు పోదురు. రాజ్య సుఖ లోభముచే ఇట్టి పాపమునకు వ్యవసించితిమి గదా!" యని అర్జునుడు శోకసంవిగ్నుడై, వికలితుడు, భ్రమితుడు ఆయెను. విషమ పరిస్థితిలో ఇట్లు 'కశ్మలమును', 'క్లైబ్యమును', 'హృదయ దౌర్బల్యమును' పొందుట అర్జునుని వంటి పరంతపునికి తగ దని, కాక ఇవి అనార్యులకు తగినవని, అకీర్తికి, నరకమునకు దారి తీయు నని కృష్ణుడు ప్రోత్సహించినను, "పూజార్హులపై బాణము లెట్లు వేయుదును ? గురువులను చంపుట కంటె బిచ్చమెత్తి తినుట మంచిది కదా ! రాజ్యాదులు వచ్చినను వీరిని చంపుట వలన కలుగు ఇంద్రియోచ్ఛోషణమగు శోకము పోదు కదా !" అని చెప్పి అర్జునుడు "న యోత్స్యే" (యుద్ధము చేయను) అని నిర్ణయించెను. కాని అట్లు యుద్ధ విరమణము శ్రేయమే అను నిశ్చయము ఆయనకు పూర్తిగ కలుగ లేదు. ఒకవేళ తన స్వభావము కార్పణ్య మను దోషముచే అపహతమైనదేమో అనియు, ధర్మ విషయమై తన చేతస్సు సమ్మూఢమైనదేమో అనియు అర్జునునికి శంక ఉండెను.

ఈ పరిస్థితిలో ఆయనకు కృష్ణుడు చెప్పినది ఇది: "అశోచ్యులను గురించి నీవు శోకించు చున్నావు. నిజమగు ఆత్మ 'అసువు' (ప్రాణము) కాదు ; దేహమును కాదు. మనము లేని కాలము ఇదివరకు ఎన్న

డును లేదు; ఇక ఉండదు దేహమందు దేహి (దేహమున ఉండునది) ఒకడు కలడు. అతనికి కౌమార యౌవన జరల వలెనే మరొక దేహము కూడ ప్రాప్తమగుచుండును. అతడు ఎన్నడును పుట్టడు, చావడు, ఉండి లేకుండ పోడు. అతడు నిత్యుడు, శాశ్వతుడు, పురాణుడు. శరీరము చంపబడినప్పుడు కూడ అతడు చంపబడడు. నరుడు ప్రాతబట్టలు విడచి క్రొత్తవి ధరించినట్లే, దేహి జీర్ణ శరీరమును విడచి నూతన శరీరములను పొందును. ఇతనిని కొందరాశ్చర్యముగ చూతురు. కొందరాశ్చర్యముగ చెప్పెదరు. మరి కొందరు ఆశ్చర్యముగ విందురు. కాని వినియు ఎవడును అతనిని ఎరుగడు. సర్వదేహము లందును దేహి నిత్యము అవధ్యుడే. కాన ఏ భూతము కొరకును శోకింప నవసరము లేదు." ఇట్లు కృష్ణుడు 'గుహ్యమగు అధ్యాత్మము'ను, భూతముల భవాప్యయములను అర్జునునికి తెలిపి, "క్షాత్రధర్మము ననుసరించి, కీర్తిని దృష్టిలో నుంచుకొని, యుద్ధమందు చచ్చిన స్వర్గము, బ్రతికిన రాజ్యభోగము వచ్చునని గుర్తుంచుకొని, యుద్ధమునకు కృతనిశ్చయుడవై లెమ్ము" అని బోధించెను.

కాని గీతోపదేశము ఇంతటితో ఆగలేదు. అర్జునుని పరిస్థితికి అనువైనట్లు భగవంతుడు తన తనువును (యాథాత్మ్యమును) వివృతము చేయవలసియున్నది. ఏలన భగవంతు డాయనపై ప్రసన్నుడు. ఆయన భగవంతునిచే ప్రీయమాణుడు. కాక, ఆయనకొరకై పరమహితము చెప్పవలసియున్నది. లేకపోయిన సర్వమునకు ఆది యగు భగవంతుని ప్రభవమును ఎవరును ఎరుగలేరు. ఆయన 'అజుడు, అనాది, సర్వలోకమహేశ్వరుడు' అని ఎరిగినవాడే పాపముల నుండి ముక్తుడగును. కాక, ఆయనయే సర్వమునకు ప్రభవము. ఆయననుండియే సర్వమును ప్రవర్తిల్లుచున్నది (మత్తః సర్వం ప్రవర్తతే). ఇది ఈశ్వరుని అవ్యయమగు మాహాత్మ్యము.

అర్జునుడు రణమందున్నవారందరు తన స్వజనులని, తనకు కర్తృత్వ మున్నదని, తనకు బుద్ధి జ్ఞానాదు లున్నవని, అందుచే అహింసను, తుష్టిని అభ్యసించెద నని అనుకొని, 'ఇది పాపము, నేను యుద్ధము చేయను' అని తలచెను. దానికి సమాధానము కృష్ణు డిట్లు ఇచ్చెను : "ఈ ప్రజలందరును ఎవరినుండి వచ్చిరో ఆ మహర్షులు, మనువులు 'నా భావము గలవారు;* నామనస్సంజాతులు". రణక్షేత్రమందే గాక లోకమందంతటను ఉన్న ప్రజలందరును ఈశ్వరుని వారే! బుద్ధి, జ్ఞానము, అసమ్మోహము, అహింస, తుష్టి మొదలగు భావములన్నియు ఆయన నుండియే కలుగును. యుద్ధాది సన్నివేశములు, అన్ని విషమ పరిస్థితులు-ఇంతకు సర్వము ఆయన నుండియే ప్రవర్తిల్లును. ఈ విధముగ అర్జునునికి తెలుపబడెను.

ఈశ్వరుని మాహాత్మ్యమును వినిన అర్జునుడు ఆయన ఐశ్వరరూపమును చూడగోరెను. భగవంతుని ఉగ్రరూపమును, విశ్వరూపమును చూచిన అర్జునునికి ఇట్లు తెలుపబడెను : "లోకములను సమాహరించుటకు ప్రవృద్ధ మగు లోకక్షయము గావించు కాలము ఈశ్వరుడే ! అర్జునుడు లేకున్నను, ఆ కాలము ఎవరిని హరింప దలచునో వారు ఉండరు. కాలముచే ముందుగానే నిహతులైన వారినే అర్జునుడు చంపగలిగినది. అతడు స్వయముగ చేయగలిగినది ఏమియు లేదు. అన్నిటికిని కర్త ఈశ్వరుడు. అర్జునుడు నిమిత్తమాత్రమే. 'నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్.' "

ఘోరమగు సంగ్రామాది కర్మ లేమి, శుభకర్మ లేమి - అన్నిటిని సంభవింపచేయునది, వాటి పర్యవసానములు నిశ్చయించునది ఈశ్వరుడు. అంతయు ఆయన చేష్ట ; ఆయన ఇచ్ఛ. లోకము భగవల్లీల. మానవ మానదండముతో, మానవ బుద్ధితో విశ్వప్రహేళిక బోధపడదు. ఇతిహాసమందు అప్పుడప్పుడు సముపస్థిత మగు విషమ సంఘటనలు అసలు అర్థము కావు. కాని మానవ అహంకారము, మానవబుద్ధి తమ వంధ్యాత్వమును, సీమలను గ్రహించి, ఈశ్వరుని దివ్య మాహాత్మ్యము కాంచినంతనే నరుడు తాను

---

* నాయందు భావనగలవారు అనియు చెప్పవచ్చు; నా నుండి ఎవరికి భావము (ఉనికి) వచ్చినదో వారు అనియు అనవచ్చును. 'మద్భావాః' అని మూలము.

ఈశ్వరునికి నిమిత్తమాత్రుడ నని ఎరిగినంతనే అపి హితమగు సత్యముఖము బయటపడును. అప్పుడే మానవుడు తన పరిస్థితిని అవగాహన చేసికొనును. ఈశ్వరుడు సర్వశక్తి. ఆయన సంకల్పించినది ఎవరు లేకున్నను జరుగును. ఆయన మహిమ పరమము (transcendent), అనన్యము, అక్షరము. ఆయన అందరికంటె గరీయసుడు. సర్వమును ఆయనచే నిర్ణీతము, ప్రవర్తితము.

అందుచే మానవుడు చేయవలసినది ఏమి? గీతా సమాధాన మిది: భగవచ్చిత్తుడైనవాడు ఆయన ప్రసాదముచే సర్వదుర్గములను (కష్టములను) తరించును. అహంకారముచే విననివాడు నశించును. ఏమి చేయవలెనో అది నిశ్చయించుటకు, అట్లు చేయుటకు నరునికి శక్తి లేదు. ఉన్నదని తలచుట మిథ్యావ్యవసాయము. ఏలన ప్రకృతి, అనగా ఆయా నరుని స్వభావముచే ఏర్పడిన కర్మ నరుని బంధించి అవశునిగా చేసియున్నది. అయితే స్వభావజ మగు ఈ కర్మ స్వతంత్ర సత్త కాదు. సర్వభూతముల హృదయములలో నుండి వారిని యంత్రములవలె తన మాయచే త్రిప్పునది ఈశ్వరుడే. ఈశ్వరుని మాయా శక్తి రూపమే నరుని స్వభావజ మగు కర్మ. దాని చేతనే నరుడు నిబద్ధుడు, అవశుడు. అందుచేతనే కదా నరుడు ఈశ్వరునికి నిమిత్త మాత్రుడు! కాబట్టి మానవుడు అన్ని ధర్మములను పరిత్యజించి ఆయన నొక్కనినే శరణు జొచ్చవలెను. ఆయన అతనిని అన్ని పాపముల నుండి విముక్తుని చేయును. 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ.'

తాను యుద్ధము చేయుటవలన కులధర్మాదులు నాశనమై తాను పాపము చేసినవాడై నరకమునకు పోదు నని కదా అర్జునుడు శోకించినది? చివరికి ఆయన కిట్టు రహస్యము వివరింపబడినది: "అన్ని ధర్మములకు ప్రభవ మగు ఈశ్వరునికి ధర్మములను వదులుము. వాటి నిర్ణయము, సంస్థాపన ఆయన పని. నిమిత్తమాత్రుడ నని గ్రహించి, తచ్చిత్తుడై ఆయనను శరణు జొచ్చిన మానవునికి ఏ పాపమును ఉండదు. భగవత్కార్యము ఈ జగద్వ్యాపారము అని ఎరిగి, అందు ఆయనకు నిమిత్తమాత్రుడ నని గుర్తించి పాల్గొనుటయే నరుని కర్తవ్యము. అటుల చేసిన వానిని పాప మంటదు." ఇది అర్జునునికి చేయబడిన ఉపదేశము. పరాత్పరుడు, సర్వశక్తి అగు ఈశ్వరుని ఇచ్ఛకు పూర్తిగ అధీనుడగుట - అనగా ఆయనను సమగ్ర భావముతో శరణు జొచ్చుట; ఆయన ఉగ్ర రూపి, విశ్వరూపి, విశ్వమునకు పరమ నిధానము అని ఎరుగుట, ఆయన నుండియే అంతయు ప్రవర్తిల్లు నని తెలిసికొనుట - ఇది మానవుడు చేయవలసినది.

యుద్ధము చేయుట, చేయకపోవుట తన వంతు అనియు, తాను తన ఉద్వేగాదుల (శోక, విషాద, కార్పణ్యములు)చే తన ధర్మాధర్మ జ్ఞానముచే ప్రేరితుడనని, కాబట్టి ఏమి చేయవలసినది తన నిశ్చయము పైనను తన వశములోను ఉన్నదని తలచిన అర్జునునికి -సర్వము భగవంతుని నుండి ప్రవర్తిల్లుననియు, బుద్ధి జ్ఞాన కార్పణ్యాది భావము లన్నియు ఆయన నుండియే వచ్చు ననియు*, లోక ఉత్పత్తి స్థితి క్షయముల కర్త ఆయనే ననియు, ఆయనయే హృదయస్థుడై భూతములను యంత్రముల వలె త్రిప్పుచున్నా డనియు బోధింపబడెను. అప్పు డర్జునుని మోహము నష్టమాయెను ఈశ్వర స్మృతి (ఎరుక, ప్రత్యభిజ్ఞ, గురుతు) లభించెను. సందేహము పోయెను. భగవంతుని వచనము ప్రకార మాయన చేసెను. ఇది గీతాసారము.

అధ్యాత్మ విద్య, ఆత్మ నిత్యత్వము, శరీరముల నశ్వరత్వము ఉపనిషత్తులలో చాల చోట్ల వివరింపబడినది. సాంఖ్య యోగములు, బ్రహ్మ విచారము ఆయా దర్శనములందు బాగుగా ప్రతిపాదితములు. ఇక భగవద్గీతలో గల అపూర్వత, ప్రత్యేకత ఏమిటి? అది ఈ క్రింది బోధ: "యో మాం అజం అనాదించ వేత్తి లోక మహేశ్వరం"; "అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే"; "నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్"; "మచ్చిత్తః సర్వ దుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి"; "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ"

* 'భవంతి భావా భూతానాం మత్త ఏవ.'

(నన్ను అజునిగా అనాదిగా లోకమహేశ్వరునిగా ఎరుగువాడు పాపముల నుండి ముక్తుడగును. నేను సర్వమునకు ప్రభవమును, నా నుండియే అంతయు ప్రవర్తించును. నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము. నాయందు చిత్తముంచిన నా ప్రసాదము వలన అన్ని కష్టములను కడతేరెదవు. అన్ని ధర్మములు వదలి నన్నొకని శరణు జొచ్చుము నేను నిన్ను అన్ని పాపముల నుండి విడిపింతును). ఇది గీతలోని కీలకమగు బోధ. అర్జునునివలె ధర్మసమ్మూఢులకు, మోహ సందేహములచే భ్రాంతులై శ్రేయ మేదో నిశ్చయము లేనివారికి, ఈశ్వరస్మృతి వంచితులకు గీత చిరమగు చరమ సందేశము నొసగుచున్నది. "గీతా సుగీతా, కర్తవ్యాకిమన్యైః శాస్త్ర విస్తరైః" అనునది వ్యర్థ వాక్యము కాదు.

# షడ్దర్శనములు

పరలోకము లేదనువారు నాస్తికు లని పాణిని చెప్పెను. ఈ నిర్వచనానుసారము జైన బౌద్ధులు నాస్తికులు కారు. సూత్రాంతములందు నాస్తిక వాదమును మిథ్యాదృష్టి యని బుద్ధుడు గర్హించి యున్నాడు. కర్మను, కర్మఫల విపాకమును ఒప్పుకొని, జీవితమందు అననుభూత సుకృత దుష్కృత ఫలము మరణానంతరము పరలోకమందో, పునర్జన్మ యందో అనుభవించి తీరవలసినదే యనియు, కర్మ బంధము పూర్తిగా వీడునంతవరకు జన్మ మరణ సంసరణము జరుగవలసినదే యనియు నమ్మువారు ఆస్తికులు. ఈ విధముగా చూచిన హిందూ బౌద్ధ జైనులు ఆస్తికులే. ఈ దృష్టితో చార్వాకులును, వెనుక ఉల్లిఖితులైన కొందరు తీర్థంకరులును నాస్తికులు. ఆస్తికులలో ఈశ్వరవాదులు, నిరీశ్వరవాదులు కూడ కలరు.

వేదముల ప్రామాణ్యమును అంగీకరింపక వాటిని నిందించువారు నాస్తికులని తరువాతనొక నిర్వచనము బయలుదేరెను (మనుస్మృతి II. 4). దీని ప్రకారము చార్వాక బౌద్ధ జైనాదులగు వేదప్రామాణ్యము నంగీకరింపని వారందరును నాస్తికులే. ఇక ఈ అర్థములోనే ఈ శబ్దము వాడెదము.

నాస్తికులు తమ తర్కముతోను, పటు యుక్తులతోను వేదప్రామాణ్యముపై తీవ్ర ప్రహారములు చేసిరి. అప్పుడు ఈశ్వరాస్తిత్వమును అనుమాన ప్రమాణముచే స్థాపించి, తదుపదేశము వేద మని కొందరును, సర్వజ్ఞాది విశేషణు డగు దేవు డెవరును లేనందున, అతీంద్రియార్థముల ద్రష్టయే లేడు గావున యథార్థ వినిశ్చయము నిత్యవాక్యముల వలననే జరుగుననియు, అట్టివి వేద మనియు కొందరును సిద్ధాంతీకరించిరి. నైయాయికులు మొదటి వర్గమునకు, మీమాంసకులు రెండవ వర్గమునకు చెందుదురు. వేదము ప్రమాణ మని, అందు అనృతములు, వ్యాఘాతములు, పునరుక్తులు* లేవని వీరు సిద్ధాంతము చేయ ప్రయత్నించిరి. బీజప్రరోహ సంరక్షణార్థము కంటక శాఖావరణమును ప్రకృతి పెంపొందించినట్లు వేద ప్రమాణ జనిత తత్త్వాధ్యవసాయ సంరక్షణ కొరకు వీరు తర్కశాస్త్రమును అభివృద్ధి జేసిరి. వేదతాత్పర్య వినిశ్చయార్థము వేద వాక్యముల విభజన, వాటిని అర్థము చేసికొను విధములను, ఉపక్రమోపసంహారాది షడ్లింగముల ద్వారా తాత్పర్యగ్రహణము చేయు రీతిని వివరించిరి. కొన్ని క్లిష్టములగు, ముఖ్యములగు మంత్ర బ్రాహ్మణములను ఉదాహరణార్థము గ్రహించి, వాటికి సోపపత్తికముగ పూర్వాపరవిచారము చేసి వ్యాఖ్యా

* అనృతము-అయథార్థ ఉక్తులు. వ్యాఘాతము-అసంబద్ధ వాక్యములు. పునరుక్తులు-చెప్పిన దానినే అనవసరముగ మరల చెప్పుట.

నించిరి. శరీరమాత్ర పరిమాణము ఆత్మ అని, ఆత్మ నొక భౌతిక ద్రవ్యప్రాయముగ చేయు జైనులకు, నైరాత్మ్యమును బోధించు బౌద్ధాదులకు విరుద్ధముగ నిర్గుణము, నిష్క్రియము, చైతన్య మాత్రము అగు నది ఆత్మయని కొన్ని ఉపనిషద్వాక్యములు ఆధార ముగా చెప్పజూచిన వారు సాంఖ్యులు. జైన బౌద్ధా దులకు వ్యతిరిక్తముగ పదార్థ విభజన, స్వరూప నిర్ణ యము చేయు ప్రయత్నము వైశేషికులు సాగించిరి. సర్వజ్ఞత్వము, తీర్థంకరత్వము, సిద్ధులు చిత్తవృత్తి విరోధము వలనను, ఈశ్వర ప్రణిధానము వలనను పొందవచ్చుననియు, అట్టి జ్ఞానము వేదజ్ఞానముతో సుసంగత మనియు యోగులు చెప్పిరి. వేదమండలి యజ్ఞయాగాది క్రతుకర్మపరమగు కాండనే హైతు కులు ఎక్కువగా విమర్శించిరి. కాక ఉపనిషదృషులును కర్మమార్గ మనవసర మని, పరవిద్యవలననే పరమ పుమర్థ ప్రాప్తి అగునని వక్కాణించిరి. 'వేదమండలి ముఖ్యభాగము సంహితా బ్రాహ్మణములు కావు. బ్రహ్మ ప్రతిపాదకములగు ఉపనిషత్తులే' యని నమ్మి, ఉపనిషద్వాక్య సమన్వయమునుచేసి, షడ్లింగములచే వాటి తాత్పర్య మెరిగి, శారీరకుని (దేహిని) గూర్చి, శారీరకునికి బ్రహ్మమునకు గల సంబంధమును గూర్చి సమధిక విచారణ చేసినవారు వేదాంతులు. ఆస్తికు లందరును శ్రుత్యాశ్రిత తర్కమును అండగా గల వారు. ధర్మము వేదము చేతనే తెలియనగు నని నమ్మువారు. ఏలన అది లింగరహితము, అవస్తువు అగుటచే ప్రత్యక్షాను మానములచే అగ్రాహ్యము. అయితే వీరిలో కొందరు ధర్మమును యోగులు ప్రత్య క్షము చేసికోగలరని అనెదరు. కాని, యోగి అగుటకు సాధన అవసరము. ఆ సాధన శ్రుత్యుక్తము. కాబట్టి ధర్మ విషయములో పరమ ప్రమాణము వేదమే! లేనిచో యోగులు అనేకులు; సర్వజ్ఞులమని తీర్థంక రులమని చాటుకొనినవారు అసంఖ్యాకులు. వీరందరి బోధల సత్యాసత్య నిర్ణయమునకు మానము ఉండ వలెను. అట్టిది వేద మొక్కటే అని ఆస్తికు లందరికి ఐకమత్యము కలదు. శ్రుత్యుపదిష్ట స్మృతి విస్తారిత మగు ధర్మ మొక్కటే సరియగు ధర్మ మనియు, అది వర్ణాశ్రమ ధర్మ మనియు ఆస్తికుల అభిప్రాయము. శ్రుతుల కవిరోధముగ నుండి, అందు కనపడని విషయములను స్పష్టము చేయుచు, అందున్న వానిని విస్తరశః ప్రతిపాదించు గ్రంథములు స్మృతులు. శ్రుతి విరుద్ధమగు తర్కము కుతర్కము. శ్రుతి విరుద్ధముగ అనుభవ ముండదు. శ్రుతి తాత్పర్య అగ్రహణము వలననే అనుభవము దానికి విరుద్ధముగ నున్నట్లు భాసించును. లేదా అనుభవమును సరిగా విశ్లేషణచేసి అర్థము చేసికొనక పోవుట వలన అట్లు అగపడును. 'ఈశ్వరు డున్నాడు. ఆయన కేవలము శాస్త్రయోని (వేదము మాత్రమే అయనను గూర్చిన జ్ఞానమునకు యోని - కారణము), అని కొందరు ఆస్తికులను, 'ఆయన అనుమానగమ్యుడు' అని కొందరును తల తురు. ఈశ్వరుని స్వరూపమును గూర్చి, ఆయన సృష్టి కర్తయా కాదా యను దానిని గూర్చి, కర్మఫల ప్రదాతయా కాదా అను దానిని గూర్చి ఆస్తికులలో సర్వసమ్మతి లేదు. కొందరు ఆస్తికులు ఈశ్వరాస్తి త్వమును అంగీకరింపలేదు. ఈశ్వరవాదులు శాస్త్రోక్త ధ్యానాదులచేత గాని, ఈశ్వరానుగ్రహమువలన గాని ఈశ్వర దర్శనము సంభవ మని భావింతురు.

"కణాదస్యాక్షపాదస్య వ్యాసస్య కపిలస్య చ, పతంజలే ర్జైమినేశ్చ దర్శనాని భవంతి షట్". అనగా కణాదుడు, అక్షపాదుడు, వ్యాసుడు, కపిలుడు, పతం జలి, జైమిని అను ఆరుగురి ఉపజ్ఞములగు వైశేషిక, న్యాయ, వేదాంత, సాంఖ్య, యోగ, మీమాంసలు షడ్దర్శనములు. ఈ ఆరింటిని మాత్రమే మొదటగా షడ్దర్శనములని వర్గీకరించినది ఎవరో తెలియరాదు. 10 వ శతాబ్దమునం దుండిన జయంతుడు మీమాంసా, న్యాయ, సాంఖ్య, జైన, బౌద్ధ, చార్వాకములను ఆరింటిని "షట్ తర్కి" అను సమాఖ్యతో పిలచెను. 9 వ శతాబ్దమున ఉండిన హరిభద్రుని దృష్టిలో బౌద్ధ న్యాయ సాంఖ్య జైన వైశేషిక మీమాంసలు షడ్దర్శ నములు. వైశేషికమును న్యాయము నుండి భిన్నమగు ప్రత్యేక దర్శనమని ఎంచక పోయినచో ఆరవది లోకాయతమగు నని హరిభద్రుడు నుడివెను. లోకా యతము గాక తక్కిన అయిదును ఆస్తిక వాదములే

అని అతడనెను. వేదప్రామాణ్యమును అంగీకరించునవియే ఆస్తికములు అను పరిపాటి వైదికులలో వచ్చిన పిమ్మట, షడ్దర్శనములనుండి జైన బౌద్ధములను తొలగించి, యోగ వేదాంతములను చేర్చుట జరిగెను. లోకాయతము నెట్లును అదివరకే కొందరు దర్శనముగా గణింపలేదు కదా! ఇప్పటికి తెలియవచ్చినంత వరకు, న్యాయ వైశేషిక సాంఖ్య యోగ మీమాంసా వేదాంతములను మొట్ట మొదటగా షడ్దర్శనములుగా పేర్కొనినది 12 వ శతాబ్దములో వ్రాయబడిన 'విశ్వసారతంత్రము'. ఎట్లైన నేమి? ఈ ఆరును ప్రధాన వైదిక దర్శనములుగా, లేదా బ్రాహ్మణ దర్శనములుగా రూఢి అయినవి.

జైన బౌద్ధము ఉదయింపక పూర్వము న్యాయము, మీమాంస, ఆన్వీక్షికి (కేవల హేతువాదము) అను మూడు పదముల చేతనే దర్శనశాస్త్ర మభివ్యంజిత మగుచుండెడి. బౌద్ధ జైన సాంఖ్యములతో కలసి ఇవి చాలాకాలము షట్తర్కములనియో, షడ్దర్శనములనియో పిలువబడుచుండెడివి. ఆన్వీక్షికి ఇంచు మించు చార్వాకుల స్వాయత్త మాయెను. బహుశః 11 వ, 12 వ శతాబ్దములలో న్యాయ వైశేషిక సాంఖ్య యోగ మీమాంసా వేదాంతములు షడ్దర్శనములై, వైదికులచే చార్వాక బౌద్ధ జైనములు నాస్తికములుగా వెలిపెట్టబడెను. శంకరానంతరము వేదాంతమునకు వచ్చిన విపుల ప్రచారము, భారత దేశమున జైనబౌద్ధముల అస్తమయము, యోగమునకు గల ఆదరణ ఇట్టి వర్గీకరణమునకు కారణములై ఉండవచ్చును. 14 వ శతాబ్దములో 'సర్వదర్శన సంగ్రహము' వ్రాసిన మాధవుడు అందు ఈ క్రింది 15 దర్శనములను అభివర్ణించెను: చార్వాకము, బౌద్ధము, జైనము, రామానుజదర్శనము, పూర్ణప్రజ్ఞ దర్శనము (మధ్వవేదాంతము), నకులీశ పాశుపతము, శైవము, ప్రత్యభిజ్ఞ, రసేశ్వరము, వైశేషికము, న్యాయము, మీమాంస, పాణిని దర్శనము, సాంఖ్యము, యోగము. అతని అభిప్రాయములో ఈ 15 న్ను, అద్వైత వేదాంతమున్ను ప్రధాన దర్శనములు. అద్వైతముపై అతడు 'వివరణ ప్రమేయ సంగ్రహ' మను బృహద్గ్రంథమును వ్రాయుటచే 'సర్వ దర్శనసంగ్రహము'న దానిని ఉపపాదింపలేదు *

# న్యాయ దర్శనము

భారతీయ నాస్తిక దర్శనముల సంగ్రహ సమీక్ష చేసియుంటిమి. ఇక ఆస్తిక దర్శనముల దిఙ్మాత్ర సమీక్ష చేసెదము.

'వాదము'ను సత్యమును తెలిసికొనుటకు మార్గముగా ఉపనిషత్తులు అంగీకరించియున్నవి. మిథిలాది రాజసభలలో, విద్వత్పరిషత్తులలో ప్రశ్నల కుత్తరములు వచ్చుటకు, శంకలకు సమాధానములు దొరకుటకు వాదములు జరుగుచుండెడివి. ఛాందోగ్య ఉపనిషత్తు 'వాకోవాక్యము'ను పేర్కొనినది. ఒక వాక్యమును మరొక వాక్యముతో చేర్చి పర్యవసానము తీయు కళ వాకోవాక్యము. తైత్తిరీయ ఆరణ్యకము 'అనుమానము' ప్రమాణ మనెను. కఠోపనిషత్తులో 'తర్కము', ఐతరేయ బ్రాహ్మణములో 'యుక్తి' కాన వచ్చును. రామాయణ, మనుస్మృతులు 'వాదము'ను గూర్చి చెప్పినవి. 'బ్రహ్మజాలసుత్త', మజ్ఝిమ నికాయము'లలో 'తార్కికులు', 'అనుమానము' ఉదాహృతములు. వాదములను నియమ పూర్వకముగా జరుపుటకు, వివిధ పక్షముల వారి తర్కముల పటుత్వమును పరిశీలించుటకు చేయబడిన ప్రయత్నముల నుండి న్యాయశాస్త్ర ముత్పన్న మయ్యెను. ప్రమాణములచే అర్థపరీక్షణము న్యాయము. తార్కిక సూత్రముల, ప్రమాణముల విచారమును న్యాయమే. ఈ శాస్త్రముపై మొదటి గ్రంథము వ్రాసినవాడు అక్షపాద గౌతముడు. వాద సూత్రములను, ప్రామాణ్యా

* ఈ రెండు గ్రంథముల కర్త ఒకడు కాడని కొందరందురు.

ప్రామాణ్యములను, ప్రమాణ ప్రమేయముల సంఖ్యను, హేత్వాభాసములను, కుతర్క-వితండవాదాదుల స్వరూపమును అందు గౌతముడు విశదీకరించెను. న్యాయసూత్రమను నీ గ్రంథము క్రీ. పూ. 4 వ శతాబ్దమున వ్రాయబడి, తరువాత పలు మార్పులకు చేర్పులకు లోనైనది. వాత్స్యాయనుడు (4 వ శ.) దీనిపై భాష్యము వ్రాసెను. దిఙ్నాగుడు (425) గౌతమ వాత్స్యాయనులను తన గ్రంథములలో ఖండించెను. ఉద్యోతకరుడు (550) తన వార్తికమందు బౌద్ధ విమర్శలను ఖండించి, గౌతమ వాత్స్యాయనుల నుద్ధరించెను. ధర్మకీర్తి (600-679) ఉద్యోత కరుని విమర్శింపగా. వాచస్పతి (840) తన న్యాయ వార్తిక తాత్పర్యటీకలో దానికి సమాధాన మిచ్చెను. దీనిని తాత్పర్య పరిశుద్ధిలో ఉదయనుడు (984) వ్యాఖ్యానించెను. అతని 'ఆత్మతత్త్వ వివేకము,' 'కుసుమాంజలి' ఆత్మాస్తిత్వమును, ఈశ్వరుని ఉనికిని సాధించి, బౌద్ధులను ఖండింప ప్రయత్నించెను. 12 వ శతాబ్దములో గంగేశుడు ప్రమాణ మీమాంసకే హెచ్చు ప్రాముఖ్యము నిచ్చుచు, నేటి సాంకేతిక తర్క వైఖరులను చాల విధములుగ నాడే కన్పరచు నొక నవ్య న్యాయమును లేవదీసెను. తత్త్వ చింతామణి అతని ప్రసిద్ధ గ్రంథము. 15 వ, 17 వ శతాబ్దముల మధ్య రఘునాథుడు, జగదీశుడు, గదాధరుడు వంటి గొప్ప తార్కికులు నవ్య న్యాయ సంప్రదాయమున మనిరి.

న్యాయ దర్శనమును సూత్ర, భాష్య, వార్తిక, తాత్పర్యముల ఆధారముపై క్రింది విధముగ సంగ్రహింతుము :

**న్యాయ సిద్ధాంతము** : ఆత్మ ఉన్నదా లేదా? ఉన్నచో అది ఎట్టిది? మంచి ఏది? చెడ్డ ఏది? మనుష్యుని చరమ పురుషార్థ మేది? మరణానంతరము అతడేమగును? - ఇటువంటి విషయములను గూర్చిన మిథ్యా జ్ఞానము వలన రాగ ద్వేషములు కలుగును. అసత్యమాడు బుద్ధి, అసూయ, లోభము మొదలగు 'దోషములు' వాటి వలన కలుగును. వీటిచే జుష్టులైన మనుష్యులు అసత్యవాదన స్తేయాదులను చేయుదురు. 'ఈశ్వరుడు, ఆత్మ లేవు' - వంటి తప్పుడు భావమునను కలిగియుందురు. చెడ్డ చేసినను, మంచి చేసినను, మనుష్యుడు కర్మ చేయుచునే ఉండును. ఈ ప్రవృత్తి అధర్మమునకో, ధర్మమునకో దారి తీయును. అతని పునర్జన్మకి ప్రవృత్తియే కారణము. పుట్టినంతనే దుఃఖము ప్రారంభమగును. వీటి అన్నిటికి మూలకారణ మగు మిథ్యాజ్ఞానము నశించి, తత్త్వజ్ఞానము కలిగినంతనే నిశ్శ్రేయస్సు లభించును. తత్త్వజ్ఞానానంతరము, దోష త్యాగానంతరము చేయబడు కర్మలు పునర్జన్మ హేతువులు కావు. ఏలన తృష్ణయే పునర్జన్మ హేతువు.

కాబట్టి నిశ్శ్రేయస్సు ఏది? ఎట్లు చేకూరును? దాని అడ్డంకులు ఎట్లు తొలగును? వీటిని గూర్చిన తత్త్వజ్ఞానము కలుగవలె ననినచో "జ్ఞాన మన నేమి? దానికి ప్రమాణములు ఏవి? అజ్ఞానమును, భ్రాంతులను ఎట్లు బాపుకొనవలెను?" అను విచారము ప్రసక్తమగును.

శరీరేంద్రియ మనో బుద్ధ్యాది అనాత్మ పదార్థములను ఆత్మ పదార్థముగ గ్రహించుట, నిత్య వస్తువగు ఆత్మను తక్కిన వాటినుండి వేరు చేసి తెలిసికొనక పోవుట మిథ్యాజ్ఞానము. "నేను శరీరమును కాను. శరీరమే దుఃఖ హేతువు; దుఃఖోపాదానము" అని గ్రహించినంతనే, మనుష్యుడు అది ఉండవలెనని గాని మరొక శరీరమున పుట్టవలెనని కాని కోరడు. పాము కుబుసమును వీడినట్లు శరీరమును వీడి వాడు పునర్జన్మ ఎత్తడు.

విషయి విషయములు, ప్రమాతృ ప్రమేయములు కలవు. ప్రమాణము అర్థోపలబ్ధి హేతువు. ఉన్నది ఉన్నట్లుగా వస్తుతత్త్వమును గ్రహించు యథాభూత జ్ఞానము ప్రమ. ఉన్నదానిని మరొక తీరున గ్రహించు విపరీత జ్ఞానము అప్రమ. ఏ జ్ఞానము సఫల ప్రవృత్తిని జనింపజేయునో అది ప్రమ. ఏది ప్రమాణాంతరముచే, లేదా అధ్యవసాయముచే దృఢమగునో అది ప్రమ.

ఇచ్ఛా ద్వేష ప్రయత్న సుఖ దుఃఖ జ్ఞానములు ఆశ్రయము లేనిదే ఉండవు. కావున ఈ గుణములు

ఏ ద్రవ్యము నాశ్రయించియున్నవో అది ఆత్మ. వివిధానుభవముల నేక సూత్రమున గ్రథించునది, పూర్వాపరానుభవముల అవిచ్ఛిన్నతకు కారణము ఆత్మ. అనగా భిన్న ప్రత్యక్షములచే ఏక పదార్థము గ్రహింపబడుట, ఇంద్రియ విషయములు వ్యవస్థితము లగుట - వీటిచేత ఆత్మ సద్భావము ధ్రువపడు చున్నది. నశ్యమాన మగు శరీరమే ఆత్మ అయినచో ధర్మాధర్మములకు అర్థము లేదు. బుద్ధి, గురుతించుట, స్మృతి ఏదో ఒక వస్తువునకు చెంది దానిపై ఆధార పడి యుండవలెను. అది ఆత్మ. అది నిత్యము. ఏలన, అప్పుడే జన్మించిన బాలుర సహజమగు హర్ష భయ శోకాదులు, స్తన్యాదుల కొరకైన అభిలాషలు పూర్వ జన్మలో కలిగిన అభ్యాసముల వలన, స్మృతులవలన కలుగుచున్న వని ధ్రువపడు చున్నది. అభిలాషలు, రాగద్వేషాదులు పూర్వానుభవ స్మృతులును, వానిపై ఆధారపడిన సంకల్పమును లేనిదే కలుగవు. కాబట్టి అన్ని శరీరములందు ఆత్మలు అను ద్రవ్యములు కల వని, ఇప్పటి శరీరములందు గల ఆత్మలకు పూర్వ జన్మ ముండె నని, ఈ శరీరముల పాతానంతరము కూడ ఆత్మ లుండు నని తేలును. బుద్ధి ఆత్మగుణము. ప్రవృత్తి వలన ధర్మాధర్మములు, రాగ ద్వేష మోహ ములవలన ప్రవృత్తి కలుగును. ధర్మాధర్మములు ఆత్మ నాశ్రయించును. అవి భౌతిక ద్రవ్యముల నుండి ఆ యా ఆత్మల ప్రవృత్తి ఫలమునకు తగిన శరీర నిర్మాణమునకు కారణములు.

జీవితము దుఃఖమయము, దుఃఖముచే అమి శ్రితమగునది లోకమున లేదు. కాక, సుఖము ఇంకను సుఖము కావలె నను అభిలాషను కలిగించును. అభి లాష ఎల్లప్పుడు సఫలము కాదు. దీని వలన దుఃఖము కలుగును. దుఃఖము నుండి అత్యంతిక విమోక్షము అపవర్గము; నిశ్శ్రేయసము ప్రస్తుతజన్మానంతరము మరి జన్మ లేకుండుటయే పరమ పురుషార్థము. అది యొక విధమగు అమృతత్వము; పునర్జన్మభయ రహి తము. శాశ్వతము. సంసారము నుండి రక్షితుడగుట మోక్షము. అదే బ్రహ్మము (వాత్స్యాయనుడు). మోక్షము గాఢ నిద్ర వంటిది. అందు సుఖ దుఃఖము లుండవు. పునర్జన్మ కారణ మగు తృష్ణ కుపాదాన మగు మిథ్యాజ్ఞాన నాశముచే అది సంభవించును. తత్త్వజ్ఞానమునకు విద్య, ప్రతిభ, యోగము, సత్సం గము సాధనములు.

సర్వజ్ఞత్వ, నిత్యబుద్ధి, సర్వశక్తిమత్త్వాది విశేష గుణములు కల ఆత్మ ఈశ్వరుడు. ఆయన జగత్తునకు పితృకల్పుడు. మనుష్యుల కర్మ లన్నియు అనివార్యముగ సఫల మగుటలేదు. కాన కర్మఫల ములు పరాయత్తములు. ఫల ప్రదాత ఈశ్వరుడు. కాక పూర్వకృత కర్మకు, దానికి తగిన నేటి ఫలము లకు గల అనుబంధాదుల సక్రమ నియమవత్త్వము, కర్మల కుచిత రీతిని ఉచిత దేశకాలములందు ఫల ములు ప్రాప్తమగుట ఈశ్వరుని కారణముననే. మరియు, సావయవ వస్తువు లన్నియు చేయబడినవే. వాటికి కర్త ఉండును. లేకుండిన వాటి రచనయే జరుగదు. ఆత్మ, అణువులు మొదలగు నిరవయవ వస్తువులకు రచన గాని కర్త గాని ఉండదు. సావ యవ వస్తువులకు (ఉదా. కుండ) చేతను డగు కర్త ఉండి తీరవలసినదే. జగత్తు సావయవము కాబట్టి దానికి కర్త ఉండవలసినదే. కార్యమును బట్టి కార ణము ననుమానింప వలెను గాన ఈ జగత్తును రచించిన చేతన కర్త సర్వజ్ఞుడు, సర్వశక్తి కావలెను; నిత్య బుద్ధియుక్తుడును కావలెను. లాఘవ తర్కముచే జగత్కర్త ఒక్కడే; అతడే ఈశ్వరుడు. నిత్యములగు అణువులనుండి, నిత్యములగు ఆత్మల పూర్వకర్మఫలానుసారముగ జగద్రచన జరుగు చున్నది. లేకుండినచో, ఆత్మలకు పునర్జన్మావ కాశము, తమ తమ ధర్మా ధర్మ ఫలభోగము జరుగదు. అనేక కోట్ల ఏండ్లు గడచిన పిమ్మట జరా మరణ చక్ర సంసరణచే శ్రాంతులగు ఆత్మలకు విశ్రాంతి నిచ్చుటకు ఈశ్వరుడు జగత్తును నాశనము చేయును. అప్పు డిక ఆత్మలు, అణువులు మాత్రము మిగులును. తిరిగి చాలాకాలమునకు ఈశ్వరుడు జగ న్నిర్మాణము చేయును. మరల నాశనము చేయును. ఇట్లెన్నో సృష్టులు, ప్రళయములు అనాదిగ జరిగినవి, జరుగును. ముక్తులీ చక్రమున తగుల్కొనరు.

# వైశేషిక దర్శనము

బుద్ధునికి పూర్వము కూడ అణువాదము ఉండెనని బౌద్ధగ్రంథములు చెప్పుచున్నవి. జైనగ్రంథములందును ఒక విధమగు అణువాదము కలదు. ఇట్లు పురాతన కాలమునుండి ఈ దేశమున అణువాదము లుండెను. అందొక విధమగు అణువాదమును గ్రహించి, దానిని వైదిక ధర్మమునకు అనువగు రీతిని కణాదుడు అభివృద్ధి చేసెను. బౌద్ధుల అనాత్మ, నిస్సత్వ సిద్ధాంతములకు, వేద నిందకు తావు లేనిదీ యణువాదము. జైనుల అణువుల వలె గాక కణాదుని అణువులలో గుణ భేదములు కలవు. బౌద్ధ వైభాషికులకు ఒక విధమగు అణువాద ముండెను. కణాదుడు బుద్ధునికి పరుడుగాను, అక్షపాద గౌతమునికి పూర్వుడు గాను తోచును. ఆయన వైశేషిక సూత్రము ఈ దర్శనమునకు మొదటి ముఖ్య గ్రంథము. దీని నాధారముగ గొని ప్రశస్తపాదుడు (499-569 లో నుండిన పరమార్థునికి పూర్వుడు) 'పదార్థధర్మ సంగ్రహము' ను వ్రాసెను. ఇతడు న్యాయదర్శనముచే ప్రభావితుడు. ఇతడు వైశేషికమును ఎంతో విస్తరించినాడు; దృఢము చేసినాడు. శ్రీధరుని (991)'న్యాయ కందలి',ఉదయనుని (984) 'కిరణావలి' పదార్థధర్మ సంగ్రహముపై టీకలు. వీటి కెన్నో టీక లున్నవి. 15 వ శతాబ్దమున శంకర మిశ్రుడు కణాద సూత్రములపై 'ఉపస్కారము'ను రచించెను.

**వైశేషిక దర్శన సంగ్రహము :** అభ్యుదయ, నిశ్శ్రేయస్సులను కలిగించునది ధర్మము.'అభ్యుదయ మనగా లౌకిక సుఖము;నిశ్శ్రేయస మనగా మోక్షము' అని కొందరి వ్యాఖ్య. 'అభ్యుదయ మనగా తత్త్వ జ్ఞానము, నిశ్శ్రేయస మనగా మోక్షము' అని ఉదయనుడు. ధర్మమును చెప్పునది వేదము. దానికే ఆ విషయమున ప్రామాణ్యము. ధర్మ విశేషముచే తత్త్వ జ్ఞానమును, దానిచే నిశ్శ్రేయస్సును కలుగును. వర్ణాశ్రమాచార యుక్తమగు కర్మల నియతాచరణముచే ఉత్పన్నమగు ఒక పురుష గుణము ధర్మము. కాని నియత కర్మలను ప్రయోజనాపేక్ష లేక నిష్కామముగా ఆచరించిన భావము (చిత్తము) ప్రసాదము (శుద్ధి) నొంది ఒక ధర్మ విశేష ముత్పన్నమగును. అది తత్త్వజ్ఞానమును ప్రసవింప గలుగును. యమ నియమాది'ఆత్మ కర్మలు'కూడ మోక్షము నీయగలవు.

ఇచ్ఛా ద్వేషములచే ధర్మాధర్మ ప్రవృత్తి యగును. దానిచే జన్మమరణములు తిరిగి తిరిగి కలుగుచుండును. ఇచ్ఛా ద్వేషములకు ఈ జన్మయందును, పూర్వజన్మయందును కలుగు సుఖదుఃఖాది అనుభవములు, వాటి సంస్కారములు కారణములు. తత్త్వ జ్ఞానము వలన, ఆత్మ కర్మల వలన దోషములు నశించును; మోక్షము వచ్చును. వైదిక కర్మల వలననే ధర్మప్రాప్తి అగును. అయితే హింసారహితము, విద్యా శ్రద్ధలతో యుక్తము అగు కర్మయే ఫలవంతమగును. శుద్ధ జీవితము, శుద్ధాహారము ధర్మమునకు సాధనములు. మనస్సు ఆత్మలో స్థితమైనప్పుడు అది కర్మ (చేష్ట, లేదా వృత్తి) రహితమగును. అప్పుడు శరీరమునకు దుఃఖాభావము సిద్ధించును. అది యోగము.

కర్మలకు (పనులకు, ప్రవృత్తులకు, సంఘటనలకు), ప్రయోజనములకు (ఫలితములకు), హేతువులు కనపడనప్పుడు అదృష్టము (చూడబడనిది) ఉన్నదను కొనవలెను. అయస్కాంతము వైపునకు ఇనుప ముక్క ఏల ఆకర్షింపబడును? వృక్షములందు రసము వేళ్ళనుండి పైకి ఎట్లు ప్రాకి ప్రసరించు చున్నది? యౌవనారంభమున పురుషునికి స్త్రీయందు అనురక్తి ఏల కలుగుచున్నది? అజము (మేక)లకు ముండ్ల కంచెల ఆకులు ఎందు కిష్టములు? వీటి అన్నిటికిని

అదృష్టమే హేతువు. అటులనే నశించు దేహమునుండి ఆత్మ, మనస్సులు వెడలి దేహాంతరమున ప్రవేశించుట, వాటితో పాటు ప్రాణము కూడ అచ్చటికి చేరుట, ఆహారము జీర్ణమై రక్తమాంసాదు లగుట-ఇదంతయు అదృష్టమువలననే జరుగును. వైదిక కర్మల ఫలములు కూడ అదృష్టమువలననే సంభవించును. పూర్వజన్మల లోని కర్మల కీ జన్మలో ఫలము అదృష్టమువలననే లభించును. అటులనే విశ్వనిర్మాణమునకు అవసర మగు గతిని పరమాణువులలో కలిగించి వాటి సంయోగమును సంభవ మగునట్లు చేయునదియు అదృష్టమే.

కణాద సూత్రములందు సృష్టికర్త ప్రస్తావన గాని, కర్మఫల ప్రదాత యగు చేతన తత్త్వ ప్రతి పాదన గాని కనపడదు. 1. 'తద్వచన' మగుటచే ఆమ్నాయము ప్రమాణమని ఆయన చెప్పినాడు. తత్ - ఆయన యొక్క, ఈశ్వరుని యొక్క అని అర్థము చేసి, ఈశ్వర వచన మగుటచే వేదము ప్రమాణ మని కొంద రనిరి. లేదా 'తత్ - దానిని గూర్చిన, అనగా ధర్మమును గూర్చిన వచన మగుటచే వేదము ప్రమాణము' అనియు చెప్పవచ్చును. తత్ అనగా 'ఋషుల' అనియు అర్థము చెప్పవచ్చును. 'ఆత్మ ప్రత్యక్ష' మను యోగులకు లభ్య మగు ప్రత్యక్ష విశేష మొకటి కలదని, దానికి ఆత్మ, ద్రవ్యాంతరములు, వాటి గుణములు కూడ విషయము లని కణాదుడు చెప్పి యుండుటచే, ఋషులవచన మగుటచే వేదము ప్రమాణ మును అర్థము అసంగతము కాదు. 2. స్వర్గ, యజ్ఞ ఫలాది నామములు (సంజ్ఞలు), క్రియలు మన ప్రత్యక్ష అనుమాన విషయములకు చెందినవి కాకపోవుటచే, మనకంటె విశిష్టులగు వారు ఉన్నారని, వారి కవి ప్రత్యక్షము లని అనుమానము చేయవచ్చు నని కణాదుడు చెప్పినాడు. మన బుద్ధులలో కల తారతమ్యములు (హెచ్చు తగ్గులు) మన బుద్ధి నతిశయించు విశిష్టబుద్ధి గల ఋషిబుద్ధిని అనుమానించుటకు లింగము అనియు కణాదుడు అనినాడు. 'మనకంటె విశిష్టులు అనగా ఈశ్వరుడుకు, ఋషులును' అనియు, 'ఆయుర్వేదాది శాస్త్రములు జగత్తను కార్యము ఋషులయు, ఈశ్వరు నియు అస్తిత్వానుమానమునకు లింగము' అనియు శంకరమిశ్రాదుల అభిప్రాయము. ఇది కణాద మతము కాకపోవచ్చును.

ప్రశస్తపాదుడు జగత్తునకు హేతువగు ఈశ్వరుని మంగళ శ్లోకమున నమస్కరించినాడు. ధర్మము ఈశ్వర చోదనచే వ్యక్త మని చెప్పినాడు. ఈశ్వరుని సంకల్పము వలననే సృష్టి ప్రలయములు జరుగునని, ఆత్మల కర్మ ఫలానుభవావకాశము కొరకు, సృష్టి, జన్మ మరణ చక్రమునుండి వారికి విశ్రాంతి నిచ్చుటకై ప్రలయము ఈశ్వరుడు సంకల్పించు నని, ఈశ్వరుడు 'సకల భువన పతి' యని ప్రశస్తపాదుడు చెప్పినాడు. తరువాత వచ్చిన వైశేషికులు పూర్తిగ ఈశ్వరవాదులైరి. ఏకైక దుఃఖహానో పాయము ఈశ్వర సాక్షాత్కార మనియు, అది శ్రవణ, మనన, భావనలచే కలుగుననియు, మననము అనుమానాధీనమును, అనుమానము వ్యాప్తిజ్ఞానాధీన మును. ఆ వ్యాప్తిజ్ఞానము పదార్థ వివేకముపై ఆధార పడినదియు అగుటచేత షట్ పదార్థములను కణాదుడు వర్ణించెను అనియు వైశేషికుల మత మని మాధవుడు చెప్పియున్నాడు.

ఆత్మ నిత్యద్రవ్యము. బుద్ధి, సుఖదుఃఖాదులు దాని గుణములు. ఇంద్రియార్థ సన్నికర్షవలన కలుగు జ్ఞానమున కేది ఆశ్రయమో అది ఆత్మ. శరీరాదులు జ్ఞానమున కాశ్రయము కాజాలవు. ఏలన అవి భౌతిక ములు. అవి జ్ఞానమున కాశ్రయము కాగలిగినచో అన్ని పదార్థములును అట్లు కాగలుగును కదా! తనకు ప్రవృత్తి నివృత్తు (చేష్టలు, వ్యాపారములు) లుండుట వలన అవి ఉన్న ఇతరత్ర కూడ ఆత్మ లున్నవని అనుమానింపనగును. శరీర గతి, శ్వాస ప్రశ్వాస, నిమేషోన్మేష, జీవన, మనోగతి, సుఖ దుఃఖ, ఇచ్ఛా ద్వేష ప్రయత్నములం వలన ఆత్మ అనుమాన ప్రమాణ సిద్ధము. అది లేనిదే శరీరాదు లున్నను ఇవి ఉండవు కదా! ఇవి దానికి లింగములు. కాక, 'అహం' (నేను) శబ్దముచే వాచ్య మగునది ఆత్మ. మరే పదార్థమును దానిచే వాచ్యము కాదు. ఈ ప్రతీతియు ఆత్మను సిద్ధము చేయుచున్నది.

సుఖదుఃఖ వ్యవస్థ[1], శాస్త్రము ఆత్మలు అనేక మని చెప్పును. ఇవి న్యాయ వైశేషికములు రెండింటి కిని సమ్మతమే.

ఆత్మకు దుఃఖముల ఆత్యంతిక వినాశము, గుణ రాహిత్య మగుట మోక్షము. దగ్ధమైన ఇంధనమందలి అగ్ని వలె ఉపశమనము మోక్షము.

# సాంఖ్య దర్శనము

జగద్వైచిత్ర్య నానాత్వ మంతయు భిన్న విరోధ ప్రవృత్తులు, గుణములు అంతర్గతములుగా గల ఒకే భౌతిక తత్త్వము నుండి వచ్చిన దను భావము కఠ, మైత్రీత్యాది ఉపనిషత్తులలో కొన్నిచోట్ల వ్యక్తము. ఏతాదృశ భావముల నన్నిటిని బుద్ధునికి పూర్వవర్తి యగు కపిలుడు ఒక దర్శనముగా వ్యవస్థీకరించెను. కాని ఆయన కృతులు ఇప్పుడు లేవు. ఆయనదని చెప్పబడు 'సాంఖ్య ప్రవచన సూత్ర' మను పేర ఇప్పుడు దొరకునది తరువాతి వారు వ్రాసినది.[2] ఈ సంప్రదాయమున ఆయన తరువాత ఆసురి, పంచ శిఖులు ప్రసిద్ధాచార్యులు. మరణానంతరము చైత న్యము నశించు నని పంచశిఖుడు నమ్మినట్లు మహా భారతము ద్వారా తెలియును. కొందరు విద్వాంసులు సాంఖ్యము భౌతికవాదము నుండి ఉదయించినదని డని, కొందరు కాదని అందురు. ప్రకృతి పురుష విభాగముతో కూడిన వ్యుత్పన్న సాంఖ్యము మైత్రా యణీ ఉపనిషత్తులో కానవచ్చును. శ్వేతాశ్వరమందు సాంఖ్య భావములు ఈశ్వర వాదముతో సమ్మిశ్రిత ములు భాగవత పురాణము కూడ కపిలుడు ఈశ్వర వాది యని, భగవదవతారమని చెప్పును. భగవద్గీత యందు సాంఖ్య వేదాంతముల సమన్వయ ప్రయ త్నము కానవచ్చును. ఇప్పుడు దొరకు సాంఖ్య గ్రంథములలో కెల్ల అత్యంత ప్రామాణికము, వాటి నన్నిటికంటె ముందటిది ఈశ్వర కృష్ణుని (3 వ శ.) 'సాంఖ్యకారిక'. ఇది చైనా భాషలోనికి 6 వ శతాబ్దములో పరమార్థు డనువదించెను. సూత్ర భాష్య మున శంకరులు దీని నుండియే సాంఖ్యవివేచన చేయు సందర్భములో ఉద్ధరణ లిచ్చెను. దీనిపై మాఠరుడు ఒక వృత్తి వ్రాసెను. గౌడపాదుడు (7 వ శ.) అను నాయన భాష్యము వ్రాసెను. వాచస్పతి (841) 'తత్త్వకౌముది'లో దీనిని వివరించెను. 16 వ శతాబ్దిలో నుండిన విజ్ఞాన భిక్షువు సూత్రములపై భాష్యము వ్రాసెను. 7 వ శతాబ్దమునకు ముందే వ్రాయబడిన 'తత్త్వసమాస' మను ఒక చిన్న సూత్రగ్రంథము కలదు. ఇది ప్రాచీనము, ప్రామాణికము అని కొందరి ఊహ.

'సాంఖ్య' మనగా సమ్యక్ ఖ్యాతి, సరియగు జ్ఞానము, ప్రకృతి పురుషుల వివేకము. ఇందు సంఖ్యకు ప్రాధాన్యము ఉన్నది కాబట్టియు, ఇందు గుణముల, ప్రకృతి పరిణామముల లెక్క (సంఖ్యానము) వేయ బడినది కాబట్టియు ఇది 'సాంఖ్యము'.

ప్రాణులకు అనుదినము దుఃఖ త్రయముచే అభి ఘాతము (తీవ్రబాధ) కలుగుచున్నది. దుఃఖ త్రయ మనగా : 1. ఆధ్యాత్మిక దుఃఖము, 2. ఆధిభౌతిక దుఃఖము, 3. ఆధిదైవిక దుఃఖము. శారీరకము, మాన సికము అగునది ఆధ్యాత్మికము. వాత పిత్త శ్లేష్మ ముల విపర్యయముచే వచ్చిన జ్వరము మొదలైనవి శారీరకము. ప్రియ వియోగ, అప్రియసంయోగాదులు మానసికము. చతుర్విధ భూతములచే కలిగినది ఆధి భౌతికము; అనగా ఇతర ప్రాణులచే గాని, స్థావర

1. సుఖదుఃఖాదులు అన్నిచోట్లను ఒకటిగా లేవు. అవి ప్రత్యేకములు కాన ఆత్మలు అనేకములు.

2. 14 వ శతాబ్దిలో నుండిన మాధవ మంత్రి సూత సంహిత టీకలో దీనిలోని సూత్రము నుద్ధృతము చేయుటచే ఇది అంతకు ముందే వ్రాయబడి యుండును.

ములచే గాని కలిగిన దుఃఖము (ఉదా. పాముకాటు, దొంగలు గొట్టుట). దేవతలచే లేదా దివము (స్వర్గము) చే కలిగిన దుఃఖము ఆధిదైవికము. శీతోష్ణ వాత వర్షాశనిపాతాదులు ఇట్టివి. ఈ దుఃఖములు తొలగుటకు మార్గములు కనబడుచున్నవి. ఉదాహరణమునకు ఆయుర్వేద చికిత్సలచేత, ప్రియ సమాగమాదులచేత ఆధ్యాత్మిక దుఃఖమును, జాగరూకతతో నిరత్యయ స్థానాదులలో ఉండుటచేత, నీతి శాస్త్రాను సారముగ నడచుకొనుటచేత ఆధిభౌతిక దుఃఖమును, మణిమంత్రౌషధులచే ఆధిదైవిక దుఃఖమును తొలగును. కాని, ఈ త్రివిధ దుఃఖము ఈ మార్గములచే ఐకాంతికముగ (అవశ్యముగ) గాని, అత్యంతముగ (శాశ్వతముగ) గాని తొలగుటలేదు. ఇట్లు దృష్టోపాయముల గతి యుండగా, ఆనుశ్రవిక (ఆగమముచే వినిపింపబడిన) ఉపాయములు కూడ సదోషములే. సోమ పానముచే అమృతులైన దేవతలు కూడ శత్రువులచే గడ్డిపోచలవలె చేయబడిరి. ఇక అశ్వమేధముచే మృత్యు పాపములను తరింతురని చెప్పబడినను, అందు హింసాది అశుద్ధ కార్యములను చేయవలసి యున్నది. కాక ఇంద్రాదులు నాశనమగుదురు గాన ఆనుశ్రవికోపాయమున క్షయగుణము కలదు; నిత్యత లేదు; ఆ ఉపాయములచే వచ్చు ఫలములు న్యూనాధికములు గాన అతిశయ ఫలము గల వారిని హీన ఫలము గల వారు ఈర్ష్యతో చూచుట, వారు వీరిని తక్కువగా చూచుట జరుగును. ఇది అతిశయ దోషము. కాబట్టి ఈ దృష్ట ఉపాయములు, శ్రుతోపాయములు, దుఃఖమును అవశ్యముగ, శాశ్వతముగ నాశనము చేయలేవు. వాటికి భిన్నము, ప్రశస్తము అగు ఉపాయమే శ్రేయస్కరము. వ్యక్తము, అవ్యక్తము, జ్ఞుడు*. వీటి విజ్ఞానము అట్టిది.

సమస్త విశ్వమునకు మూలము ఒకటియే పదార్థము. అది ప్రకృతి. ప్రకరోతీతి - అనగా బాగుగా కార్యసాధన చేయునది ప్రకృతి. లేదా అన్ని వస్తువులకు, వ్యాపారములకు ముందు (ప్రాక్) ఉండునది ప్రకృతి. 'కార్య మెప్పుడును కారణమందు ఉండును. కార్యకారణ సంబంధ మనగా పరిణామమే' అను వాదము సత్కార్యవాదము (చూ.) దీనినిబట్టి 'విశ్వకారణము తనయందు సూక్ష్మరూపమున విశ్వమును కలిగి యుండవలెను. దాని క్రమ పరిణామము వలననే యావద్విశ్వము ఆవిర్భవించి యుండవలెను' అని వీరి వాదము.

1. భిన్న భిన్న వస్తువు లన్నియు పరిణామము కలవి; సాంతములు. ఇట్టివి స్వనిష్ఠములు, స్వయం పూర్ణములు కాలేవు. వాటి కొక నిష్పరిణామ మగు అవ్యక్త వస్తు వొకటి కారణము కావలయును. 2. వస్తువుల భేదములు అనంతము కాదు. అవి తమ స్వభావమందు పూర్తిగా భిన్నములును కావు. కాబట్టి వీటన్నిటికి తగిన ఒక సామాన్య కారణ ముండవలెను. అది పరిమిత భేదములను (limited variety) పుట్టించు స్వభావము కలదై యుండవలెను. 3. వస్తువుల శక్తులకు, ప్రవృత్తులకు అనురూపమగు వాటి కారణము ఉండవలెను. సత్కార్య వాదమును బట్టి ఇవి యన్నియు అవ్యక్తముగ, సూక్ష్మముగ వాటి కారణమున ఉండవలెను. 4. కారణము కార్యమును తనంతట తాను పరిణామ క్రమమున ఉత్పత్తి చేయగలిగి ఉండవలెను. తిరిగి కార్యము కారణమందు అవిభాగముగ లయమొందునదై యుండవలెను. మట్టి ముద్దనుండి కుండ నిష్పత్తి యగుచున్నది. తిరిగి అది అవిభాగముగ మట్టిగనే లయమగును. అట్లు సమస్త వస్తువులకు ఏక కారణము, పరిణామముచే వాని యన్నిటిగా అగునది, దాని అసలు స్వరూపములో ఎన్నడును వ్యక్తము కానిది, అన్ని కార్యములకు ఆధారము అగునది (అందుచే అది ప్రధాన మనబడును) అగు ఒక వస్తువు కలదు. అది ప్రకృతి. అది నిత్యము, వ్యాపకము, స్వతంత్రము, నిరవయవము.

ప్రకృతియందు మూడు 'గుణములు' కలవు. ఇది అనుమానముచే సిద్ధము. ఈ మూడును ప్రకృతి

* వ్యక్తము - ప్రకటమైనది; స్థూలము-బుద్ధ్యహంకారాది వికృతులు; అవ్యక్తము, ప్రకటము కానిది, సూక్ష్మము - ప్రకృతి; జ్ఞుడు-పురుషుడు.

కంగములు. ఇవి నిజముగా ద్రవ్యములే! ఎందుకన వాటికి సంయోగ విభాగములు కలవు; లఘుత్వ చలత్వ గురుత్వాది ధర్మములు కలవు. ఇవి ఒకదాని కొకటి ఆశ్రయములు; సహాయకములు; కలిసి పని చేయునవి. ఇవి పురుషుల కుపకరణములు కాబట్టి, వారిని బంధించి మహత్తు మొదలగు రజ్జువులను నిర్మించునవి కాబట్టి 'గుణములు'* అనబడినవి. వీటి సామ్యావస్థ అనగా అన్యూనానతిరిక్తావస్థ ప్రకృతి; అసామ్యావస్థ వికృతి. ప్రకృతి కార్యభేదములన్నియు మూడు విధములగు ధర్మములను మాత్రమే కలిగి యున్నవి. కానవచ్చు అసంఖ్యాక ధర్మము లన్నియు ఆ మూడింటి క్రిందను వర్గీకరింపవచ్చును. సమస్త భౌతిక మానసిక కార్యములును, సుఖదుఃఖ మోహాదు లును, లఘు గురుత్వాదులును, గతిస్థిత్యాదులును వీటి వలననే జరుగుచున్నవి.

ప్రకృతి గాక పురుషుడు అను మరొక పరమ తత్త్వము కలదు. పురుషుడు అకర్త, గుణ రహితుడు. 1. వస్తువు లన్నియు సంఘాతములు (సముదాయ ములు). అచేతన సంఘటిత వస్తువు లన్నియు ఎవరి కొరకో ఒకరి కొరకై యుండును. అవి పురుషుల కొరకై యున్నవి. 2. ప్రకృతి వికృతులు త్రిగుణాత్మ కములు. వీటికి విపరీతమైనది, వీటి ననుభవింప గలిగినది ఏదో ఉండవలెను. అదియు త్రిగుణాత్మక మైన ప్రకృతివలెనే ఇతరులకొరకే ఆగును. కాన పురుషులు త్రిగుణ రహితులు. 3. చేతనాధిష్ఠానము లేనిదే జడపదార్థములలో ప్రవృత్తియుండదు. ప్రకృతి ప్రవృత్తికి అధిష్ఠానమగు చేతన వస్తువు ఉండవలెను. 4. వస్తువు లన్నియు భోగ్యములుగా కానవచ్చు చున్నవి. వీటికి భోక్త లుండవలెను. 5. కైవల్యము కొరకు కనీసము కొందరిలోనైనను ప్రవృత్తి కనపడు చున్నది. త్రిగుణాత్మక పదార్థమేదియు ఇట్లు ముక్తికి యోగ్యము కాదు. కాన నిర్గుణము, కైవల్య యోగ్యము అగు వస్తువు కలదు. ఇట్లు సాంఖ్యులు పురుషులున్నా రని సిద్ధాంతీకరింతురు.

---

* 'గుణ' మన త్రాడు, దారము అను అర్థము కలదు.

జన్మ మృత్యువులు, అనుభవముల వైచి త్ర్యము, నానాత్వము పురుషు లనేకము లని తెల్పు చున్నవి; ధర్మా ధర్మ ప్రవృత్తి, సుఖ దుఃఖ వ్యవస్థ కూడ దీనిని ధ్రువపరచుచున్నవి.

పురుషులు అకర్తలు, సాక్షి మాత్రులు, ఉదా సీనులు, దుఃఖాది రహితులు. ఏలన వారు ప్రకృతిగుణ రహితులు; తద్విరుద్ధ ధర్మములు కలవారు. క్రియా దులు, సుఖాదులు త్రిగుణ కార్యములు. పురుషులు త్రిగుణ రహితులు; పురుషులు చేతన తత్త్వములు, నిత్యులు, విభువులు, నిర్వికారులు, చలనాది రహితులు. చైతన్యము వారి స్వరూపము; ధర్మముకాదు. పురుష సాన్నిధ్యము వలన ప్రకృతి వ్యాపారవంతమై వికృ తులుగ పరిణామ మొందును. స్ఫటికము ప్రక్కనున్న జపా కుసుమపు ఎరుపు అందు ప్రతిబింబించినట్లు, కాని నిజముగా అందే వికారము కలుగనట్లు పురుషు లలో ఏ వికారమును కలుగదు. సుఖదుఃఖాద్యనుభ వము కేవలము ప్రతిభాసించును. ప్రకృతి కార్యము లనుగాంచి, తమ స్వరూపమును విస్మరించి, ప్రకృ తితో తాదాత్మ్యము నాపాదించుకొని, పురుషులు అను భవములకు లోనైనట్లు భ్రాంతి చెందుతుచున్నారు. ఈ అర్థముననే వారుభోక్తలు. అవివేకముచే ఈ విస్మృతి, ఈ అయథార్థ కర్తృత్వ భోక్తృత్వములు కలుగుచున్నవి. వికృతి యగు మనస్సులో జరుగున దంతయు పురుషానుభవ మనునది భ్రాంతి. పురుషు నిలో ఇట్లు బుద్ధి మనశ్శరీరాదుల వ్యాపారములు ప్రతి బింబించుట బంధము. ప్రతిబింబమాత్ర మగు మిథ్యా దుఃఖమే బంధము.

పురుషులకు కనబడుట కొరకు, కైవల్యము కొరకు పంగ్వంధుల సంయోగము వంటిది ప్రకృతి పురుష సంయోగము. గ్రుడ్డివాని వీపుపై నెక్కిన కుంటివాడు గ్రుడ్డివానికి దారి చూపగలుగును కాని నడువలేడు. గ్రుడ్డివాడు నడవగలడుగాని దారి తెన్ను ఎరుగడు. పురుషుడు చూడగలుగును, నిష్క్రియుడు. ప్రకృతి సక్రియము, కాని అది చూడలేదు. పురుషా ధిష్ఠితమగు ప్రకృతి అతని ప్రయోజనము కొరకై పరి

ణామమొందును. పురుషు డిది చూచుచు, దీనికి తాను కర్తనని, తన కొరకే ఇది అగుచున్న దని తలచునంత వరకు ఈ నాటకము సాగును. తాను అకర్తనని, దీనితో తనకు సంబంధము లేదని గ్రహించినంతనే పురుషునికి కైవల్యము (ప్రకృతినుండి ఒంటరితనము, వేరగుట) సిద్ధించును. ఈ ప్రకృతి వియోగము వివేకము వలన వచ్చును. ప్రకృతి వికృతి పురుషులను గూర్చి మననముచే వివేకము (అత్యంత భేదజ్ఞానము అనగా ప్రకృతి పురుషుల మధ్య) కలుగును. 'నేను జన్మింపలేదు, నాకు శరీరములేదు, నేను కర్తనుకాను, నేను భోక్తను కాను' అను అవగతి దీనివలన కలుగగానే 'అహం' లేకుండ పోవును. అప్పుడు పురుషుడు కేవలియై, స్వరూప మగు నిర్గుణత్వమును అవబోధించుకొనును. ఇట్టి జ్ఞానము కలిగిన పురుషునికికూడ వెంటనే దేహపాతకము కాదు. ఏలన అది ఈ వరకే ప్రకృతి కీయబడిన గతి ఫలము. అది వ్యయము కాగానే అట్టి పురుషునికి మరి జన్మ ఉండదు. ఆత్యంతిక కైవల్యము కలుగును.

బంధ పునర్జన్మాదులు నిజముగాలేవు. కాన ముక్తి చెందవలసిన వారుకూడ నిజముగా ఎవరును లేరు. స్వభావముచే పురుషులు మలినులు, వికారులు అయినచో జన్మాంతర శతములచేకూడ వారు ముక్తులు కాలేరు. కాన పురుషులు నిత్య ముక్తులే!

పురుష సాన్నిధ్యము ప్రకృతిని విశ్వమును ప్రసవించునట్లు పురికొల్పును. లేదా పురుషుల కర్మలు ప్రకృతి పరిణామములకు కారణములు. పురుషులు నిత్యులు. వారి కర్మలు అనాదులు. అనుభవించినకాని కర్మనాశము కాదు. ప్రపంచము పట్ల వైరాగ్యము ఏర్పడిన గాని కైవల్యము రాదు. ఇది యంతయు జరుగవలె నన్న ప్రకృతి నాటకము సాగవలెను. అందుచేతనే ప్రకృతి బంధమోక్ష కారణము. సృష్టి పురుషుల భోగార్థము, కైవల్యార్థము కూడ. కాని నిజముగా కర్తృత్వము, భోక్తృత్వము ఎన్నడును నిత్య నిర్వికారుడగు పురుషునికి లేవు. ఈ వివేకము కలిగిన దుఃఖము లేదు, బంధము లేదు, మోక్షము లేదు.

ప్రమాణము లెవ్వియు లేనందున ఈశ్వరుడు సిద్ధింపడు. పురుషులందరును బద్ధులో ముక్తులో అయి ఉందురు. ఈ రెండును కానట్టి ఇంకొక పురుష విశేషము ఉండదు. ఈశ్వరుడు ముక్తుడైనచో సృష్ట్యాదులు చేయుటకు వలయు ప్రయోజనము కాని, కోరిక కాని ఉండదు. బద్ధుడైనచో సృష్ట్యాదులు చేయలేడు. నానాపురుషుల అధిష్ఠాతృత్వము వలననే ప్రకృతి సృజించుచున్నది. కర్మఫల ప్రదాత ఒకడు అవసరము. అవశ్యకమగు కర్మవలననే ఫలనిష్పత్తి సంభవము. రాగాదులు లేనందున, స్వోపకారార్థమే ఎవరైనను అధిష్ఠాత లగుదురుగాన, రాగము కాని, ఏ ఉపకారాపేక్షగాని లేని ఈశ్వరుడు సృష్టికాని, ఫలప్రదానముగాని చేయలేడు. ఈశ్వరానుమానము చేయుటకు వలయు 'వ్యాప్తి' లేదు. ఇక శ్రుతియన్ననో ప్రపంచ కారణము ప్రధాన మనియే చెప్పుచున్నది. ఈశ్వర ప్రతిపాదన చేయుచున్నట్లు కన్పడు శ్రుతులు నిజముగ ముక్తాత్మల ప్రశంసనో, సిద్ధపురుషుల ఉపాసననో మాత్రమే చేయుచున్నవి. ఇక చేతన కారణత్వమును నిరూపించినట్లు కన్పడు శ్రుతులు సర్గాదియందుత్పన్ను డగు మహత్తత్త్వోపాధి గల మహాపురుషుని జన్య జ్ఞాన పరములు; లేదా అవియు గౌణముగా* ప్రధాన కారణతనే చెప్పుచున్నవి. ఈశ్వరుని అట్లుంచి నిర్గుణుడు నిర్వికారుడు అగు ఏ చేతనుడును ప్రపంచ కారణము కాజాలడు. ప్రకృతియే (అచేతన సవికార సగుణ తత్త్వమే) ప్రపంచ కారణము కాగలదు.

---

* ఉదా: ''అనేకముగా కావలెనని కోరెను'' అను బృహదారణ్యక శ్రుతిలో బహుభవనానురోధముచే ప్రధానమే ఇట్లు చెప్పబడెను. 'కాలువ ఒడ్డు పడబోవుచున్నది', 'ఆ ఇల్లు ఇటు ముఖము కలిగియున్నది', అన్నప్పుడు ఒడ్డు, ఇల్లు చేతనములు కావు కదా!

# యోగదర్శనము

స్థిరసుఖముగ తాపసులు కూర్చుండి యున్నట్లు చిత్రింపబడిన ముద్రలు మొహంజొదారో శిథిలములలో గాన వచ్చినవి. 'మౌనము' నభ్యసించువారు, విక్షిప్తము (hypnotic trance), ప్రహర్షోన్మాద తన్మయ మూర్ఛావస్థలు (ecstatic and trance states) వేదసంహితాకారులకు పరిచితములే. తపస్సుచే సిద్ధులు, ప్రకృతిపై జయము కలుగు నను భావము అధర్వ వేదమందు చాల చోట్ల కనపడును. తపో బ్రహ్మచర్యముల వలన సమకూడనిది ఉండదను భావము ఉపనిషత్తులలో చాల చోట్ల వ్యక్తమై యున్నది. ధ్యానము, సమాధి ఆత్మజ్ఞానమున కవసరమనియు అవి ఎన్నోసారులు చెప్పినవి. స్థిరమగు ఇంద్రియధారణము యోగ మని కఠోపనిషత్తు వచనము. పంచేంద్రియములు మనస్సుతో పాటు ఆత్మయందు స్థిరములైనప్పుడు బుద్ధికి చేష్ట ఉండదు. అది పరమగతి అని అచట చెప్పినారు. మైత్రీ ఉపనిషత్తులో షడంగమగు నొక యోగము అభివర్ణితము. శ్వేతాశ్వతర ఉపనిషత్తులో వివిక్త స్థానమున తిన్నగా కూర్చుండి, ఇంద్రియ మనః ప్రాణములను వశము చేసికొని సమాధిని పొందు మార్గము వర్ణింపబడినది. భగవద్గీత 6 వ అధ్యాయముననుఇది కలదు. బౌద్ధ గ్రంథములగు దీర్ఘనికాయాదులందు ప్రాణాయామము, సమాధి (సమాపత్తి) మొదలగు వాని వర్ణన కానవచ్చును. మైత్రి, కరుణ, ముదితము, ఉపేక్షలచే చిత్తప్రసాద మగునని నికాయములు, బౌద్ధ సాధన గ్రంథములు అంగీకరించినవి. శ్రద్ధా వీర్యా ధ్యాన సమాధి ప్రజ్ఞలు యోగమార్గ మని మజ్ఝిమ నికాయ భావము. తపో బ్రహ్మచర్య ప్రాణాయామ ధారణా ధ్యాన సమాధులను సాంఖ్యభావములతో కలిపి, బౌద్ధముచే ప్రభావితుడై, ఒక దర్శనముగ నిర్మించి పతంజలి 'యోగసూత్ర' రచన గావించెను. ఇది క్రీ. పూ. 200 కు క్రీ. శ. 300 కు మధ్య వ్రాయబడి యుండవలెను అని అందురు. సౌత్రాంతిక, విజ్ఞాన వాదములను ఖండించుటచేత ఇది క్రీ. పూ. 300-200 కంటె ప్రాచీనము కాదని, నాగార్జునుని 'ఉపాయ కౌశల హృదయ శాస్త్రము' యోగ దర్శనమును, ఉమాస్వాతి 'తత్త్వార్థ సూత్రము' (3 వ శ.) ఒక యోగ సూత్రమును ఉదాహరించుటచే ఇది క్రీ. శ. 300 కంటే పూర్వమే ఉండియుండవలెనని కొందరి వాదము. ఈ పతంజలి వ్యాకరణ మహాభాష్య కర్తయే నని సంప్రదాయము. వ్యాసుడు (4 వ శ.) దీనిపై భాష్యము వ్రాసెను. ఈ వ్యాసుడు వేదవ్యాసుడే నని సంప్రదాయము. వ్యాసభాష్యముపై వాచస్పతి (9 వ శ.) 'తత్త్వ వైశారది' యను టీక వ్రాసెను. విజ్ఞాన భిక్షువు (16 వ శ.) భాష్యముపై 'యోగ వార్తికము' రచించెను. యోగ సూత్రములపై భోజరాజు వ్రాసిన 'రాజమార్తాండ' మను వృత్తి ప్రసిద్ధ గ్రంథము.

'యోగ'[1] మనగా ఉపాయము, ప్రయత్నము, ధ్యానము, శక్తి. 'పురుష ప్రకృతుల వియోగమే యోగము' అని భోజుడు. ఇక సంగ్రహముగ ఈ దర్శన వివరణ ఇది:

వివేకి యగు వానికి అంతయు దుఃఖమే. అయిన భూతకాలిక దుఃఖము నశించినది. వర్తమాన దుఃఖము రానే వచ్చినది; అది అనుభవింపబడి నాశనమగును: ఇక అనాగత (ఇంకను రానట్టి, రాబోవుచున్న) దుఃఖము హేయము (త్యాజ్యము, రాకుండా చేసికొనవలెను). ద్రష్టృ దృశ్యముల సంయోగమే హేయ హేతువు. అనగా భోక్తృ భోగ్య సంబంధముతో చిద్రూప పురుషుడు, బుద్ధి సత్త్వముల సన్నిధానము.

---

1. వేరే అర్థములు ఉన్నవి; పాతంజలమందివియే అన్వర్థములు.

సంసారమునకు (హేయమగు దుఃఖమునకు) హేతువు. ఈ సంయోగమే సంవేదక సంవేద్యములుగా వ్యవస్థిత ములగు వాని స్వరూపోపలబ్ధికిని కారణము. ఈ సంయోగమునకు అవిద్య హేతువు. సమ్యగ్ జ్ఞానముచే అవిద్య[1] ఉన్మూలింపబడినచో దాని కార్యమగు సంయోగము నశించును. అదియే పురుషుని నిత్య మగు కైవల్యము. పురుషుడు వేరు, సత్త్వము (బుద్ధ్యాదులు) వేరు అని ఈ తీరుగనుండు విచ్ఛేదము[2] లేని వివేక ఖ్యాతి (ప్రతీత, జ్ఞానము) యే హానో పాయము. అట్టి వివేకమున్న వానికి ప్రజ్ఞ కలుగును. అట్టి వానికి తెలిసికొనివలసినది గాని, చేయవగినది గాని, పొందవలసినది గాని ఉండదు. అతడు తన కిక సంసార ముండకుండ లయమగు నని, ఇక తిరిగి కలుగదని స్వస్థుడుగ నుండును. అట్టివాడు కుశలుడు, ముక్తుడు, గుణాతీతుడు. యోగాంగములను[3] అను ష్ఠించుటవలన, అశుద్ధి[4] క్షయమై, జ్ఞానము క్రమక్రమ ముగా దీపించును. చివరకు పై చెప్పిన వివేక ఖ్యాతి కలుగును.

ఇట్లు హేయము, హేయ హేతువు, హానము, హానోపాయము అను చతుర్వ్యూహములు కలది యోగశాస్త్రము.

శుద్ధ చిద్రూపుడగు పురుషుడు చిత్తము (బుద్ధి)తో సంయోగము చెందుటచే బద్ధుడైన దుఃఖానుభవ మును పొందుచున్నాడు. నిజముగా చిత్తము వికృతి, ప్రకృతి యొక్క పరిణామము, జడము. కాని పురుషుని చిత్ ఛాయాపత్తిచే చేతనమువలె కన్పడును. పదార్థము లతో సంబంధము కలిగినపుడు చిత్తము వాటి రూప ముల దాల్చును. ఈ రూపములు వృత్తులు. జ్ఞాన, విపర్య (మిథ్యాజ్ఞాన) నిద్రాదు లన్నియు వృత్తులే. వృత్తుల సూక్ష్మరూపములు సంస్కారములు. అవి తిరిగి వృత్తుల నుత్పత్తి చేయగలవు. అవిద్యా క్లేశము లును వృత్తులే. ఈ వృత్తులు అభ్యాస వైరాగ్యము లచే నిరోధింపబడును. లౌకిక పారలౌకిక విషయము లందు వితృష్ణ (ఇచ్ఛ, చచ్చుట), ప్రకృతి కంటె పురుషుడు వేరని ఎరుగుట (అందుచే తన్ను తాను శుద్ధునిగా, ముక్తునిగా గుర్తెరుగుట) - ఇవి వైరాగ్య మనబడును. తిరిగి తిరిగి చిత్తమును బాహ్యవిషయ ముల నుండి నివృత్తి చేసి అంతర్ముఖ మొనరించి, స్వరూపనిష్ఠముగ నుంచు ప్రయత్నము అభ్యాసము. విషయదోష దర్శనముచే వైరాగ్యము, వాటియందు వైముఖ్యము, అభ్యాసముచే సుఖజనక మగు దృఢ స్థైర్యము ఉత్పత్తియై, వాటి ద్వారా చిత్తవృత్తులు నిరోధింపబడును.

చిత్తముతోగల సంబంధము విచ్ఛిన్నము కానిదే పురుషునికి ముక్తి కలుగదు. అప్పుడతడు స్వరూపమందు ప్రతిష్ఠితుడగును. అదే కైవల్యము. అప్పుడు పురుషుడు చిచ్ఛక్తిగా మాత్రమే ఉండి, వృత్తి సారూప్యము నివృత్త మగును. అదియే కైవల్యము.

పురుషుని దుఃఖానుభవము అతనికి బుద్ధితో సంబంధమున్నందున దాని అభావమునకును, బుద్ధి నాశము చిత్తలయమునకు కారణము కావలెను. చిత్త నిరోధము కలిగినప్పుడెల్ల ఒక విధముగ కైవల్య

---

1. అతస్మిం స్తత్ప్రతిభాసము (అది కాని దానిలో దాని ప్రతిభాస) అవిద్య; అనగా అనిత్యములు, అశుద్ధములు, దుఃఖములు, అనాత్మ్యములందు నిత్యత్వ, శుచిత్వ సుఖత్వ ఆత్మత్వములున్న వను అభిమానము.

2. అవిప్లవము అని మూలము. సతతము అని అర్థము. నిర్మల మనియు చెప్పవచ్చును.

3 యమ నియమాదులు.

4. అవిద్యాక్షేత్రము లగు అస్మితయు, రాగ, ద్వేష అభినివేశములును, అవిద్యయు అశుద్ధి - వీటిని క్లేశము లందురు. అజడు డగు పురుషుడును, జడ మగు బుద్ధియు ఒక్కటే ననుకొనుట అస్మిత. దీని చేతనే పురుషుడు తాను కర్తనని భోక్త నని అను కొనును. పూర్వజన్మానుభూత మరణ దుఃఖవాసనచే శరీర విషయాదులయందు కలుగు అనుబంధము, వాటి నుండి వియోగము కలుగకూడదను కోరిక అభినివేశము.

ప్రాప్తియే! అందుకే యోగులు సమాధిని కాంక్షించుట. అయితే సతతసమాధి జీవితమున సాధ్యపడదు. కాని అవిద్యాదులు నశించి చిత్త నిరోధము సాధించిన వాని చిత్తము మరణముతో లయమొందును. వాని కిక శాశ్వత కైవల్యమే. అంతవరకును వివేకముగల అట్టి వాడు జీవన్ముక్తుడు.

ఈశ్వర[1] ప్రణిధానము సమాధికి సుగమోపాయమని యోగదర్శన మనును. ప్రణిధాన మనగా భక్తి విశేషము, విశిష్టమగు ఉపాసన, విషయ సుఖాది ఫలముల నిచ్చగింపక సర్వక్రియలను ఆయన కర్పించుట. ఉపాసన యనగా ఈశ్వరుని వాచకమగు ప్రణవము (ఓంకారము)ను జపించుట, ఈశ్వరుని తిరిగి తిరిగి చిత్తమందు నివేశింప జేసికొనుట. ఈశ్వర ప్రణిధానము వలన వివేక జ్ఞానము కలుగును. యోగమున కుండు అంతరాయములు (వ్యాధులు, చిత్తము నిలుకడ లేకుండుట, భ్రాంతి ఇత్యాదులు) నశించును. సమాధి సిద్ధి కీశ్వర ప్రణిధాన మిటుల ప్రకృష్టోపాయమని యోగదర్శనము చెప్పును.

# మీమాంసా దర్శనము

వేదము పవిత్ర గ్రంథముగా, శాస్త్రముగా మాన్యమైనప్పటి నుండి దాని నర్థము చేసికొనుట చాల ముఖ్యమాయెను. తోడనే శాస్త్రప్రామాణ్యము, శాస్త్రతాత్పర్యము ఎటుల తెలియవచ్చు ననునది ప్రధాన సమస్య అయ్యెను. తోడ్తోడ ఉపనిషత్తులలో అక్కడక్కడ వేదము అపరవిద్య యనియు, దాని నధిగమించిన గాని నిశ్శ్రేయసోపలబ్ధి కాదనియు సూచింపబడెను. అట్లే భగవద్గీత వేదములు త్రైగుణ్య విషయము లనియు, నిస్త్రైగుణ్య డగుటయే మానవుని ఆదర్శము కావలెననియు, అంతకన్న ఏమియు లేదను వేదవాదరతుల వేదాపహృత చేతసులై సమాధి యందు బుద్ధి నిలుపలేరనియు, జ్ఞానికి వేదములతో పనిలేదనియు (II. 4-6) శ్రుతి విప్రతిపన్నమగు బుద్ధిని నిశ్చలము చేసుకొననిదే, శ్రుతిపట్ల నిర్వేదము చెందనిదే, శబ్ద బ్రహ్మనతివర్తింపనిదే సమాధి కుదురుట గాని, పరమాత్మ దర్శనముగాని కావనియు చెప్పినది. ఇక బౌద్ధ జైన చార్వాకుల సంగతి చెప్పనక్కరలేదు. వేదముపట్ల వారి వైఖరిలో తీవ్రరూపమును లోకాయత దర్శనమును గూర్చి వ్రాసినదానిలో చూడనగును. దీనికంతకు ప్రతిక్రియగా వైదిక దార్శనికులు వేద ప్రామాణ్యమును తమ తర్కపటిమతో నిలుపజూచిరి. వేదార్థమును నిశ్చయము చేయుటకు నియమములను, సూత్రములను, పద్ధతులను సోదాహరణముగ విపులీకరించిరి. వైదిక ధర్మ మేమని జిజ్ఞాసించిరి· 'చేయ వచ్చునా కూడదా? ఏది ఎట్లు ఎప్పుడు చేయవలెను?' అని వైదిక కర్మలను గురించి, 'ఆత్మ ఏది? బ్రహ్మ ఏది? ఆనంద స్వరూపమేమి?' అనునట్టి విషయములను గురించి జిజ్ఞాస, విచారము చేయుట 'మీమాంసించుట' అని క్రియాపద రూపముగను, 'మీమాంస' అని సంజ్ఞగాను సంహితలలోను, బ్రాహ్మణములలోను, ఉపనిషత్తులలోను చెప్పబడినది. చివరకు మీమాంస యనగా ధర్మజిజ్ఞాస అనియు, ధర్మము వేదోక్తమే కావున, వేదార్థ నిశ్చయమున కుపయోగించు సూత్రములు, పద్ధతులు (వీటిని 'న్యాయము' అందురు) కూడ అందు అంతర్భూతము లగునని రూఢి ఆయెను. వైదికకర్మలను, వేద వాక్యములను

1 ఈశ్వర స్వభావమునకు: (చూ. యోగములు; యోగ దర్శనము- అకరాది) ఎల్లరు ఆదిగురువు అనునది కూడ ఈశ్వరుని ప్రధాన ప్రభావము. ఆయన భూతానుగ్రహార్థము తారక జ్ఞానము నిచ్చు ఆది విద్వాంసుడు, ప్రకృతి పురుష సంయోగములకు, వియోగములకు ఆయన కారణ మని పతంజలి, వ్యాసులు చెప్పలేదు.

వివేచించుట. నిశ్చయించుట, వ్యవస్థీకరించుట చేయునది మీమాంసా శాస్త్రము. ఈ శాస్త్రమును గూర్చి వ్రాసినవారు ప్రాచీన కాలములో కొందరుండిరి. ఆత్రేయ, ఆశ్మరథ్య, కార్ష్ణాజిని, బాదరి, ఐతిశాయన, కాముకాయన, లాబుకాయన, ఆలేఖన, కాశకృత్స్న అను తొమ్మిదిమంది మీమాంసకులలో మొదటి ఎనిమిది మంది 'మీమాంసా సూత్ర' మందును, చివరివాడు పతంజలి 'మహాభాష్య' మందును పేర్కొనబడిరి. వీరి గ్రంథములు ఖిలములైనవి. జైమిని వ్రాసిన 'మీమాంసా సూత్రము' వీటన్నిటికంటె మిన్నగ నుండుట చేతనే అతి ప్రసిద్ధమై పరమ ప్రామాణికమైనది. ఇందు బౌద్ధవాదముల ఖండన యుండుటచేతను, న్యాయ యోగసూత్రములు జైమినికి పరిచితములైనట్లు కన్పడుటచేతను ఇది క్రీ.పూ. 4 వ శతాబ్దమునకు పూర్వపు గ్రంథముకాదు. దీనిపై శబరుడు (దాదాపు క్రీ. పూ. 1 వ శ.) భాష్యము వ్రాసెను. అంతకుముందు భర్తృమిత్ర, భవదాస, హరి, ఉపవర్షాదులు వ్రాసిన వృత్తులు, భాష్యములు నశించినవి. భవభూతి (620 - 680) కి గురువైన కుమారిలుడు సూత్ర భాష్యములపై 'శ్లోకవార్తిక', 'తంత్ర వార్తిక', 'టుప్‌టీక' లు అను మహాగ్రంథములను వ్రాసెను. అతని శిష్యుడు మండనమిశ్రుడు 'విధివివేకము', 'భావనావివేకము' మున్నగు గ్రంథములను వ్రాసెను. పార్థసారథి మిశ్రుడు (1300) కుమారిలుని గ్రంథములకు టీకలు, 'శాస్త్రదీపిక' అను మీమాంసపై స్వతంత్ర గ్రంథము వ్రాసెను. కుమారిలుని శిష్యుడని సంప్రదాయము చెప్పుచుండ, అతనికి పూర్వవర్తియని కొందరిచే భావింపబడు ప్రభాకరుడు శబర భాష్యముపై 'బృహతీ', 'లఘ్వీ' అను టీకలను రచించెను. శాలికనాథుడు (9 వ శ.) వీటిపై టీకలను, 'ప్రకరణ పంచిక' యను చక్కని ప్రకరణ గ్రంథమును వ్రాసెను. కుమారిలుడు 'భట్టు'డని, ప్రభాకరుడు 'గురు'వని గౌరవమందిరి. వీరిరువురును రెండు మీమాంసా సంప్రదాయములకు (భాట్టమతము, గురుమతము) ప్రవర్తకులైరి. దాదాపు 12 వ శతాబ్దమున మనిన మురారిమిశ్రుడు మరొక మీమాంసా సంప్రదాయమునకు దారి తీసెను. కాని ఇది అప్రసిద్ధము. ఆపదేవుని (17 వ శ.) 'మీమాంసాన్యాయ ప్రకాశము', దానిపై ఆధారపడిన లౌగాక్షి భాస్కరుని 'అర్థ సంగ్రహము' మీమాంసను బోధపరచు ప్రవేశ గ్రంథములు.

**మీమాంసా సిద్ధాంత సంగ్రహము:** చోదనల (ప్రేరణల, ఆజ్ఞలచే) లక్షితమగు అర్థము ధర్మము. వేదమందు గల క్రియా ప్రవర్తక* వాక్యములు చోదనలు. ఆమ్నాయపు ప్రయోజనము క్రియలయందు ప్రవర్తింపజేయుటయే. కాన 'ఇది చేయుము; అది చేయవలదు' అను విధాయకములగు వాక్యములే వేదమందలి ప్రధాన వాక్యములు; తక్కినవి వాటి శేషములు. వీటిలో మొదటి రకపువి 'విధులు', రెండవ రకపువి 'అర్థవాదములు'. విధేయ ప్రాశస్త్యమును గూర్చి విశ్వాసమును పుట్టించుచు విధి వాక్యములతో ఏక వాక్యతను కలిగి యుండుటచేతనే అర్థవాదములు ప్రమాణములు. లేనిచో కాదు.

ధాతువులకు 'లట్' మొదలైన లకారాలు చేర్చి వాటికి "తి-మస్ - అన్తి" మొదలైన ప్రత్యయాలు చేర్చగా క్రియాపదాలు ఏర్పడుతాయి. లకారాన్నీ అర్థభావనను బోధిస్తాయి. 'లిఙ్' 'లోట్' 'లేట్' అనే లకారాలు మాత్రం అర్థభావనతోపాటు శాబ్ద భావననుకూడా బోధిస్తాయి. లకారాల స్థానంలో చేర్చిన 'తి' మొదలైన 'తిఙ్' ప్రత్యయాలకు ఆఖ్యాతలని పేరు. అందుచేత ఆఖ్యాతలు అన్నీ భావనను బోధిస్తాయి. ఒక అర్థాన్ని-అనగా ప్రయోజనాన్ని - ఉద్దేశించి చేసే వ్యాపారానికి 'అర్థభావన' అనీ, అట్లు వ్యాపారంచేసేటట్లు ప్రేరేపించడానికి - ప్రేరణకు-'శాబ్దభావన' అనీ పేర్లు. "నువ్వు ఈ కార్యాన్ని చేసెయ్యి" అని దేవదత్తుడు యజ్ఞదత్తుణ్ణి ప్రేరేపించాడనుకుందాం. ఇక్కడ ఈ ప్రేరణ అనేది దేవదత్తునిలో ఉంది కాబట్టి అది పురుషనిష్ఠం. "యజేత స్వర్గకామః" ఇత్యాది వేదవాక్యాలు 'స్వర్గం

---

* ఏదో ఒక వ్యాపారమందు, పనియందు ప్రవర్తింపచేయునవి.

కావాలను కున్నవాడు యజ్ఞం చెయ్యాలి' అని ప్రేరే పిస్తున్నాయి. అయితే ఈ ప్రేరణ అపౌరుషేయమైన వేదశబ్దంలో ఉంది కాబట్టి దీనికి శాబ్దభావన అని పేరు వచ్చినది. "భవితుః భావనానుకూలో భావయితుర్వ్యాపారవిశేషః భావనా" అని భావనకు లక్షణం. పుట్టవలసినది పుట్టేటట్లుగా, పుట్టించేవాడుచేసే వ్యాపారం (పని) భావన అని దీని అర్థం. పైన ఉదాహరించిన వాక్యంలో యజ్ఞదత్తునితో కాష్ఠచ్ఛేదన ప్రవృత్తి కంగడానికి దేవదత్తుడు చేసిన ప్రేరణ కారణం కాబట్టి ఆ ప్రేరణ భావన అయినది. ఇది శాబ్దభావన. యజ్ఞదత్తుడుచేసే ఛేదన ప్రవృత్తి అర్థ భావన, బ్రద్దలగుట అనేది పుట్టడానికి యజ్ఞదత్తుడు చేసే వ్యాపారం కారణం కాబట్టి ఇదికూడా భావనయే. అర్థభావనలోను శాబ్దభావనలోను కూడా కిమ్, కేన, కథమ్ అనే మూడేసి అంశాలు ఉంటాయి. వీటికి వరసగా సాధ్య - సాధన - ఇతికర్తవ్యతా కాంక్షలని పేర్లు "కాష్ఠం ఛిన్ద్యాత్" 'కట్టె బ్రద్దలుకొట్టాలి' అనే వాక్యంలో ఆఖ్యాతం 'భావయేత్' అని చెపుతుంది. 'చెయ్యాలి' అని దాని అర్థం. 'కింభావయేత్' అనే సాధ్యాకాంక్ష కలుగుతుంది. దానికి సమాధానంగా "కాష్ఠచ్ఛేదం భావయేత్" (కాష్ఠచ్ఛేదనం చెయ్యాలి) అని సమాధానం వస్తుంది. 'కేనభావయేత్' (దేనితో చెయ్యాలి)అని కరణాన్ని గూర్చిన తరువాతి ప్రశ్న. "కుఠారేణ భావయేత్" అని కరణాకాంక్షకి సమాధానం. తరువాత "కథం భావయేత్" ఎట్లుచెయ్యాలి అని ప్రశ్నకలుగుతుంది. ఈ ప్రశ్నకు కథం భావాకాంక్ష అని ఇతికర్తవ్యతాకాంక్ష అనీ పేర్లు. "కుఠారమ్ ఉద్ధృత్యోద్ధృత్య పాతయిత్వా పాతయిత్వా భావయేత్" (గొడ్డలి ఎత్తి ఎత్తి, పడవేసి పడవేసి చేయవలెను) అని సమాధానం. ఈ లౌకికవాక్యంలో వలెనే 'యజేత స్వర్గకామః' అనే వైదిక వాక్యంలోకూడా అర్థభావనలో మూడు అంశాలు ఉంటాయి. కింభావయేత్? స్వర్గం భావయేత్ (దేన్ని పుట్టించాలి? స్వర్గం పుట్టించాలి) కేనభావయేత్? యాగేన భావయేత్? (దేని చేత పుట్టించాలి? యాగంచేత పుట్టించాలి). కథం భావయేత్? అగ్న్యన్వాధాన ప్రోక్షణ వహననాదిజన్యాదృష్టోపకారేణ యాగేన కుర్యాత్ (ఎట్లుచేయవలెను? అగ్న్యాధానము, ప్రోక్షణను దంచుట మొదలైన కర్మలవలన పుట్టిన అదృష్టముతో కూడిన యాగము చేత పుట్టించవలెను) అనేవి మూడు అంశాలు. ఈ విధి వాక్యాలలో ఉన్న విజాదులు శాబ్దభావనను బోధిస్తాయి. శాబ్దభావనలో కూడా సాధ్య - సాధన (కరణ) ఇతికర్తవ్యతా కాంక్షలు ఉంటాయి. 'కిం భావయేత్' అనే సాధ్యాకాంక్షకు సమాధానం- 'అర్థభావనయైన పురుష ప్రవృత్తిని పుట్టించాలి' అని సమాధానం. "కేన భావయేత్" అనే దానికి విజాదులను తెలుసుకోవడంచేత అని సమాధానం. "కథం భావయేత్" అనేదానికి విధి వాక్యాల పక్కనేవచ్చే అర్థవాదల ద్వారా ఆయా కర్మల ప్రాశస్త్యాన్ని తెలుపుతూ ప్రవర్తింప చెయ్యాలి అని సమాధానం. ఈ విధంగా వేదాలలోని విధి వాక్యాలన్ని భావనా బోధకాలై ఉంటాయి.

ఇతర ప్రమాణములచే గోచరింపని అర్థమును ప్రతిపాదించునది వేదము. అది మంత్ర బ్రాహ్మణాత్మకమగు శబ్దరాశి. వేద కర్మల అనుష్ఠాన కాలమందు వాటితో సంబంధించిన విషయములను జ్ఞాపకము చేయుటకై ఉపయోగించు వాక్యములు మంత్రములు. విధాయక వాక్యములు బ్రాహ్మణములు. వాటి శేషము అర్థవాదము అని చెప్పినాము. ఇష్ట సాధ్యమందు (ధర్మమందు) ప్రవర్తింపజేయుట, అనిష్టసాధనయందు (అధర్మమందు) ప్రవర్తింపకుండ చేయుటయే వేద ప్రయోజనము, ఇది విధి వాక్యముల ద్వారానే జరుగును. అట్టివి కాని వాక్యములు నిరర్థకములు భూతార్థములను గురించి వేదమేమియు చెప్పదు ఏలన అవి ప్రత్యక్షముచే తెలియనగును. మరొక ప్రమాణముచే వేద్యము లగు విషయములను ప్రతిపాదించిన వేదము స్వతంత్ర ప్రమాణము కాజాలదు. దాని అవసరమును ఉండదు. మానాంతరా గోచర విషయములను, పురుషార్థములను తెలియపరచి, అభ్యుదయ నిశ్శ్రేయసములకై ప్రేరేపించునదే శాస్త్రము. ధర్మము క్రియవలనే ఉత్పత్తియగును. క్రియ చికీర్ష (చేయవలయు నను

కోరిక)చే ఉత్పత్తి యగును. ఇవి ఇదివరకే ఉన్నట్టి వస్తువు కాదు. కాబట్టి ఇంద్రియ విషయము కాలేదు. దీనికి లింగము లేదు కాన అనుమానము కూడ నిరుపయోగము. పురుష బుద్ధులు అనేకములు, సాపేక్షములు (relatives) గాన అవి ధర్మమునకు ప్రమాణము కావు. సాధ్యమేది, దానికి సాధనమేది, దానిని సాధించుటకు మార్గమేది (దీనిని 'ఇతి కర్తవ్యత' అందురు) అదునదే శాస్త్ర విషయము. భూతార్థములను (సిద్ధ వస్తువులను) చెప్పుట దాని పని కాదు. ధర్మమును గూర్చి భూతార్థక వాక్యము లుండవు. వేదములందు గల భూతార్థక వాక్యములు అన్నియు అర్థ వాదములే. అవి క్రియా స్వరూపమును గూర్చియో, ఉపయోగింపవలసిన సాధనములను గూర్చియో ఆయా క్రియల కర్తను, దేవతలను చెప్పునవియై, ఆయా క్రియలను విధించు వాక్యములకు శేషములు. క్రియలకు సాధనలో, సాధ్యములో కానట్టి వస్తువులను గూర్చి వేదము చెప్పదు. ధర్మ సాధన చేయగోరు వానికి 'భూమిలో పంచ ఖండము లున్నవి', 'మాంధాత గొప్ప చక్రవర్తి' ఇటువంటి భూతార్థక వాక్యములలో ప్రయోజనము లేదు. అందుచే వేదమందు భూతార్థములను (సద్వస్తువులు - facts) గురించి గాని ఇదివరకు ఉండిన వ్యక్తులను, జరిగిన (ఐతిహాసిక) సంఘటనలను గురించి గాని సిద్ధార్థక వాక్యములు (existential propositions) లేవు*. అసలు వేదమందు వ్యక్తులను సూచించు నామవాచకములే లేవు. నిత్య పదార్థములను సూచించు శబ్దముల రాశియే అది.

ప్రమాణ మనునది అన్య ప్రమాణ నిరపేక్షముగ స్వతంత్రముగ నుండవలెను. శాస్త్ర మట్టిది. అది ప్రత్యక్ష అనుమానముల ననువదింపదు. అట్లుచేసినచో అది ప్రమాణము కాజాలదు. జ్ఞానము స్వతః ప్రమాణము. అది ప్రకాశము వంటిది. అది విషయములను తనను, తన ఆశ్రయమును కూడ ప్రకాశపరచును. అనగా ఒక జ్ఞానము తన జ్ఞానత్వమును తానే అభివ్యక్తముచేయును. మరొక జ్ఞానముచేకాని, ప్రవృత్తిచే గాని, దాని ప్రామాణ్యము నిరూపింపబడవలసిన అవసరములేదు. లేనిచో అనవస్థా దోషము కలుగును. కరణమందు (ఇంద్రియములందో, హేతువునందో) దోషమున్నప్పుడో, లేదా మరొక జ్ఞానముచే బాధింపబడినప్పుడో, లేదా అనుకూల పరిస్థితులు లేక సరిగా గ్రహింపబడక పోవుటచేతనో, స్వవచో వ్యాఘాత (self contradiction) ముండుట చేతనో, సందేహ మున్నప్పుడో, జ్ఞానముయొక్క అప్రామాణ్యము ప్రసక్త మగును. ఇది స్వతః ప్రామాణ్యావాదము, వేదవాక్యోత్థిత జ్ఞానము స్పష్టము, అసంశయము, అన్య ప్రమాణములచే అబాధితము. కాబట్టి అది స్వతః ప్రమాణము.

వేదములు అపౌరుషేయములు, అనగా అవి ఏ పురుషుని యొక్కయు బుద్ధిపై ఆధారపడిలేవు. వాటి అధ్యయనాధ్యాపన సంప్రదాయము అనాదిగ, అవిచ్ఛిన్నముగ వచ్చుచున్నది. అయినను వాటికొక కర్త ఉన్నట్లు ఎవరికిని గుర్తు (స్మరణము) లేదు. మన వంటి వారిచే అనుదినము ఉచ్చార్యమాణ మగుటచే అది పౌరుషేయ మనిన అనవచ్చును. కాని ప్రమాణాంతరముచే అర్థమును ఉపలబ్ధి చేసికొని దానిని ప్రకటము చేయుటకై రచింపబడినది అను అర్థములో అది పౌరుషేయము కాదు. ఏలన అట్టిచో అది స్వతంత్ర ప్రమాణము కాకుండ పోవును. కాక మానాంతరాగోచర అర్థప్రతిపాదన అసలు వేదలక్షణమై యుండ ఇటుల చెప్పుట స్వవచన వ్యాఘాతమగును. ప్రమాణాంతరము నాధారముగా గొనకయే మాలతీ మాధవాది గ్రంథములను వాటి కర్తలు రచించి

---

* ఉపనిషత్తులలోని వాక్యములు కూడ కొన్ని కర్తృ (ఆయా క్రియ లొనర్చువాని) స్వభావమును, కొన్ని ఆయా క్రియలకు సంబంధించిన దేవతా స్వభావమును ప్రకాశపరచునవి. కొన్ని ధ్యానాది క్రియలను విధించు వాక్యములు. స్వతంత్రములగు కేవల భూతార్థకము లగు బ్రహ్మ ప్రతిపాదక వాక్యములు వేదమందు లేవు. అని మీమాంసా మతము.

నట్లు రచించినారనుటకు వేదము కల్పితమగు కావ్య నాటకములవలె అప్రమాణమగును. స్వతః ప్రామాణ్యముగల జ్ఞానము నిచ్చు వేద మిట్టిది కాజాలదు. ఇదంతయు గాక, ఇంద్రియవిషయము కానట్టి, మార్పు లేక సనాతనమైనట్టి ధర్మమును శాసించు వేదము కూడ సనాతనము, అవ్యయము; పురుష బుద్ధిపై ఆధారపడియున్నట్టిది కాజాలదు.

వేదము సర్వజ్ఞుని రచనకాదు. సర్వజ్ఞు డెవడును ఇప్పుడు లేడు. కాబట్టి పూర్వమును ఉండ లేదు,ఉండజాలడు. సర్వజ్ఞు డైనను ప్రమాణముల ద్వారా జ్ఞానము పొందినవాడా కాడా? మొదటి పక్షమున వేదముకూడ ప్రమాణములందు అంతర్భూతము కాబట్టి ప్రత్యక్ష అనుమాన వేదాదుల జ్ఞానముచే ఎవడైన సర్వజ్ఞుడు కావచ్చును. అట్టివాడు వేదకర్త కాజాలడు కదా! ప్రమాణము ద్వారా తప్ప జ్ఞాన మజన్యము. ఏదో ఒక, లేదా కొన్ని ప్రమాణములద్వారా సర్వజ్ఞత్వము ప్రాప్తమగు ననుట 'కంటిచేతనే చూడ వచ్చును, తాకవచ్చును.' అనుటవలె నున్నది. ఇక యోగముచే సర్వజ్ఞత్వము రాదని మీమాంస అనును. ఇంద్రియములకు విషయము లగుటకు తగని వస్తువులు (ధర్మాదులు) మనకుగాని, యోగులకు గాని, మరెవరికిని గాని ప్రత్యక్షము కావు. యోగముచే దృష్ట్యతిశయము, మనకంటె చాలా హెచ్చగు జ్ఞానము వచ్చును (ఉదా. దూరసూక్ష్మాది వస్తువులు ప్రత్యక్ష మగును). కాని అతీంద్రియ విషయములు ప్రత్యక్ష మగు ననితలచుట 'శ్రోత్రముచే రూపము గ్రహింపవచ్చును' అనుటవలె నున్నది. 'సర్వజ్ఞుడు' ఒక అభూతకల్పన. ఈశ్వరుడును వేదకర్తకాడు. ఏలన 'లోకము నిత్యము. ఇప్పుడున్నట్లే ఎప్పుడును ఉన్నది. అది సృష్టింపబడినది' అనుకొనుటకు అవసరములేదు; ప్రమాణమును లేదు. ఎప్పటికిని ఇట్లే లోక ముండును. కాబట్టి సృష్టికర్త అసిద్ధుడు. ఇక కర్మ ఫలాదుల నిచ్చుటకు ఈశ్వరుడున్నాడని తలచుట అవసరము. కర్మవలన, అపూర్వము వలన ఫలములు నియమము తప్పక అవే ప్రాప్తమగును. ఒకవేళ ఈశ్వరు డున్నాడని అనుకొనినను, అతనికిని అతీంద్రియార్థ దర్శనము సంఘటింపదు; కాబట్టి ఇంద్రియాగోచర విషయములగు ధర్మాదులను చెప్పు వేదమాతని రచనకాదు. సర్వజ్ఞత్వమసంభవ మగుటచే ఈశ్వరుడున్నను సర్వజ్ఞుడు కాజాలడు. కాక, అశరీరియగు ఎవడును వర్ణోచ్చారణ చేయలేడు కదా! అట్టివాడు వేదము నెట్లు రచించును? వేదములో నెచ్చటను స్వకర్తృకతా ప్రతిపాదనలేదు. ఉన్నదనుకొనుటకు వేదము సరిగా అర్థము కాకపోవుటయే కారణము. మీమాంసోక్తన్యాయానుసారము శాస్త్రము నర్థము చేసికొనినచో ఇట్టి విపరీతార్థములు భాసింపవు.

శబ్దములు నిత్యములు, వేదము నిత్యము. దాని నిత్యత్వమును ఆదియు స్మృతులును చాటుచున్నవి. ఈ లోకము లేనట్టి, వేదము లేనట్టి కాలము అచింత్యము. శబ్దములు అనిత్యములైన వాటిని గురుతించుట (ప్రత్యభిజ్ఞ) ఉండదు. ఉచ్చారణచే నిత్యమగు శబ్దము అభివ్యక్తమగును; సృష్టింపబడదు. అందుచేతనే ఒకే శబ్దమును పలుమారులు ఉచ్చరించినట్లు ప్రతీతి కలుగుచున్నది. ఉదాహరణమునకు 'గ' అని పదిసారు లనినప్పుడు పది 'గ'కారములు ఉచ్చరించినట్లు ఎవరికిని తోచదు. 'గ' కారము పదిసారు లుచ్చరింపబడినట్లే తోచును. వర్ణాత్మకమగు శబ్దము నిత్యము శబ్దార్థముల సంబంధము ఔత్పత్తికము (స్వాభావికము); నిత్యము. శబ్దములు జాత్యాకృతుల అభిధాయకములు. అవి అన్ని వ్యక్తులకు పూర్వవర్తులు. కాన వేదశబ్దములనే వాచ్యములగు విషయములు లేనట్టి కాలము కూడ ఎన్నడును లేదు. వేదమందు వ్యక్తుల నామవాచకములు లేవు. కొన్ని శబ్దములు అటుల కనపడుట సరిగా అర్థము చేసికొనక పోవుటచే జరుగును.

రాగద్వేషాదులు గల పురుషులు చెప్పిన దానిలో దోషము లుండుట సంభవము. నిత్యము, అపౌరుషేయము అగు వేదము నిర్దోషము, పరమ ప్రమాణము. అన్యప్రమాణ సిద్ధ విషయములను గూర్చి అది అసలు చెప్పదు కాబట్టి, దానికిని, ఇతర ప్రమాణములకును ఎట్టి విసంవాదమును లేదు.

ఏ కర్మయైనను చేయగానే ఫలప్రాప్తి వెంటనే కాదు; కాలాంతరమున జరుగును. ప్రతి కర్మవలనను ఒక సూక్ష్మ శక్తి జనించును. దీని పేరు అపూర్వము. ఇది కర్మచే పుట్టు గుణ విశేషము. లేదా కర్మ యొక్క సూక్ష్మమగు ఉత్తరావస్థ; ఇదియే ఫలజనకము; లేదా ఫలమునకు పూర్వావస్థ. కర్మకు ముందు ఇది ఉండదు, శాస్త్రము, అర్థాపత్తి వలన ఇది రుజువు అగును. లేనిచో నేడు చేయబడిన కర్మలకు కాలాంతరమున ఫలప్రాప్తి ఎటుల అగును? కర్మలచే సంజనితమగు ఈ అపూర్వ మను శక్తి కర్తలో అతనికి ఫలప్రాప్తి కలుగునంతవరకు దాగియుండును. అనుకూల పరిస్థితులు, ఉచిత సమయము రాగానే దాని కారణమున కర్తకు ఫలప్రాప్తి ఈ జన్మముననో, పరలోకముననో, భావి జన్మలోనో కలుగును.

ఆత్మ కర్త, భోక్త. మానస ప్రత్యక్షముచే లేదా అహమ్ ప్రత్యయముచే అది తెలియబడును. ఆత్మలనేకములు. ఆత్మ చైతన్య విశిష్టము. కొన్ని పరిస్థితులలోనే అది చైతన్యము కలది. జ్ఞాన సుఖాది గుణములు దానికి కలుగుచుండును. శరీరేంద్రియ విషయములచే ఆత్మ బద్ధము. దీనిచే దానికి సుఖదుఃఖ రూపమగు అనుభవము కలుగుచున్నది. ఈ త్రివిధ బంధపు ఆత్యంతిక విలయమే మోక్షము. అప్పుడు ఆత్మకు ప్రపంచముతో సంబంధము విచ్ఛిన్నమగును. బంధము ధర్మాధర్మములచే కలుగును. అవి నిశ్శేషము కావలెను. వేద ప్రతిపాద్యము, ప్రయోజనవంతమునగు అర్థము ధర్మము అని చెప్పితిమి. తద్విరుద్ధము అధర్మము. ధర్మముచే ఐహిక పారలౌకిక సుఖమే ప్రాప్తము. ఐహిక పారలౌకిక సుఖములను కోరక, ఆత్మను గూర్చి తత్త్వజ్ఞానమును బడసి, కామ్య నిషిద్ధ కర్మలను మాని, నిత్య కర్మలను మాత్రము చేయుచు, సంయమ సంతోషములను అభ్యాసము చేయువాడు ప్రారబ్ధము ననుభవించుట సమాప్తము కాగానే మోక్షము పొందును. అనుభవముచే ధర్మాధర్మ ఫలము క్షయము కాగా, మృదిత కషాయుడు, నిష్కాముడు అగువానికి క్రియమాణ కర్మఫలము ప్రాప్తము కాదు. ప్రస్తుత శరీర నాశము, ఇంకొక శరీరముతో సంబంధము కలుగకుండుటయే మోక్షము *

జైమిని ఈశ్వరుని గూర్చి, అపూర్వమును గూర్చి ఏమియు చెప్పలేదు. శబరుడు హిమాలయాదులను, వేదమునకు కర్త ఉన్నట్లు ఎవరును స్మరింపరు అని జగత్కర్త అభావమును సూచించెను. జగత్కర్త కాని ఈశ్వరుడున్నాడా లేడా అని కాని, పరమాత్మను గూర్చి గాని ఆయన ఏమియు చెప్పలేదు. కుమారిలుడు 'సర్వజ్ఞుడు', 'జగత్కర్త' ఈ రెండు భావనలు అనావశ్యకములు, వితథములు" అని వానిని ఖండించినాడు. అయితే ఆయన 'శ్లోకవార్తికము' ను శివప్రార్థనతో ప్రారంభించినాడు. 'తంత్రవార్తికము'న పరమాత్మచే వేదశాస్త్ర మధిష్ఠిత మనినాడు. ఆయన అపహతపాప్మ మగు ఆత్మధ్యానము మోక్షమునకు సాధనమని చెప్పు వాక్యములు గౌణముగ అర్థము చేసికొన కూడదని, ఆత్మజ్ఞానము పరమాత్మజ్ఞాన హేతువని కూడ చెప్పినాడు. అయితే అంతకు పూర్వము లోకాయతీకృతమగు మీమాంసను తానాస్తిక పథము లోనికి తెచ్చితి నని కుమారిలుడు చెప్పి యుండుటచే ఆయనకు ముందుండిన మీమాంస నిరీశ్వరమైయుండును. ప్రభాకరుడు ఈశ్వరానుమానమును ఖండింప లేదు. సుష్ఠుగా అనుష్ఠింపబడిన కర్మయే పరమార్థమనుకొనువారికి మీమాంస యనియు, అట్టి వారికి బుద్ధి భేదము కలిగింపరాదనియు, శుద్ధులై, వీతరాగద్వేషులై, నిష్కాములైన వారికి పూర్వమీమాంస చెప్పగల దేమియు లేదనియు ప్రభాకరుడు 'బృహతి' యందు చెప్పినాడు. మోక్షమునిచ్చు ఆత్మజ్ఞానము వేదాంత నిషేవణముచే దృఢమగునని కుమారిలుడు 'శ్లోకవార్తికము'న వక్కాణించెను.

శాలికనాథ నందీశ్వరాది మీమాంసకులు మీమాంస ఈశ్వర నిరాసము చేయలేదని, ఈశ్వరుడు

---

* పై చర్చలయందంతటను కుమారిల ప్రభాకరులలో కొన్ని చోట్ల ఒకరిని, మరికొన్ని చోట్ల ఇంకొకరిని ఆశ్రయించినాము.

అనుమానముచే గమ్యుడుకాడని మాత్రమే మీమాంసా మతమని చెప్పిరి. స్వతఃప్రామాణ్యము గల నిత్య శాస్త్రమున్నదని స్థాపించుచు తొందరపాటుచే, పరమత ద్వేషముచే ఈశ్వరాస్తిత్వమును మీమాంసకులు కాదని రని శాలికానాథుని అభిప్రాయము. పరమకారుణికు డగు ఈశ్వరుడున్నాడని, ఈశ్వరార్పణ బుద్ధితో చేయు కర్మలు నిశ్శ్రేయస హేతువులని నారాయణ భట్టు, ఆపదేవుడు, లౌగాక్షి భాస్కరుడు వచించిరి.

# వేదాంత దర్శనము

ఉపనిషత్తులు వేదాంతము పేరిట మాన్యములై కాలక్రమమున ఎంతోమంది దార్శనికులకు ఉప జీవ్యము లైనవి. వీరు ఔపనిషదులని, వేదాంతులని పిలువబడుచున్నారు. "శాస్త్రము - ఉపనిషత్తులు - బ్రహ్మమునకు ప్రమాణములు. బ్రహ్మము జగత్కారణము. బ్రహ్మజ్ఞానము మోక్షమునకు మార్గము" అనునవి వీరందరు అంగీకరించు సాధారణ సిద్ధాంతములు. బ్రహ్మము నిమిత్తోపాదాన కారణమా? నిమిత్త కారణము మాత్రమేనా? బ్రహ్మము సగుణమా? నిర్గుణమా? బ్రహ్మ-జగత్తుకు, జీవ-బ్రహ్మలకు సంబంధ మెట్టిది? మోక్షసాధన మగు జ్ఞానము కేవలమా? లేదా కర్మతో సముచ్చితమా? లేదా భక్తి రూపాపన్నమా? మోక్షమున జీవుని ఉనికి ఎట్టిది? అను విషయములపై వేదాంతులలో ఐకమత్యము లేదు. ఉదాహరణమునకు, ఔడులోమి యను వేదాంతి జీవబ్రహ్మలకు సంసార దశలో భేద మున్నదని, ముక్తావస్థలో అభేదమని, చైతన్యము ఆత్మ స్వరూపమని, ముక్తిలో కేవలము చైతన్యమాత్రముగా ఆత్మయుండునని, సర్వజ్ఞత్వాదులుండవని తలచెను. కాశకృత్స్నుడుపూర్తిగ జీవబ్రహ్మాద్వైతవాది. అశ్మరథ్యుడిట్లుగాక విజ్ఞానాత్మ పరమాత్మలలో భేదాభేద సంబంధమున్నదనియు, పరమేశ్వరుడనంతు డయ్యు ఉపాసకుని అనుగ్రహించుటకు ప్రాదేశమాత్ర స్థానమందు అవిర్భూతుడగు ననియు తలచెను. జీవులు బ్రహ్మము నుండి ఉత్పన్నులై అందు లయమగుదు రని కూడ అయన తలచినట్లు తోచును. ఈ వాదమునే రామానుజుల గురువగు యాదవ ప్రకాశుడు తదుపరి అభివృద్ధి చేసినాడని 'శ్రుత ప్రకాశిక'లో సుదర్శన సూరి అనినాడు. బాదరి పరమేశ్వరుడు మహాన్ అయ్యు ప్రాదేశమాత్ర మగు హృదయముచే స్మరణ యోగ్యుడని, గతిశ్రుతి బలముచే సగుణబ్రహ్మ ప్రాప్తియే కలుగునని అమానవ పురుషులే బ్రహ్మప్రాప్తిని కలిగింప గలిగెదరని, ముక్త పురుషులు నిరింద్రియులు, శరీర రహితులు అని, వైదిక కర్మయందు అందరికిని అధికారము కల దని బోధించియుండెను. కార్ష్ణాజిని చాలా వరకు బాదరి కున్నటువంటి అభిప్రాయములే కలిగియుండెనని తోచును. జైమిని[1] ముక్తులు బ్రహ్మస్వరూపమును పొందెదరని, నిష్పాపులై సర్వజ్ఞత్వ ఐశ్వర్యాదులను పొందెద రని తలచెను. ఇంకెందరో వేదాంతులు ఉండినట్లు పురాణాదులలో కనబడును. ఉదాహరణమునకు శాండిల్య భక్తి సూత్రమందు కాశ్యపుడను భేదవాది యగు అచార్యుడు పేర్కొనబడినాడు. తెలినదేమన - పెక్కు వేదాంత రాద్ధాంతము లుండెడివని.

ఉపనిషద్వాక్యము లన్నిటిని సమన్వయ చేసి, అవి బ్రహ్మ ప్రతిపాదకము లని, వాటి ఆధారముచే నిర్మింప వీలగు దర్శనము అత్యంత సుసంగతము అని, అన్యదర్శనములలోవలె దోషములు కలది కాదని చూప ప్రయత్నించుచు, శ్రుతి తర్కముల సహాయముతో ఒక మహాదర్శన నిర్మాణమును చేసిన లోకోత్తర పురుషుడు బాదరాయణుడు. ఈయన వ్రాసిన గ్రంథము 'బ్రహ్మసూత్ర' మని, 'వేదాంత

1. ఇతడు మీమాంసా సూత్రము వ్రాసిన జైమినియో వేరొకడో తెలియదు. ఈ జైమిని మతము బ్రహ్మసూత్రములందు ఉల్లిఖితము.

సూత్ర' మని, 'శారీరిక మీమాంసా సూత్ర'[1] మని, 'ఉత్తర మీమాంసా సూత్ర' (మీమాంస తరువాతది) మని అనబడును. బాదరాయణుడు వ్యాసమహర్షియే యని సంప్రదాయవాదు లందురు. పాణిని చెప్పిన పారాశర్య 'భిక్షు సూత్రము' బ్రహ్మసూత్రమే అని కొందరి ఊహ. వ్యాసుడు పరాశరుని కుమారుడు గావున, శంకర రామానుజ మధ్వాచార్యులు బ్రహ్మ సూత్రము మూడుచోట్ల భగవద్గీతను నిర్దేశించిన దని భాష్యములలో చూపిరి. మనుస్మృతిని కూడ ప్రమాణ ముగ బ్రహ్మసూత్రము లిచ్చినట్లు భాష్యకారులు చెప్పిరి. కాన క్రీ. పూ. 500-200 మధ్య ఇది వ్రాయ బడి యుండవచ్చునని కొందరి ఊహ. తన బ్రహ్మ సూత్ర టీకా ఉపోద్ఘాతమున డా. రాధాకృష్ణన్ దీని కాలము క్రీ.పూ. 2 వ శతాబ్ద మనినారు.

బ్రహ్మసూత్రముల సంఖ్యను గూర్చియు, వాటి భావమును గూర్చియు కూడ వీటిపై భాష్య ములు వ్రాసిన వారిలో ఐకమత్యము లేదు. శంక రుని ప్రకారము సూత్రసంఖ్య 555; రామా నుజుల ప్రకారము 545; మధ్వాచార్యుల ప్రకా రము 562. బ్రహ్మసూత్ర తాత్పర్యము ఎవరికి వారు 'నేనే గ్రహించితి' నని వాదించి, పరస్పర ఖండనలు తీవ్రముగా చేసికొనిరి. వారి అనుచరులును ఈ భావ సంగ్రామమందు పాల్గొని విస్తార సాహిత్య మును సృష్టి చేసినారు. విమర్శాత్మకముగ తమతమ సంప్రదాయాభిమానము వదలి బాదరాయణుని అభిప్రాయమేమియని ఆలోచింప వీరు సమకట్టినట్లు కన్పడదు. అట్టి ప్రయత్నము మొదట జేసినవాడు 'తీబో'. ఇతడు బ్రహ్మసూత్రముపై గల శంకర రామానుజ భాష్యముల నాంగ్లీకరించిన విద్వాంసుడు. భాష్యముల రెండిని, సూత్రములను తులనాత్మకముగ వివేచన చేసి బ్రహ్మసూత్రముల తాత్పర్యమునకు రామానుజ భాష్యమే ఎక్కువ అనుకూలముగా నున్న దని ఇతడు నిర్ణయించెను.

డా. రాధాకృష్ణన్ బ్రహ్మ సూత్రములను భాష్యకర్తల దృష్టిచే గాక స్వతంత్రముగ అవగా హన చేసికొన యత్నించిన ప్రథమ భారతీయ విద్వాం సుడు. ఆయన చెప్పినదిది : "బ్రహ్మ జగత్తులు మృద్, ఘటముల వలె అనన్యములు. కాని బాదరాయణునికి అనన్య మనగా భేదాభావము కాని, పరిణామ రాహి త్యము కాని కాదు. ఛాందోగ్య ఉపనిషత్తు లోని మృత్తిక, సువర్ణము, లోహము, వాని నుండి వచ్చిన వికారముల ఉదాహరణ నిచ్చును.[2] బ్రహ్మము జగత్తునకు ఉపాదాన కారణమనియు, జగత్తు బ్రహ్మమునుండి నిజముగా ఉత్పన్నమై అందే ఉనికి కలిగి లయమగు సత్పదార్థ మనియు, ఉష్ణత అగ్నికి వలె సృష్టించు శక్తి శుద్ధమగు బ్రహ్మమునకు కలద నియు సూత్రములు చెప్పియుండుటచే బాదరాయ ణుని దృష్టిలో బ్రహ్మము జగత్తుగా పరిణమించినది. అది మిథ్యగాని స్వప్న సదృశము గాని కాదు. బాద రాయణుని ప్రకారము జీవుడు కర్త, భోక్త, అణు పరిమాణుడు; బ్రహ్మమున కీ గుణములు లేవు. బ్రహ్మము జీవునియందున్నాడు. జీవుడు బ్రహ్మాం శము, లేదా ఆభాసము" అని రాధాకృష్ణన్ వ్రాసి రి. 'సర్పము దాని చుట్టల నుండి భిన్నము, అభిన్నము కూడా అయినట్లు జీవుడు బ్రహ్మము నుండి భిన్నుడు, అభిన్నుడు కూడ' నను వాదము బ్రహ్మ సూత్రము లలో ఖండింపబడినదనియు, జీవబ్రహ్మ భేదము ఆత్యంతికము (ultimate), ముక్తియందు కూడ జీవబ్రహ్మల భేదము ఉండుననియు బాదరాయణుని మతమనుటకు బలమైన ఆధారమున్న దనియు-రాధా కృష్ణన్ చెప్పిరి. అయితే ఈ చివరి విషయమై బాద రాయణుడు స్పష్టముగా చెప్పలేదని కూడా వ్రాసిరి[3].

1. శారీరకుని-శరీరమందున్న వానిని గూర్చిన విచారణ.

2. రజ్జు సర్ప, శుక్తి రజతముల ఉదాహరణ ములు శ్రుతిలోగాని, సూత్రమునగాని లేవు అని డా. రాధాకృష్ణన్ చెప్పిరి.

3. ఇండియన్ ఫిలాసఫీ, II (1941) పుటలు 433-442

భాష్యములను తులనాత్మకముగ అధ్యయనము చేసి, బ్రహ్మ సూత్రముల భావ నిశ్చయము చేయుటకు డా. ఘాటే అను నాతడు కూడ ప్రయత్నించి నాడు. "బ్రహ్మ సూత్రములలో బ్రహ్మ విభువు; ఆత్మ అణువు. జీవుడు చైతన్యరూపుడు; జ్ఞాన మాతని విశేషణము. బ్రహ్మజగత్తునకు ఉపాదాన్ నిమిత్త కారణము. పరిణామవాదము బాదరాయణునికి సమ్మత మగునట్లు కన్పడును." అని ఘాటే సిద్ధాంతము[1].

మహాపండితుడగు రాహుల్ సాంకృత్యాయన్ బాదరాయణుని భావము లీ క్రింది రీతిగా వర్ణించినాడు: జగత్తు బ్రహ్మకు శరీరము. అందుచే బ్రహ్మ శారీరకుడు. జీవునియందు ఉండియు బ్రహ్మము జీవుడు కాదు. జీవ జగత్తులు బ్రహ్మకు అనన్యులు - ఆత్మ శరీరములు అనన్యమైనట్లు. బ్రహ్మ జీవజగత్తుల కంతర్యామి. 'జగత్తు మాయ, కాల్పనికము' అను సిద్ధాంత గ్రంథము కూడ బ్రహ్మ సూత్రములందు లేదు. జీవుడణుమాత్రుడు. పరమాత్మయే విభువు. గంధము పృథ్వీగుణమైనట్లు జ్ఞాన మాత్మగుణము. జ్ఞానమాత్మకు సారభూతగుణమగుటచే ఆత్మ అచ్చటచ్చట జ్ఞానమనియో, విజ్ఞానమనియో చెప్పబడినది. ఆత్మ కర్త, భోక్త. జీవుడు బ్రహ్మము యొక్క అంశము. అయినను జీవబ్రహ్మలు ఒకటి కాదు. బ్రహ్మము జీవునికంటె అధికుడు. ముక్తావస్థలో కూడా భోగసామ్యమున్నదిగాని, జీవునికి జగత్కర్తృత్వ ముండదు. ఇవి బాదరాయణుని అభిప్రాయములని రాహుల్ మతము[2]. రామానుజ మతమే బాదరాయణ సిద్ధాంతాలకు ఎక్కువ సమీపముగా ఉన్నదని ఆయన తలచెను. బాదరాయణుడు బాదరి కొడుకని కూడ ఆయన అభిప్రాయము.

ఇక బ్రహ్మ సూత్రముల సిద్ధాంతములలో కొన్నిటిని సంగ్రహింతము: వేదము నిత్యమగు శాస్త్రము. అదియొక్కటియే బ్రహ్మవిషయమున ప్రమాణము. తర్కమునకు ప్రతిష్ఠ (నిలుకడ) లేదు. ప్రత్యక్షానుమానముల ద్వారా జ్ఞానము కలుగును. (ప్రత్యక్షమనగా శ్రుతి, అనుమాన మనగా స్మృతులు అని బాదరాయణుని మత మని భాష్యకారులందురు.) సంరాధన (ధ్యానము, సమాధి) మందు బ్రహ్మమును సాక్షాత్కారము చేయవచ్చును. వేదమునకు కారణము బ్రహ్మమే. శాస్త్రము బ్రహ్మమునకు ప్రమాణ మని ఉపనిషత్తుల సమన్వయము వలన తెలియును. (చూ. షడ్విధ తాత్పర్య లింగములు)

బాదరాయణుడు వర్ణాశ్రమ ధర్మమును సర్వతోముఖముగ నంగీకరించెను, ఆహార విషయమున నియమములు ఉండవలెను. జాత్యాది భేదము లేకుండ ఎవ్వరి అన్నమునైన ఎవరైనను తినరాదు. ప్రాణములు పోవు సంకట సమయమందు మాత్రము అటుల తినవచ్చును. జ్ఞానులకు కూడ ఈ భక్ష్యాభక్ష్య విచారము వర్తించును. ఆశ్రమ కర్మలు బ్రహ్మవిద్యా సాధనములు; అనగా విద్యకు అవి సహకారులు. అయితే విధురత్వాదుల (భార్యా వియోగాదుల) చే ఆశ్రమ రహితుడగు వాడు కూడ దేవతారాధనోపవాసాది కర్మలు చేయు నధికారము కలవాడే గాన వాడును బ్రహ్మవిద్య కధికారియే (ద్విజులకు మాత్రమే ఆశ్రమాధికారము కలదు). ఉత్తమాశ్రమములను ఆరోహ క్రమమును (బ్రహ్మచర్యమునుండి గార్హస్థ్యము, తదుపరి వానప్రస్థము, తదుపరి సన్న్యాసము, లేదా రాగాదులు లేనిచో బ్రహ్మచర్యము నుండియే సన్న్యాసము) స్వీకరింపవచ్చును గాని, అవరోహ క్రమమున (పైదానికి విరుద్ధ క్రమమున) ఆశ్రమచ్యుతి అధర్మము. అట్టి భ్రష్టునికి బ్రహ్మవిద్యాధికార ముండదు. ప్రమాదమున కలిగిన భ్రంశము మాత్రము ప్రాయశ్చిత్తముచే పోవును. (సన్న్యాసము శ్రుతిచే నంగీకరింపబడిన ఆశ్రమ మని బ్రహ్మసూత్రము లనుచున్నవి). అయితే ఆశ్రమ భ్రష్టులతో, మండలము (కులము) నుండి వినిస్సృతులతో ప్రాయశ్చిత్తానంతరం కూడా వ్యవహారము తగదు. వారితో కలసి బ్రహ్మమును గూర్చిన శ్రవణా

1. దీ వేదాంత, పుట. 169-184,
2. దర్శన్ దిగ్దర్శన్, పు. 664-679.

దులు కూడదు. శూద్రులకు బ్రహ్మవిద్యయందు అధికారము లేదు. ఏలన వారికి అర్థిత్వము (కోరిక) ఉండినను, సామర్థ్యముండదు. వేదాధ్యయనము చేసి వేదార్థము నెరుగుట వారికి అసంభవము-ఉపనయనము లేనివారు వేదాధ్యయనము చేయరాదు గాన. ఇది లేనిదే బ్రహ్మవిద్య చేకూరదు. 'కర్మలయందు వలెనే బ్రహ్మవిద్యయందు కూడ శూద్రుల కధికారము లేదు.' అని శ్రుతి స్మృతుల శాసనము. వారు వేదముల వినరాదు, చదువరాదు, అర్థభావన చేయరాదు (ఉపనిషత్తులలోని జానశ్రుతి, జాబాలి కూడ శూద్రులు కారు). ఇది బాదరాయణుని మతము[1]. పూర్వజన్మ సుకృతముచే, స్మృత్యాదుల శ్రవణముచే విదుర, ధర్మవ్యాధులకు వలె సూద్రుని కెవనికైన జ్ఞానోదయమై బ్రహ్మనిష్ఠ దొరకవచ్చునని శంకరులు, తదనుయాయులు ఒప్పుకొనిరి[2]. అద్వైతవాదులు, జగన్మిథ్యాత్వవాదులు శూద్రులకు బ్రహ్మవిద్యాధికారము లేదనుట యుక్తియుక్తము కాదని, అద్వైత జ్ఞానము తర్క ప్రత్యక్షములతో కలిగిన కలుగునేమో కాని, వేదాంత వాక్యముల ద్వారా మాత్రమే లబ్ధమగు ఉపాసనా రూపమగు జ్ఞానమే మోక్ష సాధన మని చెప్పు తన వాదము ప్రకారము ఉపనయన రహితు లగుటచే స్వాధ్యాయము చేయలేని పశు సమానులగు శూద్రులకు బ్రహ్మ జ్ఞానాధికారము లేదని సిద్ధమగుచున్నదని రామానుజులు వ్రాసిరి. "విశ్వమంతయు, జీవులన్నియు బ్రహ్మ శరీరమే. జగత్తంతయు బ్రహ్మ పరిణామమే అను విశిష్టాద్వైతము ఇట్లు శూద్రుల అనధికారమును స్థాపింపగలదా?" యని శంకరుని గూర్చి అయన అనినట్లే రామానుజులను గూర్చి ఎవరైన అనవచ్చును.[3]

బ్రహ్మము నుండియే జగత్తుయొక్క జన్మ స్థితిలయములు కలుగుచున్నవి. బ్రహ్మమునుండియే ఈ వైవిధ్య మంతయు వచ్చుచున్నది - ఒక భూమి నుండియే రాళ్ళు, మణులు జనించునట్లు. బ్రహ్మము సాధనాపేక్ష లేకయే జగత్కారణము. బ్రహ్మమునందు సర్వధర్మముల ఉపపత్తి కలదు. అది అన్నిటియందును కలదు. బ్రహ్మము శుద్ధత్వ సర్వజ్ఞత్వ సత్యసంకల్పాది సర్వగుణోపేతము. అదియే పురుషునిలోనున్న జ్యోతి. సమస్త పృథ్వికంటెను గొప్ప

---

1. గార్హస్థ్య మొక్కటే విధింపబడిన ఆశ్రమమని జైమినియు, వైదిక కర్మమందు జ్ఞానమందు అందరికి అధికారము కలదని బాదరియు బాదరాయణునికి విరుద్ధమగు మతములు కలిగియుండిరి. ప్రాచీన వేదాంతులలో ఈ విషయమై ఐకమత్యము లేదు. శూద్రుల అనధికారమును గూర్చి బాదరాయణుని మత మిదియే యనుటలో భాష్యకారులందరికి ఐకమత్యము ఉన్నది. మాధ్వ మతమున స్త్రీలకు కూడ వైదికకర్మ జ్ఞానములలో అధికారము లేదు.

2. ఈ రీతిగ బాదరాయణునికంటె శంకరులు చాల ఉదారుడు (liberal). అన్నమయ దేహములలోగాని, ఆత్మయందు గాని భేదము ఉండజాలదు గాన ద్విజ-శ్వపచాది భేదము మిథ్యాగ్రహము. అస్పృశ్యతాదులు బ్రహ్మవిదులచే 'అసమర్థనీయములు' అను సిద్ధాంతము శంకరులకు మాన్యమైనట్లు, "బ్రహ్మజ్ఞాని చండాలుడైనను ద్విజుడైనను నాకు గురువే" అని ఆయన చెప్పినట్లు జీవిత చరిత్రలో కలదు.

3. రామానుజులు పూజార్హులుగ ఎంచిన ఆళ్వారులలో శూద్రులు చండాలురు ఉండిరి. కాంచీపూర్ణుడను శూద్రుడు ఆయనకు గురువు, మిత్రుడు. స్నానానంతరము ఆయన ప్రతిదినము తన మిత్రుడగు నాక పంచముని కుటీరమున కాలము గడుపువాడు. అన్ని వర్ణముల భక్తులకు తన ఇంట సగౌరవముగ ఆతిథ్య మిచ్చెడువాడు. దీనిని గూర్చి ఆయన భార్యకు కష్టముగ నుండెడిది. ఒక గోపురమెక్కి ఆయన సర్వ వర్ణములవారికి అష్టాక్షరీ మంత్రమును చాటెను. సర్వసమత్వ మాచరణగా గల ఈయన భాష్యములో ఇటుల వ్రాయుటకు కారణము తనకు వర్ణాశ్రమ ధర్మము అంగీకారమని ఘోషించుటకై యుండును. పాంచరాత్రము, వైష్ణవము వేద విరుద్ధమనువారల నుద్దేశించి ఈ వ్రాతకావచ్చును.

(జ్యాయాన్) దగు బ్రహ్మము అంతర్హృదయమందు వడ్లగింజకంటె చిన్నదిగా నున్నది. బ్రహ్మనిష్ఠచే మోక్షము వచ్చును. ఆకాశాది సమస్త భూతములు బ్రహ్మముచే సృష్టింపబడినవే. చుట్టబడిన గుడ్డయే పరువబడినట్లు బ్రహ్మకు, జగత్తునకు అనన్యత్వము కలదు. ప్రాణమును (ఊపిరిని) బిగపట్టిన, అది ఏ ఇతర కార్యమును చేయలేక కేవలము జీవము నొసగు కార్యమును మాత్రమే చేయును. లేనిచో అవయవ ముల చావుట, ముడుచుట మొదలగు అన్ని పనులు చేయును. నిరోధింప బడినప్పుడును, లోనికి బయటికి వచ్చుచున్నప్పుడును కూడ ప్రాణము ప్రాణమే! అట్లే జగత్తుగా నున్నప్పుడు, సృష్టికి పూర్వముకూడ బ్రహ్మము బ్రహ్మమే! మహారాజాదులు విలాసము కొరకు చాల పనులు చేయునట్లే, మనుష్యులు ఉచ్ఛ్వాస నిశ్వాసములను స్వాభావికముగ చేసినట్లే బ్రహ్మము లీలగా జగత్తును సృష్టించినది. బ్రహ్మము జీవుల పుణ్యపాపముల నపేక్షించియే సృష్ట్యాదులను చేసి, జీవులందు భేదములను ఏర్పరచి, వారికి కర్మాను సారము ఫలములను అనాదిగ నిచ్చుచు వచ్చుచున్నది. బ్రహ్మము తనను తానే ప్రపంచముగ పరిణమింప చేసికొనెను. కాని బ్రహ్మమంతయు ప్రపంచముగ కాదు (కృత్స్న ప్రసక్తి లేదు). నిరవయవమయ్యు బ్రహ్మము కొంత భాగము మాత్రమే ప్రపంచముగా నగును. దీనికి శ్రుతి ప్రమాణము.

జీవుడు 'జ్ఞుడు' (చేతనుడు, చైతన్యము కల వాడు), నిత్యుడు, బ్రహ్మాంశము. జీవులు కర్మలకు కర్తలు, భోక్తలు. ఇది వారికి దేహ సంబంధముచే సాధ్యపడు చున్నది. దేహాధిష్ఠితు డగు జీవునికే విధి నిషేధములు చెప్పబడినవి. జీవుని కంటె బ్రహ్మము అధికము (గొప్పది-transcendent). శరీరమును వదలిన జీవుడు సూక్ష్మభూతములతో (లింగ శరీర ముతో) పోయి, పరలోకమున చేసిన కర్మల ఫల మనుభవించి, మిగిలిన కర్మతో తిరిగివచ్చి జన్మిం చును. బ్రహ్మజ్ఞానము ముక్తి సాధనము. జ్ఞానముచే ఇంతవరకు ప్రారబ్ధము కాని, చేయనున్నట్టి చేసినట్టి కర్మల ఫలము వినష్టమగును. ప్రారబ్ధము అనుభ వించిన పిమ్మట ముక్తి కలుగును. ముక్తి యనగా బ్రహ్మమును పొందుట; స్వస్వరూపమున నిలచుట. ముక్తులకు శరీరముండదు, కాని సంకల్పించినంతనే వచ్చును. బ్రహ్మము వలెనే ముక్తుడును సంకల్ప మాత్రముచే అన్ని భోగముల ననుభవించును. కాని బ్రహ్మమువలె సృష్టికర్త మాత్రము కాలేడు.[1] ఇది యంతయు మనకు ఉపనిషద్వాక్యముల సమన్వయము వలననే తెలియును. ప్రత్యక్షానుమానములచే తెలియ రాదు. అయితే, ఔపనిషద సిద్ధాంతములకు విరుద్ధ ములగు సాంఖ్య బౌద్ధాది సిద్ధాంతములను తర్కముతో ఖండించుటకు వీలగును. ఉపనిషత్సిద్ధాంతముల సుసంగతత్వము కూడ నిరూపింప వీలగును.

బ్రహ్మసూత్రములపై ఉపవర్షుడు, బోధాయ నుడు[2] వృత్తులను వ్రాసిరి. సుందరపాండ్యుడు[3] ఒక వార్తికమును వ్రాసెను. ఇది మనకు శంకర రామానుజుల భాష్యముల వలన, వాని టీకల వలన తెలియును. వీరుగాక భర్తృప్రపంచు[4] డను వేదాం తిని సురేశ్వరానంద గిరులు, బ్రహ్మనంది పేరును మధుసూదన సరస్వతి, భర్తృమిత్ర భర్తృహరులను యామునాచార్యుడు, బ్రహ్మదత్తుని[5] యాముని వేదాంత

---

1. జీవేశ్వర భేదము, బ్రహ్మాధిక్యము, బ్రహ్మ యొక్క సగుణత్వము, బ్రహ్మయొక్క సృష్టికర్తృ త్వము, మోక్షమందు జీవునికి జగద్వ్యాపారము లేకుండుట-ఇదంతయు వ్యావహారిక దృష్టి నాశ్ర యించియే బాదరాయణుడు చెప్పెనని; బ్రహ్మ నిర్గు ణత్వము, జీవబ్రహ్మల నిత్య అభేదము, జగన్మిథ్యా త్వము - ఇది పారమార్థికమని బాదరాయణుని మతమని శంకరుల సిద్ధాంతము.

2. బోధాయనుడు, ఉపవర్షుడు ఒక్కరేనని వేదాంత దేశికుల తత్త్వటీక యందు కలదు.

3. ఇతడు శైవుడని చెప్పుదురు.

4. శంకరుల సూత్రభాష్యమున (2.1.14) ఇతని మతము పేర్కొనబడినదందురు; "ఏకత్వం నానాత్వం చోభయమపి సత్యమేవ." "యథావృక్ష ఇత్యేకత్వం శాఖా ఇతినానాత్వం"

5. ఇతని మతము సురేశ్వరుడు నైష్కర్మ్య సిద్ధిలో ఉద్ధృతము చేసెనని ఒక టీక చెప్పినది.

దేశికులు వేదాంతులనుగా పేర్కొనిరి. రామానుజులు 'వేదార్థ సంగ్రహము'న భారుచి, టంక, బోధాయన, గుహదేవ, కపర్ది, ద్రమి(విః) డాచార్యులను వేదాంతులను సగౌరవముగ పేర్కొనెను. వీరు విశిష్టాద్వైతులై యుందురు. మాండూక్య, బృహదారణ్యక, ఛాందోగ్య భాష్యములలో ఆగమవేత్తయని, సంప్రదాయవిదుడని ఒక ద్రమిడాచార్యుని శంకరులు పేర్కొనిరి. ఇతడు రామానుజులు పేర్కొనిన ద్రమిడాచార్యుడు కావచ్చును; కాకపోవచ్చును. ఒకడే అయిన బాదరాయణుని విషయములోవలె ఇతడు అద్వైతియా, విశిష్టాద్వైతియా అని వివాదముండి యుండును. వీరందరు శంకరునికి పూర్వులు. అందరు ప్రస్థానత్రయములో కనీస మొక దానిపై నైనను వ్యాఖ్యానములు వ్రాసియుందురు. వీరిలో భర్తృప్రపంచుడు భేదాభేదవాది; జ్ఞానకర్మ సముచ్చయవాది. బోధాయనునిది ఒక విధమగు విశిష్టాద్వైతము. ఈయన వృత్తి రామానుజుల కుపజీవ్య మందురు. బ్రహ్మనందియు, టంకుడు ఒకడేనని విశిష్టాద్వైతు లందురు. మధుసూదనుని టీక చూడ బ్రహ్మనంది అద్వైతియని తోచును. "బ్రహ్మయే నిత్యము. జీవు డనిత్యుడు. జగత్తువలెనే బ్రహ్మము నుండి పుట్టినాడు. జీవుడు వస్తుతః బ్రహ్మభిన్నుడుకాడు. వేదాంత వాక్యములపై ఆధారపడిన ఉపాసనచే అజ్ఞానము నిశ్శేష మగును. జీవన్ముక్తి లేదు. మోక్షమదృష్ట ఫలము" అని యొక విధమగు అద్వైతమును, జ్ఞాన కర్మ సముచ్చయమును, ధ్యానయోగమును బ్రహ్మదత్తుడు ప్రవచించెను. సుందర పాండ్యుడు అద్వైతి. తక్కిన వారి మతములను గూర్చి నిశ్చయముగా ఏమియు తెలియరాదు. ఎందుచేతనో ఈ ప్రాచీన వేదాంతుల రచనలన్నియు నష్టమైనవి. వీనిలోని కొన్ని కొన్ని వాక్యములు మాత్రమే కొన్ని భాష్యముల లోను, టీకలలోను ఉద్ధృతములై నేడు ఉపలబ్ధమగుచున్నవి. వీరందరు సరిగా ఏ కాలమున మనిరో కూడ తెలియదు. బాదరాయణుని తరువాత శంకరునికి ముందు వీ రందరు విలసించియుందు రనునదే తెలియును.

బాదరాయణుని సూత్రములు ఉపనిషత్తుల ఏకమాత్ర ప్రామాణిక సువ్యవస్థిత సమన్వయముగా ప్రతిష్ఠ నార్జించుకొనగానే అవియు, ఉపనిషత్తులు, భగవద్గీత కలసి 'ప్రస్థానత్రయ' మను పేరొంది, వేదాంత దర్శనమునకు ఆధారమైనవి. వీటికి అనుకూలముగా ప్రపంచితమైన దర్శనము వేదాంత దర్శనముగా వాసికెక్కెను. తమకు నచ్చిన నానావిధ వాదములకు ఇవి ఆధారములని చూపుటకు ఎందరెందరో ఆచార్యులు ప్రయత్నించిరి. అందు ఎంతో ఒకింత సఫలత నొందిన వారందరు వేర్వేరు వేదాంత సంప్రదాయ ప్రవర్తకులైరి. కొందరు తమ కిష్టము లగు సంప్రదాయములు వీటి కనుకూలముగ నున్నవని చూపుటకు వీటిలో ఏదో ఒకదానిపై భాష్యములనో, టీకలనో వ్రాసి నిరూపింప యత్నించిరి. సూత్ర భాష్యకారులగు శంకర, రామానుజ, మధ్వ, నింబార్క, వల్లభులు వేర్వేరు మతస్థాపకులైరి. భాస్కర, విజ్ఞాన భిక్షువులు భాష్య రచనలు చేసిరి. కాని అవి సంప్రదాయములకు దారితీయలేదు. శ్రీకంఠ, శ్రీపతులు తమ తమ శైవ సంప్రదాయములకు, బలదేవుడు చైతన్య సంప్రదాయమునకు అనుకూలముగ సూత్రములపై భాష్యములు వ్రాసిరి. అన్నిటికంటె అధునాతన వ్యాఖ్యానము ఇటీవల ప్రచురింపబడిన డా. రాధాకృష్ణన్ ఆంగ్లమున వ్రాసినది. వీటిలోని భావములను ముందు వివరించెదము. శ్రీకంఠుడు శివ విశిష్టాద్వైతుడు, శ్రీపతిది వీరశైవాద్వైతము, బలదేవునిది అచింత్య భేదాభేదము.

# వేదాంత ప్రస్థానములు

## అద్వైతము

**శంకరులకు పూర్వము అద్వైతము:** వేదోపనిషత్తులందు విశ్వముయొక్క మూలతత్త్వ మొకటే నను భావము చాలచోట్ల కలదు. అట్లే బ్రహ్మసూత్రములందు, భగవద్గీతయందు కూడ ఇది వ్యక్తము. ఆ మూలతత్త్వము చైతన్య మని, లేదా విజ్ఞాన మని, కాబట్టి యావద్విశ్వము దానితో అనన్య మని చెప్పిన అద్వైతమగును. చూడబడు నానాత్వము ఆ ఏకము నుండి ఎట్లు వచ్చినది? జీవుడును చేతనుడే కదా, అయినచో అతనికిని, మూల చైతన్యమునకును కల సంబంధమేమి? అను ప్రశ్నలకు అద్వైత దర్శనము సమాధానము చెప్పవలసి యున్నది. విజ్ఞానవాద, శూన్యవాద బౌద్ధులు అద్వైతులని చూపియున్నాము. అయితే బౌద్ధుల విజ్ఞానము ఏకము కాదు; క్షణికము, భేదోపలక్షణమును. తదతిరిక్తమగు అన్యపదార్థము లేదు, కాన దాని అద్వైతము ఉపపన్నము. అట్లే బౌద్ధుల శూన్య మేకమాత్ర మగు తత్త్వము, అందుచే దాని అద్వైతము సిద్ధము. ఈ శూన్యము కోటిచతుష్టయవినిర్ముక్తము, సత్తుకాదు. బౌద్ధులు, సర్వము అనిర్వచనీయమని అందురు. బుద్ధిచే వివిచ్యమానము లగు పదార్థము లన్నియు నిరభిలాప్యములు, నిఃస్వభావములు కాబట్టి. ఔపనిషదద్వైతమందు బ్రహ్మము ఏకము, అద్వితీయము; అది విజ్ఞానమును, ఆనందమును. అది నిర్వికారము, సజాతీయ విజాతీయ, స్వగత భేద రహితము. బ్రహ్మము సత్తు, పారమార్థికము. అయితే బౌద్ధులు అనుమానముచే తమ వాదములను నిరూపించిరి; వేదాంతులు ఉపనిషత్తులపై ఆధారపడి తమ అద్వైతమును స్థాపించిరి. స్కాంద పురాణాంతర్గత మగు 'సూత సంహిత' యొకటి కలదు. ఇది శివాద్వైతవాద సంప్రదాయ గ్రంథము.[1] దిఙ్నాగుని కన్న కూడ ప్రాచీనుడుగా కన్పట్టు సమంతభద్రుడను జైనుని 'ఆప్తమీమాంస'లో అద్వైతమతము ఉల్లేఖింపబడినది. సమస్తము నిత్యమగు విజ్ఞాన పరిణామము లేదా వివర్తము, అను ఉపనిషత్తుల నాధారము చేసికొనిన అద్వైతులను శాంతరక్షిత, కమలశీలులను (8వ శ.) బౌద్ధ పండితులు తమ 'తత్త్వ సంగ్రహము'లోను దాని 'పఞ్జిక'లోను పేర్కొనిరి. భవభూతియు బ్రహ్మవివర్తవాదము నెరుగును. బాదరాయణునికి పూర్వమున, పరమునకూడ అద్వైతులు కలరని క్రిందట చూపినాము.[2]

**గౌడపాదుడు :** 550 ప్రాంతమున నున్న గౌడపాదుడు[3] గొప్ప అద్వైతవాది. ఆయన నర్మదా తీరవాసి యని, ఆయన శిష్యుడు గోవిందుడు శంకరుల గురు వనియు తప్ప మరేమియు ఆయనను గూర్చి తెలియదు. గౌడపాదుని పుస్తకము 'మాండూక్య కారిక' అనియు, 'ఆగమశాస్త్ర' మనియు అనబడును. అందు మొదటి అధ్యాయము మాండుక్యోపనిషత్తును వివరించును, తక్కిన మూటిలో ఆయన దర్శనమును

---

1. దీనిపై విజయనగర రాజగు మొదటి హరిహరుని తమ్ముడగు మారప్పకు మంత్రియగు మాధవుడను నాతడు 'తాత్పర్య దీపిక' యను వ్యాఖ్యను వ్రాసెను.

2. 'యోగవాశిష్ఠము' శంకరునికన్న పూర్వపు దైనదో కాదో నిర్ణయము సర్వసమ్మతముగ జరుగలేదు. ఇందులోను అద్వైతవాద (దృష్టి, సృష్టివాద) ప్రతిపాదన కలదు.

3. హుఅన్‌చ్వాంగ్‌కు పూర్వుడగు భావవివేకుని 'తర్కజ్వాల'లో గౌడపాదుని కారికలు ఉద్ధృతములు.

విపులీకరించెను. మాండుక్యోపనిషత్తనుకోబడునది కూడ ఆయనే వ్రాసెనని కొందరు. కారికలలో మొదటి అధ్యాయము అని చెప్పబడునది ఆయన వ్రాతకాదు, అది అంతయు ఉపనిషత్తేనని కొందరు అందురు. కొంద రిది యొక బౌద్ధ గ్రంథ మనిరి.

గౌడపాదుడు ఉపనిషత్తుల ప్రామాణ్యమును నమ్మినవాడు; కాని బౌద్ధ సిద్ధాంతములు ఆయన బుద్ధికి ప్రతిపన్నములుగా కన్పడినవి. విజ్ఞానవాద, శూన్యవాదములు అకుంఠిత తర్క విజృంభణములైన, వాటిని త్రోసివేయరాదు; వేదాంతి ఎవడును ఉపనిషత్తులకు విరుద్ధమగు సిద్ధాంతముల నంగీకరింపలేడు. కాన కారికలలో గౌడపాదుడు ఉపనిషదనుయాయులు తర్క సహాయముతో వేదాంత వాక్యముల ననుసంధానముచేసి వాటినుండి చేసిన నిగమనములు, బౌద్ధ దార్శనికుల సిద్ధాంతములను బాధింపవని చూప ప్రయత్నించెను. సత్యము సత్యమును బాధింపదని ఆయన విశ్వాసము. ఐతరేయ, తైత్తిరీయ, బృహదారణ్యకముల ఆధారముపై ఆత్మ-(విజ్ఞాన) మొక్కటే సత్తు అనియు, అదియే తన మాయచే భేదములను కల్పించుకొని తానే ఎరుగుచున్నది అనియు గౌడపాదుని సిద్ధాంతము. స్వప్నము, మాయ చూడబడినట్లు, గంధర్వనగరము ఎరుగబడినట్లు, వేదాంతముచే ఈ విశ్వమును చూడబడినది. స్వప్న పదార్థముల అభావమును శ్రుతి చెప్పినది. నానాత్వము ఇక్కడ కొంచెము కూడలేదు, ఒకటియే మాయచే అనేకముగా నైనది; అజాయమానమగు నదియే (పుట్టనిదే) మాయచే అనేకముగా జాయమానమగు చున్నది (పుట్టుచున్నది), అని శాస్త్రము చెప్పినది. ఇది యంతయు ఎందునుండియు రాలేదు, (మార్పు) అయినది ఏమియు లేదు, అని ఇట్లు సంభవము (అగుట, మార్పు కార్యవర్గము) శ్రుతిచే ప్రతిషేధింపబడినది. 'ఇదికాదు, ఇదికాదు' అని అగ్రాహ్యమగుటచే ఆత్మయందు సర్వ భావములను నిషేధించి, దాని అజత్వమును (పుట్టుక లేని తనమును) శ్రుతి ప్రకాశపరచినది. సత్తు నిజముగా పుట్టదు, మాయచేతనే అది పుట్టును. వంధ్యాపుత్రుని వలె అసత్తు ఏట్లును పుట్టదు. స్వప్నమందు మనస్సొకటే ద్వయము (రెండు)గా అభాసించినట్లు, జాగ్రదవస్థయందును అదియే ద్వయము (గ్రాహ్య గ్రాహక రూపము)గా భాసించును. కాబట్టి జీవుడను వాడెవడును పుట్టలేదు, బంధమందును ఎవడును లేడు (దీని నజాతవాద మందురు). సాధనాలేదు, ముక్తీ లేదు. జీవ-ఆత్మల అనన్యత్వము ప్రశంసింపబడి నానాత్వము ఉపనిషత్తులచే నిందింపబడినది. వేదపారగులు వీతరాగ భయక్రోధులు నగు మునులచే ప్రపంచోపశమము[1], అద్వయము, నిర్వికల్పమునగు ఆత్మ చూపబడినది. ద్విపదాంవరుడగు బుద్ధుడు[2], బౌద్ధ అద్వయవాదులు ఈ అజాతి వాదమునే ఖ్యాపించిరి; కాన వారితో వేదాంతులమగు మాకు అవివాదము, అని గౌడపాదుడు చెప్పినాడు. ఎన్నో బౌద్ధ గ్రంథములనుండి యథాతథముగ వాక్యములను, భావము లను ఉద్ధృతము చేయుచు, గౌడపాదుడు కారికల నాల్గవ ప్రకరణములో ఔపనిషద సమ్మతమగు అజాతి వాదమునే బౌద్ధులును చెప్పిరని చూపినాడు. నిశ్చితము, యుక్తియుక్తము అగునదియే, శ్రుతి తాత్పర్యమగునుగాన, ''అభేదము'', "అజాతి"యే పరమార్థమని శ్రుతి నిశ్చయము; మృద్, లోహ, విస్ఫులింగాది దృష్టాంతములచే సృష్టి జరిగి దని చెప్పు ఉపనిషద్వాక్యములు అద్వైతవాదమందు బుద్ధిని ప్రవేశింపచేయుటకే చెప్పబడినవి - అని గౌడపాదుని సిద్ధాంతము.

ఇట్లు బౌద్ధ గ్రంథములలో నున్న రజ్జు-సర్ప, స్వప్న మాయా, ఘటాకాశ, గంధర్వనగరాది ఉదాహరణములను తెచ్చి జీవజగత్తులు అసలు పుట్టలేదు, విశ్వము గంధర్వ నగరోపమము, మాయావిలసితము, గ్రాహ్య గ్రాహకముల ఆభాసము విజ్ఞాన స్పందనము, అని మాయావాదమును మొదటగా పరిగ్రహించిన వేదాంతి గౌడపాదుడు బౌద్ధ గ్రంథముల

1. ప్రపంచమనగా ద్వైతభావ విస్తారము; ఉపశమ మన దాని అభావము.

2. ద్విపద్వరుడు మనుష్యశ్రేష్ఠుడు. సంస్కృత పాలీ గ్రంథములందు బుద్ధునే ఇట్లు పిలిచిరి.

లోని పారమార్థిక, సంవృతి సత్యద్వయ కల్పనను గ్రహించి, పరమార్థముగా ఆత్మయే కలదు జగత్తు లేదు, అనియే ఉపనిషత్సిద్ధాంత మనియు; సృష్టి జరిగినట్లు, జగత్తున్నట్లు చెప్పు ఉపనిషద్వాక్యములు అద్వైతమును గ్రహించలేని మంద మధ్యమ దృష్టులగు వారికే కాని, ఉత్కృష్ట దృష్టిగలవారికి కావు అనియు అతడు మొదటగా సిద్ధాంతీకరించెను. "అదృష్టమవ్యవహార్యమగ్రాహ్యమలక్షణమ చింత్యమవ్యపదేశ్య" మగునది ఆత్మయని, అది "ప్రపంచోపశమము, శాంతము, శివము, అద్వైతము" అని మాండూక్యోపనిషత్తు చెప్పిన దానికి శూన్యవాదమందు చెప్పబడిన పరమార్థ తత్త్వమునకు గల అభిన్నతమును చూచి బౌద్ధ వేదాంతముల సమన్వయమునకై యత్నించిన గౌడపాదుడు, క్షణిక అక్షణిక వాదములలోగల అసంగతత్వమును అంతగా దృష్టిలో నుంచుకొనలేదు.[3]

**మండనమిశ్రుడు :** శంకరులచే ఓడింపబడి, సన్న్యాసియై, సురేశ్వరుడని ప్రసిద్ధి నొందినవాడు మండన మిశ్రుడని సంప్రదాయము. మండన మిశ్రుని "బ్రహ్మ సిద్ధి" యను గ్రంథమును, శంకర భాష్యములను సురేశ్వరుని "నైష్కర్మ్యసిద్ధి" మొదలగు గ్రంథములను పరిశోధించి, మండన మిశ్రుడు శంకరుని కంటె ముందే ఉండిన వాడు (సమకాలికుడు కావచ్చును), అద్వైతియని ఆధునికులు కొందరు నిశ్చయించిరి. మండన మిశ్రుని ప్రకారము నామ రూపాత్మక ప్రపంచము కేవలము భ్రమకాదు, స్వప్న దృష్టాంతముచే దీనిని బోధపరచుకోరాదు. నామరూపముల భేదము కలదు, కాని అది నిరపేక్షము కాదు, మూల సత్యము కాదు. జీవుల అనేకత్వమున్నది. కాని అది అవిద్యాకృతము కాన సత్యము కాదు. నామరూపముల జీవుల వ్యావహారిక సత్త కలదు. అవిద్య అనేకము; నామరూపముల విభిన్నత, ప్రత్యేక పురుషుల పృథక్త్వము దీనిని సిద్ధము చేయుచున్నది. అవిద్య యొక దోషము, కాన దీని ఆశ్రయము అపూర్ణమగు జీవుడే. అవిద్యా పరిణామియగు జీవుడెట్లు అవిద్యాశ్రయుడయ్యె ననిన, అదియే మాయ. బుద్ధికి సంగతమగునది అవిద్య కాలేదు; బుద్ధికి విభ్రమ కల్పించునది కాబట్టియే అది అవిద్య. అసంగతత్వమే (contradication, incoherence) అవిద్య స్వరూపము. జీవు లనాది, అందుచే అవిద్య ముందా, జీవులు ముందా అను ప్రశ్నరాదు. బ్రహ్మము (పూర్ణత్వము) అవిద్యకు అనుష్ఠానము కాదు. మన అపూర్ణత్వజ్ఞానము మన పూర్ణత్వమును సూచించును; కాని ప్రతివాడును తన పూర్ణత్వమును గురించి అనభిజ్ఞుడే; అందుకే దానినన్వేషించును అవిద్యా నిరాకరణమే ముక్తి జ్ఞానమే, ఆత్మయే ముక్తి. ముక్తి చిదానందప్రాప్తి, అభావాత్మకము కాదు. జ్ఞానమే దాని సాధనము. నిష్కామకర్మచే చిత్తము శుద్ధమై, ఏకాగ్రము కాగా, అది ఉపనిషత్సత్యమును ప్రసంఖ్యానము (చింతన, ధ్యానము) చేయగలదు. అప్పుడు బ్రహ్మానుభవప్రాప్తి అగును. శబ్దజ్ఞానము పరోక్షము, వాక్యార్థ ప్రసంఖ్యానజన్యజ్ఞానము అపరోక్షము. బ్రహ్మను గూర్చిన ఇట్టి జ్ఞానము కలుగగానే ముక్తి కలుగును. ముక్తియనగా సమస్త కర్మక్షయము, ప్రస్తుత శరీరకారణమగు ప్రారబ్ధము నశించుట కూడ. జీవన్ముక్తి ఉండదు. ఇది మండనమిశ్రుని అద్వైతపు దిఙ్మాత్ర స్వరూపము.

**శబ్దాద్వైతవాదము :** వైయాకరణుల శబ్దాద్వైతవాద మొకటి ప్రాచీన కాలమునుండి వచ్చుచున్నది. దీనినే స్ఫోటవాదము, ప్రణవవాదము అందురు. "వాచైవ విశ్వం బహురూపం నిబద్ధం, తదేతదేకం"; "వాగేవ విశ్వ భువనాని జజ్ఞే, వాచ ఇత్సర్వం;" ఇత్యాది వేదవాక్యమును ఒక్క వాక్కు నుండే విశ్వమంతయు ఏర్పడినదని చెప్పినవి. ఉపనిషత్తులలో ఓంకారరూపమగు శబ్దమునుండి జగదభివ్యక్తి జరిగినదని కలదు. పాణినికి ఈ వాదము సమ్మతమందురు. వ్యాడి వ్రాసిన "సంగ్రహ"మను వ్యాకరణ గ్రంథమున (ఇది ఇప్పుడు లేదు), తదుపరి

---

3. మహామహోపాధ్యాయ విధుశేఖర భట్టాచార్యునిచే సంపాదితమగు "గౌడపాదుని ఆగమశాస్త్ర" భూమిక అద్వైత వేదాంత - బౌద్ధముల పరస్పర సంబంధమును కరతలామలకము చేసినది.

కాత్యాయన, పతంజలులు తమ గ్రంథములందు శబ్దాద్వైతమును వివరించిరి. "వాక్యపదీయ"మున భర్తృహరి (450-510) దీనిని విస్తారముగ ప్రతిపాదించెను. పక్షభేదమున అవిద్యయో, లేదా బ్రహ్మమో "స్ఫుటత్యర్థోఽస్మాత్" (దీనినుండి అర్థము స్ఫురించును) అను వ్యుత్పత్తిచే స్ఫోటము పరతత్త్వమను భర్తృహరి అద్వైతియే అని "శబ్దకౌస్తుభము"లో కలదు (స్ఫుటించుటనగా బయటపడుట, వ్యాపించుట, బద్ధలగుట.) అందుచేతనే శబ్దాద్వైతులకు నిరవయవ నిత్య శబ్దము-స్ఫోటము-బ్రహ్మము, చైతన్యరూపము, అక్షరము, అఖండము, అద్వయము. అందు గ్రాహ్య గ్రాహక, వాచ్యవాచక భేదము లేదు. జగత్తు దాని పరిణామము; అవిద్యచే అదియే నానార్థకములుగా వివర్తించుచున్నది.[1] తన "స్ఫోటవాద"మను గ్రంథమున మండనమిశ్రుడు ఈ వాదము నంగీకరించెను. స్ఫోటవాదము నంగీకరించలేదు గాని, నిత్యములగు శబ్దములనుండి జగత్తు పుట్టినదని శంకరులు చెప్పిరి. నిత్యములగు వైదిక శబ్దములు సృష్టికి ముందు స్రష్టయగు ప్రజాపతి మనస్సులో ప్రాదుర్భవించెను. వాటినుండి వాటి అనుగతములగు అర్థములను సృష్టించెను. ఇట్లు "శబ్ద ప్రభవత్వము" జగత్తునకు కలదని ఆయన అభిప్రాయము.[2]

**శంకరులు :** విశ్వమందు పుట్టిన మహాప్రతిభావంతులలో నొకరు శంకరాచార్యులు. ఏ దృష్టితో చూచినను ఈయన మహాపురుషుడు. ఈయన దిఙ్నాగ, ధర్మకీర్తి, గుణమతి[3] కుమారిలులకు పరవర్తి. ఏలన వారి గ్రంథముల నుండి ఉద్ధరణలనో లేదా వారి వాదముల ఖండననో తన భాష్యమున చేసెను. శంకర భాష్యముపై వార్తికము వ్రాసిన సురేశ్వరుని వచనములు 751-743 లో ఆచార్య పదవిలో నుండిన విద్యానందనుడను జైనుడు తన గ్రంథములో ఉదాహరించెను. 841 లో నుండి ఆయన భాష్యముపై వ్యాఖ్య వ్రాసిన వాచస్పతి నాటికి శంకరుల ప్రామాణ్యము ప్రతిష్ఠిత మాయెను; అంతకు ముందుండిన శంకరుల శిష్యుడు, వ్యాఖ్యాత అగు పద్మపాదుని మతమును, శంకరుని విమర్శించిన భాస్కరాచార్యుని వాచస్పతి ఖండించెను. శృంగేరీ మఠ పరంపర ప్రకారము శంకరులు 684 లో జన్మించి, 716 లో గతించిరని తెలియుచున్నది. దీనికి పై విషయములతో వైరుధ్యము లేదు. కాని కృష్ణ బ్రహ్మానందుని 'శంకర విజయము', నీలకంఠభట్టు వ్రాసిన 'శంకరమందార సౌరభము' ఇత్యాది గ్రంథముల ఆధారముపైన, 877-886 లో రాజ్యము చేసిన ఇంద్రవర్మ గురువగు శివసోముడు 'భగవచ్ఛంకరు'ని సాక్షాచ్ఛిష్యుడని కాంబోడియాలోని ఒక శిలాలేఖనమున ఉండుటచేత శంకరులు 788 లో జన్మించి 820 లో గమించిరని కొందరు విద్వాంసులందురు. 'శంకర పద్ధతి' యను ప్రాచీన గ్రంథము ప్రకారము శంకరులు 720 లో దేహమును వదలెను అని యున్నది. కేరళ దేశమందు 'కాలటీ' గ్రామమున నంబూద్రి బ్రాహ్మణ కుటుంబమున ఈయన జన్మించెను.[4] ఈయన తండ్రి 'శివగురువు', తల్లి 'సతి'. శంకరులు వారి తపఃఫలమని ఆయన జీవిత కథలు చెప్పును. శంకరులకు 5 వ ఏట, ఉపనయనము కాక

---

1. వివర్త, పరిణామములు శాంతిరక్షితాది బౌద్ధులకు, భవభూతి భర్తృహర్యాదులకు పర్యాయ పదములు.

2. శబ్దనిత్యత్వము, జగత్ప్రభవత్వము - ఇదంతయు వ్యవహార దృష్టి ననుసరించియే.

3. అభిధర్మకోశ వ్యాఖ్యాత (630-40 ప్రాంతము).

4. చిదంబరమున పుట్టెనని ఆనందగిరి 'శంకర విజయము'న వ్రాసెను. ఇతరులు దీనిని ఒప్పలేదు. ఆనందగిరి శంకరుల దండ్రులపేర్లు కూడ వేరుగా ఇచ్చెను. శంకరు లొక దరిద్ర విధవకు పుట్టెనను 'మణిమంజరి' యను మాధ్వగ్రంథ కథనము అసత్యము. ఆయన ఒక దైత్యుని అవతారము అని కూడ ఆ గ్రంథ ప్రలాపము. గౌతమబుద్ధుడు జగద్వంచనార్థము పుట్టిన యవతారమని కొన్ని పురాణముల పలుకులు ఉన్నవికదా! మతాగ్రహము ఇట్లు విజృంభించినది!

ముందే తండ్రి మరణించెను. 3 వ ఏడు వచ్చువరకు శంకరులకు మలయాళమే వచ్చెను. 5 వ ఏట నుండి 7 వ ఏడు వరకు విద్యాభ్యాసము చేసి దానిని పూర్తి చేసెను. కొన్నాళ్ళు శాస్త్రములను బోధించెను. 8 వ ఏట ఎట్లో తల్లి నొప్పించి సన్న్యసించెను. నర్మదా తీరమున ఓంకారనాదమున గోవిందునివద్ద దాదాపు మూడేండ్లు వేదాంతాధ్యయనము, అద్వైతసాధన చేసెను. తన గురువగు గౌడపాదుని మతానుసారముగ వేదాంతమును గోవిందుడు శంకరునికి బోధించెను. తదుపరి కాశీవెళ్ళి, అక్కడ కొంతకాలము వేదాంత అధ్యాపనము చేసి, తదుపరి బదరికాశ్రమము వెళ్ళెను. ఆ కాలమందే ప్రస్థానత్రయ భాష్య రచన కాశీలోనో, బదరీ కేదారములందో పూర్తి ఆయెను. తదుపరి భారతమంతయు తిరిగితిరిగి శాస్త్రార్థముచేసి బౌద్ధులను మీమాంసకులను, కాపాలికాదులను ఓడించెను; కొందరు రాజులను వైదిక మతానుయాయులుగా చేసెను అని ఐతిహ్యము. శృంగేర్యాది గొప్ప మఠములను, దేశపు నాల్గువైపుల స్థాపించెను. కేరళమునుండి కాశ్మీర నేపాలముల వరకు, ద్వారకనుండి కామరూపము (అస్సాం)వరకు ఆయన విజయము చేసెను. ఆయన 32 వ ఏట దేహత్యాగము చేసెనని సర్వసమ్మతము. కొందరిది కైలాస పర్వతమున, కొందరు కేరళమందలి త్రిచూరునందు, కొందరు కంచియందు జరిగెనని వ్రాసిరి.[1] "ఎనిమిదవ ఏట చతుర్వేది, పన్నెండేండ్లకు సర్వశాస్త్రవేత్త, 16 వ యేట భాష్యము వ్రాసెను. 32 వ యేట చనిపోయెను." —అనునది జీవిత చరిత్ర లన్నిటిలో కలదు.

శంకరులు ప్రస్థానత్రయముపై భాష్యములు వ్రాసెను. ప్రసన్న గంభీరమగు సూత్రభాష్య శైలి శంకరులదిగా నిశ్చయించి, దాని భావములకు అనుకూలమైనవి, దాని స్థాయికి తగ్గనివే శంకరుల కృతులై యుండు నని నిశ్చయించిన, దశోపనిషద్భాష్యములు, గీతాభాష్యము మాత్రమే సూత్రభాష్యకారుని వని కొందరు పండితులు తీర్మానించిరి. వీరి మతములో కేనోపనిషద్వాక్య భాష్యము కూడ ఆయనదికాదు; మాండూక్య భాష్యము ఆయనదా యని సందేహము. అపరోక్షానుభూతి, పంచీకరణము, ఉపదేశసాహస్రి, ప్రబోధ సుధాకరము, వివేక చూడామణి, శతశ్లోకి అను ప్రకరణ గ్రంథములు ఆయనవి కావచ్చును. భజగోవిందాది స్తోత్రములు కొన్ని ఆయనవి; శివానంద సౌందర్య లహరీద్వయము ఇత్యాదులు వివాదగ్రస్తములు.

గౌడపాదుడు ఔపనిషదద్వైతమును బౌద్ధదార్శనిక భావములతో సమ్మిశ్రిత మొనర్చెను. గౌడపాదుడు శంకరుల పరమగురువు; ఆయనను 'వేదాంత సంప్రదాయవిదు'నిగా, 'ఆచార్యుని'గా సూత్రభాష్యమున శంకరులు పేర్కొనినారు. కాబట్టి శంకరులపై బౌద్ధ దర్శన ప్రభావమున్నచో ఆశ్చర్యము లేదు. దీని నాధారముగా గొని కొన్ని పురాణములు, ఇతర వేదాంతులు ఆయనను 'అసచ్ఛాస్త్రమును', 'ప్రచ్ఛన్న బౌద్ధము'ను బోధించువానినిగా, అవైదికునిగా నిందించిరి. ఇది అయుక్తము. కొన్ని ఉపనిషద్వాక్యములు నిస్సందేహముగా అద్వైతమును బోధించును; కాగా ఔపనిషదద్వైతము బౌద్ధ అద్వయవాదమునకు భిన్నమని ఈ వరకే చూపినాము. తన పూర్వుల వేదాంతిక అద్వైతమును, శబ్దాద్వైతాది వాదములను శంకరులు అధ్యయనమును చేసియే యుండును. 'సూత సంహిత'ను 18 మారులు (లేదా 18 విధములుగ) ఆలోచించి శంకరులు సూత్రభాష్యము రచించెనని ఒక ఐతిహ్యమున్నది. మలబారులో నాటి కాలమునకే వలస వచ్చిన మహమ్మదీయులు తెచ్చిన ఏకేశ్వర వాదము-ఒకే పవిత్ర గ్రంథము ఆదరణీయము అను భావము, పరమత అసహిష్ణత - కూడ శంకరులపై ప్రభావము చూపెనని ఇటీవలి కొందరి ఐతిహాసికుల ఊహ. ఆయన అనేక దర్శనములను, మతములను

---

1. టిబెట్టులో నొక లామాతో శాస్త్రార్థమున ఓడి తన ప్రతిజ్ఞానుసారము ఆయన తప్తతైలమునపడి దేహ విసర్జన చేసికొనెననియు, లామాలు తాంత్రిక ప్రయోగముచేసి ఆయనను చంపిరనియు కింవదంతులు నేపాల్,టిబెట్‌లలో కలవు. ఇవి అవిశ్వాసనీయములు.

ఎరిగియుండెను. వాటి వాటిలోని కొన్ని భావములచే ఆయన ప్రభావితుడు; కాని ఆయన స్వప్రతిభచే కొన్ని ఉపనిషద్వాక్యములపై ఆధారపడి ఒక గొప్ప దర్శన వ్యవస్థా నిర్మాణము చేసిన మహామనీషి, గొప్ప తత్త్వ దర్శి అని మా మతము.

శంకరుని సూత్రభాష్యము ప్రామాణికముగ, శాస్త్రీయ రీతిని, చక్కని తెలుగులో వివరించబడి యున్నది.[1] "వివేక చూడామణి" ఇత్యాది లఘు గ్రంథములు ఆంధ్రీకృతములు. గీతా భాష్యమును తెలుగులోనికి సంక్షిప్తముగా చాలామంది కొనివచ్చిరి. ఈ గ్రంథములో అన్యత్ర శాంకరాద్వైతమును బాగుగా వివరించిరి (చూ. అద్వైతము - శంకరాద్వైతము). అందుచే అతి సంగ్రహముగ దాని అంశములను కొన్నిటి నిక్కడ తడివెదము.

ఉపనిషద్వాక్యములు మాత్రమే బ్రహ్మ విషయమున ప్రమాణములు.[2] తజ్జన్యమగు అనుభవమును ప్రమాణమే; తదనుకూల తర్కమును ప్రమాణమే. కాని ఈ రెండును శ్రుత్యాశ్రితములు. నిర్గుణము, సచ్చిదానందము అగు బ్రహ్మమొకటే పరమార్థముగ సత్యము. బ్రహ్మాత్మైక్యమును ఉపనిషన్మహా వాక్యములు బోధించును. ప్రత్యక్షము దీనికి విరుద్ధము కాదు. బ్రహ్మాత్మలు ప్రత్యక్షమునకు అవిషయములు కాన. జీవు డల్పజ్ఞుడు, దుఃఖి, కర్త; బ్రహ్మము సర్వజ్ఞము, సదానందము, నిష్క్రియము - అను భేదము అవిద్యాయుక్తుడగు జీవుని గూర్చి, మాయాయుక్తుడగు ఈశ్వరుని గూర్చి చెప్పబడినవి. మాయా యుజులగు జీవేశ్వరులభేదము ప్రత్యక్షముచే స్ఫురించవచ్చును కాని, కేవలులగు జీవేశ్వరుల అభేదమును శ్రుతి ప్రతిపాదన చేయుచున్నది. ఇట్లు ప్రత్యక్ష శాబ్ద ప్రమాణముల ఆశ్రయములు భిన్నములు. పరమార్థముగ బ్రహ్మ భిన్నమైనది ఏదియు లేదు; కాబట్టి జీవబ్రహ్మల భేదమును సాధించదు. దృష్టాంతము లేదు; కాన అనుమానము శ్రుతిని బాధించదు. కాల్పనిక భేదము అంగీకృతమే. శ్రుతి అచ్చటచ్చట జీవబ్రహ్మ భేదము చెప్పినది. ఇది లోకసిద్ధమగు భేదము ననువదించుటయే. ప్రత్యక్ష సిద్ధమగు భేదమును చెప్పు శ్రుతి ముఖ్య శ్రుతి కానేరదు, ప్రమాణాంతరముచే గతార్థమగు శ్రుతి దుర్బలము. మానాంతరముచే తెలియనిది, అపవర్గ ప్రాప్తికి హేతువునగు అభేదమును తెలుపు శ్రుతియే బలిష్ఠము, చరమము, స్వతః ప్రమాణము. కాబట్టి బ్రహ్మ మొకటే, "అది నీవే" అను అపూర్వమగు విషయమును ప్రతిపాదించు శ్రుతి వాక్యములు పరమార్థమును చెప్పుచున్నవి. ఇక్కడ నానాత్వము లేదు అని శ్రుతి చెప్పినందున, కనపడు నానాత్వము మిథ్య. అనగా పారమార్థికముగా నిజము కాదు; కాని కనపడుచున్నందున అర్థక్రియావంతము గాన వంధ్యా పుత్రునివలె అలీకమును కాదు. స్వప్న జాగరితములకు వైధర్మ్య మున్నది గాన, విశ్వము గంధర్వ నగరము కాదు; ఉపలభ్యమానమగు ప్రపంచము వ్యావహారికముగ సత్యమే. అందుచేతనే ఇది పరమార్థముగ సత్య మనిగాని, అసత్తని గాని చెప్పరానిదై, అనిర్వచనీయమై ఉన్నది. ఏకత్వమును అనుభవ పూర్వకముగా తెలునుకొనిన వానికి శోకము, మోహము ఉండవని, ఆత్మవేత్త శోకమును తరించునని శ్రుతి చెప్పినది గాన, శోక మోహాత్మకమగు సంసారము మిథ్య. ఇది అవిద్యచే కలిగినది. అటులైనందుననే ఇది జ్ఞానముచే నివర్త్యమగును కదా. శోక మోహములు సత్యమేని జ్ఞానముచే తొలగవు; అనిర్వచనీయ భ్రాంతి కావుననే జ్ఞానముచే నశించును. బ్రహ్మాత్మైక్యము భూతార్థమయ్యు, ప్రమాణాంతరాగమ్యము అగుటవలన తద్జ్ఞానముచే సంసార నాశనము, పరమ నిత్యానంద ప్రాప్తి అగుటవలన, దానిని ప్రతిపాదించు ఉపనిషద్వ

1. "బ్రహ్మసూత్రార్థ చంద్రిక," రెండు సంపుటములు వెన్నెలకంటి సుందరరామశర్మ రచన, వావిళ్ళవారిచే ప్రకటితము (1921). ఇతరులును అనువదించిరి.

2. అద్వైత వేదాంతమందలి శ్రుతి ప్రామాణ్యమును గురించి దావాపు నిశ్శేషముగా "Revelation and Reason in Advaita Vedanta" అను అంగ్ల గ్రంథమున చర్చించితిని.

చనములు సార్థకములు. జ్ఞానము స్వయం ప్రకాశము, స్వతః ప్రమాణము అగుటచే (దీనికి మరొక రుజువు అక్కరలేదు) వేదాంత వాక్యజనిత జ్ఞానము నిర్దోషము, ప్రమాణాంతరాబాధితము.

ఆత్మ చిద్రూపము,[1] అనాత్మ తదన్యము; ఒకటి జ్ఞాత, విషయి; ఒకటి జ్ఞేయము, విషయము. రెండును ప్రకాశ అంధకారములవలె భిన్నములు. అయినను ఒకదాని ధర్మములు ఇంకొకదానిపై అధ్యస్తములు, ఆరోపితములు. సమస్త వ్యవహారము, సంసార ప్రక్రియ ఈ అధ్యాసమువలన జరుగుచున్నవి. ఆత్మ కాని దేహమును, భార్యా పుత్ర సంపదాదులను ఆత్మయని, ఆత్మీయ మని అనుకొను అభిమానము శోక మోహములకు కారణము. ఆత్మను అనాత్మ నుండి వేరుపరచి, ఆత్మ స్వభావమును వివేచన చేసిన, ఆత్మ జాగ్రత్స్వప్నములందు సుఖాదుల భోక్తగాను, కర్తగాను కన్పడినను, సుషుప్తియం దది వాటిచే రహితము అనియు, కాని స్వసంవేదన అప్పుడును ఉన్న దనియు, అనుభవనిరంతరత్వమువలన సుషుప్త్యనుభవానువ్యవసాయమువలన (లేదా స్మృతిచే) తెలియుచున్నది. సతతము ఏది ఉండునో అది స్వరూపము గాన, ఉనికి (సత్తు), సంవేదన (చిత్తు, విజ్ఞానము) ఆత్మ స్వరూప మని తెలును. కర్తృత్వ భోక్తృత్వములు దాని అవస్థలు; కాని అవి దాని స్వరూపము కాదు. వాటినుండి విముక్తియే దానికి శాంత్యానంద ముల నిచ్చును. లోకము నీరీతిని పరీక్షించిన[2] విద్వాంసుడు దానిపట్ల నిర్వేద మొందును. అప్పు డతనికి ముముక్షుత్వము (శోక మోహ సంసారము నుండి ముక్తి కావలెనను కోరిక) కలుగును. వేదాంతవాక్యజన్యజ్ఞాన మాతనికి ఆత్మ ఒకటే యనియు, ఆనందామృత రూపమనియు, తదన్య మేమియు లేదనియు పర్యవసానము గల అవగతిని కలిగించును. ఉపనిషద్వాక్య శ్రవణము, మనన నిదిధ్యాసనములు (ఆ వాక్యములు నిజమే నని; తద్విరుద్ధ ప్రతిపాదనలు అసత్యము లని నిశ్చయము - ఇది వాక్యార్థ విచారమున కలుగును) ఈ జ్ఞానమును కలిగించును. ఈ జ్ఞానరూపమగు అనుభవమే మోక్షము. అదియే బ్రహ్మవేదనము. అది సహృదయ ప్రత్యయము.

శంకరుల శిష్యుడగు పద్మపాదుడు చతుస్సూత్రీ భాష్యముపై వ్రాసిన "పంచపాదిక", ఇంకొక శిష్యుడగు సురేశ్వరుడు తైత్తిరీయ బృహదారణ్యక భాష్యములపై వ్రాసిన వార్తికములు, "నైష్కర్మ్య సిద్ధి" యను పుస్తకము చాల ముఖ్య గ్రంథములు. సురేశ్వరుని అనుసరించి సర్వజ్ఞాత్మముని (900) "సంక్షేప శారీరకము" ను బ్రహ్మసూత్రములపై వ్రాసెను. వాచస్పతి సూత్రభాష్యముపై "భామతి" యను టీకను వ్రాసెను. ప్రకాశాత్ముడు(1200) "పంచపాదిక"పై "వివరణము"ను, దీనిలో ప్రతిపాదించిన విషములను సంగ్రహ రూపముగా ప్రతిపాదించు విద్యారణ్యుడు (14 వ శతాబ్దము) "వివరణ ప్రమేయ సంగ్రహము"ను వ్రాసెను. "భామతి"పై అమలానందుడు (13 వ శతాబ్దము) "కల్పతరువు" ను, అప్పయ్య దీక్షితుడు (16 వ శతాబ్దము) కల్పతరువుపై "పరిమళ"మను టీకను వ్రాసెను. "భామతి" యొక ప్రస్థానమునకు, "వివరణము" మరొక ప్రస్థానమునకు దారితీసినవి. ఉపనిషద్ వాక్యములచే బ్రహ్మజ్ఞానము కలుగునని "వివరణ" ప్రస్థాన మనును; అంతఃకరణము ఉపనిషద్వాక్యార్థమును గాఢముగా ధ్యానము చేయగా దానిచే జ్ఞానము కలుగునని "భామతి" ప్రస్థానము. మాయా శబలితమగు బ్రహ్మ జగత్తున కుపాదాన మని "వివరణ" ప్రస్థానము; జీవాశ్రిత మాయచే విషయీకృతమగు బ్రహ్మ జగత్కారణము

1. ప్రమాణాదుల వ్యవహారమునకు పూర్వమే ఆత్మ సిద్ధము, అవి ఆత్మాశ్రయములు కాన. జ్ఞాతృ స్వరూపమగు ఆత్మ ఎవరిచేతను నిరాకరింపబడదు. సర్వులకు ఆత్మ ఉన్నదను ప్రత్యయము కలదు. కాననే ఎవరికిని "నేను" లేను అని తోచదు. ఈ "నేను" (ఆత్మ) స్వరూపమును గూర్చియే విప్రతిపత్తి కలదు. అది నివారించుకోవలెను.

2. ఈ పరీక్షవలన ఆత్మానాత్మ వివేకము కలుగును. ఈ పరీక్ష బుద్ధిచే, అనుభవ విశ్లేషణచే జరుపవచ్చును. చిత్తశుద్ధి, నిత్యము అనిత్యమునుండి వేరని గ్రహించుట వివేకమును దృఢము చేయును.

(జీవాజ్ఞానము జగదుపాదానము) అని "భామతి" ప్రస్థానమును వాదించినవి. ఈశ్వర జీవ సంబంధము బింబప్రతిబింబ సంబంధము వంటిది; అవిద్యలోని ప్రతిబింబమని "వివరణ" ప్రస్థానము. అవిద్యచే అవచ్ఛిన్న చైతన్యము ఈశ్వరుడు, అంతకరణావచ్ఛిన్న చైతన్యము జీవుడు; అజ్ఞానమున కాశ్రయ చైతన్యము జీవుడు (అజ్ఞానములు పెక్కు కాన జీవులనేకులు); అజ్ఞానమునకు విషయీభూత చైతన్యము ఈశ్వరుడు, అని "భామతి" ప్రస్థానము. "భామతి" మొత్తము మీద మండనమిశ్రుని భావముల నంగీకరించును.* శ్రీహర్షుని (1190) "ఖండనఖండ ఖాద్యము" అద్వైతమును నాగార్జునుని వాదతర్క పద్ధతి నాధారముగాగొని స్థాపించినది. చిత్సుఖుడు దానిపై వ్యాఖ్య వ్రాసెను. మధుసూదన సరస్వతి (16 వ శ.) "అద్వైతసిద్ధి" లో ద్వైతుల ఖండనలకు సమాధానమీయ ప్రయత్నించెను. ఇవి రెండు మహాగ్రంథములు. విద్యారణ్యునిచే వ్రాయబడిన దనబడు 'పంచదశి' మంచి ప్రకరణ గ్రంథము. విముక్తాత్మని (10 వ శ.) "ఇష్టసిద్ధి", ఆనంద బోధుని (12 వ శ.) "న్యాయమకరందము" ఉత్తమ గ్రంథములు. ధర్మరాజు వ్రాసిన "వేదాంత పరిభాష", సదానందుని "వేదాంతసారము" బాలబోధక గ్రంథములు. ఆనందగిరి (13 వ శ.), గోవిందానందుడు (16 వ శ.) సూత్రభాష్యము పైన (ఆనందగిరి అన్ని భాష్యములపైన) సరళ టీకలను వ్రాసిరి. ప్రకాశనందుడు (15 వ శ.) "వేదాంత సిద్ధాంత ముక్తావలి"లో ఏకజీవవాదమును ప్రతిపాదించెను. అజ్ఞానోపాధి లేని శుద్ధ చైతన్యము ఈశ్వరుడు, అజ్ఞానోపహిత చైతన్యము జీవుడు. అజ్ఞాన సహితుడగు జీవుడు జగత్కారణము. జీవుడొక్కడే, దేహ భేదముచే జీవభేద మున్నట్లు కన్పడును. అజ్ఞానియగు జీవుని దృష్టిచే సృష్టి అయినది. ద్రష్ట లేనిదే దృశ్యముండదు; జగత్తు ఆత్మ దృష్టి మాత్రమే (ఇది దృష్టి సృష్టివాదము). ఇంతవరకు ఎవరికిని మోక్షము రాలేదు; ఒకే జీవుడు గాన - ఇది ప్రకాశానందుని వాదము. ప్రపంచ విలయ మొక్కపరియే జరుగును, అప్పుడే అందరు ముక్తులగుదురు, ఇంతవరకు ఎవరునూ కాలేదు, అనునది "సర్వ ముక్తి" వాదము. ఇది భాష్యమందు సూచింపబడినది అందురు.

ప్రతిభాపాండిత్యములందు పైవారికి తీసిపోని ఇద్దరు అద్వైత వేదాంతులు 19 వ శతాబ్దమున ఉదయించి, తమ ప్రవచనములచే అద్వైతదర్శనవ్యాప్తికి, అభివృద్ధికి బహుముఖకృషి జరిపిరి. వీరు వివేకానంద స్వామి(1863-1902), రామతీర్థస్వామి(1873-1906) పాశ్చాత్య దర్శనముచేతను, ఆధునిక విజ్ఞానముచేత వీరు ప్రభావితులు. సామాన్య జనుల దారిద్ర్య దుఃఖములచే కరుణాప్లావిత హృదయులు. అందుచే వీరు అద్వైతమును సృజనాత్మకముగ వ్యాఖ్యానించి, దానిని సర్వజనులకు పనికివచ్చు ఆధ్యాత్మిక దర్శనముగా చేయప్రయత్నించిరి. ఇదివరకెఅద్వైతియు చేయని రీతిగ క్రియాద్వైతమునకు భావాద్వైతముతో సమాన ప్రాముఖ్యము నిచ్చి సర్వమానవ సమానత్వము వ్యావహారికముగను, పారమార్థికముగను కూడ చాటిరి.

## విశిష్టాద్వైతము

ద్వాపర యుగాంతము, కలియుగారంభము నుండి దక్షిణ భారత దేశమందు పుట్టిన విష్ణుభక్తిని బోధించిన పన్నెండుగురు ఆళ్వారులు[1] కలరని వైష్ణవ సంప్రదాయము. వీరు 7 - 9 వ శతాబ్దముల మధ్య నుండిరని నేటి ఐతిహాసికుల ఊహ. వీరందరు చేసిన భగవత్ స్తోత్రములు, వీరలలో ఇద్దరగు నమ్మాళ్వారు, తిరుమంగై ఆళ్వారులు వ్రాసిన కృతులు కలిపి "నాలాయిర ప్రబంధ" మను పేర సంగ్రహించ బడినవి. 9 వ శతాబ్దాంతముననో, 10 వ శతాబ్దముననో ఉండిన నాథముని ఈ ప్రబంధ సంచయము చేసె నందురు.

---

* వాచస్పతి మండనుని "బ్రహ్మసిద్ధి" పై "బ్రహ్మతత్త్వ సమీక్ష" యను వ్యాఖ్య వ్రాసెను.

1. ఈ తమిళ శబ్దమునకు జ్ఞాన సముద్రమందు మునిగి లేచినవాడని అర్థమట.

''నాలాయిరము''న మూడవ భాగమగు ''తిరువాయ్ మొఝి'' నమ్మాళ్వారు (శఠకోపాచార్యులు పరాంకుశ ముని) కృతి. దీనిని నాథముని "సహస్రశాఖోపనిష త్సమాగం-ద్రవిడవేద సాగరం" అనినాడు. వేదాంత దేశికులు దీనిని సంస్కృతమున నూరు శ్లోకములలో సంక్షేపించెను. "తిరువాయ్‌మొఝి"లో పరతత్త్వము (ఈశ్వరుడు), జీవుడు - వీరల సంబంధము, హేయ హాని, ఇష్టప్రాప్తి అను "అర్థపంచకము" వివరింప బడినది. "మూలమంత్ర", "ద్వయ", "చరమ శ్లోకము"ల ప్రతిపాదన కూడ నమ్మాళ్వారు వ్రాసిన గ్రంథములలోనే (ఇవి మొత్తము నాలుగు) మొదటగా జరిగినది. "నాలాయిరము"న రెండవ భాగమగు "పెరియ తిరుమొఝి", తిరుమంగై ఆళ్వారు (పరకాల స్వామి, నీలన్) వ్రాసినది. ద్రవిడ వేదాంగము అన బడు మరొక ఆరు గ్రంథములను గూడ నీయన వ్రాసెను. ఆళ్వారులలో కొందరు అస్పృశ్యులగు చండాలులు, కొందరు గజదొంగలు కూడ గలరు. ఒకామె స్త్రీ (గోదాదేవి, అండాళ్).[1] పన్నిద్దరాళ్వారు లను విష్ణ్వాలయములలో ఆరాధింతురు. అంతటి పవిత్రులు వీరు శ్రీ వైష్ణవులకు.

"ఏకాయన"మను నొక వేదశాఖ, లేదా విద్య ఛాందోగ్య ఉపనిషత్తులో పేర్కొనబడినది. ఇది శుక్ల యజుర్వేదీయ కాణ్వశాఖ యందురు, కాని ఇప్పు డనుపలబ్ధము. 10వ శతాబ్దమున నుండిన ఉత్పలుని "స్పందకారిక"లో పాంచరాత్రశ్రుతినుండి ఉద్ధరణలు కలవు. శతపథ బ్రాహ్మణమందు "పాంచరాత్రసత్ర" మను అయిదు రోజుల పర్యంతము నారాయణుడు జరిపిన యజ్ఞము వర్ణించబడినది. దీనిచే ఆయన సర్వప్రాణులకు అధిపతి అయ్యెనట. ఈ వేదశాఖపై ఆధారపడిన, లేదా దాని కనుకూలమగు శరణాగతి రూపమగు భగవత్ప్రాప్తి మార్గ మొకటి "పాంచ రాత్ర సంహిత" యందు వివరింపబడిన దందురు. ఇందనేక గ్రంథములు కలవు. పరమ తత్త్వము, ముక్తి, భుక్తి, యోగము, విషయము (సంసారము) అను అయిదు విషయముల జ్ఞానము (రాత్రము) నిరూపించుటచే పాంచరాత్ర మని దీనికి పేరు.[2] మహా భారత మందలి శాంతి పర్వమున నారాయణీయో పాఖ్యానములో వర్ణించబడినదియు పాంచరాత్ర ధర్మమే. పాంచరాత్రము వేదసార మని వైష్ణవుల విశ్వాసము.

ద్రవిడ వేదమున, పాంచరాత్రమున శ్రుతి స్మృతులలోన నిష్ణాతులైన ఆచార్యుల పరంపర (అందుచే వీరు ఉభయ వేదాంతులు) యొకటి నాథ మునితో ప్రారంభమాయెను. శఠకోప శిష్యపరంపర లోని వాడీయన; "న్యాయతత్త్వా"ది గ్రంథకర్త, ద్రవిడవేద సంచయిత, ఉద్ధారకుడు. ఈయన పౌత్రుడు యామునాచార్యు లొక గొప్ప వైష్ణవ గురువు. ఈయన రామానుజులకు పరమ గురువు. రామానుజుల గురువు మహాపూర్ణులు. గోష్ఠీ పూర్ణులు మరొక గురువు. యామున, రామానుజుల జీవిత సంగ్రహములు అన్యత్ర కలవు (చూ. యమునా చార్యులు, రామానుజాచార్యులు). నాథముని,యామున, రామానుజులచే ప్రవర్తితమైన దర్శనము విశిష్టాద్వైత దర్శనము.

చేతనాచేతనములచే విశిష్టమైనది బ్రహ్మము, దాని అద్వైతము విశిష్టాద్వైతము. వేదాంత దర్శన మును గూర్చి ఇదివరకు మేము వ్రాసిన దానిలో ఆశ్మరథ్యాదులకు, బాదరాయణునికి పూర్వులగు వారిని గురించి, బోధాయన శ్రీవత్స టంకాదులు, శంకరుల పూర్వగులను గురించి చెప్పితిమి. వీరల మతములు విశిష్టాద్వైతమునకు అవతారిక. శ్రీకంఠ భాస్కరులవి కూడ విశిష్టాద్వైతమునకు దగ్గరి మత ములే. జీవుడు బ్రహ్మమునకంశము, బ్రహ్మము జగత్తుగా పరిణమించినది, జగత్కారణత్వాది గుణ ములు కలది బ్రహ్మము; మోక్షమందు కూడ జీవునికి జగత్కర్తృత్వాదు లుండవు, "సంరాధన"(ధ్యానము) మోక్షమార్గము - బ్రహ్మసూత్రములందు గల ఈ సిద్ధాంతములు విశిష్టాద్వైతమునకు ఆధారములు. సమస్తములోను ఆత్మలయందు, పృథివ్యాదులందు

1. ఈమె పాడిన "తిరుప్పావై", "తిరుమొఝి" భక్తిరసముతో నొప్పు గొప్ప కృతులు.

2. వేరే అర్థములు చెప్పుదురు.

కూడ బ్రహ్మము అంతర్యామిగ నున్నదని చెప్పు శ్రుతివాక్యములు విశిష్టాద్వైతులకు ముఖ్యశ్రుతులు - జీవబ్రహ్మైక్యమును చెప్పునవి అద్వైతులకైనట్లు. కాని విశిష్టాద్వైతులకు అన్నిశ్రుతులు మాన్యములే, పరమార్థములే. దేనిని వ్యావహారిక మని, గౌణమని త్రోసివేయరు.

రామానుజుల శ్రీభాష్యము ఆంధ్రములోనికి పరివర్తితమైనది.[1] "విశిష్టాద్వైత"మను వ్యాసము వేరే చోట ఈ గ్రంథమున ఉన్నది. (చూ. విశిష్టాద్వైతము). 1951 లో "రామానుజ దర్శన" మను బాలబోధక గ్రంథము వ్రాసితిని.[2]

ఇక్కడ విశిష్టాద్వైతమును గూర్చి అపర్యాప్తముగ కొంచెము ప్రస్తావించెదము. ఆత్మ దేహమునకు భిన్నము. అనాది అవిద్యచే సంచితమగు పుణ్యపాప రూపములగు కర్మలచే అది దేహ ప్రవేశము చేయవలసి వచ్చుచున్నది; దీనిచే దేహమం దాత్మాభిమానమును, దానిచే భవభయమును కలుగుచున్నవి. ఇది ధ్వంసము అగుటకు ఆత్మ పరమాత్మల యాథాత్మ్య జ్ఞానముతో కూడిన వర్ణాశ్రమ ధర్మానుష్ఠానము, పరమపురుషుని ఉపాసనయు ఆవశ్యకములు. అట్టి ఉపాసనకు ఆత్మస్వరూపావిర్భావమును, దాని ద్వారా అనవధిక అతిశయానందమగు బ్రహ్మానుభవమును ఫలములు. ఇది యంతయు ఉపనిషత్తులచే సమధిగతమగు అర్థము.

పరబ్రహ్మము సర్వమునకు ఆత్మ; చిద్ అచిదాత్మకమగు వస్తువు లన్నియు దానికి శరీరము అని శ్రుతి స్మృతులచే అవగతమగుచున్నది.[3] శరీరము శారీరకుని[4] 'ప్రకారము'[5]గా నుండుట వలననే పదార్థమగును. శరీర - శారీరకులకు ధర్మభేద మున్నను ఎన్నడు సంకరము కలుగదు. బ్రహ్మము సర్వశరీరి అని బ్రహ్మ వైభవమును శాస్త్రములు చెప్పినవి. ఒక ద్రవ్యమునకు విశేషణముగా మాత్రమే ఏది ఉండునో, అది ఆ ద్రవ్యమునుండి అపృథక్సిద్ధము (వేరు కానిది); అట్టిదా ద్రవ్యమునకు 'ప్రకారము'. అప్పుడా రెంటిని సామానాధికరణ్యము ద్వారా ప్రతిపాదించవచ్చును. రెండు పదములకు ప్రకారద్వయము ద్వారా ఏకపదార్థ నిష్ఠత్వమును సామానాధికరణ్య మందురు. నానావిధములుగ నున్న ఈశ్వరుని విధములే చిద్-అచిద్ వస్తువులన్నియును. మరొక తీరుగా చెప్పవలెనన్న, నానాసంస్థాన సంస్థితుడగు ఈశ్వరుని సంస్థానముగానే అన్ని వస్తువులు ఉన్నవి. ఈశ్వరుని శరీరముగా మాత్రమే - ఆయన ప్రకారములుగా మాత్రమే వస్తువుల సద్భావము. కాబట్టియే, "తత్" (బ్రహ్మము) "త్వం" (నీవు)గా, అనగా 'నీవు' శరీరముగా, 'నీవు' ప్రకారముగా అవస్థితము, అనగా నీవు బ్రహ్మ ప్రకారముగా ఉన్నావు అని 'తత్త్వమసి' వాక్యార్థము. 'నీవు తదాత్మకుడ' (అది ఆత్మగా గలవాడ) వని ఈ వాక్య భావము. శరీరాత్మ భావముచే జీవేశ్వరతాదాత్మ్యము ఉపపన్నము.

జీవునికి, శరీరమునకు కలట్టి సంబంధమే పరమాత్మకు అన్నిటితో కలదు. ఆయన సర్వాత్మ, సర్వమునకు ఆధారము, నియంత, శేషి. ముఖ్యము; సర్వము ఆయనకు శరీరము, ఆధేయము, నియామ్యము, శేషము.

బ్రహ్మమునకు రెండవస్థలు : కారణావస్థ, కార్యావస్థ. నామరూప విభాగమునకు అనర్హమగు సూక్ష్మ దశాపన్నమగు ప్రకృతి, పురుషులు శరీరములుగా కలిగియున్నప్పుడు కారణావస్థ. నామరూప

1. ఆంధ్ర శ్రీభాష్యము - కందాడై శేషాచార్యులు: స్వంత ప్రచురణము, ఏడునూతులు, మింట్‌వీథి, చెన్నపట్టణము.

2. ప్రచురణ: రామతీర్థ సేవాశ్రమం, పిడుగురాల, గుంటూరు జిల్లా.

3. రామానుజులు దీనికి పరశ్శత ప్రమాణముల నిచ్చెను.

4. దేహి, శరీరము గలవాడు శారీరకుడు.

5. అవస్థితి విధము, సంస్థాన విధము, ఉండు పద్ధతి (mode, form). ఉదా : కర్ర కర్రకలవాని ప్రకారము, గోత్వము గోవునకు.

విభాగమునకు అర్హమగు స్థూలదశలో నున్న ప్రకృతి, పురుషులు శరీరముగా కలిగియున్నప్పుడు కార్యావస్థ. ఇట్లు స్థూలముగా బ్రహ్మముండుట సృష్టి, సూక్ష్మముగా నుండిన ప్రలయము. ప్రకృతి అచిత్ తత్త్వము, పురుషులు చిత్‌తత్త్వము; రెండును అనాదులు. బ్రహ్మ జగత్కారణ మనగా, జీవులు, ప్రకృతి శరీరముగా కలిగియున్న బ్రహ్మము జగత్కారణము. అనగా సూక్ష్మావస్థలో నున్న ఈశ్వర శరీరమగు ప్రకృతి వికారము (పరిణామము)ను పొందుటచే సృష్టియగును. పరమాత్మయొక్క ప్రకారమగు ప్రకృతియే పరిణామాస్పదము; అట్లే ఆయన ప్రకారమగు జీవులందే అపురుషార్థములు, దుఃఖాదులును. వీటికి ప్రకారియగు పరమాత్మ నిర్వికారము, నిరవద్యము, సర్వకల్యాణ గుణాశ్రయము, సత్య సంకల్పము.

ఈ విషయము నింకోవిధముగ చెప్పవచ్చును: బ్రహ్మము మూడు తత్త్వముల సమాహారము. అందు ఒకటి ఎన్నడును మారనిది, కళ్యాణ గుణములుకలది, ఎప్పుడును నియంతగా నుండునది. ఇదే ఈశ్వరుడు, భగవంతుడు, నిజముగా పరమాత్మ. జీవులు వేరొక తత్త్వము. జీవులు స్వయముగా అసంకుచిత, అపరిచ్ఛిన్న నిర్మలజ్ఞాన స్వరూపులు. వీరు అనాదియగు కర్మరూపమగు అవిద్యచే వేష్టితులై, ఆ కర్మల కనురూపముగ జ్ఞాన సంకోచమును పొంది, వివిధదేహము లందు ప్రవేశించి, ఆయా దేహములకు తగిన జ్ఞానము మాత్రమే కలిగి, ఆ దేహములనే ఆత్మలనుగా అభిమానించుచు, ఆ అభిమానమునకు తగినట్లు కర్మల చేయుచు, వాటి కనుగుణమగు సుఖ దుఃఖముల ననుభవించు చున్నారు. ఇదియే సంసారము. బ్రహ్మము లోని మూడవ తత్త్వము ప్రకృతి, త్రిగుణాత్మకము, అచిత్పదార్థము. ఇదియే మాయ. వికారములను పొందునది ఇది. తక్కిన రెండు తత్త్వములు దీనికి ఆత్మలు, వాటికి ప్రకృతి ప్రకారము. జీవులు భగవంతుని ప్రకారములు, దేహములు. ఈ తత్త్వత్రయ సమష్టి బ్రహ్మమయ్యు, అవికారమగు తత్త్వమే బ్రహ్మ స్వరూపము, అదే భగవంతుడు. జీవులందరు భేద రహితమగు జ్ఞానముతో ఏకాకారులు, కాబట్టి వారం దరికి సామ్యము కలదు. ఏకరసముగా భగవంతుని శేషములుగా నుండుటయు, భగవంతుడు వాటి ఆత్మగా నుండుటయు జీవస్వరూపము. భగవచ్ఛేషత్వము, భగవదాత్మత్వము జీవస్వరూపము. కేవలము కళ్యాణ గుణాశ్రయమగు భగవత్స్వరూపము సకలేతర విజాతీయము. ఇది సర్వశాస్త్ర హృదయము.

బ్రహ్మము నిర్వికార మని శ్రుతులు చెప్పినవి; బ్రహ్మమందు స్వరూప పరిణామము లేదని దాని అర్థము. అట్లే నిర్గుణమనినవి; బ్రహ్మమందు ప్రాకృత హేయ గుణములు లేవని దాని అర్థము. వేదాంత వాక్యములు నానాత్వము లేదనినవి; చేతనాచేతనమగు సర్వవస్తువులు ఒకే బ్రహ్మమునకు శరీరముగా ప్రకార భూతముగా నున్న వని, అన్నిటి ఆత్మగా సర్వప్రకారముగా ఒక్క బ్రహ్మమే ఉన్నదని దీని అర్థము. సర్వాత్మయగు పరబ్రహ్మకు స్వరూప నిరూపక మగు ధర్మము మలప్రత్యనీకమగు, ఆనందరూపమగు జ్ఞానమే అగుటచే, బ్రహ్మము జ్ఞానానంద మాత్రముగా శ్రుతులలో చెప్పబడినది. శరీరాత్మ భావమును పురస్కరించుకొని సామానాధికరణ్యము నాధారముగా కొన్ని శ్రుతులు ఐక్యమును చెప్పుచున్నవి. "మనుష్యుడు" అన్న పదమును ఏకత్వమును చెప్పుచున్నను, వానిలో శరీర, ఆత్మం విభాగము లేదని చెప్పదు. కాశీరాజు అద్వితీయుడు అన్నప్పుడు, అతడు రాజ్య, మహిషి, దండనాయక మంత్రి సామంతాదులు లేకుండ ఒక్కడే, ఏకాకి అని అర్థము కాదు. బ్రహ్మము యొక్క ఏకత్వ, అద్వితీయత్వములు అట్టివి.

రామానుజ దర్శనము ఒక్క భేదమునో అభేదమునో, రెంటినో చెప్పదు. వేద వేద్యముగా నున్నం దున మూడింటిని సమర్థించును. సర్వము శరీరముగా, సర్వము ప్రకారముగా బ్రహ్మయే ఉన్నందున ఇట్లు అభేదమును; ఒక్క బ్రహ్మమే నానాభూత చిదచిద్వస్తు ప్రకారమగు నానాత్వముగా నున్నందున భేదాభేదములను; అచిద్వస్తువు, చిద్వస్తువు, ఈశ్వరుడు; ఈ మూడింటి స్వరూప స్వభావ వైలక్షణ్యము వలన వీటి కెన్నడు సంకరము కలుగదుగాన భేదమును సమర్థించబడినవి.

ఈశ్వరుడు అంతర్యామి అననేమి? చేతనులందరికి చిచ్ఛక్తి(ఆలోచించు శక్తి)ని, ప్రవృత్తిశక్తి(కర్మ చేయు శక్తి)ని ఇచ్చి, వారికి కార్యప్రవృత్తి, నివృత్తుల కనుకూలమగు పరికరములను ఈశ్వరుడు ఏర్పరచినాడు. తన్నిర్వహణ కొరకు, అంతకు ఆధారమై, అన్నిట ప్రవేశించి, అనుమంతగా[1] నియమించుచు, "శేషి"గా నున్నాడు. జీవుడు భగవంతునిచే ఆహితశక్తియై తానే స్వయముగా కర్మలను చేయును, మానును. ఇట్లు చేయుచున్న జీవుని ఈక్షించుచు (చూచుచు) భగవంతుడు ఉదాసీనుడుగ నుండును. అయితే, భగవంతునికి అనుకూలముగ నుండు కార్యములందు ముందుగా స్వయముగా ఎక్కువగా ప్రవృత్తుడైన జీవునిపట్ల ప్రీతుడై, భగవంతు డతనికి కళ్యాణబుద్ధి నిచ్చి, అతనిని కళ్యాణ మార్గమున ప్రవర్తింపచేయును. ఇట్లుగాక ఎక్కువగా ప్రాతికూల్యమందు ప్రవృత్తుడైన వానికి భగవంతుడు క్రూరబుద్ధి నిచ్చి, క్రూర కర్మలయందు ప్రేరేపించును. ఈ రెండు విధములగు ప్రేరణము సర్వసాధారణము కాదు. సాధారణముగా జీవులు ఏమి చేయవలెనో తామే నిశ్చయించుకొని తామే చేయుచున్నారు.

పరబ్రహ్మము నారాయణుడు. అతడు కళ్యాణ గుణాశ్రయుడు, నిర్మల జ్ఞానానంద స్వరూపుడు; సాకారుడు, శ్రియఃపతుడు; పరిజనులు, దివ్యస్థానాదులు కలవాడు. ఆదిత్య, విద్యుద్వర్ణములు గలవాడు. ఆయన పరమ పదమును సర్వదా చూచు పరిపూర్ణ జ్ఞానులు కలరు. జీవులు సులభముగా ఆశ్రయార్థమై తనను చేరుటకుగాను, నిఖిల జగదుపకారార్థము నారాయణుడు నానా యోనులందు స్వేచ్ఛగా తన రూపముతోనే అవతరించుచుండును. అట్టి అవతారములందు[2] కూడ ఆయనది ప్రాకృత దేహముకాదు. ఇతరులందరు కర్మవశమున విధిలేక పుట్టుదురు. అవతారము లట్టివి కావు.

1. జీవుల స్వేచ్ఛచే చేసిన కర్మలను ఒప్పుకొనువాడు.

2. ఈ అవతారములు కరుణావతారములని సంప్రదాయ విదు లందురు.

ఏకాంతిక, అత్యంతిక భక్తియోగముచే నారాయణుడు లభ్యుడు. జ్ఞానయోగ కర్మయోగములచే అంతఃకరణము సంస్కృత మైనప్పుడు భక్తి సాధ్యమగును. వర్ణాశ్రమ ధర్మ నిర్వహణము కర్మయోగము. ఆత్మానాత్మ వివేకము, పరమాత్మ స్వరూపము నెరుగుట జ్ఞానయోగము. పరమపురుషుడు, అనంత కళ్యాణ గుణుడు అగు నారాయణుని ఎరిగి, వేరే ప్రయోజనము లేక, అనవరతముగా, నిరతిశయముగా ప్రియమై యుండు ఆయన ధ్యానము భక్తి. ఈ ధ్యానము విశదతమ ప్రత్యక్షత్వమును పొందినప్పుడే భక్తి యగును. అనగా, ధ్యాన విషయమగు వస్తువు-ఇచట నారాయణుడు-ప్రత్యక్ష మైనప్పుడే అది భక్తి యగును. నిరతిశయ ప్రియమగు, అనన్యప్రయోజనమగు, స్వేతరవైతృష్ణ్యావహమగు[3] జ్ఞానవిశేషము భక్తి. అట్టి భక్తిగలవానిని భగవంతుడు వరించును. సతత ధ్యానముచే నారాయణుడు విశదతమముగా ప్రత్యక్షమగుటయే బ్రహ్మానుభవము, బ్రహ్మవేదనము. ఇదియే, అనగా ప్రత్యక్షతాపన్న ధ్యానము, పరభక్తి. దీనికి సాధనము భక్తి; దాని రూపము పరమపురుషుని అర్చనవందనాది సేవ. అది తత్త్వజ్ఞాన పూర్వకమును[4], స్వకర్మానుగృహీతమును[5] అయిననే ఫలించును.

రామానుజుల సూత్రభాష్యముపై సుదర్శన సూరి (1200-1275) 'శ్రుత ప్రకాశిక' వ్రాసెను. ఇతరు లింతకు ముందే దానిపై వ్యాఖ్యలు వ్రాసిరి. వేంకటనాథ వేదాంతదేశికులు (1269 - 1369) శ్రీ భాష్యముపై 'తత్త్వటీక', 'తత్త్వముక్తాకలాపము'పై 'సర్వార్థ సిద్ధి' యను వ్యాఖ్యానమును, 'సేశ్వర మీమాంస', 'న్యాయపరిశుద్ధి', 'న్యాయ సిద్ధాంజనము' లను స్వతంత్ర గ్రంథములును వ్రాసెను. ఈయన మహాపండితుడు, మహాభక్తుడు, పరమ సజ్జనుడు.

3. అదిగాని ఇతర విషయములం దన్నిటియందు వితృష్ణను కల్గించునది. వితృష్ణ-ఇచ్ఛారహితత్వము.

4. దేహవ్యతిరిక్త మాత్మ, సర్వాత్మ భగవంతుడు అనునది తత్త్వజ్ఞానము.

5. స్వోచిత వర్ణాశ్రమాచార యుక్తము.

1327లో మరణించిన లోకాచార్యుడు 'తత్త్వత్రయ', 'తత్త్వశేఖరము'లను వ్రాసెను. ఈయన 'తంగలై' (దక్షిణాది) సంప్రదాయమునకు, వేదాంత దేశికులు 'వడగలై' (ఉత్తరాది) సంప్రదాయమునకు ముఖ్యులు (చూ. తెంగలి, వడగలి సిద్ధాంత భేదము) తెంగలులు ఎక్కువగా ద్రావిడ వేదముపై ఆధారపడిరి, 'ప్రపత్తి' నాశ్రయించిరి. భగవత్కృప అహేతుక మనిరి ; వర్ణాశ్రమాదుల కంత ప్రాముఖ్యము నియ్యక పోయిరి. వడగలులు దీనికి విరుద్ధముగా శ్రుతిస్మృతులపై వర్ణాశ్రమములపై హెచ్చు మమకారము కలవారు. వరవరముని (15 వ శ.) తెంగలై సంప్రదాయమున గొప్ప ఆచార్యులలో నొకడు. రంగరామానుజుడు (16 వ శ.) రామానుజ భాష్యములపై టీకలు, కొన్ని ఉపనిషత్తులపై భాష్యములు వ్రాసెను. శ్రీభాష్యముపై "నయ ప్రకాశిక" వ్రాసిన మేఘనాథారి కూడ మంచి వేదాంతి. ఈతని మరియొక ప్రకరణ గ్రంథము 'నయద్యుమణి'. శ్రీనివాసుని "యతీంద్ర మత దీపిక" ప్రవేశ గ్రంథము.

శంకరాద్వైతమును విరోధులు ప్రచ్ఛన్న బౌద్ధమను నట్లే, విశిష్టాద్వైతులను ప్రత్యర్థులు "ప్రచ్ఛన్న నైయాయికు" లందురు. నాథముని వ్రాసిన "న్యాయతత్త్వము"తో ప్రారంభించి, వేదాంత దేశికుల "న్యాయ పరిశుద్ధి" వరకు న్యాయదర్శన ప్రభావము కన్పడుచునే యున్నది. కాని న్యాయ మందువలె అనుమానికేశ్వర ప్రతిపాదనకాని, ఈశ్వర నిమిత్తకారణత్వమును గాని విశిష్టాద్వైతము చేయదు. అందుచే ఇది ఒక రకమగు న్యాయము మాత్రమే అనుట అయుక్తము. పాంచరాత్రమును, ద్రావిడవేదమును అవలంబించుటవలన ఇది కొంద రిచే అవైదిక మనబడుచున్నది. రామానుజుల గ్రంథములలో గల ప్రతివిషయమునకు ప్రస్థానత్రయము లోనే ఆధారము కలదు. పైగా అద్వైతులు, ద్వైతుల వలెగాక ఆయన తానన్ని శ్రుతి వాక్యములకు, పూర్వోత్తర మీమాంసలకు, వేదమందలి కర్మజ్ఞాన కాండలకు, భక్తియోగమునకు, సమాన గౌరవ మిచ్చితినని చెప్పగల్గెను. ఈ దేశముపైన, హిందూ మతముపైన రామానుజుల ప్రభావము అత్యధికము, ఇంకెవరికిని తీసిపోనిది. భారతదేశమందలి అన్ని భక్తివాదములు ఆయన నుండి ప్రేరణ పొందినవియే. భక్తి మోక్ష మార్గము, ఆలయాదులందు ఆయన అర్చన ఇష్టప్రాప్తి హేతువు అను విశ్వాసము, వేదాగమములపై ఆధార పడిన రామానుజ దర్శన ప్రచార ఫలితములు.

## ద్వైతము

ఋగ్వేద, అథర్వవేద, ముండకోపనిషత్తులలో గల "ద్వాసుపర్ణాసయుజాసఖాయా" అను మంత్రము జీవుడు కర్మఫలభోక్తయని, ఈశ్వరుడు కాడని చెప్పుచున్నది. కఠోపనిషత్తులోని "ఋతం పిబంతౌ సుకృతస్యలోకే" యను మంత్రము, జీవేశ్వరులు ఛాయాతపముల (నీడ - ఎండల) వలె భిన్నులని చెప్పుచున్నది. "విశ్వతః పరమాం నిత్యం" ఇత్యాది శ్రుతులు ఈశ్వరుడు విశ్వమునకు పరుడు అనియు, ఇతర శ్రుతులు ఆయనది పరమపద మనియు చెప్పుచున్నవి. సర్వభూతములకు, కూటస్థమగు అక్షరమునకు అన్యుడును, అతీతుడును అగు ఉత్తమ పురుషుడు పరమాత్మయని భగవద్గీత చెప్పినది. జీవేశ్వరుల భేదమును, ఈశ్వరుని పరమపారమ్యమును ఇట్లు కొన్ని శ్రుతి స్మృతి వాక్యములు ప్రతిపాదించును. పురాణాదులందు ఈశ్వరుని వైభవము, సర్వశక్తిమత్త్వము, ఆనంద రూపత్వము, జీవుని తుచ్ఛత్వ, ఆర్తత్వ, పాపిత్వ, నీచత్వములు చాల ఎక్కువగా వర్ణించబడినవి. జీవేశ్వరుల ఈ ద్వైతమును, భేదమును పరమార్థముగా, శాశ్వతముగా ఎంచు వాదము ద్వైతవాదము.

1199 లో ఉడిపి దగ్గరి వేల్గ్రామమందు వాసుదేవుడను బాలుడు ఒక బ్రాహ్మణ కుటుంబమున పుట్టెను. తల్లిదండ్రుల నారాయణోపాసన ఫలమాతడని అందురు. చిన్నప్పటినుండి ఈయన బలశాలి, మల్ల యుద్ధాదులందు నిపుణుడు. గ్రామ పాఠశాలలోను, ఇంటివద్ద శాస్త్రాధ్యయనముచేసి, 11 వ ఏట సన్న్యాసము స్వీకరించి, పూర్ణప్రజ్ఞుడను నామమును గ్రహించెను. అద్వైత వ్యాఖ్యానములను దీక్షాగురువు

వద్ద అధ్యయనము చేసి అసంతుష్టుడాయెను. వేదాంత పారంగతుడై ఆనందతీర్థ నామముతో (ఈయనే మధ్వాచార్యులు) మఠాధీశు డాయెను. భారత దేశమును పర్యటించుచు, శాస్త్రార్థముల చేయుచు వైష్ణవ సంప్రదాయమును భక్తిని ప్రచారము చేయుచు, గ్రంథముల వ్రాయుచు, ఈయన తన జీవితము గడిపెను. 1303 లో గతించెను. ఈయన ప్రస్థానత్రయము పైన భాష్యములు వ్రాసెను.* ఋగ్వేదములోని కొన్ని ఋక్కులపై అమూల్య భాష్యము వ్రాసి, వేదమందు నానాదేవతా వాదము లేదని, ఏకేశ్వర వాదమే ప్రతిపాదితమని చెప్పెను. పది ప్రకరణ గ్రంథములు వ్రాసి అద్వైత ఖండనమును, విష్ణు పారమ్యమును స్థాపింప జూచెను. అందులో "విష్ణు తత్త్వ వినిర్ణయము" ముఖ్యమైనది. జయతీర్థుడు (14 వ శతాబ్దాంతమా?) మధ్వాచార్యుల గ్రంథములపై టీకలు, "ప్రమాణపద్ధతి", "వాదావలి" యను స్వతంత్ర గ్రంథములు వ్రాసెను. ఈయన మహాపండితుడు, గొప్పవాది. వ్యాసతీర్థుడు (వ్యాసరాజస్వామి అనియు పేరు) (16 వ శ.) "న్యాయామృతము", "తర్కతాండవము" ఇత్యాది గ్రంథములు వ్రాసెను. న్యాయామృత మందీయన విలక్షణ ప్రతిభతో అద్వైత ఖండనమును, తర్కతాండవమున అప్రతిహత యుక్తులతో నవ్యన్యాయ ఖండనమును చేసెను. మధుసూదన సరస్వతి "అద్వైత సిద్ధి" యందీ న్యాయామృతమునే ఖండించినది. వ్యాస రామాచార్యుడు న్యాయామృతముపై "తరంగిణి"యను టీక వ్రాసి, అద్వైత సిద్ధిని ఖండించెను. డా. దాస్‌గుప్త అభిప్రాయము ప్రకారము అద్వైతుల యుక్తుల కంటె ఈ ద్వైత తార్కికుల యుక్తులే ప్రబలతరములు, ప్రతిపక్షుల యుక్తులచే అఖండితములును. బహుశః 17వ శతాబ్దమున ఉండిన రాఘవేంద్రస్వామి మధ్వ, జయతీర్థుల గ్రంథములపై సరళ టీకలు వ్రాసెను. వనమాలీ మిశ్రుడు, సత్యనాథుడు అను పండితులు అప్పయ్యదీక్షితుడు, మధుసూదన సరస్వతి చేసిన అద్వైత సిద్ధాంతములను ఖండించిరి.

మాధ్వమత మెక్కువగా పురాణాదులపై ఆధారపడి నట్టిదని అందురు. పురాణాదులు వేదోపబృంహణము చేయునవియే యని ఒప్పుకొనువారికి ఇది అసమ్మతము కాజాలదు. కాక, కొన్ని శ్రుతివాక్యములను తీసికొని అవియే ముఖ్యశ్రుతులని, తక్కినవి వ్యావహారికములు, గౌణములు అని అద్వైతులు వాదించునట్లే, ద్వైతులు కొన్ని వేదాంత వాక్యముల నాధారముగా గొని తమ దర్శనమును స్థాపించి, ఇతర వాక్యములను వ్యాకారణ నిరుక్తముల ఆధారముతో తమ కనుకూలముగ వ్యాఖ్యానించిరి. వాయు జీవోత్తమత్వము, తన్మాధ్యస్థ్యము (mediatorship) ను చెప్పుటచేతను; ముక్తిని భగవంతుడు తన ఇష్టము వచ్చిన వారికి ఇచ్చును, జీవుల ధర్మాధర్మములను చూచి భగవంతుడు వారిని వరించడు అను సిద్ధాంతమును ప్రతిపాదించుటచేతను; మాధ్వ మతము క్రైస్తవ మతము నుండి ఈ భావములను గ్రహించినదని కొందరందురు.[1] ఇది అయుక్తము. భగవంతుని సాక్షాత్తుగ సమీపించలేక, ఆయన భార్యద్వారానో, పార్షదుల ద్వారానో తమ మొరలను ఆయనకు మనవి చేయించు భావము శైవ వైష్ణవ భక్తి వాఙ్మయములో చాలాచోట్ల కలదు. "ప్రభువునకు చెప్ప నే నర్హుడను కాను. తల్లీ! నీవైన ఈ దీనుని అవస్థ వారికి చెప్పుము" అని పార్వతితో, లక్ష్మితో మొరపెట్టుకొనుట ఎన్నో ప్రాచీన స్తోత్రములలో కలదు. అట్లే నందీశ్వరుని, హనుమంతుని, గరుత్మంతుని ఆరాధించి వారి అనుగ్రహము ద్వారా శివుని, రాముని, విష్ణుని

---

* మాధ్వ సూత్రభాష్యమునకు హుండి రామారావు వ్రాసిన ఆంధ్ర ప్రతి పదార్థము 1927 లో వేదవ్యాస ముద్రాక్షర శాల, విజయనగరము ప్రకటించెను. గీతాభాష్య టీకానుసారము వ్రాసిన తెలుగు పుస్తకము కూడ కలదు.

1. క్రైస్తవ మతమున జీసస్ ఏకైక నిష్పాపుడగు నరుడు, దేవుడును కూడ; ఆయన ద్వారానే ముక్తి సాధ్యము. కొందరిని శాశ్వతముగా స్వర్గమునకో, నరకమునకో దేవుడు పంపును అను సిద్ధాంతము (predestination) కాల్విన్ మొదలగు వారిచే ఎక్కువగా బోధింపబడెను.

సంప్రీతులనుగా చేయు భావము పురాణాగమములందు ఎల్లెడల కలదు. కాబట్టి మాధ్యస్థ్య భావమును మధ్వాచార్యులు క్రైస్తవమునుండి తేనక్కరలేదు.[1] ఇక సర్వశక్తియు, సర్వస్వతంత్రుడునుఅగు భగవంతుడు పరనిరపేక్షముగ తన కిష్టమైన వారిని ఎన్నుకొని వారికి తన దర్శనమిచ్చును, ముక్తినిచ్చును అనియు; సాధ్య సాధకర్మల నాయనే చేయించు వాడనియు; కొందరికి కీర్తిని, పుణ్యమును ఇచ్చును, మరికొందరికపకీర్తిని, పాపమును ఇచ్చుననియు కొన్ని ఉపనిషత్తులలోను, గీతావాక్యములలోను స్పష్టముగ కలదు. భగవంతు "దకాండముగనే" కృపను చూపును అని శతకోపాచార్యుడు కూడ అహిర్బుధ్న్య సంహితాదుల ఆధారముపై చెప్పెను. కాబట్టి ఈ భావము కూడ క్రైస్తవ మతమునుండియే సంక్రమించ నక్కరలేదు. అయితే బౌద్ధము అద్వైతముపైన చూపినట్లే, నాడు కొంతవరకు ప్రచారమందుండిన క్రైస్తవము ద్వైతముపై కొంత ప్రభావమును చూపిన చూపియుండ వచ్చును; కాని ఆధారము కన్పడదు. "బ్రహ్మ తర్కము", "బ్రహ్మసారము'' అను గ్రంథములపై మాధ్వ భాష్యములు ఎక్కువగా ఆధారపడి యున్నట్లు కన్పడును. ఇవి ఇప్పుడు దొరకునట్లు కన్పడదు.

ఇక మాధ్వదర్శన సంగ్రహము : ధర్మాధర్మముల నంగీకరింపనివాడు సమయికాడు, వాడికి సమయ[2] ప్రయోజనము ఉండదు కాబట్టి. ధర్మాధర్మముల సిద్ధి అపౌరుషేయ వేదవాక్యముల వలననే ఆగును. అవి స్వతఃప్రమాణములు. సర్వవేదములకు మహాతాత్పర్యము విష్ణు సర్వోత్తమత్వము; పరానందమగు మోక్షము ఆయన ప్రసాదముచే లభించును.

వేదాంత వాక్యములందు జీవ బ్రహ్మభేదము గాని ప్రపంచ మిథ్యాత్వముగాని ఎక్కడను ప్రతిపాదించబడలేదు. ఒకవేళ అట్టి అభేదశ్రుతి యున్నను ఉపజీవకమగు ప్రత్యక్ష ప్రమాణముతో విరోధించుటచే అప్రమాణ మగును. ప్రపంచోపలబ్ధి, అందలి నానాత్వము,జీవుని అసర్వకర్తృత్వము అనుభవసిద్ధములు. కాక ఇది బహుప్రమాణసంవాదము కలదగుటచే దృఢము. అభేద ప్రతిపాదన సర్వ ప్రమాణ విరుద్ధమగుటచే అసత్యము. ఉపజీవ్యప్రమాణ ప్రాబల్యముచే భేదమే శ్రుతితాత్పర్యము. జీవేశ్వర భేదము ప్రత్యక్షానుమాన సిద్ధముకాదు, ఈశ్వరాస్తిత్వము శ్రుతిచే మాత్రమే తెలిసికోబడవలసినది కాబట్టి. అందుచే జీవేశ్వరభేదమును చెప్పు వాక్యములు అనువాదములు కావు. సర్వప్రమాణ విరుద్ధ వచనములే శ్రుతితాత్పర్య మనుట తగదు. కాక, నానాత్వము, వస్తువులలో కల భేదము ప్రత్యక్ష సిద్ధము అయ్యు, శ్రుతిచే కూడ చెప్పబడిన ప్రమాణ బహుత్వముచే దానికి దార్ఢ్యమే కలుగును కాని, అప్రమాణత్వము కలుగదు. కనుకనే బహువాక్య సంవాదము, అభ్యాసము ప్రామాణ్య హేతులని, తాత్పర్యలింగములని ఎంచబడినవి.

పదార్థ స్వరూపమే భేదము. ప్రాయముగా తక్కిన అన్నిటినుండి విలక్షణముగా నుండుటయే పదార్థ స్వరూపము. భేదము స్వరూప దర్శనము చేతనే సిద్ధించును. స్వరూపమే భేదము కానియెడల, పదార్థము చూబడినప్పుడు తక్కిన అన్నిటినుండి దాని వైలక్షణ్యము తెలియరాదు. వైలక్షణ్యము తెలియబడకపోయినచో, ఆత్మయే ఘటమను సంశయమును కలుగవచ్చును. కాని అట్టి సంశయ మెవనికి కలుగుట లేదు. తక్కిన అన్నిటినుండి ఒక పదార్థమునకు ప్రాయముగా గల వైలక్షణ్యమునే ఎరిగి, ఎప్పుడో ఏదో ఒకటి దానికి సదృశముగా కన్పడినప్పుడే ఎవడైనను సంశయించును. సామాన్యముగా ఒక పదార్థపు సర్వ వైలక్షణ్యము (తక్కిన అన్నిటినుండి దాని విలక్షణత్వము) ఎరిగిన పిదప, దాని ఘటత్వాది జ్ఞానము కలుగును. వస్తువును చూచుట యనగా దాని విలక్షణత్వమును చూచుటే. ఇది ఒక పరియే జరుగునా అనిన, ఒక్కసారిగ సామాన్య

1. వాయువు ప్రత్యక్షముగా బ్రహ్మము ఇత్యాది వాక్యములలో శ్రుతి వాయువు యొక్క ఉత్తమత్వము చెప్పినది.

2. సమయమనగా ఒక హద్దు, ప్రమాణము (standard), పరినిష్ఠిత సిద్ధాంతము.

ముగ దీపసహస్ర దర్శనము[1] జరుగుటలేదా? కాక వైలక్షణ్యములును భిన్నములు; పట వైలక్షణ్యము కాదు. ఇది అనుభవ సిద్ధము. కాబట్టి భేద దర్శనము యుక్తము. ఇట్లు భేదము ప్రమాణదృష్టమై యుండ, దానిని మిథ్య యనుట ప్రమాణ విరుద్ధము. ప్రమాణ దృష్టమగునది తర్కముచే బాధింపబడదు, ప్రత్యక్ష విరుద్ధము తర్కాభాసమే నని నియమము కావున. భేదము వ్యావహారికముగ నున్నది, పరమార్థముగ లేదని చెప్పతగదు. సదసద్వైలక్షణ్యము (సత్తు, అసత్తు కానిది)నకు ప్రమాణము లేదు. శుక్తియొక్క రజతత్వము కూడ సదసద్విలక్షణము కాదు - "అసత్తగు రజతమే కనుపించె'' నను అనుభవము ఉన్నందున. ఇట్లు ప్రతీతమైనందున అది అసత్తును కాదు. అసత్తుయొక్క సత్త్వ ప్రతీతి, సత్తుయొక్క అసత్త్వప్రతీతి-ఇట్టి అన్యథా ప్రతీతియే భ్రాంతి. అసత్తుకూడ ప్రతీతము కాగలదు కాబట్టియే దాని వైలక్షణ్యము తెలియబడుచున్నది. సత్తు, అసత్తు అను రెండే అనుభూయమానములు కాబట్టి, సదసత్తులు కానిది ఉన్నదనుట అనుభవ విరుద్ధము.[2] సారాంశ మేమన, అనిర్వచనీయ మగునది ఏదియు లేదు. ఇక అద్వైతులో అసత్తుయొక్క ప్రతీతి నంగీకరించరు; భేదము ప్రతీయమానము. కాబట్టి భేదము సత్యము. అందుచే 'అద్వితీయత్వము', అద్వైతము అసంభవము.

ఉపనిషత్తులో "అతత్త్వమసి'', "అది (భగవంతుడు) నీవు కాదు" అని వేదములన్ని చదివి తాను గొప్పవాని నని, తనకంటె అధికులు లేరని తలచుచున్న శ్వేతకేతువునకు ఉద్దాలకుడు బోధించెను. నీకంటె అన్యుడు, నీకు వేద జ్ఞానాదుల నిచ్చువాడు అగు పరుడొకడున్నాడు; అతనికి అధీనుడవు నీవు అనియే వేర్వేరు ఉదాహరణములతో ఉద్దాలకుడు శ్వేతకేతువునకు బోధించెను. అట్లే ''ఇది యంతయు ఐతదాత్మ్యము'' అనగా, 'ఏతదీయము' అని అర్థము. ఆ తత్వముచేత (వ్యాపించుటచేత), మాతృత్వముచేత ఈశ్వరుడే ఆత్మ యనబడును. ''తత్సత్యం స ఆత్మా ఉతత్త్వ మసి శ్వేతకేతో". "అది సత్యము, అది ఆత్మ, అది నీవు కాదు" అని ఈ వాక్యార్థము. అట్లే బ్రహ్మము నొక్కదాని నెరుగుటచే సర్వము ఎరుగవచ్చును అన్నప్పుడు బ్రహ్మము ప్రధానము కాబట్టి, కొంత సాదృశ్యము ఉన్నది కాబట్టి, అది కారణము కాబట్టి అటుల చెప్పబడినది. బ్రహ్మమునకు అన్యమైన దంతయు మిథ్య యని దీని అర్థము కాదు; అయినచో సత్యజ్ఞానముచే మిథ్యాజ్ఞానము సంభవము కాదుకదా! శుక్తిని ఎరిగినవవాడు రజతము నెరుగడు. ఇట్లే అభేద శ్రుతులుగా కన్పడువాటి నన్ని బాగుగా విచారించినచో అవి భేదమును తెలుపు శ్రుతులే. "అసదేవేద మగ్ర ఆసీత్" ఇత్యాది వాక్యములు అన్నిటికి ముందు అసత్తే ఉండెను అని బోధించినట్లు కన్పడినను వాటి తాత్పర్య మవి కానట్లు, అభేదమును బోధించుచునట్లు కన్పడు శ్రుతులు సమ్యగ్ విచారము చేయకపోవుటచే అట్లు కన్పడుచున్నవి.

జీవేశ్వరైక్యము ప్రత్యక్షానుమాన విరుద్ధము. ఎవరికిని నేను 'సర్వజ్ఞుడను, సర్వేశ్వరుడను, దుఃఖదోషములు లేనివాడను' అను అనుభవము లేదు. సర్వము తన పరికల్పనయే అని యెరిగినవా డెవడును శిష్యులకు బోధించుట మొదలయినవి చేయడు కదా! స్వప్న మని నిశ్చయించిన పిమ్మట ఎవడును స్వప్నపుత్రునికి ఆస్తిని యిచ్చుటకు ప్రయత్నించడు కదా! సత్యసంకల్పుడగు ఈశ్వరునిచే సృష్టించబడి రక్షించబడు ఈ ప్రపంచము మిథ్యకానేరదు-ఈశ్వరునికి భ్రాంతిలేదు కాబట్టి. కాక అధిష్ఠానము, సదృశమగు, తథ్యమగు వస్తుద్వయము లేనిదే భ్రాంతి కలుగదు. స్వప్నములందు కూడ ఇంతే. విశ్వము భ్రాంతి అని చెప్పినను అద్వైతము పొసగదు. మిథ్యోపాధులచే భేదము కలుగుచున్నది అనునది అర్థహీనము. అట్లు మిథ్యోపాధుల ఉనికిగాని, వాటిచే

1. వెయ్యి దీపములు వెలుగుచున్న ఒక్క చోటికి పోయినప్పుడు వెంటనే వాటన్నిటి సామాన్య సందర్శనమగును.

2. అసత్తుయొక్క ఖ్యాతి (ప్రతీతి, cognition) ఉండదను వానికి దాని ఖ్యాతి ఆయెనా, కాలేదా? కానిచో దాని ఖ్యాతిని నిరాకరించలేడు. అయినచో మంచిదే.

భేదము కల్గుటగాని ఎక్కడను చూడరాదు. కాక అజ్ఞానముచే మిథ్యోపాధి కలుగును. మిథ్యోపాధిచే బ్రహ్మము జీవుడగును, జీవుడున్నగాని తదాశ్రయ మగు అజ్ఞానము ఉండదు-అని ఇట్లు అన్యోన్యాశ్రయ ముగ, చాక్రికముగ చెప్పుట అసంగతము. ఒకవేళ ఉపాధి సిద్ధించినను, ఉపాధిభేదము ఎట్లు వచ్చినది? కర్మభేదము వలన అనినచో, అది ఎట్లు కలిగినదనిన ఉపాధిభేదముచే అనియు మరొక చక్రకము. శుద్ధ బ్రహ్మమందే భ్రాంతిగాని, అజ్ఞానముగాని ఉన్నదనుట అంతకంటె అయుక్తము. ఇట్లు అజ్ఞానముకాని, మిథ్యోపాధులు కాని నిరాశ్రయములు. అనుభవసిద్ధ మగు భేదమును-అనగా జీవేశ్వరభేదము, జీవులందు పరస్పర భేదములు-అంతకంటె బలవదనుభవము లేదుగాన కాదనరాదు. దుర్ఘటత్వమే[1] మిథ్యావస్తువునకు భూషణ మనిన, తక్కిన దంతయు మిథ్యయే కాన ఆత్మయు మిథ్యయే అను యుక్తిచే ఆత్మమిథ్యాత్వము కూడ ప్రసక్తమగును. అట్టి యుక్తిలో కల్పనాలాఘవముకూడ కలదు. ఇట్టు జగన్మిథ్యాత్వవాదము సర్వ మిథ్యాత్వ వాదమునకు దారితీయగలదు. కాన ఎటు చూచినను అద్వైతము సిద్ధించదు.

జగత్తు సత్యము. విష్ణువుచే సృష్టింపబడినది. ఆయన అన్నిటికంటె సర్వోత్తముడు, సర్వాధికుడు. ఆయన నిత్యపూర్ణుడు, అఖిల సద్గుణముల మూర్తి, సర్వదోష వర్జితుడు, ఏకమాత్ర సర్వస్వతంత్రుడు. ఆయన గుణ క్రియాదులన్నియు ఆయన స్వరూపమే. అనంతములయ్యు వాటియందు భేదములేదు. ఇది ఎట్లు అగునో తర్కమున కందదు; విష్ణుమహిమ అట్టిది. ఇట్లు విష్ణు స్వరూపమునకు, ఆయన గుణములకు, వాటియందును, పరస్పరభేదము లేదు. కాననే ఆయన ఏకమేవాద్వితీయుడని, 'నానాత్వరహితుడని చెప్పబడి నాడు. అశేషానంత సద్గుణుడయ్యు తనయందు గుణి గుణ భేదవర్జితుడై, అద్వితీయముగ, సర్వాతిశాయిగ, స్వతంత్రుడగు సర్వేశ్వరుడుగా శ్రీమన్నారాయణుడు విరాజిల్లుచున్నాడు. తద్భిన్నయు, తదధీనయు, నిత్య ముక్తయు, అప్రాకృత దివ్యదేహ సంపన్నయు నగు లక్ష్మి ఆయన భార్య.[2] ఆనందలక్షణముగల భగవదిచ్ఛ, భగవత్ప్రజ్ఞ, జ్ఞానరక్షణ శక్తులు కలిగి, బహురూప ధారిణియై లోకమును సృజించును, అదియే లక్ష్మి-అని భావము. విష్ణువు జగత్తునకు నిమిత్త కారణము, ప్రకృతి ఉపాదాన కారణము.

జీవులు అనేకులు, అస్వతంత్రులు, అణు రూపులు, చేతనులు. వీరిలో కొంద రెప్పుడు సంసార చక్రమునందు తిరుగుచునే ఉందురు; ఎన్నడు ముక్తులు కారు. కొందరు ముక్తికి యోగ్యులు. జీవులకు ఈశ్వరునికి చిత్త్వమును (చేతనత్వము) మాత్రము తీసి కొనిన సాదృశ్యము ఉన్నది. కాని తక్కినగుణముం నన్నిటిని వివేచించి చూచిన, వారల అత్యంత భిన్నత్వము, పృథక్త్వము సిద్ధమగుచునే యున్నది. భగవంతుని గుణోత్కర్షను తెలిసికొనినవాడు భగవంతునికి ప్రియుడు; అనగా ఆయన పురుషోత్తముడు, సేవ్యుడు, స్వతంత్రుడు అనియు, జీవుడు అల్పుడు, సేవకుడు, అస్వతంత్రు డనియు తెలిసికొన వలెను. తారతమ్య జ్ఞానము పొంది (ప్రపంచమందలి జీవులన్నియు జ్ఞాన సుఖాదులందు ఒకదానికంటె ఒకటి హెచ్చు తగ్గులు కలవి, అన్నిటికి పరాకాష్ఠ, అవసానము భగవంతుడు అని గ్రహించుట), భగవంతుని పురుషోత్తమత్వ మెరిగి, ఇతర విషయ తిరస్కార పూర్వకముగ భగవద్విషయకమగు అఖండ స్మృతి కలిగి యుండుటచే ముక్తి కలుగును. వీటన్నిటిచే దాని యంతట అది ముక్తిరాదు. భగవదనుగ్రహము చేతనే అది కలుగును. పరమభక్తి పరమానుగ్రహమునకు అవకాశ మిచ్చును, దానికి కారణము కాదు. అనుగ్రహము నైసర్గికము, అవ్యాజము; ఏలన క్షుద్రుడు, అల్పుడు అగు జీవునికి ఎప్పుడును భగవదనుగ్రహము హక్కుగా లభించదు. ఆయన అపే

1. అసంభవత్వము (impossibility).

2. ఇదే ప్రకృతి. 'ద్వావేవ నిత్యముక్తౌ తు పరమః ప్రకృతి స్తథా' అని 'భాగవత తాత్పర్య నిర్ణయము'న మాధ్వవచనము. ప్రకృష్టముగ చేయునది ప్రకృతి, అదే మహామాయ; మానత్రాణకర్త్రి గాన మాయ. (విష్ణుతత్త్వ వినిర్ణయము).

తుక కృప, అనుకంప వలన జీవునికి అనుగ్ర హార్హత వచ్చును. అప్పుడు మోక్షప్రాప్తి.

## ఇతర వేదాంత రాద్ధాంతములు

శుద్ధ దార్శనిక దృష్టితో చూచిన శాంకర, రామానుజ, మాధ్వ దర్శనములలో నున్నంతటి గాంభీర్యము కానరాని వేదాంత దర్శనములు మరి కొన్ని గలవు. ఇట వేదాంత దర్శనములు అనగా ప్రస్థానత్రయమును స్వీకరించి, బాదరాయణ సూత్ర ములపై తమ సంప్రదాయానుకూలమగు భాష్యము గలవి. ఇవి యన్నియు ప్రస్థానత్రయముతోపాటు శైవ, వైష్ణవాగమములనో, భాగవతమునో సమాన ప్రమాణములుగా గలవి. బ్రహ్మము శివుడో, విష్ణువో అని చెప్పునవి. వీటిని అకారాదిగ ఆయాచోట్ల ఈ గ్రంథమున వివరించినను ఇట చాల సంక్షిప్తముగ సమీక్షించెదము.

**శివాద్వైతము:** శైవమతము అతిప్రాచీనము. అదొంక శాఖ పాశుపతులది (చూ. పాశుపతులు). దీనికి చెందిన శ్రీకంఠులు బ్రహ్మసూత్రముపై భాష్యము వ్రాసినాడు. దీనిపై అప్పయ్య దీక్షితులు (1553-1625) 'శివార్కమణి దీపిక' యను వ్యాఖ్య వ్రాసెను. అందులోనే "మహాపాశుపత జ్ఞాన ప్రవర్త కుడు" శివుని "అంశావతారము", "యోగా చార్యుడు" అని ఆయన శ్రీకంఠుని స్తుతించెను. కాన శ్రీకంఠులు పాశుపత సంప్రదాయపు యోగి. ఈయన 'నానాగమ విధాయి' యగు శ్వేతుని శిష్యుడు.

శ్రీకంఠులు శంకరుని మతోల్లేఖము చేయుటచే ఆయనకు పరవర్తి. శివ పారమ్యమును చతుర్వేద ములు ఘోషించుచున్నవని నిరూపించుటకు హరదత్త శివాచార్యుడు "శ్రుతి సూక్తిమాల"ను వ్రాసెను. ఇతడు 11 వ శతాబ్దమున ఉండినట్లు కొందరు వ్రాసిరి. ఈయన గ్రంథము శ్రీకంఠుల కుపజీవ్య మనునది నిజమైనచో (!) శ్రీకంఠుడు ఆయన తరు వాతివాడు కావలెను.[1] కొందరాయనను 13వ శతాబ్దపు ఉత్తరార్ధమందుండిన వానినిగా ఊహించిరి. కొందరు ఆయన రామానుజులకు పూర్వవర్తి యందురు. (అయప్పదీక్షితు లిట్లు సూచించెనా యని సంశయము.) శంకరులకు కూడా పూర్వవర్తి అనువారును కలరు! ఈయన వ్రాసిన భాష్యమునే కొందరు నీలకంఠ భాష్యమనిరి. కాని అది అయుక్తము. ఏలన, నీలకంఠ, శ్రీకంఠులను వేర్వేరు ఆచార్యులనుగా శ్రీకర భాష్య మందు శ్రీపతి పండితుడు పేర్కొనినాడు. నీలకంఠుని భాష్యము ఇప్పుడు దొరకుట లేదు. కాని దాని నాధారము చేసికొని వ్రాయబడిన 'క్రియాసార' మను కారికా గ్రంథము దొరుకుచున్నది.

శ్రీకంఠుని మత మిది: బ్రహ్మము సగుణము, సవిశేషము, మహామహిమము. జ్ఞానానందాది శక్తి సంపన్నము, కలంక రహితము, సృష్టిస్థిత్యాదుల కర్త. ఆయన చిచ్ఛక్తివలన జగత్తుగ పరిణమించినాడు. ఆయన శివుడు ; ఈశ్వర పశుపత్యాది పర్యాయ శబ్ద సారముచే ప్రకాశితుడు. సర్వజ్ఞత్వ, నిత్యతృప్తత్వ, అనాది బోధత్వ, స్వతంత్రత్వ, అలుప్తశక్తిమత్త, అనంతశక్తిమత్త్వాదిధర్మముల పర్యవాసనము శివుడు. ఆయనకు ఆకాశము ('ఆ కాశత ఇత్యాకాశః-ప్రకాశః, చిదంబరం ఉచ్యతే') శరీరము. 'నిఖిలజగదండ షండ బుద్బుద నికురుంబ జలధిస్థానీయ'[2] మగు పర ప్రకృతి రూపమగు పరమశక్తియే చిదంబరము. ఆకాశమునుండి భూతములు బయల్వెడలి అందే అస్త మించునని ఈ చిదంబరమును గూర్చియే శ్రుతి చెప్పి నది. శక్తి శివుని ఆత్మసత్తారూపము. చిదచిత్ప్రపంచ రూపకమగు శక్తిచే బ్రహ్మము స్వాభావికముగానే విశిష్టము. అనంతశక్తి కలదు గాన బ్రహ్మము అపరి చ్ఛిన్నమగు ప్రపంచ సమవాయి కారణము. అన్ని వస్తువులందు అనుగత వృత్తిగా కలది యగుటచే సద్రూపమగు బ్రహ్మకు సర్వోపాదానత్వము సిద్ధము. వేదాంత వాక్యములచే ఇది యంతయు తెలియును.

జీవులు అనాదియగు అజ్ఞానవాసనచే విజృం భితులు. కాన నానా కర్మల భోగముకొరకు నానా

1. హరదత్తుడు శ్రీకంఠుని భాష్యముపై టీక వ్రాసెనను ఐతిహ్యమును కలదు.

2. ప్రపంచములోని వస్తువులనే బుడగలకు సము ద్రము వంటిదని భావము.

శరీరములలో ప్రవేశించుచు, నిర్గమించుచు, పరవశులై నిస్సీమ (హద్దులేని) తాపములను సహించుచున్నారు. జీవులు చేతనులు, పరిచ్ఛిన్న శక్తులు, కర్తలు, భోక్తలు; జీవులు నిత్యులు, అణువులు, తమ ప్రవృత్తికై పరమేశ్వర సాపేక్షులు. జీవులు పరమేశ్వరాంశ భూతులు, అనగా ఆయన మూర్త్యైకదేశులు, ఆయనచే వ్యాప్తులు (కాష్ఠము అగ్నిచే వలె).

కామ్య నిషిద్ధ కర్మలను త్యజించి నియత కర్మలను నిష్కామముగా చేయుట వలన చిత్తము శుద్ధమగును. భక్తి దృఢము కాగా ఉపాసన, దాని వలన ముక్తి కలుగును. వేదాంత వాక్యములు బ్రహ్మ మును ప్రతిపాదించుటయే గాక, దాని ధ్యానమును కూడ 'ఆత్మా వా రే ద్రష్టవ్యః'[1] ఇత్యాదులందు విధించు చున్నవి. కర్త యొక్క మోక్షఫలము కొరకై ఇట్టి విధులు ఉపపన్నములు. వేదాంత వాక్యజన్య జ్ఞానము పరోక్షము; దానిపై ఆధారపడిన ధ్యానము (ఉపాసనా రూపకమగు జ్ఞానము) సాక్షాత్కార హేతువు. సాక్షా త్కారము మోక్షహేతువు.

శివుడనబడు పరబ్రహ్మము జీవునికంటే అధిక మైనప్పటికిని, ఉపాసించువాడు 'నేను బ్రహ్మను' అని ఉపాసించవలెను. ఉపాసకులు ఉపాస్యము వేర్వేరు వస్తువులయ్యు ఉపాసకులను పరబ్రహ్మము అనుగ్ర హించును; స్వాత్మగా దానిని వారు గ్రహింతురు. నిష్కళంక శివత్వ ప్రాప్తియే విముక్తి; అది పశుత్వ నివృత్తి కానిది సంభవించదు. శివత్వభావన చేయనిదే పశుత్వ నివృత్తి కాదు. కాబట్టి, నిరంతరముగా 'నేనే శివుడను' (శివోఽహం) అను భావనా ప్రవాహముచే పాశము (బంధము) శిథిలమగును, పశుభావము పోవును. అప్పుడు ఉపాసకుడు శివుడగును. సమస్త దోష కలంకములు నిరస్తములైనట్టి నిరతిశయ మంగళాస్పదత్వమే శివత్వము. పరబ్రహ్మమును అట్టిది. కాబట్టి దాని భావనచే ఉపాసకుడు దానివలె నగును. 'నేను బ్రాహ్మణుడను' మొదలగు దేహాభిమా నము పశుభావము. అది పోయి శివరూపమగు పరమా హంభావాపత్తి ముక్తి అని శ్రుతితాత్పర్యము. నేను నిరతిశయ ఆనందరూపుడను, కేవల సాక్షిని, స్వయం ప్రకాశుడను, శివుడను - అను భావము ఏర్పడుట ముక్తి. అది ఉపాసనచే-నేనే శివుడను అను సతత ధ్యానముచే కలుగును. తత్ - ఆ శివుడవు, త్వం - నీవు, అను 'తత్త్వమసి' ఇట్టి ఉపాసనను విధించు వాక్యము.

ముక్తియందు జీవునికి తన సహజ స్వరూపా విర్భావము కలుగును. బ్రహ్మముతో సదృశమగు గుణములు కల స్వరూపము అతని కప్పుడు ఉండును, అనగా, మలావరణము[2] తొలగిపోవుటచే నిజరూపము ఆవిర్భవించును. శివుని ప్రసాదము వలన ఆవరణ మందు మలము విగళితము కాగా, ఆయనతో సదృశ గుణములు కల ఆత్మస్వరూపము ప్రాదుర్భవించును. కర్మఫలములవలె అది ఉత్పాదింప బడదు. ముక్తునికి స్వాభావికమగు చిదానందఘనము, సర్వజ్ఞత్వాది విశిష్టమునగు స్వరూపము ఆవిర్భవించును. అంత దనుక మల మావరించి ఉండును; దానివలననే కదా సంసారము! ఆ మల మనాది. మలవిగళనము శివాను గ్రహము వలన నగును. బ్రహ్మమునకు, ముక్తునకు సకలకామావాప్తి ఉండును, జగత్కర్తృత్వాదు లుండవు. ముక్తుడు వికారభావములకు లోనుగాని విశుద్ధ పరిపూర్ణ బ్రహ్మస్వరూపమును, సుఖమును అనుభవించును, అసంకుచిత శక్తి కలిగియుండును. అతడు 'పరమానంద ప్రకాశ విభూతిమయ శక్తిశివ సామరస్య పరబ్రహ్మస్వరూపైకరస ప్రపంచావ గాహి'గా నుండును. ఈ అనుభవమును "నేను అనుభవించుచున్నాను" అని అతడెరుగగలడు కాని ఇది సాంసారికమగు ప్రాకృతాహంకారము కానట్టి విలక్షణమగు అహంకారము.

శక్తిశివాద్వయమగు బ్రహ్మమే ప్రపంచ జాలము; ప్రపంచాకారమున ఉన్నది శివుడే. సూక్ష్మ చిదచిద్విశిష్టము అగు బ్రహ్మ కారణము, స్థూలచిద చిద్విశిష్టమగు బ్రహ్మ కార్యము. ఇవియే శివాద్వైతము

---

1. 'ఓరీ ఆత్మను చూడవలయు'నని భావము.

2. మల మన పాపము.

కర్మమీమాంసా, బ్రహ్మ మీమాంసల నేకశాస్త్ర ముగ తలచుట, కర్మ వేదాంత జ్ఞానములపై ధ్యానము (ఉపాసన రూపమగు జ్ఞానము) ఆధారపడవలెననుట, కర్మానుష్ఠానముచే చిత్తశుద్ధి కలుగనిదే జ్ఞాన అసంభవత్వమును చెప్పుట, బ్రహ్మము చిదచిద్విశిష్ట మని చెప్పుట, శక్తి లేదా శరీర విశిష్ట బ్రహ్మమే జగత్తుగా పరిణమించు ననుట, మోక్షమందు ముక్తులకు బ్రహ్మముతో భోగసామ్యమేగాని జగద్వ్యాపారాములుండ వనుట, బ్రహ్మము కళ్యాణగుణాశ్రయమనుట - ఇవన్నియు రామానుజ, శ్రీకంఠు లిద్దరికి అంగీకార్యములు. వీరిలో ఎవరు ముందో వారిచే రెండవ వారు ప్రభావితులు. పరమేశ్వరుడు విష్ణువని ఒకరు, శివుడని ఒకరు నమ్మి, తత్తత్ సర్వోత్కృష్టత్వమును సిద్ధము చేయుటకు చాల ప్రయత్నము చేసిరి. విష్ణువని ఎట్టి స్వరూపము గలదానిని రామానుజులు చెప్పెనో, అట్టి స్వరూపము గలదానినే శివుడని శ్రీకంఠులు అనెను; ఇద్దరును అట్టి తత్త్వమొకటే కలదని చాటిరి. అట్టిచో, వస్తుభేద ప్రతిపత్తి నశించి, ఏది శివుడో అదే విష్ణు వనుభావము వీరికేల కలుగలేదో!*

శ్రీకంఠుల ఉపాసనా విధానము 'ఏ భావముండిన అది యగును' (యద్భావః తద్భవతి) 'దేనిని ఎల్లప్పుడు తదేకముగా, గాఢముగా తలచునో దానివలెనే అగును' అను అభ్యుపగమముపై ఆధారపడియున్నది. అయితే ఈ సందర్భమున శివసాదృశ్యము (అదియే శివత్వము) ఆత్మస్వరూపమనియు, ధ్యానముచే (ఉపాసనచే) అది అభివ్యక్త మగుననియు కూడ ఆయన చెప్పె నని గుర్తుంచుట మంచిది. 'దేహాదులు నేనే' యను అభిమాన రూపమగు అహంకారము (ప్రాకృతమైనది) పోయి, 'నేను శివుడను' అను అహంకారము (దివ్యమైనది) కలుగుట మోక్షము. వృత్తి నిరోధము, చిత్తనాశము ఫలముగా గల పాతంజల యోగమునకు భిన్నమగు మరొక విధమగు యోగ మిది. శ్వేతాశ్వతర్యాదుపనిషత్తులో దీని బీజము కలదు.

**విశేషాద్వైతము :** రేణుకాదిపంచాచార్యులచే ప్రచారము చేయబడిన ఒక శైవమత సంప్రదాయము కలదు. వీరిలో ఒకరగు ఏకోరాముడును, రేణుకుడు కూడ బ్రహ్మ సూత్రములపై భాష్యములు వ్రాసిరి.[1] పండితారాధ్యు డను ఆచార్యుడు దుర్వాస వృత్తి నాధారముగా గొని బ్రహ్మ సూత్ర భాష్యము వ్రాసెను. విశ్వారాధ్యుడును, ఈ పండితారాధ్యుడును మహానారాయణోపనిషత్తుపై కూడ భాష్యములు వ్రాసిరి. పండితత్రయమని ఆరాధ్య బ్రాహ్మణులచే మాన్యులగువారిలో నొకరగు శ్రీపతి[2] బ్రహ్మ సూత్రములపై 'శ్రీకర భాష్యము'ను వ్రాసెను. అందుచే ఈయనకు శ్రీకరాచార్యు డనియు అన్వర్థ నామము.

శ్రీకర భాష్యము ప్రతిపాదించిన మతసంగ్రహ మిది: ద్వైతాద్వైతము, లేదా విశేషాద్వైతము, లేదా వీరశైవ సిద్ధాంతము ఇది సర్వశ్రుతుల సమన్వయ ఫలము. 'వి' యనగా శివుడు, 'శేష' మనగా జీవుడు. ముక్తియందు వీరల యోగము అద్వైతము. వీరల

---

* కృష్ణపింగళుడు. విరూపాక్షుడు, త్రిలోచనుడు, కైలాసవాసి శివుడు; శ్రీనివాసుడు, మేఘశ్యాముడు, పద్మనేత్రుడు, వైకుంఠవాసి విష్ణువు - అను మానవీయ గుణారోపణ (anthropomorphism) చే జనించిన భావములు ఉండుట దీనికి కారణము. వారు వారు ఎరిగిన ఐతిహాసిక (లేదా అటుల నమ్మబడిన) సంఘటనలే ఈశ్వర లీలలనుగా తలచుట మరొక కారణము. ఉదాహరణము : హాలాహలము పానము చేసిన వాడే భగవంతుడు; కాదు, గోవర్ధనమెత్తిన వాడే భగవంతుడు - అను భావములు, యూదులను ఈజిప్టు నుండి వెలికి గొనివచ్చిన వాడే దేవుడు, ఇతరులు దేవుడనుకొనువాడు కాడు; లేదు, వేదములను ప్రకాశపరచిన వాడే దేవుడు - అను వస్తుభేద ప్రతిపత్తియు చూడగా నిట్టి కారణముచే కలిగినదే. ఇది పెద్ద సమస్య. దాని దిశకు ఊరకే సంకేతము చేసితిమి. మత యుద్ధములకు ఇట్టి భావముల ఉగ్రత హేతువు.

---

1. వీరలను గురించి మతముల సమీక్షలో కొంచెము చెప్పెదము.

2. 14వ శతాబ్దపు చివరి అర్ధభాగమున ఉండియుండును. బెజవాడ వాస్తవ్యుడు.

సంబంధము ద్వైతా ద్వైత మని తెల్పునది విశేషా ద్వైతము. అగ్నినుండి విస్ఫులింగములు లేచినట్లు, బ్రహ్మము నుండి జీవులు ఉద్భవించుచున్నారు. "యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగాః"[1] అని ఉపనిషత్తు దీనిని చెప్పినది. అట్లుద్భవించిన జీవుడు అనాదిగ సుఖ దుఃఖరూపమగు కర్మఫలమును అనుభవించుచున్నాడు. బ్రహ్మము క్లేశకర్మాద్యపరామృష్టుడై ఎప్పుడు శుద్ధుడుగ నుండును. దీనిని "ద్వా సువర్ణా సయుజా"అని వేదాంత వాక్యము బోధించినది. శివజ్ఞానముచే ముక్తుడైనవాడు నదులు సముద్రములో పడి నామ రూపములు పోగొట్టుకొనునట్లు శివునియందు సామరస్యమును పొందును. ఇదియే "యథా నద్యః స్యందమానాః సముద్రే" అను శ్రుతి వాక్యము చెప్పినది. దీని అభిప్రాయ మేమన, జీవేశ్వరులకు ఘటపటముల మధ్యవలె అత్యంత భేదము లేదు; రజ్జు సర్పము లందు వలె జీవేశ్వరులలో ఒకడు మిథ్యకాదు. ఈ రెండును ప్రతి విరుద్ధములు. సంసార దశలో జీవ బ్రహ్మల భేదము, ముక్తిలో అభేదము తెలుపు 'ద్వైతా ద్వైతము'ను శ్రుతులు సమన్వయ పూర్వకముగా బోధించును.

"శక్తిశ్చ శక్తిశ్చ శక్తీ, తాభ్యాం విశిష్టౌ జీవేశౌ, తయోరద్వైతం శక్తి విశిష్టాద్వైతమ్". అనగా, శక్తి విశిష్టుడగు జీవుని, శక్తి విశిష్టుడగు శివుని సామరస్యమును, ఏకాకారతను (అదే అద్వైతము) బోధించును గాన ఈ వాదము శక్తి విశిష్టాద్వైత మనికూడ అనబడినది. పరమశివుడు ఎప్పుడును శక్తి యుక్తుడు. శక్తి ఆయనకు స్వాభావికము. జ్ఞాన బల క్రియాది నానారూపముగా ప్రసరించునట్టి ఇది ఆయన 'ప్రజ్ఞ'- చిచ్ఛక్తి. ఇదియే మాయ. మం - శివం, అయతి- స్వభావతః ప్రాప్నోతి ఇతి, అనగా శివునికి స్వభావముచే ప్రాప్తమైనట్టిది మాయ. ఇది విమర్శ శక్తి రూపము; అవిద్యారూపము కాదు. ఇదియే ఉమ, పార్వతి. సమస్త లోక నిర్మాణమునకు ఇది సమవాయి కారణము, ఎల్లప్పుడు శివునితో సమవేతము; ఆయన ఇచ్చచే సాక్షాత్స్వరూపము కలది. శివశక్తులకు భేదము, అభేదమును కూడ కలదు. శక్తి విశిష్టుడగు శివునియందు జగదుత్పత్తి అయినది. బ్రహ్మమునకు 'నేనున్నాను' (అస్మి), 'జ్ఞానమందు ఆనందించు చున్నాను' (ప్రకాశే నందామి) - అను అనుభవము కలదు. ఈ అనుభవమే విమర్శ శక్తి. సర్వజ్ఞతా రూపమగు చిచ్ఛక్తికి, సర్వకర్తృత్వ రూపమగు అచిచ్ఛక్తికి ఆశ్రయమైనది విమర్శ శక్తి. ఇందు ఇచ్ఛా శక్తియు అంతర్భూతము. విమర్శ శక్తియందు మయూరాండ రసన్యాయముగా చరాచర ప్రపంచ మంతయు లీనముగా నుండును.

చిత్తశక్తి విశిష్టము, అనాది అవిద్య సంబంధము కలది అగు శివాంశమే జీవుడు. చిత్త మనగా ప్రకృతి. సృష్టిదశలో విమర్శ శక్తిలోని జ్ఞాన క్రియాశక్తులు భిన్నమై మోహోత్పత్తి కారకములగును. ఈ మోహ కారణమే ప్రకృతి; అదియే చిత్తము. జీవునికి కించిద్జ్ఞత్వము, కించిత్కర్తృత్వము కలవు. మండుచున్న అగ్నినుండి లేచిన రవ్వల వంటివి శివునినుండి వెలికి వచ్చిన అంశములు, అవే జీవులు. వానికి, శివునికి భేదాభేదము.

నిర్వికారమయ్యు శక్తిసహిత శివతత్త్వము నుండి సాలీడునుండి మగ్గము వచ్చినట్లు చిదచిద్ జగత్తు - చరాచర ప్రపంచము-ఉత్పత్తి అయినది. శివ, జగత్తులకు భేదము లేదు, అభేదమును లేదు. ప్రపంచము మిథ్యకాదు, అది శివస్వరూపము కాబట్టి. షట్ స్థలాత్మకమగు[2] (చూ. వీరశైవము) శివయోగముచే శుద్ధుడైన జీవుడు "అంగము", శివుడు "లింగము" అగును. ఇది "శివోఽహ" మను భావనచే లబ్ధమగు లింగాంగైక్యము, లేదా జీవ బ్రహ్మైక్యము.

---

1. "యథా సుదీప్తాత్ పావకాద్ విస్ఫులింగా" అని ముండకశ్రుతి.

2. స్థల మనిన దేహమునందు శివు డాక్రమించిన చోటు (సంగ్రా).

ఇట్లు వీరశైవ సిద్ధాంతములకు[1], వేదాంతమునకు సమన్వయము చేకూర్చి విశేషాద్వైతము శ్రీకర భాష్యమున, అన్య సంస్కృత గ్రంథములందు వివరింపబడినది.

**భేదాభేదవాదములు :** శంకరుల పూర్వుడగు భర్తృప్రపంచుని లోగడ పేర్కొంటిమి. శంకరుల తర్వాత, రామానుజులకు ముందు ఉండిన (9 వ శతాబ్దమా)[2] **భాస్కరుడు** బ్రహ్మసూత్రములపై ఒక భాష్యము వ్రాసి, శంకరాద్వైత ఖండన చేయుటకు చాల ప్రయత్నించెను. ఈయన మతములో బ్రహ్మ నిరాకారము, సాకారము, నిర్గుణము, సగుణమును కూడ. కారణ రూపమున నిర్గుణము, నిరాకారము. కార్యరూపమున సగుణము సాకారము. బ్రహ్మము యొక్క భోక్తృశక్తి జీవరూపమున, భోగ్యశక్తి అచేతన జగద్రూపమున పరిణతమగును. చేతనము, సర్వజ్ఞము, స్వతంత్రమునగు బ్రహ్మ స్వేచ్ఛచే లోకహితార్థము తనను తానే పరిణామము నొందించుకొనును. ఇది శాస్త్రైకసమధిగమ్యము. జీవుడణు రూపుడు, బ్రహ్మము యొక్క అంశము. అతడు బ్రహ్మమునుండి భిన్నాభిన్న స్వరూపుడు, కాని అభిన్న రూపము స్వాభావికము. భిన్న రూపము ఔపాధికము. పాము దాని చుట్టల నుండి, సువర్ణము కంకణాదులనుండి భిన్నము కాన్నట్లు ఒకే బ్రహ్మము నానా వస్తువులకు ఏక కారణమయ్యు వాటినుండి భిన్నము కాదు, అభిన్నమును కాదు. నిర్వికారము, జగత్కారణము అగు బ్రహ్మమును "నేనే బ్రహ్మమును" (అహం బ్రహ్మాస్మి) అని ధ్యానించుటచే జీవుడు దేహాత్మ భావమును వదలి బ్రహ్మభావమును పొందును. ఇట్లు ఉపాసనచే బ్రహ్మభావము కలిగినవారికి మరణానంతరము ముక్తి కలుగును. ముక్తిలో జీవులు బ్రహ్మముతో అభిన్నత్వమును పొందదెరు. ఉపాసన కవసరమగు జ్ఞానము కర్మానుష్ఠానముపై ఆధారపడి యున్నది. భిన్నాభిన్న రూపమగు బ్రహ్మమును ప్రతిపాదించు ఈ వాదము భేదాభేదవాదము.

16 వ శతాబ్దమున (17 వ శతాబ్దారంభమా?) ఉండిన **విజ్ఞాన భిక్షువు** సాంఖ్య వేదాంతములకు సమన్వయము చేయుచు, బ్రహ్మసూత్రముపై 'విజ్ఞానామృత' మను భాష్యము వ్రాసెను. ఉపనిషత్తులపైన, గీతపైన కూడ భాష్యములు వ్రాసెను. శుద్ధసత్త్వమగు ఉపాధి కలవాడును, క్లేశకర్మాదులచే అపరామృష్టుడును, శక్తి సహితుడును అగు చేతన విశేషుడు ఈశ్వరుడు. ఆయన యందు ప్రకృతి పురుషులు అంతర్లీనముగా ఉన్నవి. బ్రహ్మమునుండి అవిభక్తమగు ప్రకృత్యాదులకు అది సాక్షితామాత్రముగా ఉపష్టంభకము. కాబట్టి జగత్కారణ మయ్యు బ్రహ్మము నిర్వికారముగ ఉండును. బ్రహ్మము జగత్తునకు ఆధార, లేదా అధిష్ఠాన కారణము. సృష్ట్యాదిన జలమునుండి అవిభక్తములగు పార్థివ సూక్ష్మాంశములు (తన్మాత్రలు) జలము యొక్క ఉపష్టంభము వలన పృథివ్యాకారముగా పరిణమించునట్లే అవికారియు, చిన్మాత్రమును అగు బ్రహ్మము జగత్తునకు అధిష్ఠాన కారణము, జగత్తునకు అభిన్నమును. జీవులు బ్రహ్మమున కంశములు. పితాపుత్రన్యాయములో వలె జీవబ్రహ్మములకు అవిభాగము[3] కలదు. జీవుని అంశత్వము అతడు బ్రహ్మముతో ఏకరూపుడని, ప్రకృతికి వేరు అని తెలియపరచును. జ్ఞానులు బ్రహ్మమును తమ ఆత్మగా "సోఽహం" (అదే నేను) అని గ్రహింతురు. శ్రుతులయందలి అభేదవాక్యములు ఈ అవిభాగమునే తెల్పును. అయితే జీవులు బ్రహ్మమునకు వేరైనవి, దానిచే ప్రేరేపింపబడునవి ("పృథగాత్మానం ప్రేరితారం" అని శ్రుతి), బ్రహ్మము వానికిని ప్రకృతికిని

---

1. వి - వికల్పము, ర - రహితము, వికల్ప రహిత శివుని బోధించునది వీరశైవము.

2. ఉదయనునికి (10 వ శ.) ముందువాడు అని మాత్రము నిశ్చయము.

3. అవిభాగము ఆధారతవలె నొక స్వరూప సంబంధ విశేషము, అత్యంత సమ్మిశ్రణరూపము. ఉదా : పాలు నీళ్ళ ఏకతాప్రత్యయమును కలిగించునట్టిది.

కూడ పరము. ఈ భేద జ్ఞానము, ప్రకృతి పురుష వివేకము లేనిదే మోక్షము రాదు. అజ్ఞాని యైనను, జ్ఞానియైనను మరణమువరకు వర్ణాశ్రమానుకూలముగ కర్తవ్యము నాచరించవలెను. ముక్తియందు జీవులకు ఈశ్వరునితో సమానమగు భోగము లభించును. అప్పుడు కూడ జీవేశ్వరభేదము పూర్తిగా నశించదు. ఇదియు నొకవిధమగు భేదాభేదము; ఏలన బ్రహ్మ, ఆత్మలభేదము, అభేదము - ఈ రెంటిలో ఒకదాని జ్ఞానము, వివేకము నిచ్చి అవిద్యను తొలగించున దనియు, రెండవది వాటి అవిభాగమును నిర్దేశించు ననియు విజ్ఞాన భిక్షువు మతము.

## వైష్ణవ వేదాంతములు

బ్రహ్మ సూత్రములపై "వేదాంత పారిజాత సౌరభ"మను గ్రంథమున నింబార్కాచార్యులు (14 వ శ. ఆఖరున)* భేదాభేదమును, లేదా ద్వైతాద్వైతమును బోధించెను. జీవులు అనేకులు. వారు జ్ఞాన స్వరూపులు, హరికి (బ్రహ్మమునకు) అధీనులు, శరీర సంయోగ వియోగము కలవారు. అణురూపులు, హరి అంశములు. నిఖిల వస్తువులు యథార్థములు, అవి బ్రహ్మాత్మకములు కావున. బంధమోక్షక్షముడగు జీవుడు ఎప్పుడును భగవంతుని అంశమే, ఆయన నుండి ఎప్పుడును పృథక్‌గా ఉండడు; చెట్టునుండి ఆకులు, దీపమునుండి దాని ప్రభ వేరుకానట్లు. కాని జీవుడు భగవంతుని అంశ మాత్రమేగాన ఎన్నడు భగవంతునితో పూర్తిగ ఒకటికాడు. కాక బద్ధావస్థలో జీవు డజ్ఞుడు, దుఃఖాది భోక్త. ఇట్లు జీవబ్రహ్మల భేదా భేదము ఉపపన్నము. బ్రహ్మమునకు త్రిరూపములు : ఈశ్వరుడు, ప్రకృతి, పురుషులు. సృష్టి కారణము కాన బ్రహ్మము సగుణము; జగత్తు బ్రహ్మ పరిణామమేగాన బ్రహ్మాభిన్నము. బ్రహ్మము నిర్వికారము, స్వరూపమున జగదతీతము, కాన నిర్గుణుడు. ఇట్లు జగద్బ్రహ్మల మధ్యకూడ భేదాభేద సంబంధమే. ముక్తావస్థయందు జీవుడు తన బ్రహ్మస్వరూపత్వము నుపలబ్ధి చేసికొని తదభిన్నత్వము ననుభవించును.

* డా. దాస్ గుప్త అభిప్రాయము.

కృష్ణరూపుడగు బ్రహ్మము పట్లగల భక్తియే మోక్షమునకు గతి. "నాన్యాగతిః కృష్ణపదారవిందాత్."

నింబార్కుని గ్రంథములపై శ్రీనివాసుడు, పురుషోత్తముడు, దేవాచార్యుడు, కేశవాచార్యుడు టీకలను, వివరణలను వ్రాసిరి. ఈ మతమును అనుసరించి విశ్వనాథ చక్రవర్తి గీతపై టీక వ్రాసెను.

నింబార్కునికి పూర్వుడు, రామానుజుల తొలి గురువునగు యాదవుడును ఒక విధమగు భేదాభేద వాదియే. కాని అతడి సూత్రభాష్యము వినష్టము.

**వల్లభాచార్యులు** (1481-1533) : ఈయన తన "అణుభాష్యము"లో బ్రహ్మసూత్రమును వివరించెను. ఈయనది శుద్ధాద్వైతము. ఈయన జీవబ్రహ్మముల అంశాంశిరూపక ఏకత్వము నంగీకరించును. కాని శంకరులవలె మాయా శబలమగు బ్రహ్మమును గాక శుద్ధ బ్రహ్మమునే ప్రతిపాదించును. కార్యకారణ రూపముగా నున్నది శుద్ధ బ్రహ్మమే, మాయాసంబంధముగల బ్రహ్మము కాదు-అను ఈ మతము "శుద్ధాద్వైతము". ఈయన కూడ అవికృతపరిణామ వాదమునే చెప్పును. కాన జగత్తు బ్రహ్మమే, సత్యమును. జీవుడు భగవత్స్వరూపుడు. అగ్నికి, విస్ఫులింగములకు కల సంబంధమువంటిది జీవబ్రహ్మ సంబంధము. బ్రహ్మమునందు విరుద్ధములగు అన్ని ధర్మములు కలవు. అది సర్వ కర్త. కాన బ్రహ్మము నిర్గుణము, సగుణము; అకర్త, సర్వకర్త; అణువు, మహాన్‌కూడ. యశోద ఒడిలో ఆడుకొనిన శ్రీకృష్ణుడే పరమ తత్త్వము ("జానీత పరమం తత్త్వం యశోదోత్సంగ లాలితమ్"). ప్రకృతి గుణములు లేనందున బ్రహ్మము నిర్గుణము, కాని సాకార మనియు చెప్పవచ్చును. భగవంతుని అనుగ్రహము వలననే ముక్తి కలుగును. భగవదనుగ్రహము "పోషణ"మని భాగవతమనినది. పోషణమును ముక్తి సాధనముగా అంగీకరించుటచే వల్లభ వేదాంతము పుష్టి మార్గము. సర్వము శ్రీకృష్ణుని కర్పించి సేవించువారు పుష్టికర్ములు. సర్వాత్మ భావము- అనగా అన్నిటిని బ్రహ్మ(కృష్ణ)మయముగ చూచుట ముక్తి. కృష్ణమయులై కృష్ణుని సేవించుటే

ముక్తి. శరీర పాతానంతరము గోలోకమున కృష్ణ సాయుజ్యము శుద్ధజీవులకు దొరకును.

విఠ్ఠలనాథ, వ్రజనాథ, పురుషోత్తమాదులు వల్లభుని "అణుభాష్యము"నో, లేదా దానిలోని భావములనో వివరించినారు.

**బలదేవుడు** : అచింత్యశక్తిగల బ్రహ్మము, నిత్యజ్ఞానాదియుతము జగద్రూపముగా పరిణమించును. జీవు డణువు, నిత్యుడు, సుఖదుఃఖాదు లనుభవించును. జీవుడు ఈశ్వరుని శక్తి, దేహము, గుణము. అట్లే ప్రకృతియు ఈశ్వరుని ఆశ్రయించినది, నిత్యము, తదధీనము, తచ్ఛక్తి. గుణము-గుణి (గుణము కలది) అను భావముచే జీవబ్రహ్మలు అభిన్నులు భిన్నులు కూడను. భక్తి, భగవత్కృపవలన మోక్షము కలుగును. ముక్తుడు కూడ బ్రహ్మము నుండి వేరుగనే ఉండును. కాని భగవత్సాన్నిధ్యమున పరమానంద మనుభవించును. ఇట్లు అచింత్య భేదా భేదవాదమును బలదేవుడు (1764) తన బ్రహ్మసూత్ర భాష్యమున వివరించెను. (చూ. అచింత్య భేదాభేదవాదము).

**రామానందుడు** (14 వ శ.) : "ఆనంద భాష్య"మను పేర దొరకు బ్రహ్మసూత్రములపై నొక భాష్యమును రామానందుడు వ్రాసెనని కొంద రందురు. ఇది ఆయనది కాదు, ఇటీవలి వారు వ్రాసి ఆయన పేరు పెట్టిరి - అని కొంద రందురు. దీనిపై 'సురద్రుమ'మను వ్యాఖ్య, దానిపై 'సురద్రుమ మంజరి'యను టీక కలదని అందురు. బ్రహ్మము యొక్క సారభూతగుణము ఆనందము. బ్రహ్మ శబ్దము శ్రీరామునియందు పర్యవసించును. ప్రాకృత గుణములు లేనిది, దివ్యగుణములు కలది బ్రహ్మము. ఇట్లు బ్రహ్మము సగుణము, నిర్గుణము. సూక్ష్మ చిద చిద్విశిష్టమగు బ్రహ్మము, స్థూల చిద చిద్విశిష్టమగు బ్రహ్మము - ఈ రెండింటి అద్వైతమును ప్రతిపాదించు ఈ మతమును విశిష్టాద్వైతమతమే. భక్తిచే మోక్షము వచ్చును.

**ముక్తానందుడు** : స్వామి నారాయణ సంప్రదాయమను నొక వైష్ణవ సంప్రదాయము కలదు. దానికి చెందిన ముక్తానందుడు బ్రహ్మసూత్రభాష్యము నొకటి వ్రాసినాడు. ఇందును కొంచెము భేదముతో విశిష్టాద్వైతమే అనూదితము.

**శుకుడు** (16వ శ.) : శుక డను భేదవాది కూడ భాగవతము నాధారము చేసికొని సూత్రములపై భాష్యము వ్రాసినట్లు తెలియుచున్నది. ఇతడును వైష్ణవుడు, భక్తివాది.

**డా. రాధాకృష్ణన్** (1888-1975) : ప్రస్థాన త్రయభాష్య రచయితయగు సంప్రదాయ ప్రవర్తకుడే ఆచార్యుడు అని శాస్త్రవిదుల అభిప్రాయము. అయినచో "వేదాంత సిద్ధాంతములు" అను ఈ ప్రకరణమున విచారింపబడిన అనేకులు ఆచార్యులు కారు. వేదాంత దర్శనేతిహాసమును పరిశీలించిన ముగ్గురు నలుగురు తప్ప ఇతరు లెవ్వరును దశోపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు, భగవద్గీతలపై ఇంతవరకు స్వతంత్ర భాష్యములు వ్రాయలేదు. సామాన్యులు వ్రాయలేరు. అన్యులు వ్రాసిన భాష్యములపై టీకలు వ్రాయుట వేరు; స్వయముగా, నిశ్శేషముగా ప్రస్థాన త్రయముపై భాష్యము వ్రాయుట వేరు. రెండవది మహత్కార్యము. అపార పాండిత్య ప్రతిభలు కలవారే చేయగలరు. డా. రాధాకృష్ణన్ ఈ పని చేసినారు. వైదుష్యమందు, ఏది తత్త్వమని నిశ్చయించగల మనీషాశక్తియందు ఆయనను మించగల వారు శంకర, రామానుజ, శ్రీకంఠ, మధ్వాది మహాపురుషులు మాత్రమే. రాధాకృష్ణన్ భాష్యములు ఆంగ్లమున ఉన్నవి. అమూల్యమగు పుస్తకములు సంస్కృతమున ఉన్ననేమి? పాళీలోనున్న నేమి? లేదా గ్రీకులో నున్న నేమి? ఆయన పూర్వుల భాష్యములచే ప్రభావితులు. ఎవరు కారు? గౌడపాద, బోధాయన, యామునాదులు శంకర రామానుజులకు నిర్మాతలు కారా? డా. రాధాకృష్ణన్‌పై శంకర రామానుజులది, బుద్ధునిది హెచ్చు ప్రభావము కలదు; పాశ్చాత్య భావవాదము, ఇటీవల అస్తిత్వవాదము ఆయన కెన్నో అంశములను అవగతము చేసినవి. వివేకానందస్వామి చిన్ననాట ప్రేరణ నిచ్చెను. ఇదిగాక ఆయన ప్రాక్ప్రతీచీ దర్శనములందు నిష్ణాతుడు.

ఆయన తన ప్రస్థాన త్రయము ద్వారా వివరించిన వేదాంతమును ఇక్కడ దిఙ్మాత్రముగా వివరింతుము. పరాత్పరము[1] (The Supreme) యొక్క నిర్గుణ నిరుపాధిక రూపమే (aspect) బ్రహ్మము కేవలము లేదా (The Absolute). క్రియాశీల రూపము (active aspect)లో అదే ఈశ్వరుడు. ఈశ్వరుడు సృజనశీల స్వాతంత్ర్యము. ప్రపంచములో అభివ్యక్తి నొందిన జ్ఞానశక్తి ప్రేమలు విశ్వాత్మ లేదా హిరణ్యగర్భుడు. ప్రపంచములో వాస్తవముగా సాధింపబడుచున్న శక్యత (possibility)తో గల సంబంధముచే సావధికమగు పరాత్పరమేవిశ్వాత్మ. పరాత్పరము మూర్తము, అమూర్తమును కూడ. దానికి నామరూపములు లేవు. కాని అన్ని నామ రూపములను అభివ్యక్తము చేయుటకది సమర్థము. బ్రహ్మమును మాత్ర మేపరమార్థమని, ఈశ్వరుని వ్యావహారిక సత్యమని అనుట తప్పు, అని డా. రాధాకృష్ణన్ సిద్ధాంతము. పరాత్పరము ఈ రెంటిలో ఒకటే కానక్కరలేదు. మానవునికి నిజమైన స్వాతంత్ర్యమున్నది. దాని దురుపయోగము దివ్య ప్రయోజనముతో సంఘర్షించవచ్చును, కాని దానిని నిష్ఫలము చేయలేదు. విశ్వ ప్రయోజన సిద్ధికి దివ్యేచ్ఛతో మానవ వ్యక్తుల సహకారము ఉండవలెను ; కాని దివ్యప్రేమ మనుష్యుల పెంకెతనమును స్వార్థమును అణచి వేయును. కాబట్టి విశ్వప్రయోజనము తప్పక సిద్ధించగలదు. వ్యక్తి దివ్యత్వము (The Divine) లో అంతర్భూతుడై అందులో లయముకాడు. వైయక్తిక ప్రేమద్వారా ఏకత్వము సిద్ధించును. విశ్వప్రక్రియ అంతమగువరకు అందరు వ్యక్తులు (ముక్తులు కూడ) భిన్నముగానే ఉందురు; కాని ఆత్మిక సర్వగతత్వము (universality of spirit) ను కలిగి ఉందురు. విషయకరణము (objectification) పరావర్తనము (alienation)—ఇవి జయింపబడినప్పుడు, అందరికిని ఆధ్యాత్మిక స్వాతంత్ర్యము లభించి, ఇట్లు సర్వముక్తి సిద్ధించినప్పుడు, కాలము అతిక్రమించబడును; ఇతిహాస ప్రక్రియ సార్థకము అగును. అప్పుడు సంసారమే మోక్షము అగును. సర్వముక్తి అతిలౌకిక వర్తమానము (supra-mundane present). స్వార్థమునకు, అభిమానమునకు లోబడినప్పుడు మనము యాంత్రిక శక్తులకు వశులమై, కర్మబద్ధుల మగుచున్నాము. స్వార్థాభిమానములను వీడి, నిత్యము లేదా బ్రహ్మము (The Eternal)ను గూర్చిన ఆలోచనలతో మనస్సును నింపి, ప్రార్థనలో జ్యోతి (The Light)కి ఉన్ముఖులమైనప్పుడు[2] కర్మను నిరోధించి వశము చేసుకోగల శక్తిని కలిగి ఉందుము ప్రపంచము భ్రాంతికాని, అసత్యము కాని కాదు; శూన్యము కాదు. అది సత్య సంకల్పుడైన ఈశ్వరుని ఇచ్ఛచే సృష్టము; కాన యథార్థము, వాస్తవము. అయితే దాని సత్యత్వము కేవలము (బ్రహ్మము)-ఈశ్వరునికి ఉన్న సత్తకు భిన్నము. కేవలమునకు మాత్రమే సృజింపబడని (అనగా నిత్య) దివ్యసత్యత్వము ఉన్నది; తక్కినదంతయు అస్వతంత్రమైన, సృజింపబడిన సత్యత్వమే. బ్రహ్మ మొక్కటే స్వతంత్ర తత్త్వము; ఇతర మంతయు అస్వతంత్ర తత్త్వము. మాయా వాదపు అర్థము ఇదే. సంసారము దుఃఖాంతము అని గాని, భ్రమ అని గాని దాని అర్థము కాదు. ప్రపంచపు సత్యత్వము స్వస్థము కాదు. అది సృష్టికర్త యొక్క సత్తపైన, ఆలోచనపైన ఆధారపడి

1. పరాత్పరము చైతన్యము (spirit). అది వస్తువు కాదు, ప్రాణము; నిష్క్రియత్వము కాదు, శక్తి (not a thing, but life; not immobility, but energy). సమస్తాస్తిత్వమున కధిష్ఠానమగు చైతన్యమే మానవునిలో ఆత్మగా నున్నది; అంతయు చైతన్యముయొక్క అభివ్యక్తియే గావున. ఇట్లు మరొకచోట రాధాకృష్ణన్ వ్రాసెను.

2. దివ్య భర్గమును ధ్యానించినప్పుడు - అనియు అనవచ్చును.

ఉన్నది అని దాని అర్థము. ఇది డా. రాధాకృష్ణన్* వేదాంతసారము.

ఇట్లు వేదాంతమందు ఎన్నో ప్రస్థాన భేదములు కలవు. సింహము గర్జించనంతవరకు అడవిలో నక్కలు కూయుచుండునట్లు, వేదాంత శాస్త్రము గర్జించనంతవరకే తక్కిన శాస్త్రములు గర్జించగలవు అని వేదాంతులు చెప్పుదురు. ఇది సర్వవిద్యా ప్రతిష్ఠ యని, విద్యలలోకెల్ల విద్య యని శ్రుతి స్మృతులు. బ్రతికినంత కాలము మేల్కొని యున్నప్పుడెల్ల వేదాంత చర్చలోనే కాలము గడపవలెనని అను శాసనము. "ఆసుప్తేః ఆమృతేః కాలం నయేద్వేదాంత చింతయా".

# ఆధునిక భారతీయ దర్శనము

**దర్శన క్షీణత:** ఇంచుమించు పద కొండవ శతాబ్దము నుంచి భారతీయ చింతనమందు, సంస్కృతి యందు కొంత శిథిలత్వము, క్షయము (decline) పొడకట్టును. ముందుగా ఉత్తర దేశ మందును, తరువాత 17 వ శతాబ్దపు అంతమునాటికి దక్షిణ భారత మంతటను కూడ ఇది క్రమక్రమముగ మెల్లగ వ్యాపించెను. అనేక సహస్ర వర్షముల కర్మణ్యత, సృజనముల అనంతరము భారతీయ సంస్కృతిలోని ప్రాణశక్తి మందగించెను; దాని అలసటను పోగొట్టి కాయకల్పము చేసి పునరుజ్జీవితము చేయగల నూతన శక్తులను, చైతన్యమును ఆవశ్యక మాయెను. కాని నాటికే హిందువులలో అల్లుకొనిన వ్యావర్తక ప్రతిబంధక మనోవృత్తి (exclusive spirit) హిందూ తేజమునకు స్ఫురణమును, మనస్సునకు ఉత్సాహమును ఈయగల ప్రేరణను బయటినుండి గ్రహించుట అసంభవముగా జేసెను. హిందూ సంఘమందలి అంతర్గత పీడన, కర్షణలు (stresses and strains)లో నుండి స్ఫూర్తి వికసింపకుండ చేసెను. ఈ అంతర్గత సంకటము (inward crisis) ఆత్మవిశ్వాస లోపము, ఆదర్శ ముల పతనము, అకర్మణ్యత, నిస్పృహ పరులచే పరాజయ రూపమున, స్వాతంత్ర్య వినాశరూపమున అభివ్యక్తములైనవి బయటినుండి వచ్చిన ఆక్రమణ కారులు తమతో కొనివచ్చిన సంస్కృతులలో కూడ భారతదేశమున నున్నవానికంటె ఉత్కృష్టములగు, ఆధ్యాత్మికశక్తి సంపన్నములగు మార్మిక ప్రజ్ఞా దృష్టులు గాని, ఐహికాభివృద్ధి కుపయోగపడు సాంకేతిక శాస్త్రము గాని, విజ్ఞానము గాని, రాజనీతి విధానము గాని లేవాయెను. సృజనాత్మక ఆలోచనలకు ఎట్టి ప్రేరక శక్తులు లభించక, గతమును, పరంపర (tradition)ను అంధ విశ్వాసముతో పూజించునట్టి, ప్రగతి శూన్యమగు వ్యామోహము జీవితము నావరించెను. మన పూర్వులు చెప్పినది తప్ప వేరే సత్యముండదను అభినివేశ మేర్పడెను. కూపస్థ మండూకములవలె తమ తమ సంప్రదాయములను

* "బ్రహ్మ జ్ఞానమున కందురును అధికారులే. వేదాధ్యయనమును గూర్చిన నిషేధములు అసమర్థ నీయములు. సర్వ మానవులలో అంతర్గత (potential) మగు దివ్యత్వమును దృష్టిలో నుంచుకొనిన, జాతి కుల మత లింగములు, వృత్తివర్గములు ఏవైనను, మోక్ష సాధనకు అందరికి అధికార ముండ వలెను." అని రాధాకృష్ణన్ తన సూత్రభాష్యమున అపశూద్రాధికరణమున వ్రాసినాడు. సూత్ర భాష్య కారులలో ఎవరును ఇంతకుముందు ఇట్లు వ్రాయలేదు. ఈయనకు భావసమత్వమే గాక క్రియా సమత్వము ఇష్టము. వేదాంతమునకు సమాజవాదము (సోషలిజం) పర్యవసానమని ఈయన కొన్ని రచనలలో, ఉపన్యాసములలో సూచించెను.

అంటిపెట్టుకొని, ఇతర సంప్రదాయములను, ఇతర దేశముల సంస్కృతులను, విజ్ఞానమును ద్వేషించు మనోభావము సర్వత్ర వ్యాపించెను. 17వ శతాబ్ది చివరికి ఈ వైఖరి అంతయు చరమ స్థితిని అందుకొనెను. ఆ తరువాత బౌద్ధిక వ్యాపారము (intellectual activity) అసవన్న మాయెను.

భారతీయ దర్శనేతిహాసము చూచిన ఇదియే తేలును. రాజపోషణ లేక, కొందరు రాజులు పెట్టిన బాధలవలన, కుమారిల శంకరాదుల ఖండనలకు తాళలేక, మతములలో ప్రబలిన అవినీతివలన, జనసామాన్యమును ఆకర్షించలేకపోవుట వలన, మహమ్మదీయుల ఆక్రమణలవలన బౌద్ధమతము 11వ శతాబ్దమునాటికి భారతదేశమున దాదాపు నశించెను. అసలు ఎనిమిదవ శతాబ్దానంతరము మంచి బౌద్ధ దార్శనికుడు ఎవడును ఈ దేశమున పుట్టలేదు. జైన దర్శనమున మాత్రము 12వ శతాబ్దము వరకు కొలది మంది గొప్ప విద్వాంసులు (హేమచంద్ర, మల్లిషేణ సూరి ఇత్యాదులు) ఉద్భవించుచునే ఉండిరి. గుణరత్నాదులు తరువాత కూడ పుట్టిరి. ఇక తక్కిన దర్శనములలో లోకాయత మెప్పుడో చచ్చెను. దానిని నిత్య జీవితములో తెలిసియో, తెలియకయో అభ్యసించువారు ఎప్పుడును ఉండుచునే వచ్చిరి, ఉన్నారు;[1] కాని దానిని సిద్ధాంత రూపముగా ప్రతిపాదించగలవారు ఎప్పుడో పోయిరి. కోరిక యున్నను సాహసము, శక్తి ఉండవలెనుకదా! ఇక షడ్దర్శనముల సంగతి: 17వ శతాబ్దమున ఉండిన ఖండదేవమిశ్రుని తరువాత పెద్ద మీమాంసకు లెవ్వరును లేరు. 16వ శతాబ్దపు ఆఖరునో, 17వ శతాబ్దపు ఆరంభముననో ఉన్న విజ్ఞాన భిక్షువు సాంఖ్యయోగ దార్శనికులలో చివరివాడు. వైశేషిక మెప్పుడో పోయినది; 17వ శతాబ్దమున ఉండి 'భాషాపరిచ్ఛేద సిద్ధాంత ముక్తావళు'లను వ్రాసిన విశ్వనాథుడు, 'తర్క సంగ్రహము' వ్రాసిన అన్నంభట్టు విద్యార్థులకు తగు పాఠ్యపుస్తకములు (text books) మాత్రమే వ్రాయగలిగిరి. ప్రాచీన న్యాయము దశమ శతాబ్దములో ఉదయనితోనే అంతరించినను, 13వ శతాబ్దమున మిథిలలో గంగేశునిచే ప్రతిష్ఠింపబడిన నవ్య న్యాయము 16వ-17వ శతాబ్దములలో నవద్వీపమున రఘునాథ, జగదీశ, గదాధరులచే విస్తరింపబడెను. వీరల ప్రతిభ, నిర్వాహము దర్శనేతిహాసమున అపూర్వములు. ఇక వేదాంతము స్థితి: 16వ శతాబ్దమున ఉండిన మధుసూదన సరస్వతి, అప్పయ్య దీక్షితులు (ఒకరు ఉత్తరాదివారు, ఒకరు దక్షిణాదివారు) చెప్పుకోదగిన అద్వైతానుయాయులలో కడపటివారు; అంతటివారు తరువాత లేరు. విశిష్టాద్వైతమున వీరితో తులతూగగలవారు 14వ శతాబ్దము తరువాత కనపడరు; వేదాంత దేశికులు, లోకాచార్యుడు 13వ శతాబ్దివారే. 16వ శతాబ్దమువరకు కూడ శ్రీనివాస, రంగరామానుజాదులు ఉద్భవించుచుండిరి. కాని వీరు ప్రాత గ్రంథములను పట్టుకొని టీకలనో, పాఠ్య గ్రంథములనో వ్రాయు బాపతు. ద్వైత వేదాంతమందు సర్వాతిశాయియగు ప్రజ్ఞను చూపిన జయతీర్థ, వ్యాసతీర్థులు 14వ, 15వ శతాబ్దముల వారు. వ్యాసతీర్థుల న్యాయామృతమును ఖండించుచు, మధుసూదన సరస్వతి వ్రాసిన అద్వైత సిద్ధిని ఖండించుచు గ్రంథములు వ్రాసిన రామాచార్యుడు, విజయీంద్ర తీర్థుడు, వనమాలీ మిశ్రుడు అందరును 17వ శతాబ్దము, లేదా అంతకు ముందువారే. ఆ తరువాత వారు వీరి కాలిగోటికి సములు కారు. 16వ శతాబ్దము తరువాత చెప్పుకోదగిన దార్శనిక కృషి ఏమాత్రమును ఈ దేశములో జరుగలేదు. ఈ స్థితి 19వ శతాబ్దములో అంతమైనది.[2]

1. 10వ శతాబ్దమున జయరాశి 'తత్త్వోపప్లవము'న చార్వాకవాద ప్రతిపాదన చేసెను.

2. మౌలికరీతిన దర్శనముల స్థాపనగాని, వృద్ధిగాని చేయగల దార్శనికులు 13వ శతాబ్దము తదుపరి ఈ దేశమున పుట్టలేదు అని కొందరి అభిప్రాయము. భావవ్యవస్థా నిర్మాతలు (system builders) మాత్రమే దార్శనికులుకారు. జగదీశ గదాధరాదుల, వ్యాసతీర్థ మధుసూదనాదుల ప్రతిభ, శేముషికూడ అనన్య సామాన్యములు; వీరు గొప్ప దార్శనికులు.

**దర్శన పునరుత్థానము :** పశ్చిమ దేశముల సంస్కృతి, విచారముల సంసర్గముచే 19 వ శతాబ్దమున పునరుజ్జీవనము, లేదా పునర్జాగరణము (renaissance) ఈ దేశమున కలిగెను. ఈ ఉద్యమముచే వచ్చిన ప్రేరణచే శతాబ్దముల తరబడి ఆలోచన లేకుండ వ్యవహారములో ఉన్న విశ్వాసముల, స్వార్థాచారముల సమీక్ష, వాటి మాటున ఉన్న గొప్ప భావముల పరిష్కారము జరిగెను. భారతీయ ఆలోచనను, వ్యవహారమును మేల్కొల్పి చైతన్యవంతములుగా చేయగల శక్తి హిందూమత మూలకల్పనలలో కలదని తెలగా, వాటి పునరధిగమము, పునః పరీక్ష, పునర్వివరణము ప్రారంభమాయెను.

ఈ పునర్జాగరణోద్యమపు ప్రధాన వ్యక్తి రామమోహనరాయ్ (1772 - 1833). ఇతడు ఆధునిక భారతీయ చింతనకు ఆరంభకుడు. యూరప్‌లో పెట్రార్క్, ఇరాజ్మస్, బేకన్, లెస్సింగ్ మొదలగువారు వేర్వేరు కాలములందు చేసిన పనివంటి దానిని ఈయన ఈ దేశమందు చేసెను. బేకన్ క్రైస్తవ నీతి బోధలు, బౌద్ధికవాదము, దేవవాదము (Deism) యూరఫ్ లోని పునర్జాగరణోద్యమము (the Enlightenment), ఉపయోగితావాదము (utilitarianism) ఈయనపై తమ ప్రభావమును చూపెను. కాని ఆయన వేదాంతమందు సుప్రతిష్ఠుడు; ఉపనిషత్తులపై ఆధారపడినదే ఆయనకు మతము. జీవిత సమస్యలపట్ల ఆయన దృష్టి సహేతుకము (rational), వైజ్ఞానికమును (scientific), శంకరుల తరువాత ఉపనిషత్తుల అద్వితీయ ప్రామాణ్యమును ఇంతగా ఎవరును ఒప్పుకొనలేదు. తక్కిన వారికి పురాణేతిహాసములు, ఆగమములు కూడ సమాన ప్రమాణములు. ఉపనిషదాశ్రిత ధర్మమే యథార్థ హిందూ ధర్మము, అది ఆధునిక జగత్తుకు అనుకూలము, విజ్ఞానముతో సుసంగతము, - ఇది రాయ్ చూపదలచినది. ఆయనవలన, వివేకానందునివలన వేదాంతము ఆధునిక భారతమున ప్రధాన దర్శనమైనది. రాయ్ తరువాత కేశవచంద్రసేన్ (1824 - 1884) భారత పశ్చిమముల కలయికచే ఒక నూతన సంస్కృతి ప్రాదుర్భవింపవలెనని, అది ఆ రెంటికంటె ఉత్తమము కానగునని చెప్పెను. భారతీయ ఆధ్యాత్మికత - పాశ్చాత్య విజ్ఞానము, వేదాంతము - సాంకేతిక విద్య - వీటి సమన్వయమే జగద్ధితమునకు మార్గమని మొదటిసారి స్పష్టముగా చెప్పిన దీయనయే. ఈ భావము రాయ్ రచనలలోను ఇమిడి యుండెను. తరువాత ఎందరో కేశవుని ఈ భావమును ప్రచారము చేసిరి.

**దయానంద సరస్వతి** (1824 - 1883) : హిందూ సభ్యత కాదిస్రోత మగు వేదమునుండి హిందూ ధర్మమును పునరుద్ధరణ చేయగల గొప్ప జీవత్సత్యములను ఈయన పొంద ప్రయత్నించెను. వేద సంహితలు సుసంగతముగా ఏకేశ్వరవాదమును ప్రతిపాదించుచున్నవని, వైదిక ధర్మము వర్ణవిభాగాది కురీతుల కాశ్రయమీయదని, వేదము సహేతుకము, నీతిబద్ధము నగు ఆధ్యాత్మిక నైతిక ధర్మమును బోధించునని ఈయన ప్రతిపాదించెను.

1882లో ఈ దేశమునకు వ్యాపించిన దివ్యజ్ఞాన సమాజము జనసామాన్యమందు వ్యాప్తిలో నుండిన లోకప్రియమగు హిందూ మతములోని పెక్కు అంశములను విమర్శింపక ప్రశంసించి, రహస్యవాద (mysticism) విశ్వాసములకు, గుప్తక్రియలకు, ప్రేతవాదము (spiritism) నకు ప్రోత్సాహమిచ్చెను. ఈ ధోరణి చాలవరకు బ్రాహ్మ, ఆర్య సమాజముల ఏకేశ్వరవాద - హేతువాదములకు వ్యతిరిక్తము. హిందూమత పునరుద్ధారము (revival) నకు, స్వమత దేశసేవకు ఈ సమాజము అపార కృషి చేసినది. సర్వ మతములు సమానములు; అవి యన్నియు ఒకే గమ్యమునకు పోవు భిన్న మార్గములు - అని మొదటగా ఈ దేశమందు ప్రచారము చేసినదీ సమాజమే కావచ్చును.[1]

1. భగవద్గీత : మహిమ్నస్తోత్రము ; జయంత, అభినవగుప్త, మధుసూదన సరస్వతీత్యాదుల కృతులు ఈ భావమును వివిధముగా అభివ్యక్తము చేసి యున్నను, 19 వ శతాబ్దమునకు ముందు దీనిని జనసామాన్యము గాని, శిక్షితులు గాని సామాన్యముగ అంగీకరింప లేదు.

శక్తిని తృప్తిని ఇచ్చునది, పుణ్యమును భక్తిని వృద్ధిచేసి మానవులను తోటివారిని ప్రేమించునట్లు, సేవించునట్లు ప్రేరేపించునది మతము అను సూత్రమును రామకృష్ణపరమహంస (1836-1886) నుండి గ్రహించి, వివేకానందస్వామి (1863-1902) సర్వ మానవ ప్రేమను, నీతిని, కర్తవ్య పరాయణతను బోధించు అన్ని మతముల విలువను, ప్రామాణ్యమును అంగీకరించెను. అయినను, అద్వైత వేదాంతమును ఆయన విశ్వజనీన వైజ్ఞానిక మతమనియు, అన్యమతముల ఆంశిక సత్యము లన్నియు అందు సమావిష్టమైన వనియు తలచెను. జీవితమందు అద్వైత పరమతతత్త్వము నాచరణలో పెట్టుటయే నిజమగు మతమని ఈయన బోధ. సమత్వమును చిత్తమందు, వర్తనమందు సాధించుట ఈయన బోధించెను. ఏ విధమైన అసమత్వము లేనట్టి, వర్ణభేద రహితమైన, విశేషాధికారములు గల వర్గములు లేనట్టి, వ్యక్తులందరకు వారి నిగూఢ శక్తులను స్వేచ్ఛగ వృద్ధి చేసికొని, తమ దివ్య తత్త్వము ననుభవించు అవకాశమును ఈయగలట్టి స్వతంత్ర సంఘ వ్యవస్థయందే అద్వైత వేదాంతము పర్యవసానమంద గలదని వివేకానందుని మతము. వివేకానందుడు పెద్ద దార్శనికుడు. ఆయన తత్త్వ మీమాంసనే గాక, నైతిక సిద్ధాంతమును కూడ తర్క, అనుభవ, విజ్ఞాన, ప్రస్తుత ప్రపంచములకు అనువగునట్లు విపులీకరించి, నవీన హిందూ విశ్వ దృష్టి నొకదానిని నిర్మించెను. సర్వతోముఖముగా అద్వైత వేదాంతమును శంకరుల తర్వాత ఇంత బాగుగా వ్యవస్థీకరించినది(systematise)ఈయనే. ఈయనతో సముడగు రామతీర్థస్వామి (1873-1906) కూడ ఈయనచే ప్రభావితుడై అద్వైత వేదాంతమును ఎంతో నిపుణతతో అభివృద్ధి చేసెను. ఈయన తబ్రీజ్, రూమీ మొదలైన పర్షియన్ రహస్యవాదులను, బెర్క్లీ, ఫిక్టె మొదలగు యూరోపీయ దార్శనికులను ఎక్కువగా అధ్యయనము చేసినాడు. ఈయన భావనా శక్తికూడ తీక్ష్ణము. ఈయన అద్వైతమునకు ప్రాతీతిక భావవాద రూపమిచ్చినాడేమో యని తోచును. ఈయన దర్శనము స్వోపజ్ఞము.[1] ఈయన కూడ వివేకానందుని వలెనే సామాన్య మానవుల సుఖము, అభ్యుదయము మిక్కుటముగా కోరెను. భావాద్వైతమే గాక క్రియా ద్వైతము అవసరమని బోధించెను. వివేకానంద రామతీర్థులలో భావవాదమొక ఉచ్ఛశృంగము నందు కొనినది.

రామమోహనరాయ్, దయానంద, వివేకానంద, రామతీర్థుల యుగము 19వ శతాబ్దమున భారతీయ దర్శనమందు మహత్త్వపూర్ణమగు క్రొత్త యుగమును సృష్టించినది. దీనిని యూరోప్‌లో నికొలస్ కూసాతో ప్రారంభించి, డేకార్టునకు ముందుండిన యుగముతో పోల్చవచ్చును.

## ఆధునిక దార్శనికులు

19వ శతాబ్దపు చివర పుట్టి, ఈ శతాబ్దపు మధ్య భాగమువరకు జీవించిన అయిదుగురు గొప్ప వ్యక్తులు దార్శనిక దృష్టిచే చాలా గొప్పవారు. వీరు రవీంద్రనాథ్ ఠాకుర్ (1861 - 1941), మోహన్ దాస్ కరమ్‌చంద్ గాంధీ (1869 - 1948), అరవిందఘోష్ (1872 - 1950), ముహమ్మద్ ఇక్‌బాల్ (1873 - 1938), మానవేంద్రనాథ రాయ్ (1887 - 1954).

**రవీంద్రుడు** : ఠాకూర్ మహాకవియే కాక లియోనార్డో వించీ వలె విశ్వజనీనుడగు మానవుడు. ఉపనిషత్తులు, వైష్ణవభక్తి, తనపూర్వజులగు దేవేంద్రనాథ ఠాకుర్ (ఈయన విశుద్ధ ప్రపంచాతీత ఈశ్వరవాది) - వంటి వారలచేత ప్రభావితుడై ఈయన ఒక ఆధ్యాత్మిక దర్శన నిర్మాణము చేసెను. జీవితమందు, ప్రకృతియందు ఆనందమును గాంచు ఇటువంటి సుందర దర్శనము ఉపనిషత్తులు, భగవద్గీత తరువాత తిరిగి ప్రతిపాదింపబడలేదు. వాటివలెనే ఇదియు

1. రామతీర్థుల ముఖ్యమైన ప్రవచనములు "వేదాంత దర్శనము" అను పేరిట నేను అనువదింపగా 1949లో శ్రీ రామతీర్థ సేవాశ్రమం (పిడుగురాల, గుంటూరు జిల్లా) ప్రకటించినది. ఆయన సంపూర్ణ సారస్వతము అనువదించి ఆ సంస్థయే ప్రకటించినది.

తార్కికము, నిశ్చితము, సుసంబద్ధము అగు చింతన కాదు; కాని కవిత్వమువలె ధ్వన్యాత్మకము. ఇది అనభిలప్యమును సూచించునట్టి, వర్ణించనలవిగాని దానిని ప్రకాశపరచునట్టి ఒక రహస్యవాద విశేషము. అద్వైతమునే ఒప్పుకొనుచు బ్రహ్మము యొక్క ఆనందరూపత్వమును,రసమయత్వమును ఇది నొక్కి చెప్పును. ప్రపంచమును బ్రహ్మముయొక్క అభివ్యక్తిగా, లీలగా నెంచి, మాయావాదమును, దుఃఖ నిరాశావాదములను ఇది స్పృశింపదు.

**గాంధీ :** గాంధీ దర్శనము దానికదియే ఒక ప్రపంచమని ష్వైట్జర్ అనినాడు. ఒక ప్రపంచమును అర్థము చేసుకొనుటగాని, కొద్దిలో చెప్పుటగాని దుస్తరము. అహింసాభావమును ఆచరణ ప్రవృత్తి (activity) తో సమ్మేళనము చేయుట ఈ దేశమందే గాక మానవ చింతనలోనే ఒక ప్రధానసంఘటన యని ష్వైట్జర్ అనినాడు. జైన ధర్మము, టాల్‌స్టాయి, రస్కిన్, క్రైస్తవమతము, వేదాంతము (ముఖ్యముగా ఈశోపనిషత్తు, గీత), కొందరు భక్తులు వీరు గాంధీకి ప్రేరణ నిచ్చినవారు. అయినను ఈయన దర్శనము అపూర్వము, విప్లవాత్మకము. సమర్థులు దీనిని, ఈయన శిష్యుడగు వినోబా భావే భావములను వేరొకచోట ఈ గ్రంథమున వివరించిరి.

**అరవిందుడు** ఎలొసియన్, డయోనిసియాక్ రహస్యమతముల సంప్రదాయములు, సోక్రటీస్ నకు పూర్వముండిన దర్శనము (ముఖ్యముగా హెరాక్లీటస్) అరవిందుని అభిప్రాయములను తీర్చుటలో కొంత కారకములు. నీట్షే, బెర్గ్‌సన్, జేమ్సులను, విజ్ఞానమును(science)ఆయన అధ్యయనముచేసెను. వేదఋక్కులను, ఉపనిషత్తులను ఆయన కూలంకషముగా అవగాహించెను శాక్తతంత్ర, వైష్ణవములు ఆయ[illegible]క్షిప్తములు. ఇదంతయుగాక ఆయన యోగి. ఇన్ని ప్రభావములు అరవిందుని దర్శనము వెనుక ఉన్నవి తన ఆధ్యాత్మికానుభూతిని, ఋషుల అంతర్దృష్టులను కల్పనలను (premises) గా తీసికొని వాటి యాధారముపై ఒక దర్శనమును ఆయన ని[illegible]ంచెను. సిద్ధాంతములను స్థాపించుటయందాయన భారతీయ పాశ్చాత్య దర్శనములలోని చాల భావముల నుపయోగించియు, గొప్ప సృజనకార్యమును (Creative work) చేసినాడు. ఆధునిక కాలమందలి భారతీయ దార్శనికులలో కెల్ల ఆయన అగ్రగణ్యుడు అని చాల మంది తలచెదరు*

సంగ్రహముగా ఈయన దర్శనమును వివరించెదము : అరవిందునిది పూర్ణాద్వైతము, లేదా పూర్ణవాదము (integralism). పరమతత్త్వము అనిర్దేశ్యము (Indeterminate),అకథనీయమును (ineffable). 'ఇతి' యని గాని, 'నేతి' యని గాని దానిని చెప్పవీలులేదు. అయితే అది నిషేధముల (negatives) సమాహారము గాని, రిక్తమగు (vacant) శుద్ధసత్తగాని కాదు. అదే బ్రహ్మము. అంతయు బ్రహ్మమే అని అరవిందులు ఒప్పుకొనును. అయితే దాని అర్థము ఎల్లెడల ఉన్న సర్వవ్యాపి యగు బ్రహ్మమే అంతయు అని. ఈ సర్వము అను భ్రాంతికి సర్వశక్తి యగు బ్రహ్మము కారణమని అర్థము కాదు, అసత్తు, సత్తు కూడ దాని ఆకృతులు (aspects), స్థితులు. వైవిధ్యమున కంతకు అదియే మూలము, ఆధారమును. బ్రహ్మమందు శుద్ధసత్తయు శక్తి(energy) లేదా స్పందనము(movement)ను కూడ కలవు. ఈ శక్తి చిచ్ఛక్తి. ఇందు మొదటి దానిని శివుడు, రెండవ దానిని కాళి అనవచ్చును. శుద్ధ సత్తు ఆనంద స్వరూపము, అనంత చిచ్ఛక్తి యగు నిరవధిక కేవల సత్త ఆనందమే అగును కాబట్టి. శక్తియొక్క సృజనలీల (creative play) లోని ఆహ్లాదమే (delight) ఈ ఆనందము(bliss). తన ఆత్మాహ్లాదపు అనంత స్పందనమును, వైవిధ్య

---

* ఉదాహరణమునకు, డా. రాధాకృష్ణన్ అరవిందుని 'మనయుగము' (our age) లో అందరి కంటె గొప్ప మనీషి (the greatest intellectual) అని, ఆధ్యాత్మిక జీవితమున కనుకూలమగు బృహచ్ఛక్తి (major force) అని వర్ణించెను. దర్శనమందు, మతమందు ఆయన కృషి అమూల్యమనెను.

మును భోగించుటకు (to enjoy)గాను, బ్రహ్మము అను సత్-చిత్ తత్త్వము (సచ్చిత్తు) అసంఖ్యాక ములగు లోకములుగా అభివ్యక్తమగును. కాని శక్తి బ్రహ్మమును ఎప్పుడును క్రియాశీలముగాను సృజ నాత్మకముగాను ఉండునట్లు నిర్బంధించలేదు. సృష్టి బ్రహ్మకు ప్రమోదార్థము (for joy); విలాస మాత్రము. ప్రపంచ అస్తిత్వము శివతాండవము.[1]

అనంతాస్తిత్వపు అసీమ, మహత్తత్త్వము నుండి నామరూపములను నిర్మించగల శక్తి అనంత చైతన్యమునకు కలదు; ఈ శక్తియే మాయ. అన్ని వస్తువులు ఒకే సత్యపు ఐక్యమున సహావస్థితములు (co existence in The Unity of one truth) కాని తాను ప్రత్యేకుడనని, ఇతరులనుండి పృథక్ (separable)గా ఉన్నానని మానవుడు నమ్ముచున్నాడు. ఇదియు మాయయే.

అన్ని నామరూపములకు అధిష్ఠానముగా నుండి వాటి యన్నిటిద్వారా అభివ్యక్తము అగుచున్నది సచ్చిత్తే, అను సత్యమునకు అనురూపమగు జ్ఞానము 'ఋతచిత్తము' లేదా 'విజ్ఞానము'[2] (Supermind). ఇది నిజమగు సత్తు (real being) నుండి ప్రాదుర్భవించి, దానినే అభివ్యక్తిచేయుచు, దాని స్వభావము కలిగి యున్నట్టి చిచ్ఛక్తి. ఇదే దివ్యమాత. సచ్చిదానందమునకు జగత్తునకు మధ్య అది సేతువు; ఋతచిత్తపు యథార్థత లేదా సిద్ధి[3] (realisation) యే జగత్తు. ఋతచిత్త మొక సృజనాత్మక భావము (creative idea). అందు పరమాత్మయొక్క సత్యము నిహితము. మనస్సు, ప్రాణము, భౌతిక ద్రవ్యము (matter) కూడ దీని రీతులే (expre-ssions); అదియే గమ్యముగా గలవి. మనస్సు ప్రతిదానిని తన దృష్టికోణము నుండియే చూచుచు, 'ఉన్నదంతయు ఒకే మనస్సు' ఒకే ప్రాణము'[4] అను సత్యమును మరచుట అవిద్య. మనస్సు తన జ్ఞాన మందు జ్ఞానముయొక్క ప్రభవము నుండి వేరుగా నుండుట అవిద్య. సచ్చిదానందమే విశ్వరూపము. అది పరమసత్యము యొక్క సామరస్య పూర్ణమగు లీల. అందు వైరుధ్యము, సంఘర్షణలును ఉన్నట్లుగా అధ్యాసము (False appearance)ను కల్పించుట అవిద్యవలన జరుగుచున్నది.

దివ్యము (The Divine) యొక్క సృజ నాత్మక ప్రమోద-విలాసమునందు పాల్గొనుట; వ్యావ హారిక(Empirical)జగత్తును,శరీరస్థమగు ప్రాణము (embodied life) నంతను (ప్రాణులన్నిటిని?) ఇప్పుడు ఇక్కడే దివ్యముగా చేయుట(divinise)లో దివ్యముతో సహకరించుట మానవుని కర్తవ్యము. ఇదే పూర్ణయోగము. ప్రాణమును (ప్రాణులను?) దివ్యముగా చేయుట, దివ్యజీవిత ప్రాప్తి, సమస్త మానవుల ముక్తి ఈ యోగ లక్ష్యము. పరమ సృజన శక్తియగు దివ్యమాతతో తనను ఏకీకరణము (self identificotion) చేసికొని, ఆమెతో సాయుజ్య మందుటయే దీనికి సాధన. మానవులను(తనతో సహా) దివ్యులగు మానవాతీతులను (Divine Super-men) గా పరిణమింపజేయుటలో సృజనాత్మకమగు దివ్యము (The Creative Divine) తో సహక రించవలెను.దానికి సంపూర్ణఆత్మసమర్పణము, జీవిత మును ఆధ్యాత్మికముగా(spiritualise)చేసికొనుట[5] అవసరము. ఆత్మ సమర్పణము, తనను పురుషునిగా

1. తాండవము చేయకుండ ఉండుటకు గూడ శివుడు స్వతంత్రుడు అని భావము.

2. ఈ పదములను అరవిందుడు వేదమునుండి, ఉపనిషత్తుల నుండి గ్రహించెను.

3. వాస్తవమగుట.

4. అంతయు ఒక దాని ప్రాదుర్భావములు, వ్యక్తీ కరణములు కావున.

5. మనోవాక్కాయములలో శుద్ధి, సంయమము, శాంతి ఇత్యాదుల సాధన. ఈ యోగమందు ఇట్లు జ్ఞానము, పరమతత్త్వ స్వరూపము (మన కర్తవ్యము లను తెలిసికొనుట), భక్తి (ఆత్మ సమర్పణ), కర్మ (వాక్కాయ సంయమాదులు, కర్త వ్యాచరణ), రాజ యోగము (మనస్సమాధానము) ఉండుటచే ఇది పూర్ణ యోగము.

ఎరిగి కర్తృత్వాభిమానము వీడుట, అంతటా ఈశ్వరుని చూచుట ఈ యోగ లక్షణములు. ఇట్లు మనుష్య ప్రయత్నము, ప్రకృతిపురుషుల (Man&Nature) వికాసము (evolution)ను నిర్దేశించు (guide) పరమ సృజనాశక్తి అనుగ్రహమునకు తోడైనచో దివ్య అతిమానవుల ప్రాదుర్భావ మగును.

ఇది దిఙ్మాత్రముగా అరవింద దర్శన స్వరూపము.

**ఇఖ్‌బాల్ :** ముహమ్మద్ ఇఖ్‌బాల్ ఈ తక్షిన వారివలె గాక మహమ్మదీయుడు ఇంగ్లండు, జర్మనీలలో తత్త్వశాస్త్రము, న్యాయశాస్త్రముల నధ్యయనము చేసినవాడు. ఈయన గొప్పకవి. ఆధునిక యుగమున మహమ్మదీయులలో సర్వోత్తమ దార్శనికుడు. నీత్షే, బెర్గ్‌సన్, జలాలుద్దీన్ రూమీ, జమాలుద్దీన్ ఆఫ్ఘని ఈయనపై ప్రభావము కలవారు. నివృత్తి(quietism) ఈయనకు గిట్టదు. ప్రవృత్తి (activity) యే జీవితము. పాపముతో అధర్మము (evil)తో పోరాడుటలోనే జీవితమున కర్థము. ఈశ్వరుని, ధర్మమును (the Law) అంగీకరించు వారందరును మహమ్మదీయులే. సత్యమే ఇస్లాము; మహమ్మద్ దానిని పూర్ణ రూపములో పొందెను. ఇతరులకును సత్యము ప్రసాదింపబడినది. జాతి, పదవి, ధనము మహమ్మదీయులలో శ్రేష్ఠత్వమును నిర్ణయింపవు; నీతియే దానిని నిర్ణయించును. అన్ని అస్తిత్వ విధములు ఆత్మ (the self) కార్యములే. దృశ్యమంతయు ఆత్మ రహస్యమే (secret of the self). ఆత్మసారమున (essence) అనేక విశ్వములు నిహితములు. అది మేల్కొని సంవేదనవంతమైన తనను తాను దృఢీ-రించు (affirm) కొనగనే, ఆలోచన జగత్తు ప్రకాశితమై (revealed), అనాత్మ వెలుగులోనికి వచ్చెను. వ్యాపారము కొరకు ఆత్మ-విషయి విషయములు (subjects and objects) గా, సాధ్య సాధనములు (end and means)గా - ఇటుల ఎన్నియో రూపములు దాల్చును. కాలము ఆత్మకు రంగభూమి. కాలము అనాద్యంతము కాబట్టి ఆత్మ చేయునట్టి దానికంతకు శాశ్వత ప్రాముఖ్యము కలదు. ఇతిహాసము ఆత్మను తన స్వభావ మెరుగునట్లు చేయును. నిరవచ్ఛిన్న చైతన్య తరంగము జీవితము. కాలమూలకమును, దాని సతత విద్యమానత్వమును ఎరుగుటయే అక్షయ జీవిత రహస్యము. ఇచ్ఛ, తృష్ణ ఇవి జీవిత ధారణకు కారణములు; పరిరక్షణ చేయునవి; దానికి లక్ష్యము నేర్పరచునవియు. ఇచ్ఛ-ఆదర్శము-లేనివాడు మృతుడే. జీవితమునకు సౌభాగ్యమిచ్చునది, సార్థకము చేయునది, దానిని తీర్చి దిద్దునది ఇచ్ఛ. మానవ నిర్వహణ మంతయు సిద్ధించిన ఇచ్ఛయే. ధర్మాధారముపై సంస్థాపితమగు సంఘముతో తాదాత్మ్యము నొందుటచే ఆత్మ అర్థవంత మగును. సంపూర్ణాత్మ వికాసము ప్రేమచే సాధ్యము. జ్ఞాన, ధర్మాచరణలకు ప్రభవము ప్రేమ. ప్రేమ ఆత్మను ఇతోఽధికముగా సజీవముగాను, కాంతిమంతముగాను చేయును. ప్రేమవలననే ఆత్మయొక్క సత్తాప్రకాశము (radiance of being) ఆవిర్భవించును; దానిలోని అజ్ఞాత శక్తులు వృద్ధి నొందును. జీవనము (ప్రాణము)న కంతకు ఉద్గమమును, అన్ని ఆదర్శములకు మహత్కార్యములకు ప్రభవమును అగు ఈశ్వరునిపట్ల ఉండు ఆనందాతిరేక పూర్వకమగు భక్తి(ecstatic devotion)యే నిజమగు ప్రేమ. "భగవత్ప్రేమ తుదకు పూర్తిగా భగవంతుడగును." ఇది ఇఖ్‌బాల్ తన కవిత్వమున, అన్యగ్రంథములందు ప్రతిపాదించిన దర్శన సంగ్రహము. తాను ఇస్లాం సారమునే స్పష్టము చేసితి నని ఆయన భావించెను.

**ఎమ్.ఎన్. రాయ్** (1887-1954)మానవేంద్రనాథ్ రాయ్ భౌతికవాది, హేతువాదియు. ఆయన మార్మికమగు లేదా మూలస్పర్శియగు (radical) (తీవ్రమైన) నైతికవాదముపై మానవతా వాదము (humanism) ను స్థాపించెను. విజ్ఞానము (science) ద్వారా కలుగునది మాత్రమే జ్ఞానము. మానవునికి బుద్ధి, వివేకము ఉన్నవి. కాబట్టి తనను, ప్రకృతిని(nature) అర్థము చేసికొనగలడు. వ్యక్తుల మధ్య సరియైన సబబైన సంబంధములపై ఆధారపడిన సంఘము నిర్మించుటకు వీలున్నది-మనుష్యునికి బుద్ధి జ్ఞానము ఉన్నవి కాబట్టి. సంఘమందలి వ్యక్తులమధ్య

నుండు సంబంధములు సుసంగతములుగ, సామరస్య పూర్వకముగ, పరస్పర లాభకరముగ ఉండవలెనని కోరి,అట్లాచరించుటయే నీతి (morality). మానవుని బుద్ధియే* నీతికిమానము, నిర్ణాయకము కావలెను. వ్యక్తుల పూర్ణస్వాతంత్ర్యమును కాపాడుచు, వారిమధ్య సామరస్యము స్థాపింపగల ఒక ఆధ్యాత్మిక సంఘ వ్యవస్థ పరమ లక్ష్యము. అది సార్వభౌమికము (cosmopolitan),ప్రజాతంత్రయుతము(democratic) అగు సాధారణ రాజ్యము (commonwealth)అయిననే ఈవిలువ లన్నియు-స్వాతంత్ర్య సామరస్యాదులు-సిద్ధించును. మనుష్యులను ఆలోచించు నట్లు చేసి స్వాభావికము, హేతుబద్ధమునగు నీతి ననుస రించు నట్లుచేయుట దీనికిమార్గము-అని రాయ్ బోధించెను. ఎన్నో ఉపపత్తులతో, ఎంతో అనుసంధానముతో రాయ్ ఈ మానవతా వాదమును చక్కగ ప్రతిపాదించెను.లోకాయతుల తరువాత తిరిగి ఇన్నాళ్ళకు ఒక భారతీయుడు హేతుబద్ధమై నీతి నాశ్రయించిన భౌతికవాదమును ప్రవచించెను.

**కొందరు సమకాలికులు :** విశ్వవిద్యాలయము లలో నుండిన ఆధునిక దార్శనికులలో రాధాకృష్ణన్, సురేంద్రనాథదాస్ గుప్త, కృష్ణచంద్ర భట్టాచార్య, వసంత్‌కుమార్ మల్లిక్ ప్రముఖులని చాలమంది ఒప్పు కొందురు.రాధాకృష్ణన్‌ను గూర్చి క్రిందట చెప్పనాము. అకారాది వివరణములో కూడా కలదు

**దాస్‌గుప్త** (1885 - 1951) : భారతీయ దర్శనేతిహాసమును కేవలము సంస్కృతమూలముల ఆధారముపై అయిదు బృహత్సంపుటములలో వ్రాసి తన సర్వతంత్ర స్వతంత్రతను చూపినాడు. కాక నూతన విధముగ ఒక దర్శనమును గూడ నిర్మింప యత్నించినాడు. మొదట కేవల వాదము (absolutism), అద్వైత వేదాంతము, యోగములపై అభిరుచి గల దాస్ గుప్త జైనుల అనేకాంత వాదము, ఆధునిక సాపేక్షవాదము(relativity theory)ల ప్రభావ ము చేతను, మెక్‌టాగర్ట్, మూర్, వార్డ్ మొదలగు బ్రిటిష్ దార్శనికుల ప్రభావము చేతను వాటిని పరిత్యజించెను. ద్వైత తార్కికుల అద్వైత ఖండనల అధ్యయనము దీనికి మరొక కారణము. మనకున్న అన్ని అనుభముల వ్యవస్థీకృత వివరణమే దర్శనము-అని ఈయన అభిప్రాయము. ఇట్లు వివరించునప్పుడు అనుభవముల పరస్పర సంబంధమును దృష్టిలో నుంచుకొనవలెను; ఈ అనుభములచే నిర్దిష్టము (denoted)లగు ఘటనలను లేదా దృశ్యములను (phenomena) నిరూపించవలెను. ఇది దర్శనము చేయవలసిన పని. ఈ దృష్టితో చూచినచో హెగెల్, స్పినోజా, శంకరులు దార్శనికులు కారని ఆయన మతము. విలువలను గూర్చిన మన భావముల నుండి ఈశ్వరుడు ఉద్గమించును (emerges) అని ఆయన అనును. కర్మ పునర్జన్మ సిద్ధాంతములను, వేద ప్రామాణ్యమును, వేదాంత సంప్రదాయములను ఒక దరికి నెట్టి, తర్కముపైన, అనుభవముపైన మాత్రమే ఆధారపడి దర్శన నిర్మాణమునకై ఈయన ప్రయత్నించుట, అందులోను ఈయన సంస్కృతమందు భారతీయ దర్శనములందు దిగ్దంతి వంటి పండితుడగుట చాలా విశేషములు. ఇంతటి వైదుష్యము, ఇంతటి భావ స్వాతంత్ర్యము ఈ దేశమున సాధారణముగ సమ్మిళితము కాలేదు; ఆధునిక యుగమున ఈయనలో మాత్రమే ఇది జరిగినది.

**కృష్ణచంద్రభట్టాచార**(1875-1947): దాదాపు 48 ఏండ్ల క్రిందట గతించెను. ఈయన కలకత్తా విశ్వ విద్యాలయమున చిరకాలము దర్శనాచార్యుడు. ఈ శతాబ్దములోని భారతీయ దార్శనికులలో కెల్ల ఈయనయే గొప్పవాడని కొందరి అభిప్రాయము. ఇక ఆయన దర్శనము: విషయి విషయముల కతీతమై

---

* విశ్వమందు సామరస్య(harmony)మున్నది; మానవబుద్ధి నైసర్గికముగా దీని కనుకూలముగానే ఆలోచించును. చుట్టునున్న ప్రపంచము స్వర్గము చేసికొని, ఉచితముగా నాచరింపగల్గుట మానవబుద్ధి కున్న సహజశక్తి. వీటిని రాయ్ సంశయింపరాని అభ్యుపగమములుగా గ్రహించెను (evident premises).

వాటి పరస్పర సంబంధమును, భేదమును అర్థమగు నట్లు చేయు చైతన్యము కలదు. కాని దానిని వాటి ద్వారా నిర్వచించుట అశక్యము. కాన అది అనిర్దిష్టము (indefinite), అతీతము. నిర్దిష్టము అనిర్దిష్టము యొక్క ఒక ప్రకారము, విధము (mode); దానిని రూపొందించును. అనిర్దిష్టమును గూర్చి ఇంద్రియానుభూతిగాని, భావాత్మక చింతనగాని అసాధ్యము; కాని అది భావాత్మకానుభవమును (positive experience) అన్నివైపుల పరివేష్టించి యున్నది. దానిని గూర్చి మనకు సంవేదన మున్నది. అది జ్ఞేయములన్నిటి అత్యంత ప్రతిషేధము[1] (negation). దాని ప్రతిషేధము నిర్దిష్టము. నిర్దిష్టము చింతనావిషయ మని భావించు సాధారణ తర్కమునకు అనిర్దిష్టము అతీతము. సాపేక్షిక విషయి విషయములకు అతీతమగు కేవల విషయియే (absolute subject) అనిర్దిష్టము. విషయిత్వము (the subjective) - అనువ్యవసాయ క్రియ, మనన క్రియ - (contemplating act)-తప్ప తక్కిన దంతయు ప్రతిషేధించుటకు వీలున్నది. కాని ఇదియు, అనగా విషయియు, ఒక వ్యక్తి (individual) కాదని కొన్ని అనుభవముల[2] ఆధారముపై ప్రతిషేధింప వచ్చును. "నేను లేను" అని ఈ తీరున వైయక్తిక ఆత్మ (individual self) పతిషేధింపబడిన పిమ్మట మిగులునట్టిది, ఈ ప్రతిషేధము సాధ్యమగు నట్లుచేయునది - కేవలము అది అప్రతిషేధనీయమగు సత్తుకాన సత్యము. అది అన్నిటిని అతిక్రమించు ప్రతిషేధ ప్రక్రియ, కాన కేవల స్వాతంత్ర్యము. విషయత (the objective) ను వదిలించుకొని, కాబట్టే విషయిగా కూడ నుండకుండు ఆత్మ కేవల స్వాతంత్ర్యమును పొందును. భట్టాచార్య ఈ రీతిన అద్వైత భావవాదమునే పాశ్చాత్య కేవలవాద ప్రభావమునకు లోనై క్రొత్త పద్ధతిగ వ్యాఖ్యానించెను. ఈయన వ్రాసినది కొంచెము; శైలి నారికేళ పాకము; భావము లందు పరిభాషలోను అపూర్వతకై యత్నించును (కొంత సాధించినాడు కూడ); కాన ఈయన తాత్పర్యము గ్రహించుట కష్టము.

**వసంతకుమార్ మల్లిక్**:- చాలకాలము ఆక్స్ఫర్డులో నుండిన వసంతకుమార్ మల్లిక్ ఉత్తమ చింతకుడు. ఈయన కూడ దాదాపు 39-41 ఏండ్ల క్రిందటనే గతించెను. ఇతడు 'విచ్ఛిన్న తత్త్వము', 'అవిచ్ఛిన్నతత్త్వము' అను రెండు భావములను గ్రహించెను, ఇందు మొదటిది సత్తు అసత్తులు సంబద్ధావస్థలో నున్నప్పుడును, రెండవది అవి అసంబద్ధావస్థలో వేరు వేరుగా నున్నప్పుడును వాటిచే ఏర్పడును. అవిచ్ఛిన్నము (continuous reality) వ్యావహారిక జగత్తు. సత్తు అసత్తులు రెండు సమానముగానే తథ్యములు, విలువ కలవియు. ఇవి రెండు పరస్పర పూరకములు, నైష్ఫల్యకారకములును (frustrating). ఈ ద్వంద్వముల సంబంధమే విశ్వము. ఇవి రెండు అకేవలములు (non-absolutes). ఇవి సంబద్ధములయ్యు దేనికది విలక్షణము, పృథక్. ఇవి పరస్పరము సహకరించుచు కూడ ఒకదాని నొకటి నిష్ఫలము చేయును. ఈ ప్రక్రియకు ఈ విశ్వము పర్యవసానము; అందుచేతనే విశ్వమందును సంఘర్షణ, భ్రమ, నిష్ఫలత కలవు. కాన అన్ని పురుషార్థములను (values) నిషేధించుటే మన కర్తవ్యము; వాటిని అనుభవించుట కాదు. సన్న్యాసము(త్యాగము), తపస్సు (austerity) ఆచరణీయములని, భ్రమ నివారణ కావలెనని దీని అర్థము. చింతనచే భ్రమనివారణ యగును. పురుషార్థములను పొందవలెనను ప్రయత్నము విరమించి, సన్న్యాసమును, నివృత్తిని అవలంబింపవలెను. సంబద్ధ ద్వైతవాదమును (related dualism), సన్న్యాసమును ప్రతిపాదించుచు ఈయన నాలుగు పెద్ద పుస్తకములను వ్రాసెను. ఈయన స్వతంత్రరూపమున దర్శన నిర్మాణముచేయ ప్రశంసనీయముగ యత్నించిన సూక్ష్మబుద్ధి.

1. అన్ని విధముల ఆలోచనలు జ్ఞాన విషయములే గాన అనిర్దిష్టము 'ఆలోచన' (thought) అనియు చెప్పరాదు.

2. ఉదా. ఆత్మార్పణాది మతానుభవములలో ఆత్మ ప్రత్యాఖ్యానింపబడును (abnegated).

మతమునకు, అతిభౌతికవాదమునకు తాదాత్మ్యము న్నదని, ప్రతివ్యక్తి తనను తాను నిశ్శేష - నిరాసము (denial) చేసికొని అవాఙ్మానస గోచరమగు ఈశ్వరత్వము (god head)లో చచ్చి, అందులోనే పాతిపెట్టుకొనవలెను అనియును, అన్ని మతములు ఒకే సాధారణ ఆధ్యాత్మిక భాషకు ఉప భాషలు (dialects) అనియును ఒక విధమైన రహస్యవాదమును **ఆనంద కుమారస్వామి** (1877-1947) విస్తరించెను. "నేను ఇది కాదు"[1] అని గార్గ్యాయనుడను ఉపనిషద్ ఋషి చెప్పిన వాక్యము నాధారముగా గొని, వేదాంతముతో సమానతంత్రమగు నొక దర్శనమును **భగవాన్ దాస్** (జ. 1869) ప్రపంచించెను. వీరు ఇద్దరు బహు గ్రంథకర్తలు, బహుశ్రుతులు, ప్రాచీన శాస్త్ర గ్రంథములలోని సత్యముల పునర్వ్యాఖ్యానము ఆకర్షకముగ జేసిరి. స్వయముగా ఎక్కువగా వ్రాయక పోయినను చాలమందికి ప్రేరణ నిచ్చి దర్శనమునకు చాల ప్రతిష్ఠ చేకూర్చిన బ్రజేంద్రనాథ్ సీల్ కూడ ప్రశంసనీయుడు.

## ఉపసంహారము

దిగంత విశ్రాంత కీర్తులగుటచే రాధాకృష్ణన్‌ను గూర్చి, వినోబా భావేను (చూ. వినోబాదర్శనము) గూర్చి ఈ గ్రంథమున చెప్పినాము. కాని జీవించియున్న ఏ ఇతర భారతీయ దార్శనికులను గూర్చి ప్రస్తావింప దలపలేదు. నేడు భారతీయ దార్శనిక జగత్తులో ఈ క్రింది ధోరణులు కనపడుచున్నవి: 1. భారతీయ దర్శనములలో నొకదానిని విశేషాధ్యయనము చేసి, దానికి సంబంధించిన గ్రంథముల అనువాదములనో, వ్యాఖ్యానములనో, టీకా టిప్పణములనో చేయువారు. 2. పాశ్చాత్య వాదములలో ఏదో ఒకదానిని అధ్యయనము జేసి దాని వివరణలనో, విమర్శలనో చేయువారు. 3. ప్రాక్ప్రతీచీ భావముల తులనాత్మక అధ్యయనము చేయువారు. 4. స్వతంత్ర విధముగ ఆలోచించి కొంచెమైనను సృజనాత్మతక కృషిని చేయువారు. 5. ఈ పై నాలుగు రకముల పనులను యుగపత్తుగ చేయగల సమర్థులును కలరు. నేటి భారతీయ దార్శనికులలో వెనుకటి తరము వారిలో ఎక్కువమంది భావవాదులు; ఇప్పుడే పైకి వచ్చుచున్న వారిలో ఎక్కువ మంది తార్కిక ప్రత్యక్ష జ్ఞానవాదము (logical positivism) చే ప్రభావితులు. అస్తిత్వ వాదముచేత, దృశ్యవాదము ఇత్యాదులచేత ప్రభావితులు ముగ్గురు నలుగురే ఉందురు. మార్క్సిస్టులు కొలదిగనే ఉన్నారు. అనుభవవాదులు, ఈశ్వరవాదులు ఒకరిద్దరు ఉందురేమో. తమ తమ పూర్వగుల మతమునే (ఉదా. అద్వైతము, విశిష్టాద్వైతము) ఆశ్రయించి యుండువారును కలరు. నేటి భారతీయ దర్శనపు సాంగోపాంగ వివరణము నేనిటీవల సంపాదన (edit) చేసిన హిందీ గ్రంథమున[2] కలదు. అన్యత్ర ఇంతవరకు లేదు.

# చైనీయ దర్శనము

'రహస్యము'ను గూర్చి నేర్చుకొనుట (hsüan hsüeh), సత్యము నెరుంగుట (tao hsueh), సూత్రములను ఎరుంగుట (i li chih hsiieh)- ఈ సమస్యలు చైనీయ దర్శనమున ప్రధాన అధ్యయన విషయములు. మానవ స్వభావము, 'ద్యాన్' (Heaven) యొక్క తెన్నులు (లేదా విధానములు) కూడ చైనా దార్శనికులకు మనన విషయములు. కాని ఉత్తమ మానవుని లక్షణములు, నైతిక గుణములు-వీనిని గూర్చి జరిగినంత హెచ్చుగా చైనాయందు ప్రమాణములను గూర్చికాని, సత్త లేదా పరమతత్త్వమునుగూర్చి కాని, జ్ఞానమును గూర్చికాని, ఆత్మాదు

1. చూడబడు దృశ్యము ఆత్మ కాదు అని భావము.

2. 'సమకాలీన్ భారతీయ దర్శన్' ప్రచురణ: భారతీయ దర్శన్ పరిషద్, ఫరీద్ కోట్, పంజాబ్, ఇండియా-1962. ఇందు మహమ్మదీయ, క్రైస్తవ దర్శనములను గురించి, రాజనీతిని గురించి, ఇంగ్లీషు రాని ప్రాచీన పరిపాటి ననుసరించు పండితుల కృషిని గూర్చి కూడ వివరణ కలదు.

లను గూర్చికాని మీమాంస జరుగలేదు. చైనీయ దర్శనము హెచ్చుగా వ్యవహారయోగ్యములైన, ఉపయోగ్యము లైన విషయములను గూర్చి చర్చించినది. మానవుడు ఎట్లు నడచుకొనవలెను? ఎవడు ఉత్తమ మానవుడు? ఎట్టిది సరియగు సంఘ వ్యవస్థ? ఈ ప్రశ్నల కుత్తర మిచ్చుటకే చైనీయదార్శనికులు విశేష ప్రయత్నము చేసిరి. టావో సంప్రదాయము, చైనీయ బౌద్ధము, నవీన కన్‌ఫ్యూసియన్ మతము దీనికి అపవాదములు.

## కన్‌ఫ్యూసియన్ దర్శనము

చైనాలో స్పష్టమగు దార్శనిక చింతన తొలిమారు కన్‌ఫ్యూసియస్ యందే కానవచ్చును. సుంగ్ రాజవంశమునకు చెందినవాడీతడు. కాని ఇతని ముత్తాత కాలమున ఈ కుటుంబము తన ప్రాభవమును కోల్పోయి, స్వరాష్ట్రమును వీడి, 'లూ' అను వేరు రాష్ట్రమునకు వలసపోయి, అక్కడ అతిసాధారణ దశలో జీవింప సాగెను. ఇతడు క్రీ. పూ. 551లో జన్మించి 479 లో మరణించెను. కన్‌ఫ్యూసియస్ అనునది కుంగ్ ఫుట్జూ (K'ung Fu Tzu-కుంగ్ గురువు) అనుదాని యూరోపీయ రూపము. ఇతని పూర్తిపేరు కుంగ్ ఛియు. ఇతడు 19వ ఏట వివాహము చేసికొనెను. కొన్ని ఏండ్ల పిదప భార్యకు విడాకులిచ్చెను. ఈతని కొక కుమారుడు. లూ రాష్ట్రమున కొంత కాలము ఉద్యోగిగా నుండి, తరువాత రాష్ట్రాంతర భ్రమణాది ఎన్నో అనుభవములకు గురియై, క్రీ. పూ. 501లో లూ ప్రధానమంత్రియై సమర్థతతో రాష్ట్రపాలన చేసెను. 497 ప్రాంతమున రాజు దుర్వర్తనకు లోనుకాగా, ఇతడు తన పదవిని, రాష్ట్రమును వీడి, శిష్యులతో కలసి చైనాలోని ఇతర రాష్ట్రములలో పర్యటించుచు, నీతులను బోధించుచు, ఏ రాజైన తన ఉపదేశములను ఆచరణలో పెట్టి, ఆదర్శ రాజ్యసాధన చేయునేమో అని అన్వేషించుచు కాలము గడిపెను. చివరకు విసిగి తిరిగి తన రాష్ట్రమునకే వచ్చి, జీవితమందలి చివరి మూడేండ్లు అధ్యయ నాధ్యాపనములందు గడిపెను. ఇది కన్‌ఫ్యూసియస్ జీవితమును గూర్చిన సంప్రదాయము.

కొందరు ఆధునికులు దీనినంతను సత్యమని ఎంచరు. సోక్రటీస్ మొదలగువారి వలెనే కన్‌ఫ్యూసియస్ మహనీయుడు; గొప్ప వ్యక్తిత్వము కలవాడు. క్రీ.పూ. 206లో హన్ రాజవంశస్థాపన జరిగినప్పటినుండి కన్‌ఫ్యూసియస్ మహర్షిగాను, దివ్యపురుషుడుగాను చైనాలో ఆరాధింపబడసాగెను. క్రీ. పూ. 206 - 194 మధ్య ఉండిన కాఔతే (Kaow Te) చక్రవర్తి ఇతని సమాధిని దర్శించి ఆతని కొక ఎద్దును బలి ఇచ్చిన నాటినుండి ఇతని సంప్రదాయము, ఆరాధన వ్యాపించెను. చైనాలో కన్‌ఫ్యూసియస్ ఆలయములు 1500కు పైగా కలవు. వీటియందు అతడు ఆరాధింపబడుట, ఎద్దులు, పందులు, గొర్రెలు బలి ఈయబడుట పట్టువస్త్రములు, ఫలములు ధూపాదులు సమర్పింపబడుట మొన్న మొన్నటి వరకు జరుగుచుండెడివి. సాన్‌టుంగ్‌లోను, పీకింగ్‌లోను అన్నిటికంటె ప్రధాన ఆలయములు కలవు. వీటి శిల్పము, వైభవము అద్భుతము. కన్‌ఫ్యూసియస్‌ను దివ్యపురుషునిగాను, నూతన నీతిబోధలు చేసిన జగద్రక్షకునిగాను ఎంచు ఈ సంప్రదాయము 'నూతన శాస్త్ర సంప్రదాయ' (new text school) మనియు. దీనికి విరుద్ధముగ ఆతనిని కేవలము ఒక మహాపురుషునిగా, ప్రాచీన సత్యముల ప్రచారకునిగా ఎంచునది 'ప్రాచీన శాస్త్ర సంప్రదాయ' మనియు పిలువబడెను. ఇందు మొదటిది యింగ్ - యాంగ్ భావముల చేతను, రెండవది టావో మతము చేతను ప్రభావితములు. మొదటిదానిలో అస్వాభావిక ఘటనల యందు నమ్మకము. మహాద్భాచారములు హెచ్చు. ఇందు మొదటిది దాదాపు క్రీ. పూ. 190 నుండి, రెండవది క్రీ. పూ. 60 ప్రాంతము నుండి స్పష్టముగ కానవచ్చుచున్నవి.

పశ్చిమ చైనాలో నుండిన ఒక చిన్న రాష్ట్రమగు చౌ (Chow) క్రమ క్రమముగా వృద్ధినొందివెన్, వూ అను రాజుల క్రింద బలశాలియై చైనాపై అంతటను ఆధిపత్యము స్థాపించెను.* వూ సోదరుడగు

* ప్రస్తుతము ఉత్తర చైనా మైదానము, పసుపు నదిలోయ (Yellow river basin) మాత్రమే అప్పుడు చైనాగా బరగెను.

చౌ ప్రభువు కూడ ప్రసిద్ధుడు. ఇట్లు చౌ చక్రవర్తుల పరంపర క్రీ. పూ. 1122 నుండి 256 వరకు ఉండె నని ఐతిహ్యము. వీరి కాలమున సంస్కృతి, ఆచార వ్యవహారములు పరమోత్కృష్ట స్థితియందు ఉండె నని, ఈ చక్రవర్తులు ఆదర్శ పురుషులు, ఋషులు అని కన్‌ఫ్యూసియస్ నమ్మెను. చౌ వంశమునకు ముందర కూడ రెండు ప్రసిద్ధ రాజవంశములు, వాటికి చెందిన మహాపురుషులగు చక్రవర్తులు ఉండిరి. వారి కాలమున కూడ సంస్కృతి గొప్ప స్థితిలో నుండినను, అది చౌ రాజవంశ కాలమున పరిపూర్ణత నందెనని కన్‌ఫ్యూసియస్ అభిప్రాయము. ఆ సంస్కృతి స్వరూప మెట్టిదో బోధించుట, దానిని వ్యాపింప జేయుట, 'ద్యౌన్'చే నిర్ణీతమగు తన కర్తవ్యమని అతడు తలచెను. ప్రాచీన నాగరికతా సంప్రదాయ ముల వ్యాఖ్యాతగను, ప్రచారకునిగను మాత్రమే అతడు తనను భావించెను; తాను నూతన విషయము లను గాని, మార్గములను గాని బోధించుచున్నానని అతడు ఎన్నడును తలచలేదు.

'ద్యౌన్' (చైనీయ పదము - T'ien)అనగా దివము, వ్యోమము, ఆకాశము (ద్యౌః, ఖమ్*). ఇది సర్వజ్ఞమని, విశ్వమును పాలించు పరమ తత్త్వమని, దాని ఇచ్ఛ (ming) వలననే సమస్తము జరుగు చుండునని, అదే విధి అనియు, అది నిష్క్రియమయ్యు సమస్తమును ప్రవర్తింపచేయు ననియు, ఋషుల ఉపదేశముల అధ్యయనముచే దృఢబుద్ధి బడసి, సంశయ రహితులైన వారికి ద్యౌన్ యొక్క ఇచ్ఛ అవగత మగుననియు అతని బోధలవలన తెలియ వచ్చును. ద్యౌన్ ఇచ్ఛ పట్ల ఉత్తమ పురుషులు భయ భక్తులు కలిగి యుందురని అతడనెను. విశ్వసృష్టికి కారణమును, కర్మఫల ప్రదాతయు ద్యౌన్. అది ప్రతివానికి స్వభావముగానే మంచితనము నిచ్చి యున్నది. నడచుకొనవలసిన నియమముల నేర్పరచి నది. ఆ స్వభావమును వీడకుండ దానిని పూర్ణముగ పరిపక్వ మగునట్లు ప్రయత్నించువాడే సరియగు మానవుడు. ద్యౌన్ నియమముల ననుసరించువాడు, మానవ నిజ ధర్మమును - స్వభావమును (మంచి తనమును) - తన వ్యక్తిత్వమందు పూర్తిగ వికసింప చేయువాడు ఋషి. వాడు ద్యౌన్‌కు తుల్యుడు. (కొందరు నేను ద్యౌన్ శబ్దముపయోగించిన చోట్ల నెల్ల 'ఈశ్వరుడు' అనియే అనువదించిరి).

పితరులను, భూతములను (పృథివ్యాకాశ, నదీపర్వతాదుల అధిదేవతలను) ఆరాధించుట, వాటికి బలుల నిచ్చుట కర్తవ్యమని కన్‌ఫ్యూసియస్ భావిం చియు, వారినిగూర్చి ఆలోచించుటను, మాటలాడుటను అతడు నిరుత్సాహపరచువాడు. అట్లు చేయుటే వివేక మని ఆయన తలచెను. మానవులను, వారిపట్ల ఆచరింపవలసిన ధర్మము, జీవితము - వీటిని సరిగా అర్థము చేసికొనుటయే అవశ్యకముగాని, పితరుల, భూతముల గూర్చిగాని, మరణము తదనంతర స్థితిని గూర్చిగాని విచారించుట అనావశ్యకమని అతడు బోధించెను. పితరులను, భూతములను ఉన్నట్లుగ ఎంచి పూజించుట, బలులిచ్చుట చేసిన చాలును; వారిని గూర్చి మీమాంస అనవసరము - అని అతని మతము.

కన్‌ఫ్యూసియస్ నైతిక బోధలను ఇక సంగ్ర హింతము : ద్యౌన్‌చే ఈయబడిన మానవ స్వభావ మున కనుకూల నియమమును పాటించుటయే ప్రధాన నీతి సూత్రము. నైతిక మార్గము స్వాభావికము. విశ్వము యొక్క స్వభావముతో దానికి సామరస్యము కలదు. సుఖ దుఃఖ కోపాదులు లేనట్టిది మన నైతిక స్వభావము; మన నిజమగు ఆత్మ (Chung - central self & moral being). సుఖదుఃఖాది ఉద్రేకములు ఆవిర్భవించి, అన్నియు తగుమాత్రముగ వృద్ధిచెంది సామ్యావస్థ నొందిన సమన్వయము నైతిక వ్యవస్థ ('ho' - moral order). ఈ సమన్వ యమే విశ్వ నియమము. మన నిజమగు ఆత్మను, సమన్వయమును సాధించుటే పరమ పురుషార్థము. విశ్వ వ్యాప్తమగు నైతిక వ్యవస్థతో (ఋతముతో అనవచ్చును)ఏకతానుడై, దానిని జీవితములో వ్యక్తీక రించుటయే మానవ లక్ష్యము. తన నిజమైన ఆత్మ్మ

---
* ద్యావా పృథివీ - చైనా భాషలో T'ien T'i

తన నైజమగు స్వభావమును కనుగొని, అందు సుప్రతిష్ఠు డగుటయే (Chungyung) నైతిక జీవనము. సమత్వసాధన - మధ్యమమార్గ సాధన (Chungyung) లో ఇది ఇమిడియున్నది. నైతిక వ్యవస్థ ఎల్లెడల కలదు. అయినను అది గుహ్యమే. ఆధ్యాత్మిక శక్తి విశ్వమందంతటను కలదు. అది అనుభవ విషయము; అయితే అప్రత్యక్షము. మానవునిలో శ్రద్ధను, ఆరాధన, యజ్ఞము ఇత్యాదులు చేయవలెనను సంకల్పమును కల్గించునది ఈ శక్తియే!

మానవ స్వభావము సర్వత్ర ఒక తీరుననే ఉండును. అంతఃకరణ ప్రవృత్తికి, పరస్పరత (అన్యోన్యత, 'Shu' reciprocity)కు అనుకూలముగ వర్తించువాడు నీతి సూత్రమును పాటించును. ఇతరులు నీకు ఏవి ఒనరించిన నీకిష్ట ముండదో, అవి వారికిని నీవు ఒనరింపకుము - అనునదే ఈ సూత్రము. వృద్ధుల ఆదరణ, సేవ, తన స్థితికి అనువుగ ఉండుట, దానికి వేరగు స్థితిని కోరకుండుట యుక్తము.

ప్రతి వస్తువుయొక్క సారమును దాని పేరే తెలుపును; వస్తువుల స్వాభావికమగు పరిణతిని, ఆదర్శమును కూడ వాని పేర్లే సూచించును. వస్తుస్థితి దాని పేరునకు తగినట్లుండిన అంతయు సక్రమముగ నుండును. 'పేర్లను సరిదిద్దుట' ('Cheng ming, rectification of names) అన్నిటికంటె ముఖ్యము. దీని అర్థమేమన, 'రాజు', 'మంత్రి', 'తండ్రి' 'కొడుకు' అను పేరులు గలవారు అన్వర్థనాములుగ - ఆ పేర్లకు తగినట్లు - వ్యవహరింతురు. ఉదా: 'రాజు' సరిగా రాజ్యమేలవలెను. 'కొడుకు' పితృవాక్య పాలనాదుల జేయవలెను. 'భర్త' భార్యను తగురీతి భరింపవలెను. లేకున్న పేరు ఒకటి, వస్తు స్థితి మరొకటిగా ఉండి, సంఘ వ్యవస్థ తారుమారై, నీతి సమసిపోవును. ప్రతివాడును సంఘమందలి తన పరిస్థితికి, తన అధికారమునకు, తనకే పేరు వర్తించునో ఆ పేరునకును తగినట్లు వర్తింపవలెను - అని తాత్పర్యము. ఉదా: 'పంతులు' అను పేర బరగువాడు సక్రమముగా శిక్షణచేసి అన్వర్థనాముడు కావలెను. లేకపోయిన సంఘమందు వ్యవస్థ (Tao) లేకుండపోయి చేటు వాటిల్లును. సంఘమందు శ్రేష్ఠులైనవారు - రాజులు, సామంతులు, మంత్రులు, ఇత్యాదులు - తమ అధికారమునకు, పదవికి తగినట్లు తమతమ విధ్యుక్త ధర్మములు నెరవేర్చనిదే ఇతరులు, సామాన్యులు అటులచేయరు. శ్రేష్ఠుల ఆచరణనే ఇతరులు అనుసరింతురు. కాన పాలక వర్గమునకు సదాచారమును పాటింపవలసిన బాధ్యత హెచ్చుగ కలదు. లేకపోయిన సంఘము, కుటుంబము, ధర్మము ఉత్పన్న మగును.

ప్రతివాడు తన వైయక్తిక విధ్యుక్త ధర్మములను నెరవేర్చినచో రాజ్య వ్యవస్థ దాని కదియే చక్కబడును. సక్రమమగు సాంఘిక రాజకీయ వ్యవస్థ ఏర్పడుటకే యుక్తాయుక్త విచారణ, ఆచారములు,[1] సంప్రదాయములును స్వకుటుంబ సదస్యులపట్ల, స్వజనులపట్ల ప్రేమ కలిగియుండుట, పొరుగువారితోను, అన్యులతోను ఉచిత వర్తనము కలిగియుండుట, ఎవరిని ఎట్లు గౌరవింపవలెనో, ప్రేమింపవలెనో ఎరిగి, అట్లు చేయుట - ఇదియే ధర్మానుష్ఠానము, సాంఘిక వ్యవస్థయు (lü). సంఘమందు ఎవరెక్కువ, ఎవరు తక్కువ అని క్రిందుమీదులు తెలిసికొని, తారతమ్య జ్ఞానముతో అందరిపట్ల ఉచితరీతిని వ్యవహరింపవలెను. వృద్ధులకు,[2] తనకంటె అధికులకు[3] లోబడి వారిపట్ల విధేయతతో, గౌరవముతో ఉండవలెను; స్వజనులను, మిత్రులను ప్రేమింపవలెను; కొందరి కీజ్ఞానము పుట్టుకతో వచ్చును. మరి కొందరు విద్య ద్వారానో, అనుభవము ద్వారానో దీనిని సంపాదింతురు.

---

1. ఇది మిత్రులు తేనీటికి వచ్చిన సందర్భములో కావచ్చును; లేదా జాతాశౌచమృతాశౌచముల సందర్భములో కావచ్చును; లేదా రాజ్యాభిషేక సందర్భములో కావచ్చును; లేదా కూతురు పెండ్లికే సంగీతము పాడవలెనను సందర్భములో కావచ్చును. ప్రతి సన్నివేశములోను విహితాచారము కలదు.
2. తండ్రి, జ్యేష్ఠభ్రాత.
3. రాజు, మగడు, గురువు.

సత్యశీలురు, ఋజువర్తనులు అయినవారే పరిపూర్ణులు కాగల్గెదరు. తమ నిజస్వభావమును సఫలము చేసికోగల్గెదరు. సులభముగ సహజముగ నైతిక సూత్రముతో సామరస్యము కలిగియుండుటే సత్యశీలత్వము. అట్టివారు అప్రయత్నముగ ఏది మంచియో, ఏది యుక్తమో ఎరుగుదురు, అట్లు చేసెదరు. సత్యమనగా మన ఆత్మలాభము, ఆత్మప్రాప్తి (fulfilment of our self) నైతిక సూత్ర మనగా మన సత్తయొక్క సూత్రమే (law of our being). ఋతము ననుసరించునది సత్యము.

ఉత్తమ పురుషుడు బహుముఖుడుగ నుండును. అతనికి విచారము, సంశయము, భయము ఉండవు. తానెట్టి స్థితిలో నుండినను దానిలో సంతుష్టుడుగనే ఉండును. దేశకాల పరిస్థితులను బట్టి అతని నిశ్చయము, వ్యవహారమును ఉండును. ఎప్పుడు ఎవరిని ఎట్లు ప్రేమింపవలెనో, ద్వేషింపవలెనో, ఎవరిని, ఎప్పుడు ఎట్లు గౌరవింపవలెనో, కూడదో - అతనికి తెలియును, అట్లు చేయును. చెడుగునకు ప్రతీకారముగ మంచి చేసినచో, దుష్టులకు దయ చూపినచో మంచితనమునకు, సజ్జనత్వమునకు ఉచిత ప్రతిక్రియ ఏమిటి? చెడుగునకు ప్రతీకారముగ దయచూపుట ఉదారతయే కాని, దుష్టులను శిక్షించి వారికి కఠినముగ న్యాయము జరుగునట్లు చేయక పోయినచో, మంచికి ప్రోత్సాహము, చెడుగునకు భంగము కలుగవు.

ధర్మము ('jen' - virtue) మానవుని నిజస్వభావము ('chih'). అసలైన మానవ హృదయము కలిగియుండుటే ధార్మికత. విధ్యుక్తాచారముల ('li') ప్రకారము వర్తించుట, ఇతరులపట్ల సహానుభూతి కల్గియుండుట, ఋజువర్తనమును ('i') అంతర్గత మూలాధారముగా గైకొనుట ధార్మికతా లక్షణములు. ధర్మము సర్వశ్రేయస్కరమైనను, అది ఉపయోగమును బట్టి నిర్ణయింపబడదు. అది నిరపేక్షము. ధర్మార్థమే ధర్మానుష్ఠానము. ఇతర ప్రయోజనముల సిద్ధికది సాధనము కాదు. ఇది కన్‌ఫ్యూసియస్ బోధల సంగ్రహము.

క్రీ. పూ. 371-289 మధ్య చైనాలోని ట్సౌ రాష్ట్రములో జన్మించిన మెన్సియస్ (ఇది మెంగ్ కో అను చైనీయ నామమునకు ఐరోపీయ రూపము) కన్‌ఫ్యూసియస్ మనుమని శిష్యుల వద్ద విద్యాభ్యాసము చేసి, కన్‌ఫ్యూసియస్ సంప్రదాయమున గొప్ప గురువుగా పేరొందెను. తన బోధల నెవరైన రాజులు విని ఆచరణలో పెట్టెదరేమో అని మెన్సియస్ ప్రయత్నించెను గాని, వాటిని విను రాజులు దొరకలేదు. అందుచే శిష్యులకు బోధించుటయందు, గ్రంథ రచనయందు అతడు కాలము గడిపెను. మెన్సియస్ బోధలు : మానవుని స్వతస్సిద్ధ నిజ స్వభావము మంచితనము. దాని అభివ్యక్తియే సత్ప్రవర్తన. తన సహజ స్వభావమున కనుకూలముగ వర్తించు ప్రతివాడును మంచివాడే దయ, పరోపకారబుద్ధి - ఇవన్నియు మానవుని సహజగుణములు. తగు జాగ్రత్త, పోషణ సంస్కారము లేనప్పుడు బాహ్య పరిస్థితులు సహకరించనప్పుడు మానవుడు ఆత్మను పోగొట్టుకొని, తన స్వభావమునుండి చ్యుతుడగును. అంతర్ముఖులై, మననశీలురై, భౌతిక వస్తువులకు దాసులుగాక, స్వభావానువర్తనము చేయుచు, ధర్మము ననుష్ఠించువారు ఆత్మను పోగొట్టుకొనరు. మానవ స్వభావము ('hsing') ద్యౌన్‌లో ఒక భాగము.

క్రీ. పూ. 298-238 మధ్య ఉండిన హుసలన్ ట్జూ పరమతములను ఖండించి, కన్‌ఫ్యూసియస్ మతమును వేరొక విధముగ వృద్ధిచేసెను. ప్రకృతిలో నియతి (regularity) కలదు. దీని అదృష్ట కారణమే ద్యౌన్. క్రమ పద్ధతిని నడచుకొనుట, సుఖమును అన్వేషించుట. భోగభాగ్యములను చేకూర్చుకొనుట, ప్రకృతి తన ఋతుక్రమము తప్పనియట్లు సరియగు ప్రభుత్వమును, సంఘవ్యవస్థను నిర్మించి దానికి లోబడియుండుట - ఇవి జ్ఞానులు చేయుదురు. ద్యౌన్‌ను గూర్చి వారెరుగ కోరరు. దానిని ప్రశంసించుట, దానికి విధేయులై యుండుట, వారు చేయరు. అవకాశముల నుపయోగించుకొని, వస్తువులను గూర్చి ఆలోచించుటకు బదులు వాటిని తమవిగా ఎంచి వాటిని వాడుకొనుట, వృద్ధి చేసుకొనుట వివేకము.

అట్లు చేయువాడు ట్యాన్‌ను, పృథివిని - అనగా ప్రకృతిని అనుశాసించి, తన సుఖసాధనములుగా చేసికొనును. మానవుడు స్వభావ సిద్ధముగ స్వసుఖమును, స్వలాభమును కోరును. మానవుని సహజ స్వభావము చెడుతనము. ఇంద్రియ ప్రవృత్తుల నరికట్టి న్యాయ శాసనములకు, సత్ప్రవర్తనాదర్శములకు అనుగుణముగ నడచుకొనుటవలన మానవుడు మంచివాడగును. మానవునికి బుద్ధి కలదు కాబట్టి, అతడు శిక్షణ అభ్యాసములద్వారా వ్రాయుట, దున్నుట మొదలగునవి నేర్చుకొనినట్లే, సత్ప్రవర్తనను, న్యాయాచరణమును నేర్చుకొని, అభ్యాసము వలన పెంపొందించుకొనగలుగును. పుట్టుకతోనే ఎవరికిని మంచితన ముండదు. సంఘాచారములు, సంస్థలు, సంస్కృతి, న్యాయము, చట్టములు - వీటిచే తీర్చిదిద్దబడినదే మంచితనము. జనులకు పెక్కు కోర్కెలున్నవి. అందరు కోరునది ఆ వస్తువులే! మానవులు ఏకాకులుగ ఉండిన పూర్తి సుఖము నందలేరు. ఏలన అన్ని పనులు ఒకరే చేయలేరు కాబట్టి సామూహిక జీవితము, దానిలో పనుల వైవిధ్యము, వృత్తి విభాగము, వ్యక్తులమధ్య తారతమ్యము - వీటన్నిటిని వ్యవస్థీకరించుటకు సూత్రములు ఏర్పడినవి. మానవుని నైసర్గికమగు చెడ్డతనమును ఈ సూత్రములు, సాంఘిక చట్టములు, ఆచారములు అదుపులో పెట్టి వానిని మంచివానినిగా చేయును. అప్పుడే అతనికి, ఇతరులకు సుఖము కలుగును. ఇది హుసున్ట్జూ ఉపదేశము.

584-617 మధ్య నుండిన వాంగ్‌తుంగ్ కన్‌ఫ్యూసియస్ మత పునరుద్ధరణకు కొంచెముగా ప్రాతిపదిక వేసెను. ఏలన నాటికి టావో మతము, బౌద్ధ మతము విపుల ప్రచారము గడించి ఇది వెనుకకు పోయెను. 768-824 మధ్య నుండిన హన్‌యు నవీన కన్‌ఫ్యూసియస్ మతమునకు ప్రారంభము చేసెను. ఇతడు టావో మత ప్రభావమునకు, ఇతని శిష్యుడగు లి ఆవో బౌద్ధమత ప్రభావమునకు లోనైనవారు. ప్రజ్ఞ, సమాధి, ధ్యానాది పదములు మూల స్వభావపు పునఃప్రాప్తి మొదలగు పదములు లి ఆవో వ్రాతలలో దొరల నారంభించెను. 1017-73 మధ్య నుండిన చౌ తున్-ఇ, 1011-77 లోని షావో యుంగ్ టావో మతముచే ఎక్కువగా ప్రభావితులైన నవీన కన్‌ఫ్యూసియన్ సంప్రదాయ ప్రవర్తకులు. వీరు ఎక్కువగా పరాత్పరమును ('T'ai chi', The Supreme, Ultimate) గూర్చి మననము చేసిరి. పరాత్పరము పరమ మూలము, పరాకాష్ఠ, పరమగతి. అది తన స్పందనము ('tung') చేతను, నిశ్చలత్వము ('ching') చేతను విపర్యయముగ వస్తుజాతము నంతను ఉత్పత్తి చేయును. పరాత్పరమునందలి స్పందన, నిశ్చలత్వములు ఒకదాని నొకటి ప్రేరేపించును. షావో యుంగ్ పరాత్పరమును టావో (పథము) గాను, మన సత్త్వముగాను అభివర్ణించినాడు. అది నిశ్చల ఏకత్వము, సమస్త వస్తుసారము. అది ద్వైతమును పుట్టించును. ఈ ద్వైతము అభౌతికము, అనగా దేశకాలములందు లేనిది. దీనినుండియే సంఖ్యలు, సంజ్ఞలు, వస్తువులు ఉత్పన్నమగును. ద్వంద్వములకు, ద్వైతమునకు, నానాత్వమునకు కారణమయ్యు పరాత్పరము, ఏకత్వము. అది మహా సమన్వయ మని చాంగ్‌ట్సై (1020-77) వర్ణించెను. అహంకార అభిమానములను వీడి, విశ్వప్రేమ ('Chien ai,) నలవరచుకొనిన నాడు విశ్వముతో ఐక్యభావము నందును - అని చాంగ్ వ్రాసెను. చెంగ్‌హావో (1032-85). చెంగ్-ఇ (1033-1108) నవీన కన్‌ఫ్యూసియన్ మతమును సుదృఢము చేసిరి. సమస్త ఆచరణ సూత్రముల (principles)కు మూలము, అధిష్ఠానమును ట్యాన్ యొక్క సూత్రము ('t'ien li) అది ఒక్కటియే! అది ఆదర్శము; అది నిత్యము, నిర్వికారము. "నిశ్శబ్దముగా నిశ్చలముగా నుండుట, కాని క్రియాశీలమైన పిదప ప్రతిదానిలోను అనుప్రవేశము చేయుట" - ఇది ట్యాన్‌యొక్క సూత్రము(heavenly principle), ఈ సూత్రము మన మనస్సులో స్వయంపూర్ణముగ నున్నది. మనలను మనము పరీక్షించుకొనినచో దానిని కనుగొనగలము. దానిని అభివ్యక్తము చేయగలము. ఛెంగ్ బోధసారమిది. మనము నిజముగా అంతటితోను

అభిన్నులమని ఎరుగుట, సమాధిలో ('ting') శాంతిలో ప్రతిష్ఠితులమై వ్యాపారవంతుల మగుట లక్ష్యములు.

ఛూ హ్సి (1130-1200) నవీన కన్‌ఫ్యూసియన్ మత సిద్ధాంతముల నన్నిటిని పూర్తిగా సమన్వయము చేసిన గొప్ప తత్త్వవేత్త. పరాత్పరము ఎక్కడనో ఒకచోట ధగధగ ప్రకాశించుచు ఉన్నట్టి భౌతిక వస్తు విశేషము కాదు. అది దిక్కాలములకు అతీతము, ఆకృతి లేనిది, సమస్తమునకు మూలము. అనగా అది సర్వవస్తువుల, సూత్రముల, ఆదర్శముల సమష్టి, సమస్తమునకు పరమావధి (highest archetype, the final cause, the ideal). అది పరమ మంగళము, పరమ శివము, విశ్వమందలి మంచితనమున కంతకు మూలము, ఆదర్శము. సమాహారము. అది నిత్యము, అదే గతి, అదే మార్గము ('Tao'). ప్రతి వస్తువునందు అది నిహితము. చంద్రుడు దశ సహస్ర నదులలో ప్రతిబింబించినట్లు అది అన్నిటిలో ప్రతిబింబించియున్నది. ఆ ఏక తత్త్వమునే అన్ని వస్తువులు పంచుకొనినవి. అయినను అది అవిభాజ్యము. ఇది హ్సి బోధ.

లూ ఛి యూ-యువాన్ (1139-93) (లేదా లూ హ్సియాంగ్-షన్) మరొక గొప్ప నవీన కన్‌ఫ్యూసియన్ సంప్రదాయపు తత్త్వవేత్త. అతని బోధ: నా మనస్సే ('hsin') ప్రపంచము ('యూ ఛౌ'). ప్రపంచమే నా మనస్సు. మనస్సు ఏకము; అన్ని మనస్సులు ఒకే తీరున ఉన్నవి. నా మనస్సును నేను పూర్ణముగ అభివృద్ధి చేసికొనిన ద్యౌస్‌తో తాదాత్మ్యము నొందెదను. ఇదే సత్యము ('tao'). అజ్ఞానముచే ఇది ఆవృతమైనది; అంతర్ముఖులమై, మన అంతర్గతమగు ఈ సత్యమున నివిష్టుల మగుటయే లక్ష్యము. మనస్సు, లేదా విజ్ఞానము పరమ తత్త్వము. అది ఏకము, అది వైయక్తిక మనస్సున కభిన్నము - అను సిద్ధాంతమును లూ శిష్యుడగు యాంగ్ ఛియన్ (1140-1226) ఇంకను స్పష్టముగ బోధించెను. ద్యావాపృథ్వులతోడను, అన్ని వస్తువులతోడను సర్వ వ్యాపకమగు ఐక్యముగలవాడే మహాపురుషుడు. అతనికి విశ్వమంతయు ఒకటే కుటుంబము, చైనా అంతయు ఒకే మనుష్యుడు. ఏలన, అతని ప్రేమ అట్టిది. ఆవరణదోషము నివారణమై, స్వతస్సిద్ధ, నిజస్వభావము అభివ్యక్తమైనప్పుడు ఈ విశ్వప్రేమ, ఏకత్వము అనుభూతిలోనికి వచ్చును. ఇటుల వాంగ్‌షౌ జెన్ (లేదా వో-అన్ 1472-1529) ఈ సిద్ధాంతములనే విపులీకరించెను.

యెన్ యువాన్ (1635 - 1704), లీ కుంగ్ (1659-1746) - వీరిద్దరు పై విధమగు నవీన కన్‌ఫ్యూసియన్ మతమును విమర్శించి, బౌద్ధ-టావో ప్రభావములకు లోనుగాని ఆదిమ కన్‌ఫ్యూసియన్ మతమును పునరుద్ధరింప ప్రయత్నించిరి. వ్యవహారము, నైతికత-ఇవి ప్రధానముకాని, తత్త్వ మీమాంస ప్రధానము కాదని వీరల అభిప్రాయము. వ్యవహారాతీతమగు తత్త్వముగాని, సూత్రము ('li') గాని లేదు. ప్రత్యక్ష వస్తుస్థితిని బట్టి, మానవ భావముల, వేదనల (feelings)ను బట్టి ఏది సూత్రమో నిర్ణయింపనగును. ఇది వీరి మతము.

19వ శతాబ్దములో మరొక రకపు కన్‌ఫ్యూసియన్ మతము విస్తరిల్లెను. 206-224 మధ్య వెలుగు చూచిన 'నూతన శాస్త్రీయ సంప్రదాయము' అతనిని అతిమానవ దివ్యపురుషునిగా భావించెను. దీని పునరుద్ధరణ 19వ శతాబ్దమున తిరిగి జరిగెను. 1644-1911లో రాజ్య మేలిన ఛింగ్ (మంచూ) రాజవంశ కాలములో దీనిని కొందరు చైనా జాతీయ మతముగాను, కన్‌ఫ్యూసియన్‌ను దేవతగాను చేయజూచిరి. వీరు కన్‌ఫ్యూసియన్‌ను రాజకీయ సంస్కర్తగా కూడ భావించి, అతని బోధల ప్రకారము సంఘ రాజకీయ వ్యవస్థల పునర్నిర్మాణమును, ఆదర్శ విశ్వరాజ్య (Ta Tung) స్థాపనను చేయజూచిరి. అట్లు జరిగిననే చైనా తన పూర్వోన్నతిని తిరిగి పొంది పాశ్చాత్యులచే అగౌరవింపబడకుండ స్వతంత్రముగ, వైభవోపేతముగ నుండగలదని, ప్రపంచ శాంతి ఏర్పడునని వీరల బోధ. కంగ్ యూవై (1858-1927) టాన్ స్సు-టుంగ్ (1865-98) లి యావో పింగ్ (1852-1932) ఇత్యాదులు ఈ ఉద్యమములో ప్రముఖులు.

వీరల సిద్ధాంతములో క్రొత్తదనము ఏమంత లేదని అభిజ్ఞులనిరి. వీరలను ప్రతిఘటించు ఉద్యమము కూడ ఉండెను.

## టావో దర్శనము

కన్‌ఫ్యూసియస్ కంటె దాదాపు 50 ఏండ్ల ముందు జన్మించిన లావో ట్జూ గొప్ప తత్త్వవేత్త అనియు, అతడు ఒక దర్శన నిర్మాణము చేసెననియు, ప్రస్తుతము లభించు 'టావో టే ఛింగ్' అతని కృతి యనియు సంప్రదాయము చెప్పును. ఇతడు చైనాలోని హోనాన్ రాష్ట్రమున క్రీ పూ. 604లో పుట్టెను. చౌ ఆస్థానమున ఉద్యోగిగా* ఉండెను. చౌ రాష్ట్ర పతనము జరుగనున్నదని గుర్తించి ముందుగనే ఉద్యోగ విరమణ చేసి, ఏకాంతముగ, అజ్ఞాతముగ సన్న్యాస జీవితము గడపెను. తరువాత కొన్ని ఏండ్లకు ఆ రాష్ట్రమును వదలి, కొండలను దాటి పడమటగా వెళ్ళిపోవుటచే మరి అతని జాడ తెలియ లేదట. వెళ్ళ బోవుముందు పర్వత దరి పాలకుడగు ఇన్‌హి అనువానికి తన మతమును బోధించి, తన కృతి నాతని కిచ్చెను. లావో ట్జూ కన్‌ఫ్యూసియస్‌ను రెండు మారులు కలిసికొని అతని వ్యక్తిత్వముచే చకితు డయ్యెనట. ఇది పూర్వము నుంచి వచ్చుచున్న ఐతిహ్యము. దీనిని కొంద రాధునికులు నమ్మరు. అందలి విషయములను, శైలినిబట్టి టావో టే ఛింగ్ క్రీ. పూ. 300 ప్రాంతమున వ్రాయబడి యుండునని కొందరు ఆధునిక పండితు లందురు. ఈ పుస్తకమును వ్రాసినది ఛు రాష్ట్రమున లిహ్ సియాంగ్ గ్రామమున పుట్టిన లి ఎర్‌హ్ (Li Erh) అనియు, ఇతని కొడుకు పై రాజ్యమున క్రీ.పూ. 273లో దండనాయకుడుగాను, సామంతుడుగాను ఉండెననియు కొందరి ఆధునికుల నిశ్చయము. ఇతడు తన సిద్ధాంతములను మెన్సియస్‌కు పూర్వవర్తి (సమకాలికుడా?) యగు యాంగ్ చు బోధల నాధారముగా చేసుకొని అభివృద్ధి చేసెనందురు. నాటి గాథలలో ప్రసిద్ధుడుగా నుండిన లావో టాన్ అను ఋషి రచనగా తన రచననే లి ఎర్‌హ్ ప్రచారము చేసి దానికి ప్రతిష్ఠ వచ్చునట్లు చేసెనని కొందరి ఊహ! ఛువాంగ్ ట్జూ (క్రీ. పూ. 286) లావో ట్జూను ప్రశంసించినందున ఈ ఊహలు నిరాధారములేమో! ఏది ఎట్లున్నను 'లావో టే ఛింగ్' ఒక మహా గ్రంథము. కాల క్రమమున లావో ట్జూ మరణించలేదని, అమరుడని, అతడు దివ్యపురుషుడని, టావోయొక్క అభివ్యక్తి అనియు, అంతకుముందే అతడొక పది అవతారము లెత్తెననియు అతడు సర్వజ్ఞుడు, అతి లౌకికుడు అనియు, అతనిని గూర్చి గాథలు బయల్వెడలి, అతని సంప్రదాయ మొకటి ఆవిర్భవించెను. క్రీ.పూ. 221లో చక్రవర్తి అయిన చిన్ షిహ్ హువాంగ్ టి, క్రీ.పూ. 140-46 లో రాజ్య మేలిన వూ చక్రవర్తి టావో సంప్రదాయపు గురువుల ప్రభావమునకు లోనైరి. క్షుద్ర లోహములను బంగారముగా మార్చుట, అమరత్వము నొసంగు మూలికను, లేదా రసాయనమును కనుగొనుట-నానావిధ అంధ విశ్వాసములకు, వివిధ ఆరాధనలకు దాసులగుట ఇది నాటి టావో సంప్రదాయపు పని. లావోట్జూ అసలు బోధలు వారెవరికి పట్టలేదు. వూ మరణానంతరము ఈ విధమగు ఆచార విశ్వాసములు క్షీణించెను. కొంతవరకు అసలు బోధలు ప్రచారములోనికి వచ్చెను, 147-168 లో నుండిన హవాన్ చక్రవర్తిని టావో మతము తిరిగి ఆకర్షించెను. నాటినుండి లావో ట్జూ జన్మస్థలమున ఉన్న అతని ఆలయములో చక్రవర్తి తరపున బలులు ఈయబడసాగెను. తరువాత చాల కాలము తిరిగి ఈ మతము క్షీణ దశలో నుండెను. తిరిగి 424-452 లో టాయ్ వు టె చక్రవర్తి టావో మతమున దీక్షితుడాయెను. మరల అంధ విశ్వాసములు, క్రతుకర్మలు ఈ మతమున తల ఎత్తెను. తరువాత 477-500 మధ్య ఏలిన టాయ్ హో చక్రవర్తి టావో అనుయాయుల కొరకెన్నో ఆలయములు, మఠములు కట్టించెను. నాటినుండి టావో మతము కొందరు చక్రవర్తుల కాలమున ఉచ్చస్థితిలోను, మరి కొందరి కాలమున క్షీణదశలోను ఉండుచు వచ్చెను.

* పురావృత్త లేఖల (archives) రక్షకుడుగ, లేదా కోశాధ్యక్షుడుగ నుండెనని కొందరనిరి.

ఛింగ్ (మంచూ) రాజ్యవంశ కాలములో (1644 - 1911) తిరిగి దానికి చెడ్డరోజులు వచ్చెను.

'టావో టే ఛింగ్' లోని బోధలు సంగ్రహించెదము. టావో అనగా మార్గము. జనుల జీవిత పథమునకు, ప్రకృతి విధానమునకు, పరమతత్త్వము ఉన్నట్టి తీరునకు కూడ టావో శబ్దము వర్తించును. ప్రపంచమును పాలించు నియతి టావో; ఏ సూత్రము ననుసరించి విశ్వమందలి ప్రక్రియ లన్నియు జరుగున్నవో అది టావో; సమస్త నీతులు దేని ననుసరించుటకై ప్రేరణలో అది టావో. మనుష్యులు స్వభావసిద్ధముగ నడచుకోవలసిన విధానము టావో; సూర్యచంద్రాదుల, పృథ్వియొక్క గతి టావో; సమస్త వస్తువుల సహజ స్వభావము సారమును టావో. టావో తక్కిన మార్గములవలెగాక అనిర్వచనీయము. టావో ఇదమిత్థముగ మార్పులేకుండ ఉండదు. సదసత్తులు, జీవన్మరణములు చక్రమువలె ఎల్లప్పుడు ఒకదాని తరువాత ఒకటి సంభవించుచున్నవి - ఇదంతయు టావో. ద్యావాపృథ్వుల ఆరంభము అసత్తు[1], ఈ అసంఖ్యాక వస్తువుల తల్లి[2] సత్తు వీటి విపర్యయము వలననే మొదటిదాని ఆశ్చర్యము, రెండవదాని సాంతత్వము కానవచ్చును. సదసత్తుల యోని పరమ రహస్యము, టావో. అది దృశ్యజగత్తు ఉద్భవించక ముందే ప్రవర్తిల్లు చుండెను. అది శాంతము, శూన్యము ఏకాకి, నిర్వికారము, విశ్వమంత ఓతప్రోతము, సమస్తమునకు తల్లి, అనియతము, అసంస్పృశ్యము. అది స్వప్నమందువలె చూడబడును. అగ్రాహ్యము. అందులోనే అన్ని ప్రతికృతులు, కల్పనలు, వస్తువులు, సారము, సత్యము కలవు. ఎన్నో పేర్లతో ప్రాచీన కాలమునుండి సమస్తమునకు ఆదియగు ఇది చూడబడుచున్నది; కాని దాని స్వభావమును ఎవడైనను ఎట్లు ఎరుగ గలడు? అది ద్వంద్వములకు అతీతము, పరస్పరవిరుద్ధములకు ఆశ్రయము, పరిణామశీలమగు దృశ్యజగత్తులో అంతర్యామి అయ్యు నిర్వికారము (Ch'ang). కాని దాని పేరు చెప్పవలసినదే అని పట్టుబట్టిన, దానిని 'గొప్పది' (బ్రహ్మము భూమన్ అను శబ్దములు ఇక్కడ సరిగా సరిపోవును) అన వచ్చును. గొప్పది అనగా నిరతిశయము; చివరవరకు పోయి తిరిగి వచ్చునది. ప్రపంచమందలి ప్రతి వస్తువు తన గొప్పతనమును టావో నుండియే పొందుచున్నది. నిర్వికారము, నిత్యము అగు ఈ జగద్వ్యాపియగు తత్త్వము నెరుగుటే సంబోధి (ming) (అధ్యాయములు 1, 21, 25. డుయ్‌వెన్‌డక్, బ్లాక్‌నీల అనువాదములు.[3]) టావో సమస్తమునకు కారణము, ఆధారము, సారము, గమ్యము; అది నిష్క్రియమయ్యు స్వాభావికముగా అంతను ప్రవర్తింప చేయును; అది అప్రమేయము - అని తాత్పర్యము. కోరికలు, అహంకారము లేనివారి అంతర్దృష్టికి ఈ రహస్యము కానవచ్చును; తన చేతలలో టావోను అనుసరించువాడు దానితో తాదాత్మ్యము చెందగలడు. విరక్తిచే, త్యాగముచే, సన్న్యాసముచే టావో ప్రాప్తమగును. (అధ్యాయములు, 1, 28, 48. అవే అనువాదములు)

టావో ననుసరించి నడుచుకొనిన వానిలో 'టే' ప్రకట మగును. టే అనగా సద్వర్తనము, ధర్మము, నైతికశక్తి, ఇతరులకు మార్గదర్శికాగల ప్రభావము. ధైర్యము, తితిక్ష, మితత్వము, సమభావము, క్షాంతి, వినయము - ఇవి టే లక్షణములు. వస్తువులు, మనుష్యులు స్వభావ సిద్ధముగ స్వతంత్రముగ ప్రవర్తించునప్పుడు-తమ తమ సహజ కర్మలు చేయునప్పుడు-అంతర్గతముగ నిహితముగనున్న టే పరిపూర్ణముగ అభివృద్ధి నొందుటకు అవకాశముండును. సహజకర్మ లందు యాదృచ్ఛికముగ ప్రవర్తిల్లువాడు చేసియు చేయనివాడే. స్వభావము ననుసరించువాడు చేయకుండనే చేయును, చేసియు చేయనివాడే. ఈ స్థితిని

1. పేరు లేనిది, చెప్పనలవి కానిది, మానము లేనిది.

2. ప్రభవ స్థానము.

3. ఈ రెండు అనువాదములలోను, వీటికి తక్కిన వాటికిని ఎన్నో విసంవాదములు కలవు. వెలీ అనువాదము కూడ ప్రసిద్ధమైనది.

'వెయ్ వు వెయ్' అని ఈ గ్రంథమనినది; నిష్క్రియ యగు క్రియ, అకర్మయగు కర్మ అని దీని అర్థము. మానవుడు నిశ్చలుడై, స్థిరుడై, శాంతుడై, సమాహితుడై, నిర్లిప్తుడై (పు షిహ్) తాను నిమిత్తమాత్రముగ నుండి తన ద్వారా టావోను పనిచేయనిచ్చుట వలన ఈ స్థితి వచ్చును. టావో వర్త్మ ననువర్తించుట వలన, దానికి నిమిత్త మాత్రముగా నుండుట వలన, మానవుడు తన నైజత్వమును - అసలుతనమును - ఆత్మత్వమును-(ట్జూజాన్) సిద్ధించు కొనుచున్నాడు, స్వభావమందు స్థితుడగుచున్నాడు. బాలునివలె స్వభావ సిద్ధముగ నాచరించుచు అట్టివాడు సామరస్యమును, సమన్వయమును వ్యక్తీకరించును.

సుఖము, దీర్ఘజీవితము (పీలైన అమరత్వము), సంపద ఇవి మనుష్యులు సాధారణముగా కోరునవి, కాబట్టి జనసామాన్యమున ప్రచారము గనిన టావో మతము వీనిని పొందు మార్గములు చూప యత్నించెను. తపస్సు వలన, ప్రాణాయామాది (An-pan) క్రియల వలన, మంత్రౌషధుల వలన, బ్రహ్మచర్యము వలన, కొన్ని తాంత్రిక మైథున ప్రక్రియల వలన అజరత్వ అమరత్వములు లభించునని ఈ టావో మతము బోధించెను. సామాన్య లోహాదులను బంగారముగా చేయు ప్రక్రియవలన అఖండ సంపద లభించునను విశ్వాసమును కూడ ఈ టావో మతము పెంపొందించెను. ఇంద్రియ సంయమచిత్త నిరోధముల ద్వారా సమాహితత్వమును పొందు మార్గము **టావో తే ఛింగ్** లోనే వర్ణించబడినది.[1]

క్రీ. **పూ.** 369 - 286లో నుండిన ఛువాంగ్ ట్జూ టావో దర్శనమును అభివృద్ధి చేసెను. ఇతడు పెద్దపండితుడు, తార్కికుడు, గ్రంథకర్త. హొనాన్‌లో చిన్న ఉద్యోగిగా నుండెను: ఛు రాష్ట్ర ప్రధాన మంత్రి పదవి ఇచ్చెదనని రాజు ఆహ్వానించినను దానిని తిరస్కరించెను. ఇతడు కూడ టావోను సర్వాంతర్వ్యాపిగాను, జగత్కారణముగాను, స్వయం పూర్ణమగు స్వతంత్ర సమగ్ర తత్త్వముగాను వర్ణించెను. టావోకు సత్త, సాక్ష్యము కలవు; కాని దానికి క్రియ, ఆకృతి లేవు. అది సంక్రమింప బడవచ్చునేమో గాని, గృహీతము కాదు. దాని ఉపలబ్ధి సాధ్యము కావచ్చును, కాని అది అగోచరము. దాని వలననే ఉన్నదంతయు ఉన్నతీరున ఉన్నది. విరుద్ధ విశేషణములు - ఉన్నతము, నిమ్నము; అతిప్రాచీనము, నవీనము - దానికి వర్తించును. అది నిత్యము, పరము, మూలము. అన్నిటి యందు అభివ్యక్త మగునది, స్పందించునది టావో. అది నిష్క్రియమయ్యు, సకల ప్రవర్తకము. ఇది ఇతమిత్థము కాదు కాన, అసత్తనికూడ అనబడును; అనగా నామరూపములు లేనిది, నిర్గుణము. ప్రత్యేక వస్తువులు టావో నుండి పొందునదిదే. ఈ విశ్వము, ప్రకృతి నిరంతర సతత పరిణామశీలము, వికార సహితము; వస్తువు లెప్పుడును రూపాంతర మొందుచు వికసించుచున్నవి. ప్రకృతియందలిఈ వికాసమే (tien chün) దానికి సీమ (tien i).

ప్రతి వస్తువు, ప్రతి మనుష్యుడు తన సహజ స్వభావము ననుసరించిన సుఖము నందును, దానికై అన్వేషణ అక్కరలేదు. తమ తమ అకలుషిత నైజ అంతర్గత ప్రవృత్తుల కనుకూలమగు వ్యవహారము చేయుచు, నిష్కాములై, అమాయకులగు సరళ (su pu) హృదయులు స్వస్వరూపమున అవస్థితులుగ నుందురు. విశ్వముతో, ప్రకృతితో సామరస్యము నొందుటే ఆనందము. అన్ని విధములైన సంస్థలు, కట్టడులు మనుష్యుల స్వాతంత్ర్యము నరికట్టునవే. మనుష్యులందరి స్వభావము ఒకే రకముగా ఉండదు గాన, అందరికిని ఒకే విలువలను, ప్రమాణములను చట్టములను నిర్ణయించుట అనుచితము. మనుష్యుల శక్తులు, వృత్తులు ఒకే తీరున లేవు. కాబట్టి అందరు ఒకే విధముగా ఆచరించి ఆనందము నందలేరు. మానవులందరు వ్యవస్థను, శాంతిని కోరుదురు కాబట్టి, ప్రతివాడు తన స్వభావానుసారము ఆచరించుటకు,

1. టావో మూల సిద్ధాంతములపై భారతీయ దర్శన ప్రభావము, తరువాతి టావో మతముపై హఠ యోగ, రాజయోగ, తంత్రసాధనల ప్రభావము కలదని కొందరి ఊహ.

సుఖము నందుటకు స్వతంత్రత ఉండవలెను. ప్రభుత్వము, శాసకులు అనవసరము. నిష్కపటముగా ఎవని అంతర్గత స్వభావమును వాడు అనుసరించిన ప్రభుత్వము అక్కరలేకుండానే అంతయు సరిగా ఉండును. కాబట్టి మానవులందరికి సంపూర్ణ స్వాతంత్ర్యముండవలెను; లేదేని స్వేచ్ఛగా తమతమ సహజ స్వభావము ప్రకారము వారాచరించలేరు. ఒక వస్తువు మరియొక వస్తువు కంటె మంచిది గాని, ఒక విధమైన ఆచరణ మరొక విధమైన ఆచరణకంటే శ్రేష్ఠముగాని కాదు. ప్రపంచమందు ఉన్నదంతయు-అన్ని వస్తువులు, అన్ని దృక్పథములు, అన్ని ఆచారములు - సమానములే. ఒకటి మంచిది, మరొకటి చెడ్డది అని నిర్ణయించుటకు, ఒకటి సుందరము, మరొకటి కాదు అని నిర్ణయించుటకు ప్రమాణము లేదు. రుచుల వైచిత్ర్యము వలన, అవలంబించిన దృక్పథము వలన కొందరికి కొన్ని మంచిగానో, అందముగానో తోచును; ఇతరుల కట్లు తోచదు. కాబట్టి వస్తువులలోను, దృక్పథముల లోను గల విభేదములను మరచి, అనంతత్వమందు ఆనందించవలెను. మంచి, చెడుగులు మారుచుండును, వీటిని ఉపేక్షించి, వీటి కతీతులు కావలెను. టావో దృక్పథముతో చూచిన పనికి వచ్చునది పనికిమాలినవి, మంచి చెడ్డ లేవు. అన్ని విధములగు అస్తిత్వములు సమానములు; మరణము, జీవనము, దుఃఖము, సుఖము అన్నియు వికారములు; ఇవన్నియు ఒకటి మరొకటిగా సతతము మారుచుండును. సమబుద్ధి కలిగినవాడే బంధమునుండి ముక్తుడగును. అన్ని వస్తువులను వాటిలోగల సామ్యత్వ దృష్ట్యా చూచిన అవన్నియు ఒకటే. సమస్త వస్తువుల ఐక్యతయే విశ్వము. ఈ ఏకమును దర్శించి దానితో తాదాత్మ్యము చెందిన, ఆద్యంతములకు, భేదములకు, ద్వంద్వములకు అతీతత్వము కలుగును. అట్టి వానికి జీవన్మరణములు, వచ్చునది పోవునది లేవు. ఇదియే సంక్షోభమున స్వస్థత అనబడును.

ఏకముతో తాదాత్మ్యము చెందిన ఈ స్థితి శుద్ధ అనుభూతి. ఇది అపరోక్షము, బుద్ధీంద్రియ నిరపేక్షము. అట్టి అనుభూతియందు నామరూప వస్తువుల భేదజ్ఞానముండదు; అది నిర్వికల్పము. మనస్సు ఈ స్థితి యందు నిరాహార (hsian chai) మగును; అది 'విస్మృతి యందు కూర్చొనును' (tso wang). ఇట్లు మనస్సు ఖాళీ అయినప్పుడు, జ్ఞానమును విసర్జించినప్పుడు, అనంతముతో ఏకమగును (ta tung). ఈ శూన్యమందే టావో వసించును. ఈ ఐక్యము కల వానికి సమస్తముతో తన తాదాత్మ్యము, అపరిమితత్వమును సమకూడును. కేవలము తన స్వభావము ననువర్తించు వాడు ఆనందమును పొందును, కాని అతడు ఇంకను ఇతర వస్తువులపై నిర్భరుడు, పరతంత్రుడు. ప్రతివాడును తన సుఖమునకై మరొక వస్తువుపై ఆధారపడును, కాన పూర్ణ స్వతంత్రుడు కాడు. కాని "నాతో గలసి సమస్త వస్తువులును ఒకటియే, పృథివ్యాకాశములు నాతోపాటే వచ్చినవి" అను అనుభూతిని పొంది, జీవన్మరణములు, మంచి చెడుగులు సమానములుగా చూచువాని స్వాతంత్ర్యము నిరపేక్షము, పరిపూర్ణము. అట్టి పూర్ణ పురుషునికి ఆత్మ ఉండదు; అట్టి ఆధ్యాత్మిక మానవునికి ఏ నిర్వాహము ఉండదు; అట్టి ఋషికి పేరు ఉండదు. ఇది చువాంగ్ ట్జు దర్శన సంగ్రహము.

ఇంచుమించు క్రీ. పూ. 150 నుండి కన్ఫ్యూషియన్ మతము ప్రభుత్వమతముగా అయ్యెను. నాటి నుండి కన్ఫ్యూషియస్ ఒకడే సర్వోత్కృష్టుడగు ఋషిగా చైనాలో గణింపబడుటచే ఇతర మతములు, దార్శనికులు వెనుకబడిరి. కాని కన్ఫ్యూషియస్‌కూడ నరుడే, అతడు చేసినదెల్ల ప్రాచీన శాస్త్రముల ప్రచారమే అను మరొక కన్ఫ్యూసియన్ సంప్రదాయము రమారమి క్రీ పూ. 50 లో బయల్వెడలిన పిమ్మట, వాంగ్ చుంగ్ (27-100 ?) అను ఈ సంప్రదాయపు ప్రధానులలో నొకడు టావో మతమందలి స్వభావ వాదసహాయముతో నాడు ప్రచారమందున్న అంధ విశ్వాసములను, మూఢాచారములను ఖండించినప్పటి నుండి, టావో దర్శన పునరుత్థానమునకు వీలు చిక్కెను. క్రొత్తగా బయల్వెడలిన ఈ టావో దర్శనము 'రహస్య విద్య' (hsiian hsiieh) యని దాని అనుయాయులచే పిలువబడుచుండెను. ఈ

సంప్రదాయపు వారందరును కన్‌ఫ్యూషియస్‌నే సర్వోత్తమ ఋషిగా ఎంచుటయు, అతని బోధలకు, టావో మతమునకు ముఖ్య భేదము లేదని నమ్ముటయు విశేషము. పరతత్త్వముతో ఏకత్వము నొందుటచే దానిని గూర్చి కన్‌ఫ్యూషియస్ అంతగా మాట్లాడలేదని, లావో ట్జూ, ఛువాంగ్ ట్జూలు ఆ స్థితికి వెళ్ళకపోవుటచే దానినిగూర్చి తరచు మాట్లాడిరని వీరల అభిప్రాయము. లావోట్జూ, ఛువాంగ్ ట్జూలకు పరమ తత్త్వపు జ్ఞానముండెనుగాని, దానితో తాదాత్మ్యము లేదట. కాక వీరి బోధలు ఏకాంతమందు చేసిన స్వగత సంభాషణల వంటి వగుటచే, అవి వారి అక్కరకు వచ్చెను గాని, జనసామాన్యమున కుపయోగించవట. కన్‌ఫ్యూషియస్ పరతత్త్వముతో ఐక్యత నొందుటచే దానిని గూర్చి నిశ్శబ్దత వహించి, విశ్వముతో తాదాత్మ్యము నొందుటచే అన్ని యుగములందలి అందరి జనులకు ఉపయోగించు బోధలు చేసెను - అని ఈ క్రొత్త టావో సంప్రదాయపు కువో అను ఒక ప్రసిద్ధ టీకాకారుడే అనెను. కాని ఛువాంగ్ ట్జూ దార్శనికులలో కెల్ల అగ్రగణ్యుడని, అతని రచనలు సకల సంపూర్ణములని, విశ్వస్థితిని, ప్రక్రియలను వివరించునని కూడ కువో చెప్పెను.

వాంగ్ పి (226 - 249) లావో ట్జూ గ్రంథముపై వ్యాఖ్యానించెను. ప్రపంచమందలి నానాత్వము ఏకము నుండి వచ్చినది; అది వీటన్నిటికి పరమము. అన్ని వస్తువులకు ఆధారమగునది వస్తువు కాజాలదు, దానివలన అవన్నియు ఏర్పడినవి. కాన అది అవస్తువు, అసత్తు. అది సర్వవ్యాప్తము, చరము. అదియే టావో, సత్తుయొక్క వ్యాపారము, అసత్తుయొక్క నిర్వాహము.

వాంగ్ పి నామములను వేర్వేరుగా విభజించుట, సూత్రములను విశ్లేషించుట (ming li) ద్వారా వస్తువుల స్వరూపములను గ్రహించుటలో హెచ్చు ఆసక్తి కనపరచెను. సంజ్ఞలు భావములను వ్యక్తము చేయును. సంజ్ఞలను పదములు వివరించును. పదముల పరీక్షచే సంజ్ఞలను, సంజ్ఞలను పరీక్షించుటచే భావములను గ్రహింపవచ్చును. సంజ్ఞలను గ్రహించిన పదములను మరచి పోవచ్చును; భావములను పరచుచే సంజ్ఞల పనిగాన, భావములను గ్రహించిన సంజ్ఞలను మరువవచ్చును. కాబట్టి సంజ్ఞలను పదములను పట్టుకు వ్రేళ్ళాడరాదు; లేనిచో వేనిని వ్యక్తీకరించుటకు, వివరించుటకు ఇవి వచ్చినవో ఆ భావములను గ్రహించలేము. పదార్థములలోని సూత్రములను భావములుగా మనస్సునందు గ్రహించుటయే దీనియంతకు లక్ష్యము.

టావో మతము ఋషికి రాగద్వేషాది ఉద్రేకములు ఉండవని చెప్పదు; ఇవి ఇతరులకు వలెనే అతనికి కలుగును. విశుద్ధ వివేకము ఉండుటే అతనికున్న ఆధిక్యత; అందుచే అతడు సమరసమగు సమగ్రతతో తాదాత్మ్యము చెంది అసత్తుచే నిబిడీకృతుడగను. అతడును ఉద్రేకములచే వస్తువుల పట్ల ప్రతిక్రియ కలిగి యుండును; కాని ఆ వస్తువుల జాలములో పడడు, వాటికి దాసుడు కాడు. మానవోద్రేకము స్వస్వభావమునకు సహజము, కాన వస్తువులపట్ల ఉద్రేకముతో ప్రవర్తింపక ఎవడును ఉండడు. కాని ఋషి వస్తువుల వలలో తగుల్కొనడు. అద్దములో ఏదియైనను ప్రతిబింబించును, కాని ఏదియు నిలవదు. ఋషి మనస్సు ఇట్టిది; ఉద్రేకాదులు కల్గుచున్నను, అది శూన్యముగానే ఉండును. ఇట్లు వాంగ్ పి ఋషి లక్షణమును వివరించెను.

ప్రకృతిని అనుసరింపుడు, స్వభావసిద్ధముగ మనుడు - అని టావో మత బోధ. ఇంద్రియ ప్రవృత్తులు, విషయములకై ఆరాటము సహజమే కాన, వాంఛలు పూర్తికానిదే స్వభావసిద్ధముగ నుండలేము; కాబట్టి చిత్తము వచ్చినట్లు సహజ ప్రవృత్తులగు కామాదులను తీర్చుకొనుటే పురుషార్థమను నొకవిధమగు నవీన టావో మతము 250 ప్రాంతమున ప్రచారమందుండెను. నైతిక సాంఘిక నియమములను త్రోసివేసి, ఇచ్చవచ్చినట్లు చరించి, అట్టి అకుంఠిత విహార వ్యవహారముల వలన కలుగు మానసిక స్థితులను 'అవగతి', 'బోధి' అని వీరు భావించిరి. అయితే ఈ మతానుయాయుల దృక్పథపు వ్యవస్థీకరణము క్రీ.పూ. కాలములోనే లియోహ్ యూ-కౌ వ్రాసిన 'లియోహ్-

ట్జూ' అను గ్రంథములోనే కలదు. ఇందు భౌతిక వాదము, నియతివాదము బోధింపబడినవి. మానవ ప్రయత్నము వ్యర్థము, విధియే బలీయము. ప్రకృతి లోని ప్రక్రియలు, మానవుల వ్యవహారములు అన్నియు యాంత్రికముగా జరుగును. ప్రయోజనము గాని, స్వాతంత్ర్యముగాని ఎచ్చటను లేవు. జీవితము బుద్బుద ప్రాయము, వ్యర్థము; మరణము సంపూర్ణ వినాశమునకే దారితీయునుగాన అదియు నిరర్థకమే. కాన వీలైన కొద్ది క్షణములలో సుఖ మనుభవించ వలెను, అదియే జీవితమునకు విలువ నిచ్చునది. ఇచ్చ వచ్చినట్లు వాంఛలు తీర్చుకొనుటే సుఖానుభవము. దీనికి గల అడ్డములన్ని తొలగించుకొని, సుఖానుభవము సాధ్యమైనంతవరకు చేయుచు, మరణమునకై వేచి యుండుట పురుషార్థము. ఇంద్రియ సుఖములను తాత్కాలిక సౌఖ్యములను వదలి, ఎప్పుడో దొరకగల వానికై యత్నించుట, సంఘపు కట్టుబాట్లకు లోబడుట అవివేకము. చావు అనివార్యము, జీవితము కొలది కాలము ఉండునది, కాన ఇదే సరియగు దృక్పథము. ప్రతివాడు తాత్కాలిక సౌఖ్యమునే చూచుకొనిన, ఎవడును అధికారము కొరకు స్వలాభము కొరకు ప్రయతించడు. ఏలన, వాటికి ఎంతో శ్రమ, కాలము అవసరము. అప్పుడిక మనుష్యులలో వీటికై సంఘ ర్షణ ఉండదు. ఈ విధముగా ప్రపంచము బాగు పడును. లియోహ్ ట్జూ సిద్ధాంత సంగ్రహమిది.

కువో హ్సియంగ్ (మ. 312) హ్సియంగ్ హ్సియు (221-300 ప్రాంతము) - వీరిరువురు ఛువాంగ్ ట్జూ గ్రంథముపై వ్యాఖ్యానము వ్రాసిరి. వీరి బోధ ఇక సంగ్రహించెదము. ప్రతి వస్తువు తనను తానే పుట్టించుకొనును. మరొకదాని నుండి రాదు. ప్రతిది స్వతంత్రముగానే అటుల అయినది. ఈ సూత్రమునే టావో శబ్దము సూచించును. సత్తు నిత్యము, దానికిముందు కాలము ఉండజాలదు. సత్తు ఎన్నడును అసత్తు కాజాలదు, అసత్తు నుండి సత్తు రాజాలదు. కాన ఎన్ని విధములుగ మారుచున్నను సత్తు నిత్యముగ నుండును. వస్తువులు అకారణముగ స్వతః ఉత్పత్తి అయినవి కాబట్టి, అన్ని వస్తువులు వాటి యంతట అవియే అవి ఉన్న తీరున ఉన్నవి. అవి మరొక దానిపై ఆధారపడి లేవు. లేకున్న అన వస్థాదోషము వచ్చును. ప్రతి వస్తువు స్వతంత్రము, తనను తానే సృజించుకొనినది, అను ఈ సిద్ధాంతము నకు ఆత్మపరిణామ (tu hua) వాదమని పేరు.

వస్తువులన్నియు పరస్పర సంబంధములు కలిగి యున్నవి, వస్తువులు ఒకదానికొకటి అవశ్యక ములు. ప్రతిది తనకు తానై ఉండుచు తన స్వభావాను సారము ప్రవర్తించుచున్నను, ఒకదాని నొకటి సంపూర్ణము చేయుచున్నవి. ప్రతి వస్తువునకు తక్కిన యావద్విశ్వము పరిస్థితియై యున్నది. జరుగుచున్న ప్రతిదానికి, ఉన్నట్టి ప్రతి వస్తువునకు, యావత్తు వర్త మాన విశ్వము, భూతమందున్న విశ్వ సంస్థితియు బాధ్యత వహించును. విశ్వమంతయు మార్పు నొంద నిదే, గతమంతయు వేరొక విధముగా ఉండనిదే, ఏదియు ఉన్నట్లుగాక మరియొక విధముగ నుండ జాలదు. ఒక ప్రత్యేక వస్తువు మరొక ప్రత్యేక వస్తు వునకు కారణము కాదు; కాని యావత్తు గత చరిత్ర వర్తమాన విశ్వ సంస్థితియు ప్రత్యేక వస్తువులను తీర్చి దిద్దుచున్నవి.

విశ్వమందలి ప్రతివస్తువు సతత పరిణామము నకు లోనై యున్నది. మానవ వ్యక్తులేమి, నదులు, పర్వతములేమి, సంఘమేమి, అంతయు ఎప్పుడును మారుచున్నవి. ఏదియు స్థిరము కాదు, ప్రతిది నవీనమే. నిన్నటి 'నేను' ఈ రోజున్న 'నేను' కాదు, నిన్నటి కొండ నేటిది కాదు. కాబట్టి దేశకాలములందలి మార్పులకు అనుసారముగ, వస్తువుల కనురూపముగ ఋషులు ప్రవర్తించెదరు. అందుచే ఈ ప్రవర్తనా విధానములలో వైవిధ్యముండును.

నిష్క్రియత్వము, అకర్మ అనగా చేతులు ముడుచుకొని నిశ్శబ్దముగా ఉండుట కాదు. ఋషి చేయునది ఇదికాదు. అతడు ప్రతిదానిని దాని స్వభా వానుసారముగా ప్రవర్తింపనిచ్చును. టావో నాశ్ర యించి అతడు సరళముగ వ్యవహరించును; జరుగ నున్న దానిని జరుగ నిచ్చును, తనకు చేతనయినది, తాను చేయవలసినది స్వాభావికముగా చేయుటే

నిష్క్రియత్వము. స్వశక్త్యనుసారము, స్వభావాను సారము స్వధర్మమును నెరవేర్చుటయే అకర్మ (చేయకపోవుట) ఋషి అట్లు చేయును. తనకు వీలు కానిది చేయబూనుట, స్వశక్తికి, పరిస్థితికి అందు బాటులో లేనిదానికై ఆరాటపడుట అవివేకము. తమ సహజశక్తికి అనురూపముగ, తమ స్వభావములను బట్టి నడచుకొనువారు. తృష్ణ, వాంఛ అనుబంధముల నుండి ముక్తులు. అన్ని వస్తువులు సమానములని గ్రహించిన ఈ బంధములు ఉండవు. వస్తువులు, వ్యక్తులు ఆయా తీరుల నుండుట వారి వారి గుణము లను బట్టియే. ఎవడును తన స్వభావము నుల్లంఘించ లేడుగాన, తనకు సహజమగు కర్మను చేయుటలోనే ప్రతివానికి ఆనందముండును. ఒక స్వభావము మరి యొక స్వభావము కంటె, ఒక కర్మ మరియొక కర్మ కంటె ఉత్కృష్టములు కావు; అన్నియు సమానములే. ఇట్లు భేదజ్ఞానమును విసర్జించి, సమబుద్ధి పొందడానికి సీమలు, ఉపాధులు ఆటంకములు ఉండవు. వాడు పూర్తిగ స్వతంత్రుడు. వాడు అన్నిటికి అతీతుడై, దేనితోను విరోధించక, దేనిచేతను బంధింపబడక దేనికి లోబడక, నిర్లిప్తుడై ప్రతి విషయమందు, మామూలు గానే వ్యవహరించును. స్వ స్వరూపమున స్థితుడై, స్వ స్వభావము నుండి చ్యుతి నొందక ఋషి అన్ని బాహ్యక్రియా కలాపములందు సామాన్యంతో సమా నముగానే ప్రవర్తించును.

కువో హ్సియంగ్, హ్సియుం హ్సియు ఇట్లు ఛువాంగ్ ట్జూ దర్శనమును వివరించిరి.

## మో ట్జూ దర్శనము

మో ట్జూ కన్ఫ్యూషియస్ కాలము తరువాతి వాడు. క్రీ. పూ. 468-376 మధ్యనో, లేదా క్రీ. పూ. 479-381 మధ్యనో ఇతడు ఉండి యుండునని పండి తుల అభిప్రాయము. ఇతడు హోనాన్ రాష్ట్రమందో, లూ రాష్ట్రమందో పుట్టి యుండును.

మో ట్జూ ఉపయోగితావాది. ఉపయోగము లేదా లాభము ('li') నిర్వాహము('kung') వీనిని. అతడు ఎక్కువగా నొక్కి చెప్పెను. మంచి చెడుగు లను గూర్చిన ఏ ఉపపాదన అయినను, దాని ఆధా రమును బట్టి, రుజువు అగుటనుబట్టి, వినియోగమును బట్టి పరీక్షింపబడవలెను. ప్రాచీన రాజర్షుల ఆచరణ, ద్యౌస్‌యొక్క, పితరులయొక్క ఆజ్ఞలు - ఇవియే నైతిక నిర్ణయములకు సరియగు ఆధారములు. సాధా రణ జనుల ఇంద్రియ జ్ఞానముచే రుజువు అయిన ప్పుడే ఆ నిర్ణయములు సబబగును. రాజ్య పరిపా లనయందు అవలంబింపబడి, రాష్ట్రమునకు, ప్రజ లకు లాభము చేకూర్చ గల్గుటయే వాటి వినియో గము. వీటిలో 'రాష్ట్రమునకు ప్రజలకు లాభము' అనునదే నీతికి ఒరిపిడి రాయి. ఆచరణలో పెట్టుటకు వీలులేని సిద్ధాంతములును, అట్లు పెట్టినప్పుడు శాశ్వత మగు లాభము నీయలేనివియు విలువలేనివి. లాభ మనగా రాష్ట్ర సంపద, ప్రజా సంఖ్య. రాష్ట్రములోని ధన ధాన్యములను, ప్రజల సంఖ్యను విస్తరించునదే సరియగు నీతి విధానము. ఉపయోగము లేని ధన వ్యయమును తగ్గించుటచేత సంపద వృద్ధి యగును. మగవారు 20 ఏండ్ల ప్రాయములోను, ఆడువారు 15 ఏండ్ల వయస్సున వివాహములు చేసికొని, సంతానవంతులైన ప్రజావృద్ధి యగును. మానవుడు ఎన్నడును ఫలప్రదమగు పని చేయుచుండవలెను. అన్నవస్త్రముల నీయగలవి, శ్రమ తీర్చగలవి యగు పనులే ఉపయోగము కలవి. పనిపాటులు లేకుండ, మృతాశౌచాదులందు దినములు గడుపుట వలన, పెద్ద పెద్ద గుళ్ళు, గంటలు నిర్మించుటవలన, సంగీతాదుల వలన ప్రయోజనము లేదు; కాన ఇట్టి నిరర్థక కర్మలు, వస్తువులు త్యాజ్యములు. ఉద్రేకములవలన లాభములేదు; శ్రమపడి పనిచేయుట, మిత వ్యయము మాత్రమే చేయుట, ప్రజాతంతువును విస్తరించుట కర్తవ్యములు.

యుద్ధములు, ముఖ్యముగా పెద్ద రాష్ట్రములు చిన్న రాష్ట్రములపై దండెత్తుట, దుర్బలులను, సరళ హృదయులను బలవంతులు, వక్రబుద్ధులు పీడించుట, మోసగించుట-ఇవి ఈ లోకములోని గొప్ప విపత్తులు. పాలకులకు దయ లేకపోవుట, పాలితులకు విశ్వాసము లేకపోవుట; తండ్రికి ప్రేమ, కొడుకునకు పితృభక్తి

లేకుండుట; ఆతతాయులు ఈ లోకమున మనుట ఇవి లోకమున గల ఘోర విపత్తులు. వీటి యన్నిటికి కారణము పరస్పర ద్వేషము, హింస. మానవులు కొందరిని మాత్రమే ప్రేమించి, ఇతరులను ద్వేషించుట పక్షపాతము. ప్రేమయందలి ఈ పక్షపాతమే లోకమందలి చెడుగున కంతకు కారణము. కాబట్టి పక్షపాతములేని విశ్వ ప్రేమ (chien ai)ను అలవరచుకొని, ఇతరులను అందరిని తనవలెనే భావించిన లోకమున విపత్తులు ఉండవు. పక్షపాత విసర్జన చేసి సార్వత్రికతను మానముగా నుంచుకొనిన, విశ్వమున కెంతో లాభము చేకూరును. అప్పుడు అందరు విశ్వ ప్రేమ కలిగి యుందురు. ప్రతివాడు అందరిచే ప్రేమింపబడును; అందరు ప్రతివాని లాభమును తమ లాభముగానే భావింతురు; అటులనే అతడును అందరిని ప్రేమించి, అందరి లాభమును తన లాభముగానే ఎంచును. అప్పుడు ప్రతివాడు ఇతరుల సేవ చేయుటకు యత్నించును, ఎవడును ఇతరులకు హాని తలపెట్టడు. ఇట్లు విశ్వప్రేమలో పారస్పరిత కలదు. అది కలవానికి, ఇతరులకు కూడ లాభము కలుగును. యుద్ధమువలన పరపీడన, హింస, మోసము, దగాలవలన లాభము ఉండదు; తాత్కాలికముగా ప్రయోజనములు కల్గినట్లు కన్పడినను వీటివలన అందరికిని నష్టమే. వీటిని విసర్జించుట, విశ్వప్రేమ నవలంబించుట వలన లోకములో గల విపత్తులన్ని సమసిపోవును.

ద్యౌన్ ఉన్నదనియు, అది విశ్వప్రేమ నాచరణలో పెట్టువారిని ఉచిత ప్రతిఫలమిచ్చి బహూమానించుననియు ఇతరులను శిక్షించుననియు మోట్జూ బోధించెను. విశ్వప్రేమ కల్గియుండవలె ననునది ద్యౌన్ యొక్క ఇచ్ఛ, ఆజ్ఞ. ద్యౌన్ అందరికి వివేకము నిచ్చినది గాన, అది అందరిని ప్రేమించునని తెలియుచున్నది. అది అందరిని ధరించుచు, భరించుచు ఉన్నది గాన అదియే అందరికి వివేక మిచ్చినదని తెలియును. అది అందరి పూజలను, యజ్ఞములను, బలులను స్వీకరించుచున్నది గాన అదియే అందరి ధారణ భరణములు చేయుచున్నదని తెలియును. ప్రపంచమందు నాగరికు లందరు దానికి బలుల నర్పించుచు నారాధించుటచే, అది వాటిని స్వీకరించుచున్నదని స్పష్టము. ద్యౌన్ లేదా ఈశ్వరుడు (Shang Ti) ధర్మాత్ములను సంభావించును, పరిత్రాణము చేయును; అధర్మాత్ములను శిక్షించును, నాశనము చేయును. లోకమందు దుర్ఘటనలు, విపత్తులు ఉండుటకు కారణము అధర్మమే. ప్రజలను శిక్షించుటకివి ఈశ్వరుడు ఉద్దేశించినాడు. ఈశ్వరుడే కాక, పితరులు, దేవతలు కూడ శిష్టుల సంభావన, దుష్టుల శిక్షణ చేయుదురు. అయితే వీరందరు మానవుల కర్మలకు ఫలమిచ్చువారు మాత్రమే. మానవు లనుభవించునది అంతయు వారు చేసినదాని ఫలమే. అచేతన మగు అదృష్టమో, విధియో గ్రుడ్డిగ మానవుల అచరణను సరకుగొనక, వారికి సుఖమునో దుఃఖమునో ఇచ్చుట లేదు. యాంత్రికముగా పూర్వ నిర్దిష్ట ప్రకారముగ, అవశ్యంభావిగ మానవులకు సుఖదుఃఖాదులు సంభవించుట. నిజమైనచో ధర్మమునకు, నైతిక చోదనలకు అర్థముండదు. ప్రపంచమున విశ్రుంఖలత, స్వార్థము, హింస ఉండుటకు ఇట్టి దుర్బోధయే కారణము.

రాష్ట్రము, ప్రభుత్వము లేకపోయినచో ప్రతివాడును తన ఇష్టము వచ్చినట్లు తన మేలే చూచుకొనును. దీనివలన ప్రజలలో పరస్పర సంఘర్షణ కలుగును. అది లేకుండుటకే రాష్ట్రము ఏర్పడి ధర్మాత్ముడు, సమర్థుడు అగువాడు ప్రభువుగా నిశ్చయింపబడెను. అప్పటినుండి ఉచితా నుచితములకు మానము ప్రభువు ఆజ్ఞలాయెను. ప్రతివాడును తన శ్రేష్ఠుల,* తన యధికుల కట్టడికి లోబడినచో, ప్రభువు ఆజ్ఞయే ధర్మమునకు పరమ ప్రమాణముగా అందరిచే ఎంచబడినచో, రాష్ట్రమందు సువ్యవస్థయు, ధర్మమును సుప్రతిష్ఠితము లగును. ఇది మోట్జూ దర్శన సంగ్రహము.

మోట్జూ తరువాత కాని, క్రీ. పూ. 221 కు ముందే, అతని అనుయాయులు తర్కము నూతగా గొని అతని బోధలను బలపరచ యత్నించిరి.

---

* సర్వశ్రేష్ఠుడు ప్రభువు.

'మోథింగ్' అను గ్రంథములో ఇది కనపడును. ఉపయోగము కలదానికి, లాభప్రదమగు దానికి విలువ నెందుకు ఈయవలెను? అను ప్రశ్నకు వీరిచ్చిన సమాధాన మిది: సంప్రాప్తమైనప్పుడు సుఖము నిచ్చునది లాభప్రదము. సంప్రాప్తమైనప్పుడు అప్రియ మగునది నష్టప్రదము. అనగా, సుఖము నీయగల్గిన దగుటచే లాభమునకు విలువ కలదు. దాని ఫలితముల నన్నిటిని తూచగా, భవిష్యత్తునందు శాశ్వతమగు గొప్ప సుఖమును కల్గించునదియే లాభప్రదము. తాత్కాలిక సంతోష మిచ్చునది లాభప్రదము కాదు. అందరికి లాభకరముగా ప్రవర్తించుటయే ధర్మము (i); విశ్వప్రేమ ఉండినప్పుడే ఇది సాధ్యము.

మోట్జూ అనుయాయులు జ్ఞాన స్వరూపమును గూర్చి, దానికి, భాషకు గల సంబంధమును గూర్చి, ప్రమాణములను గూర్చి, భావముల విశ్లేషణ చేయు విధానమునుగూర్చి చర్చించిరి. విశ్వప్రేమ సాధ్యమా? కాదా? అను సమస్యను చర్చించి, సాధ్యమని నిర్ణయించిరి. (1) విశ్వమందలి మానవు లెందరో తెలియదు. వా రెక్కడనున్నారో తెలియదు. వారి నెటుల ప్రేమించవచ్చును? అని పూర్వపక్షము. మనకు తెలిసినవా రందరి సంఖ్య మనకు గుర్తు లేకపోయినను వారిని ప్రేమించుట సాధ్యమని అనుభవము; కాబట్టి ప్రేమించుటకు సంఖ్య తెలియనక్కరలేదు. మారుపడిపోయిన బిడ్డ ఎక్కడ నున్నది ఎట్లున్నది తెలియక పోయినను తండ్రి వానిని ప్రేమించును; కాబట్టి ప్రపంచమందలి మానవులందరు ఎక్కడ ఎట్లున్నది తెలియకపోయినను వారిని ప్రేమించుట సాధ్యము. ఇట్లు సిద్ధాంతము. (2) మానవుల సంఖ్య అనంతము కదా: అనంతమును మన ప్రేమ పరిధిలో ఇముడ్చ గలమా? యని శంక. విశ్వము పరిచ్ఛిన్నమా? కాదా? అపరిచ్ఛిన్నమైన అది అంతయు పూర్తిగా ప్రజలచే నిండి యుండదు. కాబట్టి ప్రజల సంఖ్యకు హద్దు కలదు అనగా అది సొంతము. విశ్వము పరిచ్ఛిన్నమైన, మనుష్యుల సంఖ్యయు పరిమితమే కదా! కాని అపరిచ్ఛిన్న మనుకోబడు విశ్వము నంతటను పూర్తిగా మానవులు ఆక్రమించగలిగిన, అది నిజముగా అపరిచ్ఛిన్నము కాదు. అందులోని మనుష్యుల సంఖ్యయు పరిమితమే. కాబట్టి ఎటు చూచినను మానవుల సంఖ్య పరిమితము, అందరిని ప్రేమించుట సాధ్యము, అని సమాధానము. (3) దుష్టులు కూడ మానవులే కదా, మానవు లందరిని ప్రేమించవలెను కదా, అట్టిచో దుష్ట శిక్షణ అయుక్తము కాదా? అని సమస్య. తెల్ల గుర్రమును గుర్రమే; ఏలన, అది గుర్రము కాబట్టి. తెల్లనిది కాబట్టి కాదు, ఏలన నల్ల గుర్రములును కలవు. కాని ఒకడు సోదరుని ప్రేమించినప్పుడు, అతని సోదరు డయినందుననే ప్రేమించును గాని, అతడు సుందరుడుగా నుండుట తటస్థించుటచే ప్రేమించడు. కాబట్టి సుందరుడగు సోదరుని ప్రేమించుట సుందరుడగు పురుషుని ప్రేమించుట కాదు. అట్లే దుష్టుని శిక్షించుటయన మానవుని శిక్షించుట కాదు; దుష్టుని విషయములో ప్రధానాంశ మతని దౌష్ట్యము, అతడు మానవుడగుట కాదు. తల్లిదండ్రులు మానవులు. కాని తలిదండ్రుల సేవచేయుట యన మానవసేవ కాదు. బండి కొయ్య (శకటము దారుమయము) కదా, కాని బండిలో వెళ్ళుటయన కొయ్యలో వెళ్ళుట కాదు. అటులనే దుష్టశిక్షణ యన మానవ హింస కాదు, అని పరిష్కారము. ఇట్లు మోట్జూ అనుయాయులు తర్క సహాయముతో స్వపక్షస్థాపన, పరమత ఖండనకు విశేషముగా ప్రయత్నించిరి.

## బౌద్ధ దర్శనము (చైనీయ)

బౌద్ధము మొదటగా ప్రథమ శతాబ్దములో మధ్య ఏషియా గుండ చైనాలో ప్రవేశించి వ్యాపింపసాగెను. 220 లో హాన్ రాజవంశ పతనానంతరము వచ్చిన శతాబ్దములలో అది చైనాలో ఒక ప్రధాన మతముగ నయ్యెను. 4, 5 శతాబ్దముల నుండి 1000 వరకు చైనాలోని పెద్ద దార్శనికు లందరు బౌద్ధులుగనో బౌద్ధ ప్రభావమునకు లోనైన వారుగనో ఉండిరి. ఎంతో అపార సాహిత్యము సంస్కృతమునుండి చైనాభాషలోని అనువదించబడెను. మూలములో ఇప్పుడు దొరకని సంస్కృత గ్రంథములు చైనా భాషలో సురక్షితముగ నున్నవి.

549 - 623 లో నుండిన ఛిట్సాంగ్ **మాధ్యమిక శాస్త్రముపై** వ్రాసిన టీకనుబట్టి, దానిపై అంఖో అను జపానీయుడు వ్రాసిన టిప్పణిని బట్టి 221-589లో చైనాలో ఏడు బౌద్ధ సంప్రదాయములున్నట్లు తెలియుచున్నది. ఈ సంప్రదాయముల సిద్ధాంతసార సంగ్రహమిది : (1) అన్నిటికంటె ముందు ఉండినది అసత్తు (Wu), భౌతిక వస్తువుల రూపముల అన్నిటికి ఆరంభమున ఉండినది శూన్యత (K'ung). అనుషంగిక సత్తయొక్క పరిధిలోనే ఇరుకుకొని యుండుట మానవుని కడ్డంకి, మూల అసత్తులో అతని మనస్సు విశ్రమించిన విపరీత భావములు నశించును. అన్ని 'ధర్మముల'[1] అసలగు తొలి స్వభావము శూన్యత ; పంచ 'స్కంధములు' మొదట లేవు యని దీని అర్థము. టావో ఆన్[2] (312 - 385) అను భిక్షువు దీనిని ప్రతిపాదించెను. (2) భౌతిక వస్తువుల ఉనికికి ముందు అసత్తుండెను. అందుచే అది మూల అసత్తు. దానినుండి సత్తు వెలువడెను. అసత్తనగా ఆకృతులులేని శూన్యత; దానినుండియే అన్నియు ఉద్భవించినవి. ఇందు శూన్యత పరమార్థ సత్యము. దానినుండి ఉద్భవించిన అసంఖ్యాక వస్తువులు సంవృతి సత్యము. దీనిని ఉపనామము గల ఛు (టావో) ఛి యన్ (ఫా - షెన్) (285 - 374) ప్రతిపాదించెను. (3) 'రూపము' శూన్యము కాని రూపమున కధిష్ఠానమగు మూల స్వభావము శూన్యము కాదు. నిశ్చిత గుణములు కల సూక్ష్మ అదృశ్య రూపము శూన్యము కాదు. దీనిని ఛాంగ్ అన్ చుట్టునున్న ప్రాంతములో నివసించిన వాడొకడు ప్రతిపాదించెనని మాత్రమే తెలియుచున్నది. ఛిహ్ టావోలిన్ (314 - 366) అను మరియొకడు రూపమును గూర్చి మరొక విధముగ నిట్లు చెప్పెను: రూపము దానికది రూపము కాదు, కాన రూపముగా కానవచ్చినను అది శూన్యమే. అట్లే 'నామము'ను దానికి అది నామము కాదు. అది ఎరుగుచున్నట్లు భాసించినను, ఎప్పుడును శాంతముగనే ఉన్నది. కాన నామ రూపములు రెండు స్వభావతః శూన్యములు; ఇది పరమార్థము. కాని ఈ 'శూన్య' నామ రూపములు ఎచ్చటను లేకుండా లేవు, - ఇది సంవృతి సత్యము. (4) అన్ని ధర్మములు శూన్యమను ప్రతిపాదన మనస్సును శూన్యముగా చేయుటకు, దానిని అవిద్యాత్మకమగు 'ఉపాధానము' నుండి విడిపించుటకు చేయబడినది. ప్రపంచమందలి వస్తువులన్నియు శూన్యమని దీని అర్థము కాదు. మనో నిరోధముకొరకై రూపము శూన్యమనిరి గాని, నానా ఆకృతులు ధరించియున్న రూపము నిజముగా శూన్య మెట్లు కాగలదు? ఇట్లు ఛు ఫా - వెన్ చెప్పెను. ఇతడు ఫాషెన్ శిష్యుడు, ఛిహ్మిన్ - టు (326 - 342 ప్రకారము 'సర్వ కారజ్ఞత' గొప్ప వివృతమగు శూన్యత. అయినను విషయముల గ్రహణము (జ్ఞానము) సాధ్యమే. అది లేనిదైనను విషయములపట్ల ప్రతిక్రియ సంభవింపజేయును. దానిని పొందినవాడు వస్తువుల మూలమున ఉండును. వెన్ మతములో జీవితముతో గల బంధము తెగుటవలన మనసు రిక్తము, అసత్తు అగును; ఆ స్థితి నిత్యమగు నిర్వికార గుహ్యస్థితి (miao yu). మిన్-టు మతములో మనస్సు గొప్ప వివృత శూన్యము అయ్యు విషయ గ్రహణ యోగ్యము. (5) సంవృతి జగత్తు ఒక దీర్ఘరాత్రి, అందు సంభవించు స్వప్నమునకు మనస్సు, విజ్ఞానము హేతువులు. మనకిప్పుడు ప్రత్యక్షమగుచున్న అస్తిత్వమంతయు ఆ స్వప్నమందలి ఆభాసములు. దానినుండి మేల్కొని, ఆ రాత్రి పగలుగా అయినప్పుడు, ఈ మాయను కల్పించిన విజ్ఞానము నశించును, జగత్తు శూన్యముగ అవగతమగును. ఇట్లు యూ ఫ - కై బోధించెను. ఇతడును ఫా-షెన్ సమకాలికుడు. (6) అన్ని 'ధర్మములు' మాయయే, కాబట్టి సంవృతి సత్యము. కాని మనస్సారము (shen) వాస్తవము, శూన్యము కాదు. ఇది పరమార్థ సత్యము. ఇదియు శూన్యమైన, బౌద్ధ సిద్ధాంతము ఎవరికి బోధించునది? ఎవరు దానిని పాటించి సంబోధి నొందునది? ఇవి టావో-యి (మ. 397-401

---

1. బౌద్ధ పారిభాషిక పదము.

2. ఇతడు బౌద్ధములో టావో దర్శన భావములను గాంచెను. బౌద్ధమును పట్టుదలతో గ్రహించి సమ్యక్ప్రచారము చేసిన మొదటి చైనీయుడు.

(ప్రాంతము) ఉపదేశము. (7) హేతువుల సంఘాతముచే సత్తు కలుగుచున్నది. ఇది సంవృతి సత్యము. ఇవి విడిపోవుటచే అసత్తు పర్యవసించును అది పరమార్థ సత్యము. ఇటుకలు. సున్నము మొదలగునవి కలిసిన ఇల్లు నిర్మాణమగును ; అవి కలసి ఉన్నంత వరకే ఆ ఇల్లు. ఇట్లు యూ టావో-సుయ్ బోధించెను. ఇతడు యూ ఫ-కై సతీర్థుడు. ఇవి చైనాలోని ఏడు బౌద్ధ సంప్రదాయములు. బౌద్ధులు 'భూతతథతా' అనియు 'శూన్య' మనియు అనినది టావో దర్శనము అనిన 'అసత్తే' అనియు; బౌద్ధుల సంసారము, జగత్తు టావో దార్శనికులు 'సత్తు' అనినట్టిదనియు; బౌద్ధుల 'నిర్వాణమే' టావో దార్శనికులు 'నిష్క్రియత్వ' మని రనియు నమ్మి, బౌద్ధ సిద్ధాంతముల వివరించుటలో ఆ కాలపు చైనీయ బౌద్ధులు టావో భావములను ఎక్కువగా వాడిరి.

మధ్య చైనీయ తుర్కిస్థానపు ఉత్తర భాగమున కుచలో 344 యందు పుట్టిన కుమారజీవుడు గొప్ప బౌద్ధ పండితుడు, భిక్షువును. ఇతని తండ్రి భారతీయుడు, తల్లి కుచా రాజవంశపుది. కుచ ను లియాంగ్ అను చైనీయ రాష్ట్రము జయించి ఇతనిని ఖైదీగా గొనిపోయెను, తరువాత బౌద్ధుడగు ఛిన్ - రాష్ట్ర రాజు ఇతనిని అపహరించి పట్టుకొనిపోయెను. ఛిన్ రాజధానియగు ఛాంగ్ - అన్‌లో ఇట్లు 402లో వచ్చి 413 లో మరణపర్యంత మక్కడనే ఉండెను. ఇతడు ఆ రాజ్యమున మతమునకు, విద్యకు అధికారిగా (kuo - shih) నియుక్తుడాయెను; ఇతనికి 3000 మంది శిష్యులు. అతని వ్యక్తిత్వము వలన, పాండిత్యమువలన, అతడు చేసిన అనువాదముల వలన చైనాలో బౌద్ధము బాగుగా పాదుకొనిపోయి ప్రతిష్ఠ నార్జించెను. ఇతని శిష్యులలో నొకడగు సెంగ్-ఛావో (384-414) గొప్ప దార్శనికుడు. లావో, ఛువాంగ్‌ల గ్రంథములచే సంతృప్తి కలుగని ఈతడు **విమలకీర్తి సూత్రమును** చదివి బౌద్ధుడాయెను, తదుపరి కుమార జీవుని శిష్యుడాయెను.

సెంగ్ - ఛావో బోధలు కొన్ని మచ్చున కిచ్చెదము. 'ధర్మములు', సంఘటనలు నిశ్చలములైనచో, నేటి 'ధర్మములు' సంఘటనలు నిన్నటివే. కాని అవి గతిశీలములైనచో, నిన్నటి 'ధర్మములు' సంఘటనలును నేటి వానితో ఒకటి గాకున్నను, పరిణామ ప్రక్రియకు (గతికి) లోనై అవి నేడున్నట్టివిగా పరిణతి చెందినవి అగును. ఇట్లు గతియు, నిశ్చలతయు పరస్పర విరుద్ధము లగును. ఇది సామాన్య జనుల ధోరణి. సెంగ్-ఛావో ప్రకారము నిన్నటి 'ధర్మములు' సంఘటనలును నేటివియు ఒకటి యనుట తప్పు; నిన్నటివి నేటివిగా పరిణతి నొందిన వనుటయు తప్పు. ఏలన, గతి గతిగా ప్రతిభాసించుట మాత్రమే జరుగుచున్నది, వాస్తవముగా అది నిశ్చలతయే. అటులనే, చనుటయు ప్రతిభాస మాత్రమే. వాస్తవముగా నది చిరస్థాయితయే. గతియందే నిశ్చలతయు, నిశ్చలత యందు గతియు కలవు. ఇట్టివి రెండును విరుద్ధములు కావు. ధర్మములు నిజముగా నిశ్చలములు కావు, గతిశీలములును కావు: లేదా, అవి నిశ్చలములు గతిశీలములు కూడను. ఇట్లు చెప్పుట మధ్యమ మార్గము, మరొక విధముగా చెప్పుట అతివాదము. బ్రహ్మచారి ఒకడు విద్యాభ్యాసమునకు గురుకులమునకు వెళ్ళెను. వెంట్రుకలు నెరసిన తరువాత తిరిగి వచ్చెను. వానిని చూచి ఇరుగుపొరుగు వారు, పూర్వము మేమెరిగినవాడు ఇంకను నేడు బ్రతికియే ఉన్నాడా? అని ప్రశ్నింపసాగిరి. నాటివానిగా కన్పడుచున్నాను గాని, వానిని కాను, అని బ్రహ్మచారి చెప్పెను. వస్తువులు రావు, పోవు; అవి ఎక్కడనున్నవో అక్కడే ఉండును. అనగా భూతకాలమందలి వస్తువులు వర్తమానమునకు రాలేదు. అవి భూత కాలమందే ఉండును. కాన అవి నిశ్చలములు. అట్లే వర్తమానమును దాని వర్తమానత్వమును వీడి చనదు. కాబట్టి ఏ క్షణమందున్న ప్రత్యేక వస్తువైనను ఆ క్షణమందే ఉండును, ఇతర క్షణము లందున్నవి వేరగు ప్రత్యేక వస్తువులు; ఏ క్షణమందలి వస్తువైనను క్రిందటి క్షణమందలి వస్తువు యొక్క సంతానముకాదు. భూతము, వర్తమానమును వాటి చోట్ల అవి ఉండి, తమతమ కాల సంస్థానముల నుండి కదలవు. ప్రతివ్యక్తి తన కాలక్షణమందు సంస్థితము. తథాగతుని సత్కర్మ ఎన్నివేల తరములు

గడచినను అట్లే నిత్యముగా నున్నది. ఒక గుట్టను చేయుటకై వేయబడిన మొదటి తట్టెడు మట్టి అట్లే ఉండును. గుట్టయొక్క సంపూర్తి ఆ తట్టపై ఆధార పడియున్నది. ఏలన, కర్మ ఎన్నటికి క్షీణించదు; భూతమందే ఉండినను మారదు. అది నిర్వికారము, కాననే శక్తిమంతము. నిర్వికారత నైశ్చల్యములో లేదు, గతియందు లేదు. నిశ్చల గతియందే నిర్వికారత, నిత్యత కలవు. బుద్ధుని దీపశిఖ, నాగసేనుని రథాది ఉదాహరణలు స్మరణీయములు. ఈ విధముగా నాతడు ప్రతీత్య సముత్పాద, క్షణిక వాదములను ప్రతిభా పూర్వకముగ వివరించినట్లు తోచును.

ఈ విధముగానే సెంగ్-ఛావో సత్తున్నదని కాని అసత్తున్నదని చెప్పలేము, రెండును లేవు అని సిద్ధాంతము చేసెను. ఒక విధముగ అన్ని ధర్మములు ఉన్నవి. మరొక విధముగా లేవు. ఏలన, ధర్మములన్నియు హేతు ప్రభవములు. అట్టివి స్వతంత్ర సత్త కలవి గాని, నిత్యములుగాని కావు. కాన అవి పరమార్థముగ అస్తిత్వము కలవికావు. అట్లే ఆస్తిత్వము లేనివియు కావు, వాటి అనస్తిత్వమును నిత్యము, నిరపేక్షము కాదు. వాటి అవభాసములు ఆకృతులు గలవి యగుటచే, అవి లేనివనలేము. దృశ్యమానాకృతులు అసత్తు కావు; పరమార్థముగ సత్యములు కానందున నిజముగ సత్తును కావు. అవి మాయా మనుజుని వంటివి. వాడు లేనివాడు కాడు, కాని మాయాకల్పితుడుగాన నిజమగు మనుజుడు కాడు. మాయా మనుజుడు మాయా మనుజుడుగ అస్తిత్వము కల్గియున్నట్లే, ధర్మములన్నియు సతతము ఉత్పన్నము లగుచు నశించుచు ఉన్నను, అవి ఈ రూపముగ నున్నవియే. కాబట్టి వాటికి కలదని చెప్పబడు శూన్యత ఒక విధముగ చూచిన శూన్యత, మరొక విధముగ చూచిన కాదు. కాన అన్ని ధర్మములు మరొక విధముగ లేనట్టివి కావు.

ఇటులనే సెంగ్-ఛావో, 'ప్రజ్ఞ' జ్ఞానమా కాదా యని మీమాంసించి, అది నిర్గుణమును గూర్చిన జ్ఞానము, జ్ఞానము కానట్టిది అని చెప్పెను. ఏలన, పరమార్థ సత్యము ప్రజ్ఞకు విషయము; కాని పరమార్థ సత్యమునకు ఎట్టి లింగముగాని, విశేషముగాని, గుణములు గాని లేవు, కాన అది జ్ఞాన విషయము కాజాలదు. జ్ఞాన విషయమైనది జ్ఞాతమగును, జ్ఞాతత ఒక ఉపాధి. పరమార్థ సత్యము నిరుపాధికముగాన, అది ఎన్నడు జ్ఞాతము కాజాలదు. కాక దానికి ఎట్టి సంబంధములు ఉండవు కాన, అది జ్ఞాతృజ్ఞేయ సంబంధమున ఇరుకు కొనలేదు. ఏది జ్ఞానమునకు అవిషయమో అది ప్రజ్ఞకు విషయము. ప్రజ్ఞ దానిని విషయముగా గ్రహింపదు; అది అగ్రాహ్యము గాన. కాని ప్రజ్ఞ ఎరుగ లేదు, అది జ్ఞానాభావము. అయినను అది సాంవృతిక గుణములు లేని పరమార్థ సత్యమును ప్రకాశ పరచును. నిశ్చలము, శూన్యమునగు ప్రజ్ఞలో జ్ఞానము ఉండదు, అయినను అది సర్వజ్ఞము. ఇటుల సెంగ్-ఛావో సిద్ధాంతము చేసెను.

కుమారజీవుని మరొక శిష్యుడగు ఛు టావో-షెంగ్ (360-434 ప్రాంతము) శబ్దముల నతిక్రమించనిదే సత్యము ఉపలబ్ధము కాదని, శాస్త్రములను పట్టుకొని కూర్చొనువారికి సంపూర్ణ జ్ఞానము కలుగదని, చేపల వలను మరచి చేపలను పట్టవలెనని బోధించెను. ఇతడు నిర్వాణ సూత్రమును గాఢముగా అధ్యయనము చేసెను. (అ) 'సత్కర్మ ప్రతిఫల ప్రదము కాదు', (ఆ) 'సద్యస్సంబోధివలననే బుద్ధత్వప్రాప్తి అగును', (ఇ) 'ఇచ్ఛంతికు* లందరికి కూడ బుద్ధత్వ ప్రాప్తి సంభవము', అనునవి ఇతడు ప్రతిపాదించిన ప్రధాన సిద్ధాంతములు. (అ) కుకర్మ సుకర్మలకు వచ్చు ప్రతిఫలములు వారి వారి మనోవ్యాపారముంపై ఆధారపడియుండును. కాని సంసారము దుమ్ము వంటి దనియు, స్వప్నము వంటి దనియు గ్రహించి, రాగ మోహములను, అవిద్యను జయించిన వాడు, 'నేను' 'నేను కానిది' అను భేదమును అతిక్రమించును. అప్పుడు కర్త, భోక్త ఉండడు. కాబట్టి సంసారము (జన్మ మరణ చక్రము) సాగుచున్నను, సత్తలో నున్నప్పటికి అతడు అసత్తుతో తాదాత్మ్యము నొందియుండును. అట్టివానికి

* బౌద్ధమును నమ్మనివారు.

స్వపర ఆత్మ అనాత్మ భేదము లేనందున, ఇతరుల నిర్వాణమునకై ధర్మోపదేశము ప్రారంభించును. టావోతో తాదాత్మ్యమొందినవాడు ఏమిచేసినను అతని పుణ్యములకు ప్రతిఫల ముండదు; అతనికి శిక్ష అసలే ఉండదు. (అ) దర్పణమువలె శూన్యమగు నిర్వాణము సూక్ష్మము, గంభీరము, రహస్యము; దాని ప్రాప్తి క్రమ క్రమముగ వివిధ భూములలో (దశలలో) కొంచెము కొంచెముగా జరుగదు. సత్యము ఏకము, నిర్విశేషము, చరమము. కాన దాని ప్రాప్తి (సంబోధి) సద్యోభవము, క్రమక్రమముగా వచ్చునది కాజాలదు. సంబోధి ఒకేపరి ఒకే క్షణమున పూర్తిగా కలుగును, లేదా అసలు కలుగదు. అధ్యయనము, శ్రద్ధ, శీలము, పుణ్య సంభారము-ఇవన్నియు సంబోధికి ఉపాయ మాత్రములు, అవి సంబోధి ఎంత మాత్రము కావు. అవి అవిభాజ్యము, నిరనంతరము, తత్క్షణికము, పూర్ణము. మానవులందరికి బుద్ధత్వము సంభవము, మోహమే సంసారమునకు కారణము. శాస్త్రజాలమును విదిలించుకొని శబ్దముల నతిక్రమించి, సద్యస్సంబోధికి యత్నింపవలెను. (ఇ) బుద్ధత్వ మందరి యందు నిహితము, అందరు దానిని అభివృద్ధి చేసుకోగలరు. ఇది షెంగ్ మతము.

షెంగ్, హ్యుయి-యువాన్ (334 - 416)లు ఆత్మ (shen)ను గూర్చి చేసిన సిద్ధాంతమును ప్రస్తావించెదము. అవిద్యారాగముల చేతనే మానవుడు జీవించుచున్నాడు. అవి నశించువరకు అతడు కొనసాగవలసినదే; కాబట్టి అవి నశించకపోయిన మరణము సంభవించినను అతడు మరొక శరీరము గ్రహించి పునర్జన్మనొందవలసినదే, ఆత్మ అతి సూక్ష్మ వస్తువు; అదియొక ఆశ్చర్యము, దాని స్వరూపమును నిర్ణయించలేము- అని యువాన్ మతము. అది శరీరముతో నశించదు. ఒక కట్టెనుండి మరొక కట్టెకు వ్యాపించు అగ్ని వోలె అది వివిధ శరీరములను గ్రహించును. తృష్ణ నశించినప్పుడే ఈ సంసారము నశించును. ఆత్మ-పునర్జన్మలపై బౌద్ధులు, ఇతరులు ఆ కాలమున చైనాలో ఎన్నో వాదోపవాదములు చేసిరి. పునర్జన్మ, సంసారము లేవు; ఒక జీవితమే ఒక వ్యక్తికి ఉన్న ఏకైక జీవితము; జీవితము ప్రకృతి యొక్క ప్రసాదము; తాను కోరినందున గాని తన కారణముచే గాని మానవుడు పుట్టడు, చావడు; జన్మమరణములు స్వాభావిక ప్రక్రియలు; జీవితము దుఃఖము కాదు; కాన స్వాభావిక సరళతతో నుండుటే వివేకము. ఇది అబౌద్ధుల మతము. వీరిలో ఫాన్‌ఛెన్ (450 - 515 ప్రాంతము) అగ్రగణ్యుడు,

సుయ్, టాంగ్ రాజవంశముల కాలములో (590-906) చైనాలో బౌద్ధమతము పూర్వము కంటె హెచ్చు వ్యాప్తిని, ప్రభావమును గడించెను. ఈ కాలములో ఛి-ట్సాంగ్ (549-623) అను బౌద్ధ భిక్షువు ఒక ప్రసిద్ధ దార్శనికుడు. ఇతని పూర్వులు నేటి రష్యన్ తుర్కిస్థానమునుండి చైనాకు వలస వచ్చినవారు. ఇంతటి బహుళ గ్రంథకర్తలు అరుదు. ఇతడు మాధ్యమికశాస్త్ర, శతశాస్త్ర, ద్వాదశ నికాయ శాస్త్రములపై టీకలు వ్రాసెను. ఈ మూడు శాస్త్రములపై ఆధారపడిన ఒక దర్శనమును, సంప్రదాయమును కూడ అభివృద్ధి చేసెను. సత్తను గూర్చి చెప్పుట సంవృత్తి (shih) సత్యము; అసత్తను గూర్చి చెప్పుట పరమార్థ (chen) సత్యము. ఇది ప్రారంభ దశ. సత్తును గూర్చిగాని, అసత్తును గూర్చిగాని చెప్పుట సంవృతి సత్యము. ఈ రెంటిని గూర్చి చెప్పక ఇట్టి రెండు కోటులను విసర్జించి మధ్యమ మార్గమున నుండుట పరమార్థ సత్యము. ఇది రెండవ దశ. ఈ రెండు కోటులు ఉన్నవని కాని, లేవని కాని చెప్పుట సంవృతి సత్యము. ఈ రెండునుగాని, ఇందొకటి గాని, ఉండుటగాని, లేకపోవుటగాని లేదని చెప్పుట పరమార్థ సత్యము. ఇది మూడవ చరమదశ. ఇందు ద్వైతమతిక్రమించబడి సర్వ నిషేధముల నిషేధమగును. సంవృతి-పరమార్థము, సంసారము-నిర్వాణము, రెండును లేవు; ఏలన, ఇందొకటి ఉండి ననే రెండవది ఉండుట సంభవము. కాని సంవృతియు, సంసారమును మాయ; మాయ లేదు. కాన పరమార్థము, నిర్వాణమును కూడ లేవు. ఇదియే 'ధర్మకాయము', సరియగు మార్గము (ఛెంగ్ టావో).

ఇట్లు ఛి-ట్సాంగ్ ద్వివిధ సత్యమును గూర్చి వ్రాసిన ప్రకరణమున బోధించెను.

టాంగ్ రాజవంశకాలమున ఉండిన హ్సువాన్-ట్సాంగ్ (హుఆన్ ఛ్వాంగ్ 596-664) గొప్ప బౌద్ధ దార్శనికుడు. మధ్య ఏషియాగుండ భారతదేశము వెళ్ళి, తీర్థాటన చేసి అచ్చట చాలా ఏండ్లు ఉండి, బౌద్ధమతము నధ్యయనము చేసి, 657 తాళపత్ర గ్రంథములతో చైనాకు తిరిగివచ్చి, మరణపర్యంతము వాటి అనువాద కార్యమున మగ్నుడాయెను. 75 గ్రంథముల ననువదించెను. ఇతని అనువాదములు నిర్దుష్టములు, సుందరములు అని అభిజ్ఞులందురు. ఇతడి గురువు శీలభద్రుడు. ఇతడు వసుబంధు ధర్మపాలుల విజ్ఞాన వాదమును చైనాలో వ్యాపింపజేసెను. ఇతడు చైనాలో ఇటుల 'ధర్మ లక్షణ సంప్రదాయము'ను ప్రవర్తింపజేసెను. వసుబంధువు గ్రంథము 'విజ్ఞప్తి మాత్రతాసిద్ధి' యను ఇతని టీక[1] గంభీర దార్శనిక కృతి. ఆత్మ (wo) ('నేను') ధర్మములు (బాహ్యవస్తువులు fa) రెండును కల్పితములు, రెండును శూన్యములు. అవి నిస్స్వభావములు, వాటి ప్రతిభాసలు 'విజ్ఞాన' వికారములపై ఆధారపడిన మనఃకల్పనలు. విజ్ఞానము 'విపాక విజ్ఞానము', 'మన్యన', విజ్ఞప్తి' అను మూడు తెరగులు.[2] మూల విజ్ఞానము 'ఆలయ విజ్ఞానము', 'బీజవిజ్ఞానము' అనబడును. 'లక్షణము' (దృశ్యము)గా, 'దర్శనము' (ద్రష్ట)గా విభాగము చెందునది విజ్ఞానమే. విజ్ఞానాతిరిక్తమేమి లేనందున అంతయు విజ్ఞప్తి మాత్రతయే. అయితే ధర్మాదులు విజ్ఞానముతో అవినాభావముగ నున్నవి, అవి అసలు లేనివి కావు. ధర్మముల పరమార్థ స్వభావము 'భూతతథత' (నిజమగు అట్టితనము) అనగా ధర్మములు స్వంత స్వభావము ఎట్టిది లేనివి ( లక్షణ నిస్స్వభావములు ), అవి అనేక హేతుప్రత్యయ ప్రభవములు (ఉత్పత్తి నిస్స్వభావములు), అవి పరమార్థముగ నిస్స్వభావములు. ధర్మములు గగన కుసుమములు వంటివి; ఇంద్రజాలికుడు పుట్టించిన వస్తువుల వంటివి; అయితే అవి పూర్తిగ లేనట్టివి కావు. ధర్మముల ఈ అట్టితనమే భూతతథతా. ఇది ఎప్పుడును మార్పు లేకుండ అటులనే ఉండును; నిజమైనది, నిర్వికారమును. ఇది ధర్మములతో అభిన్నము కాదు, వాటినుండి భిన్నమును కాదు. ఇది ధర్మముల సారము గాన 'ధర్మధాతువు' అనబడును. అది లేదు అను భావమును నిరసించుటకు ఉన్నదనియు. ఉన్నదను భావమును పరిహరించుటకు శూన్యమనియు చెప్పబడినది, అది నిరాధారము; మాయ కాదనుటకు 'భూతకోటి'[3] అనబడినది. భూత తథతా యందు 'నిష్ఠ' కల్గుటయే బోధి. అనగా పుణ్యాదుల సంభారము, ప్రయత్నములచే[4] దానిని 'ప్రతివేధించి' (ప్రవేశించి), దానినే భావించుచు అందే నిష్ఠ గల్గుట, స్థితులగుట. ఇది హ్సువాన్ ట్సాంగ్ వివరించిన సిద్ధాంతము.

సెంగ్-ఛావో అన్ని ధర్మములు మాయా మానవ సదృశములు, కాన నిజముగా లేనట్టివి కావు అని ప్రపంచించి యుండ; హ్సువాన్‌ట్సాంగ్ మాయా మానవుడు మాయాకల్పితుడు గాన నిజమగు మానవుడు కాడని ప్రపంచించెను. ధర్మములు (బాహ్య వస్తువులు) మన మనఃకల్పితములు, మనస్సు కూడ నిస్స్వభావము, పరతంత్రము; లక్షణ-దర్శన విభాగము మాయ - అని ఇతడు బోధించెను.

సామర్‌ఖండ్ దగ్గరి (నేటి రష్యాలోని తుర్కిస్థానములో) సోగ్దియానా నుండి చైనాకు వలస వచ్చిన యొక కుటుంబమున ఫా-ట్సాంగ్ లేదా హ్సియన్-షౌ (643-712) జన్మించెను. ఇతడు కొంతకాలము హ్సువాన్-ట్సాంగ్‌తో కలసి అనువాద కార్యమును చేసెను. కాని తరువాత భిన్నాభిప్రాయములు వచ్చుటచే విడిపోయెను. అవతంసక సూత్రము నాధారము

1. ఇది చాల టీకలను క్రోడీకరించినది.

2. Maturing consciousness, intellection, perceptive consciousness.

3. సత్తుయొక్క అవధి-realm of reality.

4. వీటిచే మోహనాశమై నిశ్చయము, మార్గవరణము జరుగును.

చేసుకొని ఇతడు తన దర్శనము నభివృద్ధి చేయుటయే గాక, ఒక 'అవతంసక' సంప్రదాయమునకు కూడ ప్రవర్తకుడాయెను. ఇది చైనాలో హు - ఆ - యెన్ సంప్రదాయమని; జపాన్‌లో కెగాన్ అని పేరొందినది. ఫా-ట్సాంగ్ గొప్ప తత్త్వవేత్త; హు - ఆ - యెన్ తత్త్వ మీమాంస కూడ గంభీరమైనది. నాగసేనుడు మిలిందునికి చేసినట్లే, ఇతడు ఉ సామ్రాజ్ఞికి (684-705) చేసిన బోధ ఛీన్ షిహ్-ట్జు ఛాంగ్ (స్వర్ణసింహ ప్రకరణము) అను గ్రంథమున కలదు. రాజ సౌధమున నున్న ఒక బంగారు సింహపు బొమ్మను ఉదాహరణముగా గైకొని ఈ బోధ సాగినందున దీనికా పేరు వచ్చినది. ఇతడి బోధ ఇది : (1) సింహపు బొమ్మలోని స్వర్ణమునకు అంతర్గతమగు స్వంత స్వభావము లేదు. శిల్పి నిపుణతచే సింహాకృతి వచ్చినది. అది కేవలము ప్రత్యయ జనితము. స్వర్ణము పరమతత్త్వము (li fn chieh) నకు, సింహము దృశ్యమానమగు వాస్తవికత (shih fa chieh) కు సంకేతములు. పరమతత్త్వము స్వాభావికముగ శుద్ధము, స్పష్టము, సంపూర్ణము. అది తథాగత[1] గర్భము నందుండు 'ధర్మత.' (2) సింహపు బాహ్యాకృతి శూన్యము, స్వర్ణము మాత్రమే పరమార్థము. సింహము నిజముగా లేకుండుట, స్వర్ణతత్త్వపు అభావము లేకుండుట. 'రూపము' యొక్క శూన్యతను తెల్పును. ఈ శూన్యత నిస్స్వభావమయ్యు మాయాస్తిత్వము కలది. దృశ్య వస్తువు లన్నియు మాయాభివ్యక్తులు. రూపమునకు, శూన్యమునకు ద్వైతాభావమే పరమ తత్త్వము. అదియే పరమ సత్యము. శూన్యత యన రూపము యొక్క అత్యంతాభావము - వినాశము - కాదు; శూన్యత రూపమునకు భిన్నమైనది కాదు; శూన్యత ఒక వస్తువో, స్థితియో కాదు. (3) ఇంద్రియముల దృష్ట్యా సింహమున్నది. ఇది దాని పరికల్పిత లక్షణము. దీనికంటె ఉత్కృష్టమగు దృష్ట్యా సింహము ఉండుట ఆభాస మాత్రమే. ఇది పరతంత్ర లక్షణము. స్వర్ణము స్వభావతః మార్పు లేదనునది వీరి నిష్పన్న లక్షణము. యిది యే 'ధర్మతా లక్షణము'. (4) సింహము సంపూర్ణముగా స్వర్ణమందు ఇమిడి యున్నది. ఏలన స్వర్ణమునకు భిన్నమైన గ్రాహ్యములగు లక్షణము లేవియు సింహమున లేవు. కాన దృశ్య వస్తువు లన్నియు స్వలక్షణ రహితములు. (5) సింహముమాత్రమే సముత్పన్నము. దానిని ఉద్భవింపచేసినది స్వర్ణము. స్వర్ణము కాక మరేమియు లేదు. కాన సింహము ఉత్పత్తి వినాశములు చెందుచుండ, స్వర్ణము ఉత్పత్తిని గాని వృద్ధి క్షయముల నొందుటలేదు. (6) సింహము సత్తు అని చెప్పిన శూన్యత్వమును, అది అసత్తు అని చెప్పిన దాని ప్రాతిభాసిక సత్తును బాధింపబడుచున్నవి. కాబట్టి ఈ రెండు పరస్పరము బాధించుకొని వినాశము (annul) నొందును. సత్తయు లేదు. శూన్యమును లేదు అని అవగతమై, భాష కతీతమై, మనస్సు నిర్లిప్తమగుటయే సంబోధి. తరంగములు నిశ్చల సముద్రమునుండి వచ్చునట్లు, శుద్ధ దర్పణమందు ప్రతిబింబములు ఏర్పడునట్లు, సూర్యునినుండి కిరణములు వెలువడినట్లు అన్ని వస్తువులును నిరపేక్షము, సర్వవ్యాప్తము, సంపూర్ణమునగు పరమతత్త్వమగు కేవలమునకు, "బుద్ధధాతువు"నకు. చెందియున్నవి కాన అంతయు ఒక్కటే, ఒక్కటే అంతయును, ప్రతిదియు మరొకటేదైనను కూడ ఒకటే.[2] (7) అన్ని వస్తువులు - సింహము, స్వర్ణమును కూడ - నిస్స్వభావములు, అన్నియు మనస్సుయొక్క అభివ్యక్తులే, వికారములే. (8) ప్రతి వస్తువు ఒక దృష్టితో చూచిన

2. తథాగత మన కేవలము (absolute).

2. అవతంసక సంప్రదాయ సిద్ధాంతమిది : ప్రతి వస్తువు సమగ్రతలోని అంతర్భాగము. కాని వస్తువులు తమ తమ వ్యక్తిత్వములను కోల్పోకుండ సమగ్రతతో అభిన్నముగ కలిసి యున్నవి. అందు విలీనమై లేవు. ఇట్లు సమగ్రత వాటన్నిటికి అతీతము, కాని వాటికి అతిరిక్తముకాదు. కాబట్టి ప్రతి వస్తువు సమగ్రతతోనే కాకుండ తక్కిన అన్ని వస్తువులతో తాదాత్మ్యము నంది యున్నది. దీనినే 'జిజిముజె' తత్త్వమని జపానీయ భాషలో నందురు.

ఒక విధముగాను, మరొక దృష్టితో చూచిన, మరొక విధముగాను ఉండును. ఉదాహరణమునకు సింహ మును ఒకటిగా ఎంచవచ్చును. లేదా తల, తోక కాళ్ళు-ఇట్లు వేర్వేరుగా ఎంచవచ్చును. అన్నియు హేతువులచే సముత్పన్నములు. ఇది వాటి సమానత. కాలు తోక కాదు. తోక తల కాదు; ఇది వాటి భిన్నత్వము. వీటి కలయిక, ఒకే వస్తువునందు పర్యవ సించినది గాన, ఇది వాటి సమన్వయము. (9) బోధి యనగా టావో, వెలుగు చూచుట(chiieh). దృశ్య వస్తువు లన్నియు స్కంధముల కలయికవలన అట్లే ర్పడక ముందునుండి కూడ విచ్ఛిన్నము లగుచునే యున్నవి. కామము, సన్న్యాసము - అను రెండు 'అతు'1 లను వదలి మధ్యమ మార్గమున పోవుట బోధికి త్రోవ. మాయ ఎన్నడు పరమార్థము కాదని గ్రహించుటయే బోధి. (10) స్వర్ణ - సింహముల రెండిటి లక్షణములు ఉపశాంతమై, క్లేశముల సమసి నప్పుడు, మనస్సు శాంత సముద్రమువలె అయి నప్పుడు విరుద్ధము లన్నియు ప్రతిభాసములుగా గ్రహింపబడి మోహము నశించినప్పుడు, బంధము తెగును; దుఃఖ సముదయము నశించును. ఇదే నిర్వా ణము. ఫా-ట్సాంగ్ ఈ తెరగున స్వర్ణసింహ ప్రకర ణములో చెప్పినాడు. ఈ భావములకు, అవతంసక సూత్రముపై అతడు వ్రాసిన గ్రంథములలో భావము లకు కొలది భేదములు కలవు. అపరిణామము, నిత్యము, కేవలము అగు తత్త్వ మొకటి (ధర్మ ధాతువు) కలదు. అది దృశ్య జగత్తున 'సంవృతి' కంతకు అధిష్ఠాన మనునది అతని దర్శన హృద యము.

538 - 597 లో నుండిన ఛిహ్-క్రై మరొక గొప్ప చైనీయ బౌద్ధ దార్శనికుడు. ఇతడు టియన్-టాయ్ పర్వతములలో నివసించుటచే, ఇతని గురు వులు ప్రవర్తింప చేసిన సంప్రదాయమున కాపేరు వచ్చెను. సద్ధర్మ పుండరీకసూత్రము వీరి కాధార గ్రంథమగుటచే ఇది పుండరీక (ఫా-హావా) సంప్ర దాయము అని కూడ పేరొందెను. అశ్వఘోషుని మహాయాన శ్రద్ధోత్పాద శాస్త్రము కూడ వీరికి చాల ఉపాదేయ గ్రంథము.

బుద్ధుని బోధలను అయిదుదశలలోనికి విభజింప వచ్చునని, ఉత్తరోత్తరముగా ఆయన తన బోధలలో పరమసత్యమును ప్రకటించె నని ఛిహ్-క్రై అభిప్రా యము. బుద్ధుడు ఇటుల చేయుటకు కారణము ఆయన శిష్యులలో గల అధికారభేదమును, వారున్న పరిస్థితులును. మొదటిదశలో బుద్ధుడు నేడు **అవతం సక సూత్రము**లందు దొరకు పరమసత్యమును బోధిం చెను. కాని అది మానవాతీతులకు తప్ప అగ్రాహ్యముగ నుండుటచే, రెండవ దశలో నేడు ఆగమము (పాళీ నికాయము) లందు గల ఉపదేశములను బోధించెను. మూడవ దశలో నేడు వైపుల్యసూత్రము లందు కాన వచ్చు సిద్ధాంతములను, నాల్గవ దశలో నేడు ప్రజ్ఞా పారమిత గ్రంథములలో కనపడు వానిని బోధించెను. చివరిదగు ఐదవదశలో సమస్త సత్యసారమగు సద్ధర్మ పుండరీక సూత్రమందు గల సిద్ధాంతమును బోధిం చెను. ఇట్లు బుద్ధుని అన్ని బోధలు అధికారి భేదమును బట్టి ఉపాదేయములని చెప్పి ఛిహ్ - క్రై, హీనయాన, మహాయానముల మధ్య సమన్వయము చేయ చూచెను.

ఏకైకము, కేవలమునగు చిత్తము (మనస్సు) విశ్వమందలి పరమతత్త్వమని టియన్-టాయ్ సంప్ర దాయము బోధించును. ఇదియే భూతతథతా (ఛెన్-జూ) లేదా తథాగతగర్భము. అన్ని 'ధర్మములు' దీనిపై ఆధారపడియున్నవి. ధర్మములు వాటికవి శూన్యములు, మాయ నిజమగు ఉనికి లేనిది. వీటితో పోల్చిన చిత్తము యథార్థము. అది వృద్ధిక్షయాది వికారముల నొందదు. ధర్మములు మాత్రము నిజ ముగ లేనివైనను మాయచే ఉత్పత్తి వినాశాదుల నందుచున్నట్లు అవభాసించును. అవాఙ్మానసగో చరము, సర్వవ్యాప్తి, నిర్వికారము, సమస్తమునకు ఆధారము భూతతథతాయే. శుద్ధాశుద్ధ ధర్మము లన్ని టికి, చేతన వస్తువుల స్వభావములన్నిటికి తథాగత గర్భమే నిలయము. అదియే ధర్మకాయము. దాని వ్యాపారములందే - ప్రక్రియలందే అది భేదము కలిగి

1. చరమ మార్గములు (extremes).

యుండును. యథార్థముగ నది అంతర్గతభేదరహితము, ఏకరసము; కాననే శూన్యము. భేదములులేని దానియందు భేదములు గల ఈ తథాగతగర్భమును వర్ణించుట కష్టము. తథాగతగర్భమందే అన్ని ధర్మములు స్వగత భేద శూన్యముగ నున్నవి. కాన ప్రతి ధర్మము దానికది సంపూర్ణమగు తథాగతగర్భమే, అయినను అన్ని ధర్మములు దాని యందున్నట్టివే. "విశ్వమంతయు ఒక వెంట్రుకలో నున్నది; బుద్ధులందరు ప్రతిమానవునిలో కలరు "

చిత్తము కానిది ఏదియు లేదు. కాన దృశ్యమగు ప్రతి వస్తువు చిత్తముయొక్క అభివ్యక్తియే ఇటుల అన్ని వస్తువులు ఒక అఖండ సమైక్యతను, సామరస్యమును కలిగి యున్నవి. క్లేశాది "వరణము" (అడ్డంకులు) లన్నిటికి అతీతమై శుద్ధబుద్ధత్వ లక్షణములు కల్గియున్నప్పటి భూతతథత పరినిష్పన్న సత్యము. అదియే వరణములలోనుండి అశుద్ధ లక్షణములు కల్గియున్నప్పుడు ఆలయ విజ్ఞానము ఇది పరతంత్రము. విజ్ఞాన వికారములు అన్నియు పరికల్పితములు స్వచ్ఛమగు దర్పణలో ప్రతిబింబములు వచ్చుచు పోవుచు నుండును. అద్దము, స్వచ్ఛత, ప్రతిబింబములు-వీటిలో అసలు పదార్థము అద్దము. దానికొకదానికే నిజముగ అస్తిత్వము కలదు, తక్కినవి దానిపై ఆధారపడినవి, దానిలో కల్పితములు. భూత తథతా స్వభావమును ఇట్లు త్రివిధము.

**అన్ని ధర్మములు ఆదినుండి స్వ స్వభావ రహితములు, ఉత్పత్తి వినాశ రహితములు,** మాయచే లేనివైనను ఉన్నట్లు కనబడును; అవి యన్ని భేద వర్జ్యమగు చిత్తమాత్రములే, అను అవగతిచే చిత్త వృత్తి నిరోధము (చిహ్) అగును. ఇదియే 'సమాధి' లేదా 'అధిచిత్తము' ధర్మములు చిత్తస్వభావము కారణముగ సముత్పన్నములు,కాన వాటికి సాంసారిక లేదా సాంవృతిక వ్యాపారము కలదు; స్వప్నావభాసములకువలె వాటికిని ఒకవిధమగు అస్తిత్వము కలదు, అను అవబోధ 'ప్రజ్ఞ'. సమాధిచే శుద్ధ చిత్తము ననుభవించి, అద్వయభావము నొంది, అన్ని జీవులతో ఏకాత్మత నొందుట జరుగును. శాంతి, గంభీరత, విశుద్ధత, నిర్వ్యాపారమున వ్యాపారము ఇది దీని స్వభావము. ప్రజ్ఞ చిత్తపు ముఖ్య స్వభావము నభివ్యక్తి చేయుచు, స్వచ్ఛందముగ బాహ్యభౌతిక వస్తువుల ఆటంకము లేకుండ ప్రవర్తించును. ప్రజ్ఞ కలవాడు నిర్వాణము నొందియు సంసారమున ఉండి, క్రియావంతుడుగనే ఉండును; అట్లయ్యును అది నిష్క్రియతయే. సమత, విపశ్యన (insight) ప్రజ్ఞకు చిహ్నములు.

అందరు మానవులు బుద్ధులు కాగల్గెదరు, అనగా తథాగత గర్భములోనికి - శూన్యతలోనికి - ప్రవేశించి అన్ని భూతముల పట్ల కరుణ, శాంతి కల్గియుండ గలరు, అను **సద్ధర్మపుండరీక** బోధ టియన్-టాయ్ సంప్రదాయ మవలంబించును. ధర్మలక్షణ సంప్రదాయము (హుసువాన్ ట్సాంగ్ ప్రచారము చేసినది) ఇటులగాక, కొందరు మానవులే బుద్ధత్వ మందగలరని బోధించెను. ప్రతి మానవునిలోను బుద్ధత్వ మున్నది; దానిని సాధనచే, ప్రయత్న, శీల, సమాధి, ప్రజ్ఞలచే వృద్ధిచేసుకొని ప్రతివాడు బుద్ధుడు కావచ్చునని చిహ్-కై ఇత్యాదుల విశ్వాసము. ఛాన్ - జన్ (711 - 782) అను ఈ సంప్రదాయపు గురువు అచేతన పదార్థములలో కూడ బుద్ధత్వ స్వభావ మున్న దనెను.

టియన్ - టాయ్ సిద్ధాంతమున కేవలము, నిర్వికారమునకు చిత్తము పరమార్థ సత్యము; విజ్ఞాన వాదమున మూల విజ్ఞాన మట్లుగాక హేతు ప్రభవము, వికార సహితమును. టియన్ - టాయ్, హువాయెన్ సంప్రదాయముల సిద్ధాంతములు చాల దగ్గరగా నుండును. టియన్ - టాయ్‌కి దీనితో గల భేద మేమన, అది అన్ని వస్తువుల స్వభావములు కేవల చిత్తమున అంతర్గతములని. ప్రతి స్వభావము కేవల చిత్తమేనని, కాని నిర్వికార మని చెప్పును.

బోధిధర్మ డను ప్రసిద్ధ భారతీయ బౌద్ధ భిక్షువు 520 లో చైనాకు వచ్చెను. ఇతడు మహాప్రతిభావంతుడు. దూరప్రాచ్య దేశములలో ఎనలేని కీర్తిని గడించిన మహాపురుషుడు. ఇతడు కాంచీ

పురము వాడని, పల్లవ రాజవంశమునకు చెందిన వాడని ఐతిహ్యము. ఇతడు మొదట నాంకింగ్‌కు వచ్చి అప్పటి చైనీయ చక్రవర్తియగు వూ-టిని కలసికొని, గుళ్ళు, గోపురములు కట్టించుట మొదలగు వాని వలన ఫలము లేదని, వీటివలన సంసారము నశించదని, నిజమగు సత్కర్మ గుహ్యము, జ్ఞానవంతము, మన అతీతము, ఐహిక నిర్వాహము వలన సమ కూడదని చక్రవర్తికి బోధించెను. అపరిమిత శూన్యత్వమే బౌద్ధుల బోధ అని, అది పవిత్ర మని అపవిత్ర మని చెప్పవీలుకాదని, మానవ వ్యక్తి ఎవరో చెప్పలే మని బోధిధర్ముడు బోధించెను. "మేము తెచ్చు సందేశము మతగ్రంథములలో లేనిది; అక్షరముల పైన మాటల పైన ఆధారపడనిది; తిన్నగా మానవుని ఆత్మను నిర్దేశించును; స్వస్వభావములోనికి నిరీక్షించి బుద్ధత్వ మును పొందుట" - ఇది బోధిధర్ముడు తెచ్చిన సందేశ సారముగా పరిగణించబడెను. సత్యం విధి నిషేధము లకు - అస్తినాస్తి వాక్యములకు - అతీతము; అది ఒకేపరి హఠాత్తుగ స్ఫురించును, మరొకసారి కాన రాదు; యథార్థముగా గ్రహింపదగిన వస్తువు ఏదియు లేదు; ఇంతకు చెప్పవలసినదేమిలేదు; నిశ్శబ్దముగా ఉండుటే ఉచితము; ఇది అతని బోధలసారమైనట్లు కానవచ్చును. తరువాత బోధిధర్ముడు లో - యాంగ్ అను చోటికి వెళ్ళి ఒక మఠమందు ఒక గోడను చూచుచు ధ్యానమందు కూర్చొనెను. ఇన్నేళ్ళు ఉప యోగము లేకుండుటచే అతని కాళ్ళెండి ఊడిపోయె నట! షెన్ - కువాంగ్ అనువాడు సత్యము కొరకై తనకు గల తీవ్ర ఉత్కంఠను రుజువు చేసుకొని శిష్యునిగా గ్రహింప మని వేడగా, బోధిధర్మ డతనికి బుద్ధులు చెప్పినది ఇతరుల ద్వారా తెలియరాని దని చెప్పెను. "నా ఆత్మ శాంతించుట లేదు, దానిని శాంతింపజేయు" డని షెన్-కువాంగ్ తిరిగి వేడగా, "ఏదీ, దానిని ఇటు తీసుకురా, శాంతింపజేసెద" నని బోధిధర్మ డనెను. "నేను చాల ఏండ్లనుంచి దానిని వెతుకు చుంటిని, కాని దానిని పట్టుకోలేక పోయినాను" అని శిష్యుడు జవాబిచ్చెను. "ఇంకేమి, అది శాశ్వత ముగా శాంతించిన" దని బోధిధర్ముడు సమాధాన మిచ్చెను. అతని బోధలిట్లుండెడివి. తరువాత నీ షెన్-కువాంగ్ హుయ్-కె నామమున ప్రసిద్ధ గురువాయెను. బోధిధర్ముడు 9 ఏండ్లిట్లుల చైనాలో గడిపి, తరువాత ఎవరికి తెలియనిచోటికి వెళ్ళిపోయెను. కొంద రాతడు భారతదేశమునకు వెళ్ళెనని, కొందరు జపాన్‌కు వెళ్ళెనని, కొందరాతడు విరోధులు విషము పెట్టుటచే మరణించె నని అందురు. బోధిధర్ముడు, హుయ్-కె, వారి అనుయాయులు ప్రవర్తింప జేసినది ధ్యాన సంప్రదాయ మని పేరొందినది. ధ్యానమే చైనీయ భాషలో 'ఛాన్న' అని, 'ఛాన్' అనియు, జపానీయ భాషలో 'జెన్' అనియు మారినది. ఇందెన్నో శాఖలు కలవు.

లంకావతార సూత్రము, వజ్రచ్ఛేదిక ప్రజ్ఞా పారమితలలోను గత సిద్ధాంతములు ధ్యాన బౌద్ధము నకు చాల దగ్గరవి. లోగడ వర్ణించిన టావో - షెంగ్ సిద్ధాంతములు కూడ దీనికి ప్రోద్బల మిచ్చియుండును. వీరు వర్ణించిన పరమతత్త్వము చరమ శూన్యత, కేవల నిషేధము, స్వనిషేధమును కూడ నిషేధించు కొనునట్టిది అది పరమ రిక్తత అని కొందరు, అది అన్ని వస్తువుల మూలమగు చిత్తము, అదియే 'ఆదిమ స్వభావము' లేదా 'బుద్ధ స్వభావము' అని మరికొంద రును వ్యాఖ్యానించిరి. కాని ధ్యాన బౌద్ధులందరు క్రింది అయిదు సూత్రముల నంగీకరింతురు. (1) పరమ సత్యము లేదా ఆదితత్త్వము అకథనీయము, అవా - జ్మానసము, కార్యకారణ పరిధి కతీతము. (2) ఆధ్యా త్మిక సాధనను కావలెనని చేయుటగూడ ఫలప్రదము గాన అది సంసారమునకే దారితీయును. సత్కర్మలు దుష్కర్మలు కూడ కార్యకారణ జాలమున, సంసార మున ఉంచునవియే. కాన ఆధ్యాత్మిక సాధనను సాధించరాదు. ఈ కర్మ విరతియే ఒక విధమగు సాధన. అనగా పుణ్యాపాపములను, మంచి చెడుగులను అంటిపెట్టుకొనరాదు. దీనివలన ఇది సమకూడును; ఇది రాదు; ఇది కావలెను; ఇది వద్దు; ఇది చేయ వలెను; ఇది చేయరాదు; - ఇట్టి విధమగు నిశ్చయ బుద్ధి, విమృశ్యకారిత, ఫలసాపేక్ష్య కారియగు చిత్తము

లేకుండ,* నిస్సంగముగ, నిర్లిప్తముగ స్వచ్ఛంద ముగ వ్యవహరింపవలెను. ఏ ఆలంబనము లేకుండుట, ఏ ప్రవృత్తుల (ఉదా. రాగ ద్వేషాదుల) చేతను బద్ధుడు కాకుండుటయే, అనాసక్తకముగ అన్ని వస్తువులను గూర్చి ఆలోచించగల్గుటయే 'అప్రతిష్ఠిత చిత్తము' సాధన కాని ఈ సాధనే ధ్యానబౌద్ధులు విధింతురు. (3) సంబోధిచే పొందబడునది ఏదియు లేదు. "కొండ కొండగానే ఉండును. నది నదిగానే ఉండును". ఇప్పుడు బోధపడునదే ఈవరకు బోధపడినది. లోగడ మోహపెట్టినదే ఇప్పుడు వెలుగు చూపును. ఏది సంసారమో అదే నిర్వాణము. ఉపలబ్ధి కానట్టి ఉపలబ్ధి ఇదియే. కాబట్టియే జ్ఞాని జీవితమునకు, సాధారణుని జీవితమునకు భేదము లేదు. మానవు లందరు బుద్ధులే, బుద్ధత్వము ప్రాప్యము కాదు. నిత్యము. (4) బౌద్ధ సిద్ధాంతమున విశేష మేమియు లేదు. బోధపడకముందు అది స్వర్ణమువలె నుండిన, బోధపడిన పిమ్మట పెంటవలె నుండును, అని ఛింగ్-యువాన్ చెప్పినాడు. తెలియక ముందు అది రహస్యముగ కన్పడును, తెలిసిన అది రహస్యము కాదు. (5) సాధారణ మర్త్యత్వమును వదలి బుద్ధత్వమును పొందినవాడు, దానిని వదలివేసి సాధారణ మానవత్వములోనికి పునఃప్రవేశము చేయును. జ్ఞాని మనస్సు రిక్తముగ - అనాసక్తముగ, నిస్సంగముగ, తృష్ణా రహితముగ నుండును. ఇదియే ప్రజ్ఞ. కాని అతడును సాధారణులు చేయునదే చేయును. అతడును కట్టెలు కొట్టును, నీళ్ళు మోయును, భోజనము చేయును, బహిర్భూమికి వెళ్ళును. మానసిక శూన్యత లేదా అంతయు బుద్ధతయే యను భావమందు తప్ప వ్యవహారమందు జ్ఞానికి సాధారణునికి భేద ముండదు; అయితే ఏపని చేసినను అతని కర్మలు ఫలావహములు కావు కాన జ్ఞానికి బంధము ఉండదు.

హుయ్ - సెంగ్ (638 - 713) ధ్యాన బౌద్ధ మతమును అభివృద్ధి చేసినవారిలో అగ్రగణ్యుడు. ఆతడి ఉపదేశ సంగ్రహ మిది : బౌద్ధము అద్వయ వాదము. పేరుగల దంతయు ద్వయమునకే గొని పోవును. "పుట్టుకకు పూర్వము తనకున్న ముఖమును గాంచుట" ధ్యాన బౌద్ధ లక్ష్యము. అంతర్వీక్షణము చేసికొని, ప్రతివాడును తనకున్న బుద్ధ భావమును గాంచుట యని దీని అర్థము. బుద్ధత్వ మద్వయము, అది మంచిచెడ్డ, శాశ్వతాశాశ్వత, భౌతికాధ్యాత్మిక, ఇత్యాది ద్వంద్వ రహితము. చిత్తమునుండి సాపేక్షతను, భేదమును, ద్వంద్వ భావమును తొలగించిన, తన అసలు స్వరూపము పుట్టుటకు పూర్వమున్న ముఖము కన్పడును. ఇది ఎక్కడనుంచి వచ్చునది కాదు, పోవునది కాదు. కాన పద్మాసనాదులు వేసి ధ్యానముచే గ్రహింపరానిది. 'అప్రతిష్ఠ చిత్తము'ను, అనగా నిరాలంబనము, నిరాశ్రయము అగు చిత్తమును, కల్గియుండుచే స్వస్వరూపమును గాంచుట. ఇది ఒకేపరి హఠాత్తుగ ఆకస్మికముగ జరుగును. ఇట్టివాని ఆచరణ స్వతంత్రము, ముక్తము అప్రయత్నముగ స్వాభావికముగా ప్రవర్తించుటే ముక్తుని లక్షణము. గ్రహించునది, గ్రహింపబడునది కూడ జన్మ మరణములు లేనిది; ప్రాప్యము నివారణీయము కానిది సత్యము; బోధి పొందవలసినది కాదు; సమాధి ప్రవేశించవలసిన ఒక అవస్థ కాదు; చిత్తవృత్తులు కలవా లేవా యని ఎరుక లేకుండుటయే మహా సమాధి. గాన అది సాధ్యము కాజాలదు; నిష్క్రియత్వమే యథార్థత; శూన్యతయే సత్యము; ధర్మముల పరమార్థము (ultimate meaning) అపరిమితము, నిశ్చలము. మనస్సులో గాని శుద్ధత్వములో గాని, నిశ్చలతలో గాని ఆసక్తి (attachment) లేకుండుటే ధ్యానము. ప్రతిదాని చేతను అబాధితముగా అకుంఠితముగా నుండుట, మంచి చెడులగు బాహ్య జీవిత పరిస్థితులచే ఎట్టి ఆలోచన కలుగకుండ ఉండుట, స్వ స్వభావపు నిశ్చలతను అంత ర్వీక్షణము చేయుట, ఆంతరంగికముగా ఎప్పుడును ఆకులతను (సంక్షోభమును) చెందకుండుట, బహిరంగముగా 'రూపము' పట్ల ఆసక్తి లేకుండుట,-ఇదియే ధ్యానము. ఇట్లు హుయ్-సెంగ్ బోధించెను.

* దీనిని 'అప్రతిష్ఠిత చిత్త' మని ప్రజ్ఞాపారమితా సాహిత్య మనినది.

హరివర్మ వ్రాసిన సత్యసిద్ధిశాస్త్రముపై ఆధార పడిన సంప్రదాయము, నాగార్జున - ఆర్యదేవుల రచనలపై ఆధారపడిన సంప్రదాయము, తొలి దినములందు చైనాలో ఉండినను వాటికంత ప్రభావము రాలేదు. అభిధర్మ కోశముపై ఆధారపడిన కోష (కుష) సంప్రదాయము, నైతికాచరణ నియమములపై ఆధారపడిన వినయ (Lu) సంప్రదాయము అమితాభ మతము, షెన్-యన్ (మంత్రయాన) సంప్రదాయము కూడ చైనాలో ఉండినవి. వీటిలో చివరి రెండు చాల వ్యాప్తిలో నుండినవి. దూరప్రాచ్య దేశములపై ఎంతో ప్రభావము చూపినవి. కాని దార్శనికముగా కాక, మతములుగానే వీటి ప్రాధాన్యము.

## ఫా ఛి యా

ఫా ఛి యా అనగా రాజ్య శాసన సంప్రదాయము ధర్మము లేదా నీతిస్థానమున శాసనము ఉపస్థాపింప బడవలెనని, ప్రభుత్వము ప్రపంచమందు నేడున్న వస్తుస్థితిపై ఆధారపడవలెనని, కాబట్టి పరంపరపైనను, అలౌకిక నిర్దేశములపైనను ఆధారపడ రాదని ఈ సంప్రదాయము వారు ఘోషించిరి.

క్రీ. పూ. 319-301 లో ఛి రాష్ట్రము నేలిన హ్సువాన్ కాలమున నుండి షెన్ టావో, 351 లో హాన్ రాష్ట్రమంత్రిగా నుండిన షెన్ పూ-హై, ఛిన్ రాష్ట్రమున చాల ఏండ్లు మంత్రిగా నుండిన షాంగ్ యాంగ్ (మ. 338) ఈ విధమైన ఆలోచనలను ప్రారంభించిరి. వీరందరి చింతనలను వ్యవస్థీకరించిన వాడు హాన్ ఫై ట్జూ (మ. క్రీ. పూ. 233)

షెన్ టావో ఒక విధమగు టావో విశ్వాసి. అన్ని వస్తువులు సమానములు, కాని కొన్ని వస్తువులు కొన్నిటికి సమర్థములు, కొన్నిటికి కావు కాన వీటిలో కొన్నిటినే ఏరుకొనుటగాని, అవలంబించుటగాని అర్థములేని పని. కొన్నిటి పరిగ్రహము, మరికొన్నిటి విసర్జనవలన సమగ్రత లేదా పూర్ణము లంభింపదు. అందలి భాగమే దొరుకును. అట్లే ఏ బోధ కూడ పూర్ణము కాజాలదు; కాన జ్ఞానము వ్యర్థము. ఏలన ఇది మంచి, ఇది చెడ్డ, ఇది కర్తవ్యము, ఇది కాదు, అని కదా జ్ఞాన విషయము; కాని అంతయు సమానమై, మంచి చెడుగుల, కర్తవ్యా కర్తవ్యముల విభాగము యథార్థము కానప్పుడు జ్ఞానము వ్యర్థము. జరుగవలసినది ఎటులైనను జరుగునని తెలుసుకొని, పరిస్థితులకనుగుణముగా మారుచు, కష్టము, దుఃఖము కలుగని రీతిగా వర్తించవలెను. గాలిలో ఎగిరిపోవు ఈకవలె పరిస్థితులెటు నెట్టిన అటు పోవుచు, పశువులవలె స్వాభావికముగ ప్రవర్తించుచు, ధర్మాధర్మములను సరకు చేయక, అన్నిటిపట్ల ఉదాసీనతతో నుండి, అనుభవము నుండి ఏమియు నేర్చుకొనక, భవిష్యత్తును దృష్టిలో నుంచుకొనక, జీవితమును గడపవలెను. షెన్ టావో ఇటులనే జీవించెనని ఛువాంగ్-ట్జూ గ్రంథము చెప్పుచున్నది.

రాజ్యపాలన కవసరమైనది అధికారము, శక్తి, లేదా ఆధిపత్యము (shih); సుగుణములు, జ్ఞానము కావు. ధర్మాత్ములు, జ్ఞానులు కూడ అణగి పడియుండవలసి వచ్చుటకు కారణము వారికి అధికారము, శక్తి లేకపోవుటయే; ఇవి ఉన్నప్పుడే వారికి ప్రాభవము ఉండి, వారు రాణింతురు. జనులను అణచి పరిపాలించుటకు అధికారము, శక్తి, పదవి మాత్రమే అవసరములు. పాలకుని భయము వలననే ప్రజలు శాసనములననుసరింతురు; అతనిపట్ల ప్రేమవలన కాదు. పాలకుని చేతిలో అజేయమగు దండము ఉండి, ప్రజలను తన ఆజ్ఞల ప్రకారము. తన శాసనముల కనుసారముగ, నిర్బంధముగ నడిపింపగలిగిన శక్తి ఉండిననే పాలన సరిగా ఉండును. ఇవి షెన్ టావో అభిప్రాయములని చెప్పబడినవి.

ఉద్యోగులకు బాధ్యతలనుబట్టి పదవులనిచ్చుచు, వారి వారి పదవుల కనుగుణమగు ఆచరణ వారికి నిర్బంధము చేయుచు, వారికిని ప్రజలందరికిని పరమ భాగ్యవిధాతగా నుండు శక్తి కలిగియుండి, అందరి ప్రాణములను ఉండనిచ్చు, లేదా తీసివేయు అధికారము పాలకుని గుప్పిటలో నుంచుకొను పాలన విధానములే (shu) రాజతంత్రమున ముఖ్యములని షెన్ పూ-హై మతము.

రాజోద్యోగుల ఆజ్ఞలకు 'ప్రతికృతులు' శాసనములు. శాసనముల ననుసరించు వారికి బహుమానము అతిక్రమించు వారికి శిక్ష అను విషయము ప్రజల మనస్సులలో హత్తుకొనవలెను. నిశ్చితములగు శాసనములు మంత్రులకు, ఇతర రాజోద్యోగులకు మార్గదర్శకములు. శాసనములు (fa) లేనిదే రాజ్యమందు సంక్షోభము కల్గును అని షాంగ్ బోధ.

మానవ స్వభావము ఎప్పుడును స్వలాభమును, స్వార్థమును సాధింపజూచు కొనును. కాబట్టి, దండము వలననే వారి నందరిని అదుపులో నుంచుటకు వీలగునని ఫా ఛియా చెప్పును. వ్యవహారమునకు, కర్తవ్యాకర్తవ్య నిర్దేశమునకు, అంతఃకరణము గాని, పరంపరగాని, అలౌకికమైన దేదైన గాని ప్రమాణము కారాదు; శాసనము - పాలకుల ఆజ్ఞ, వారి ఇచ్ఛలు- దీనికి ప్రమాణముగ నుండవలెను; శాసనము ప్రచండముగ నుండవలెను అని కూడ ఫా ఛియా చెప్పును. పాలకుని, తల్లిదండ్రులను గూర్చి పాలన విధానమును గూర్చి చర్చించుట, తెలిసికొనుటయే పురుషార్థము అని హాన్ ఫై ట్జూ వ్రాక్రుచ్చెను. నీతి దయల కంటె శాసనము, దండమును ముఖ్యము; ఇవియే అధికమగు విలువయు, ఉపయోగమును కలవి. రాష్ట్రము కోరిన దానిని చేయు వానికి బహుమానము, రాష్ట్రమునకయిష్ట మగునది చేయువానికి శిక్ష, ఇదియే ఆచరణకు పరమ సూత్రము. కాబట్టి శాసనములు బాగుగా విపులముగా స్పష్టములుగా ఉండుటయు, బహుమానములు గొప్పవిగాను, శిక్షలు తీవ్రముగాను ఉండుటయు ఆవశ్యకములు. మానవుడు స్వభావతః కల్లకపటములు కలవాడు; ఎప్పుడో ఒకసారి తప్ప శాసనములు దండము లేకుండ పాలన చేయగలవాడు ఉండుట సంభవించదు. కాననే వీటి ఆవశ్యకత.

రాష్ట్రము ఉత్తరోత్తరముగా బలీయమగుటయే పాలకుని ఆదర్శముగ నుండవలెను. ప్రజల సుఖము, అభీష్టములను అతడు సరకు చేయరాదు. ప్రజల కేది చేసినను తృప్తి ఉండదు, కాబట్టి వారిని లెక్కచేయక ఆహార ఉత్పత్తి, సైనిక శక్తుల అభివృద్ధియే పాలకుడు లక్ష్యములుగ నుంచుకోవలెను. వీలైన ఇతర రాష్ట్రములను జయించు చుండవలెను. రాష్ట్రములో కెల్ల వ్యవసాయపు పనివాండ్రు, సైనికులు తక్కిన అందరికంటె గౌరవార్హులు. దండభయముచే ప్రతివానిని వ్యవసాయమందు మితములేని కష్టము పడువానిగానో, ముందు వెనుకలు చూడని సాహసముగల యుద్ధభటునిగానో, నిర్బంధముగ చేయుటకు పాలకుడు ప్రయత్నించ వలెను. సమృద్ధిగానున్న రాష్ట్రము ఎప్పుడు యుద్ధమునకు పోవుచుండవలెను. లేకపోయినచో శాంతివలన కళలు, నాగకరిత వృద్ధియై, దయాదాక్షిణ్యములు, వృద్ధులసేవ, శీలసత్యముల నభ్యసించుటకు అలవాటుపడి ప్రజలు యుద్ధమును ఏవగింతురు, ఒడలువంచి పనిపాటులు చేయరు. కాబట్టి ప్రజల నందరిని ఎల్లప్పుడు ఆహారోత్పత్తియందు, యుద్ధ సన్నాహములందు నిమగ్నులుగజేసి, బలము చేకూరినంతనే ఇతర రాష్ట్రముల నణచుటకు, వాటిని తమ అధీనములోనికి తెచ్చుటకు పాలకులు అనవరతముగ ప్రయత్నించవలెను. ప్రజల దృష్టి ఎప్పుడును యుద్ధము పైననే ఉండునట్లు, దానదండములతో వారికీ విషయమందు మరపు కలుగకుండునట్లు చూచుట ప్రభుత్వ కర్తవ్యము. యుద్ధమందు ధైర్యసాహసములు చూపువారికే సంఘమందు ఉన్నతపదవుల నీయవలెను, ఇవి జన్మతః సంక్రమింపరాదు. వ్యవసాయము, యుద్ధము చేయలేని వర్గముల నన్నిటిని రూపుమాపవలెను. అనగా, కళాకారులు, సాధుసన్న్యాసులు, వ్యాపారులు, పండితులు, దార్శనికులు ఇత్యాదుల నందరిని తన్ని వ్యవసాయము చేయించవలెను; అట్లు చేయనిచో వారిని చంపవలెను. బీదల పోషణ, దయాధర్మములు బోధించు వారిని కూడ ఇట్లే చేయవలెను. శాసనములకు వ్యతిరిక్త దర్శనములు, గ్రంథములు లేకుండ చేయవలెను. కష్టపడి పనిచేసి, మితవ్యయము చేయువానికి ఆహారలోపముండదు; అట్లు చేయనివానికే దారిద్ర్యము, వానికి దయ చూపరాదు. నీతి, ఋజువర్తనము, సత్యము, దయ - ఇవి రాజతంత్రమునకెందుకును కొరగావు. తన విరోధులు చేయుటకు సిగ్గుపడు కార్యములను తాను చేయుట వలననే పాలకునికి లాభము చేకూరును. పూర్వాచారములు,

పరంపర, దైవము - వీటిని పట్టుకొని ప్రేళ్ళాడక, కేవలము ప్రస్తుత పరిస్థితులను బట్టియే పరిపాలన జరుగవలెను. వీలైన ప్రపంచమునకు, లేదా చైనా అంతటికి చక్రవర్తి అగుటయే ప్రభువున కాదర్శముగ నుండవలెను. ఎవరిని నమ్మక, ఎవరికి తన ఉద్దేశము లను తెలుపక, చండశాసనము ద్వారాను, తన శక్తి వలన, విస్తృతమగు గూఢచారుల వ్యవస్థ ద్వారాను, కపటము, దుర్మార్గము, దండములద్వారా పాలకుడు ప్రజలనందరిని నిరంతర భయముతో బ్రతుకునట్లు చేయవలెను. కాని అతడెప్పుడును ప్రతి పని నీతి దయా ధర్మముల పేరిటనే చేయవలెను. అప్పుడే వారు ముందు వెనుకలు ఆలోచించక రాష్ట్రమునకై తమ జీవిత ములను ధార పోసెదరు; అప్పుడే రాష్ట్రము సమృద్ధము, బలీయము అగును. షాంగ్ యాంగ్ రాజతంత్ర మీవిధముగా నుండవలెనని నిరూపించెను.[1] హాన్ ఫై ట్జూ ఇంచుమించు ఇదంతయు అంగీకరించును, కాని అతనిలో హ్సున్ ట్జూ అను కన్‌ఫ్యూసియన్ అను యాయి ప్రభావము, కొంత టావో మత ప్రభావము కలదు.

టావో దర్శనమును, మెన్సియస్ వివరించిన రీతిగ కన్‌ఫ్యూసియన్ దర్శనమును అనుసరించు రాష్ట్రి మేనాడును చైనా యందు ఏర్పడలేదు. కాని పై విధములగు ఫా ఛియా సిద్ధాంతములను, పద్ధతులను, ఛిన్ రాష్ట్రి మవలంబించి చైనానంతను సమైక్య పరచి, ఒక చక్రవర్తి క్రిందకు చైనా నంతటిని తెచ్చెను. ఇది క్రీ. పూ. 221లో జరిగెను. ఫా ఛియా విధానములన్ని అవలంబించి ఈ సామ్రాజ్యము నిరంకుశముగ చండశాసనము చేసెను. ప్రజలందరు రాష్ట్రము శాసించినట్లే చింతనను, ఆచరణను చేసిరి. ఛిన్ రాజవంశము 15 ఏండ్లు పాలించెను. తరువాత విచ్ఛిన్నమాయెను. 20వ శతాబ్ద ఉత్తరార్ధములో తిరిగి నిరంకుశమగు చైనా ప్రభుత్వము ఫా ఛియా సూత్రములను విధానములను అనుసరించుచున్నదా?

ఆధునిక యుగమున చైనాలో క్రొంగొత్త దర్శనములు లేవలేదు. కొందరు టావో, కన్‌ఫ్యూసియన్ దర్శనములను పునరుద్ధరించుటో, కొందరు పాశ్చాత్య ధోరణుల ననుకరించుటో, వాటిని మార్చి నూతన విధముగ అభివద్ధి చేయుటయో కావించిరి. చైనీయ, పాశ్చాత్య దర్శనముల సమన్వయ చేష్టలును జరిగినవి. చైనీయ బౌద్ధము మాత్రం అంతగా ప్రేరకము కాలేదు. జాతీయభావము బౌద్ధమును పరదేశీయముగా చూచినదేమో! కమ్యూనిస్టు రాజ్య స్థాపనానంతరము మావో ట్సె టుంగ్ వ్యాఖ్యానాను సారమగు మార్క్స్ దర్శనమున కొక్క దానికే స్థానము, ప్రచారము సమకూడినవి.[2]

---

1. ఫా ఛియాకు కౌటిల్యుని అర్థనీతికి, మహాభారత రాజధర్మములోని కొన్ని బోధనలకు సామ్యములు కలవు. కాని వాటి లక్ష్యము, దృక్పథము, విధానములు హిందూ రాజనీతికి పూర్తిగ భిన్నములు.

2. కన్‌ఫ్యూసియన్, టావో ముఖ్య గ్రంథములు చాలవరకు లెగ్ అనువదించగా ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయము ప్రకటించినది. (Chinese classics; Sacred Book of the East). గైల్స్ టావో గ్రంథముల నెన్నిటినో అనువదించెను. లిన్ యుటాంగ్, క్రీల్ చేసిన కన్‌ఫ్యూసియన్ అనువాదములు ఉత్తమములు. వేలీ మరి ఇంకెందరో లావో ట్జూ ననువదించిరి. డబ్స్ హ్సున్ - ట్జూను అనువదించెను; మెయ్ మో-ట్జూ గ్రంథముల ననువదించెను. ఇక బౌద్ధము : ఫూ సె (ఫ్రెంచిలోను, దీనికి నరేంద్ర దేవ్ హిందీలోను) హామిల్టనులు హ్సువాన్ - టాంగ్స్‌ను, లై బెన్‌థల్ సెంగ్ ఛావోను, వాంగ్ మౌ - లమ్ హుయ్ - సెంగ్‌ను అనువదించిరి. సుజూకి ధ్యాన బౌద్ధముపై చాల వ్రాసినాడు. డుయ్‌వెన్‌డక్ షాంగ్ యాంగ్‌ను అనువదించెను. హ్యూజ్ (Hughes) చైనీయ దార్శనికుల నుండి ఉద్ధరణముల ననువదించి వాటి సంహితను వెలువరించినాడు (Everyman's Library).